ఉ. లేఁడు పరాపరోక్తుల నెఱింగి విచారణ సేయఁజాలువాఁ
డెందును లేఁడె, తన్నుసరసకవిశ్రేణిఘటల మెచ్చ్యముఁ, జే
డెందును లేఁడె, యయ్యది భరితము ద్విజప్రకరమ్ము సెల్లఁ, బూ
డెందును లేఁడె, యయ్యది చరించెడి సత్పథమరయఁ బొందుగన్.

చ. తనకలరామకృష్ణకవి తద్దయు శిష్యుఁడు, తాను నేను న
మ్మిన బలుశిష్యుఁ, డిర్వురును మీయెట కేఁగియుపోయె! మట్టిచో
జనవరునొద్ద నాదగుప్రశంసయె యుత్తమి కేమి హేతువో? వుం
డిన నది పేరునందుఁ బ్రకటింపఁగ రాదె జగమ్ము మెచ్చఁగన్.

*ఉ. సూరయగారితోఁ బలికెఁ జూ! యతఁ "డీ విడినట్టివిద్ద బల్
నీరసమై యెటో చనియె నీవు గురుండవు కావు నా"కటం
చా రసవేది నాకు నిది యంతయుఁ జెప్పె, స్వబుద్ధిమార్గమా
ధీమనియందుఁ జొన్పు సువిధేయున కేపని సేయరా దికన్.

మ. మధునాపంతుల సూరయాభిధుని సమ్మానించె నీరీతి, నా
బుధమాన్యుండు వచించె నిచ్చవడి "పో! పో! యెంతవారైన యి
య్యానరూపుం గలి మండ వచ్చు" నని "తాతా! యీతనిం జెప్పఁబో
కు ధరన్ లేఁ డిటువంటిధీరుఁ"డని వాక్రుచ్చెన్ బరం బేగుచున్.

ఉ. సూరయగారనంగఁ గడుసూరియఁ దండ్రికి మేనమామయున్
ధీరుఁ డుదారుఁ డీతనికి దేశికుఁ డమ్మహనీయుఁ డట్లె నే
నేరమి నట్లు చూపిన వినీతున కే నొక లెక్కయే! "మహా
శూరుఁ డితం"డటం చదియ చొప్పనఁ జెప్పెడుఁ జెక్కులేటికిన్. 112

ఉ. ఆసమయిక్ వరమ్ముఁ గొని యాతఁయి దేవుని నెత్తి మొత్తు భ
స్మాసురు లిప్పుడుం గల, రహంకృతిశాలుల సట్టిమారవి
శ్వాసుల నొంచు శ్రీపతులు సజ్జనమాన్యులునుం గలారు "సే
బా"సని వారిమెచ్చు గుణవంతులునుం గలరయ్య, శ్రీపతీ!

---

*"...గారికి—మ. వెం. సుబ్బారావు........లేక, గిరతముఁగాని సూరయ్య తాతగారియొద్దఁ జదివినదంతయు మఱచి పోతినను కారణమున గురువులుగా వేసికొనలేదని వెనుక తమ యొద్ద నన్నమాట యెచ్చటనైనను తమరు వ్రాయింపుఁడు......................."

వెం॥ సు॥ రా॥

ఈ వెంకటసుబ్బారావు మధునాపంతుల సూరయ్యగారి కుమారుఁడు.

చ. మొదటిగురుం ద్యజించె నొక మూలము లేకయె నన్ను నీగతిన్
బదపడి వానిఁ బోవిడిచె, మధ్యగురుం డిటఁ జర్లచంద్రుఁ డీ
కదనమునాఁటికిన్ మిగిలెఁ, గావున వాతని చేతియూఁత ని
న్నదిరి జయింపరాదె! యిటు లేటికి మూల మణుంగు పోఁడుముల్.

తే. గీ. ఉభయశాస్త్ర ప్రవీణులఁ టుభయులును మ
రేవి యా శాస్త్రములు? వాని యెఱుక యెట్టి?
దుభయ శాస్త్రము లన నసత్యోక్తులును గృ
తఘ్నతావాదములు నేమొ తత్త్వమరయ!

* క. బావయఁట! యతఁడు శాబ్దిక
జీవుండఁట! యతని కితఁడు శిష్యుండఁట! యే
మీ! వీరల పాండిత్యపుఁ
జేవయుఁ గవనంపుఁ జేవఁ జెప్పఁగ నేలా! 117

శా. "పుల్లాసారులు గారు వచ్చి రరుగో! పుస్కాంబులన్ దేవ యా!
మల్లాసారులు! శిలమంతులము మేమా! పుస్కముల్ దెచ్చుటా
యెల్లాసారులు గారు తెత్తు రకటా! యేమండి! కూర్చోండి! మీ
రల్లాగంటది దమ్మమా!" యనువిధంబౌ నీ ప్రసంగ మ్మహో!

† 8 సీ. బావకుశాబ్దికజీవత్వ మెటులబ్బెఁ? దనకెట్టులబ్బెఁ బ్రాథమిక పదవి?
అణుమాత్రముం గాని యవధానమున కెట్టు లత్యద్భుతపు బిరు దను ఘటించు?
తలమీఁదివార లెందఱో కవీశ్వరు లుండఁ గోరు నీతండు పెండేర మెట్లు?
పేరెడ! యూరెడ! పెంపేడ! సొంపేడ! ఘంటాశతం బేడ! కవన మేడ!

తే. గీ. ఏడ నీ! వేడ యీకవు! లేడ సూర్యుఁ!
డేడ ఖద్యోతములు! నీకు నింతమాత్రఁ
దెలియదేనియుఁ జూడుమా, దేశమాత
పత్రిక వచించు నివ్వారి పాటవంబు. 118

ఉ. ఆకుకవుల్ శతమ్మును సహస్రము మున్నను నేఁడు నుండ వీ
రాశవహించు టెట్టి దకటా! కట! ప్రాథమికత్వమంద, న
బ్రాశి పటుంచి కూపమును బ్రాథమికంబన రెవ్వరేని యీ
యాశకు మేర లేదుగద! యందని పండ్లకె యఱ్ఱు చాఁచెడిన్.

---

* ఉ. పన్నుగ నాకు సత్కవన పద్ధతి నేర్పినబావ శాస్త్రసంపన్నుఁడు......

† ఈ కవితావిధానమునకు మేమే ప్రాథమికులము" 8 "సందేహము లేదు బావ శాబ్దికజీవా." (వెం॥ రా॥ గ్రంథమాల 19-28-49 వ పుటలు చూ.)

మ. మొదమొన్నన్ గతియించు శిష్టకులజున్ మాన్యున్ గవీంద్రేడ్యునిన్
జను లింకన్ వినకుందురీగాక ఘటికాసద్యశ్శతగ్రంథక
ల్పవచుంచున్ ఘటరాట్కవిన్ దెలియరో!* లాఁతుల్ శతంబుండఁ బో
లని యీమాట గలట్టి కాగితము నేలా చింపివేయింపరో. 120

ఉ. చింపిననేమి కాగితము చింపక యుంచిననేమి యెవ్వ రా
దంపుడుపాట నమ్ముదురు? తప్పుడు వ్రాఁతనుబట్టి చింపివే
యింపఁగఁ బూనుచోఁ "గవనమెల్ల వనం" బగుచుండఁ జింపివే
యింపరుగాక, "గ్రుడ్డికను లేటికి మూసిన మూయకుండినన్?"

మ. అఱకన్ గట్టిన గంగిరెద్దుఱుకదే! యాత్మీయవాద్యధ్వని
స్ఫురణం బించుక విన్నయంత; నటులే మూరుల్ కలావాద దు
ర్భరతాఖండు లాఁకంటఁ గట్టువడియున్ బాండిత్యకండూయనో
త్సరణోత్సాహసహాయులై కవులతో సంధింప కెల్లుందురో.

శా. వేఁడున్ వాడని కీడుమాట లిసిరో! "వేయిండ్ల పూజారియా
వాఁడా" యన్నవనాథరై యొకట విద్యాంసుండు గూర్చుండునే
మూడుంబోలె, మహాకవీంద్రచరితల్ మూచూడలేదొక్కొ "పం
డ్లూడుం బో!" యని నీవు మున్ననినదే యుక్తంబు మామ్మాటికిన్.

ఉ. కుంటి కవిత్వమో మఱియు గ్రుడ్డి కవిత్వమొ కాని నేఁడు మె
చ్చంటుట దుర్లభం బనియొ యక్కట! యిక్కవు లట్టి కైత కై
కొంటకునై కడంగెదరు కొందఱు ప్రాజ్ఞులచేత గ్రుద్దులున్
గుంటులెకాక యమ్మలును గొండొక పూజితులౌ టెఱుంగరో!

ఉ. కబ్బము లచ్చువేతురఁటకా! యవియే వచియించుఁ గాక యా
రబ్బసమెల్ల నేమిటికి నవ్వయు నట్టును నీకుఁ? గోఁతికిం
గొబ్బరికాయలాగు సమకూఁడెను బత్రిక యొందు వారి; కా
గబ్బది మున్నె లోకులకుఁ గన్పడె నొండొరు లేల దీనికిన్.

శా. లేకల్ వీరిప్రవీణతన్ దెలుపు నీ లేఖావివాదంబు లే
లా? కృష్ణం గని బోధినిన్ జదివి యన్యంబైన సత్పత్రికా

---

* ఖ్యాత శ్రీరఘునాథనాయక దయాధారానువారోన్నమ, ద్వీణావాదన సంస్కృతాంధ్రకవితాసామ్రాజ్యలక్ష్మీజుషా, తత్తాదృక్షుటికార్థనిర్మితశతశ్లోకీ, ఫణిగ్రామణీ, వాణీపాత్రకృతశాస్త్రసైపుణసమున్మీలద్యశశ్శ్రీజుషా॥ మధురవాణి (ఈమధురవాణి తంజాపురీ సంస్థాన విదుషి) స్వహస్తపత్రికాశినీ పత్రిక చూడుఁడు.

నీకంటెన్ జవి చూచి రేని మతులెరో! నీ వల్ల యాతాయనా
లీకళ్యాణపుఁబాట నొక్కి తిరిగి చేసెం బ్రాఁతలేదా! సఖా.

క. "మిడతంభొట్లు శకున" మను
పడువునఁ గన్నం బొకంటఁ బాతినయంతం
దుడుకు పడఁ జెల్లునే! యీ
క్కడ నెవ రున్నారొ సుంత గాంచఁగవలదే. 127

చ. "ఇరువుర మేము మీ రిరువు రిందవ రెవ్వరిఁ గోరుకొంటిరి
ర్వ్యరు నొకనన్నె రొందిరి పోరి జయింతురో? లేక యిర్వ రి
ర్వ్యర నెదిరింతురో? తెలుపఁ బోలు" నటన్న వృథాగఁ జాటుచున్
మురిసిన నేమి లాభ మగు? ముక్కున నూపిరి లేద యాదెసన్.

ఉ. లోక మెఱుంగుఁజా! కవితలోఁగల పాకము; శతృవైన సు
శ్రీ కలకబ్బముం గని 'యిసీ' యనఁ జాలఁడు, మిత్రుఁడైన న
శ్రీక కవిత్వమైన 'బళిరే' యని మెచ్చుకొనండు; నీకు నే
లా కలహంబు? లోకమె రసారసచర్చ యొనర్చుచుండఁగన్.

శా. తాతాచార్యులు లోనుగాఁగలుగు తంత్రిజ్ఞుల్ వధానార్థమై
యేతేరం గన మెక్కొ! సభ్యజను లీస్సీ యంటయుం గాంచమో!
యీ తంత్రిజ్ఞులు వారి కెంత వనుకో యేతేరఁగాఁ దగవా
లేతన్మాత్రులతో వివాదమున కీ వేలాగు కాలాఁగితో.

ఉ. "మా కవితావిశేషములు మానసవీథుల సంచరింప" నం
చా కవు లాడు మాటలకు నప్పురవాసులె గేలి గొట్టుచున్
"మీ కవితావిశేషములు మేదరవీథుల సంచరించుఁ జుం
డో కవులార" యంచుఁ గడునుల్లస మాడుదు రంట! ఖంటినే.

ఉ. 'మా కవితావిశేషములు మానసవీథుల' పద్య మందు "వీ
రేకవి" యన్నచోటఁ గల 'యే' ప్రకృతస్థితిఁబట్టి ప్రశ్నగా
స్వీకృత మయ్యె, జెండ్లనుట సిద్ధము నయ్యె, రసజ్ఞు లెల్లరున్
మేకు బిగించి లాగుటయు మేకొనె నేమిటి కింక బీరముల్.

చ. కవి కవితావిలాసము జగన్నుతిలోఁ బనిలేనిదేనిఁ గా
కవియుఁ గవీంద్రుఁడే యగునుగాక వివేకముతోడ నేమి! ఘూ
కవియుఁ గవీంద్రుఁడే యగునుగాక రసారస చర్చయేల! యే
కవియుఁ గవీంద్రుఁడే యగును గాకిఁకఁ బాకవివేక మేటికిన్. 133

చ. ఎవనికవిత్వమున్ విని యహోవ [illegible]
కవు "లిదివో! కవిత్వ" మని కంపితశీర్షచమత్కృతిన్ మహా
త్సవసవిశేషనటచితసుధారసధారధరీకు లౌదురో,
కవియనఁగా నతండ యగుఁ గాకవు లేకవు లేనిఁ గాకవుల్.

శా. దారిం జిక్కిన లాడ మొందుకొని మోదం బంది "యీ మీఁదనే
స్వారిం జేయుఁగ మూఁడు లాడములు నశ్వ మ్మెక్కెడుఁ జాలో" టటం
చూరం బొచ్చినభంగి బాలకవు లేదో కొంచె మార్జించి యా
ధారాధారమునన్ భవత్పదవికై ధ్యానించుచున్నా రహో!

ఉ. గాసెల పిండిపంటకయి కాంతుఁడు కాంతను బృచ్ఛ సేయ, నా
సారసనేత్ర వ్రేలఁ గొట్టి చయ్యనఁ జూపి "యి దొక్కెడున్న దా
ధార" మటన్న సామెతగ ధార యొకించుక కల్గుమాత్రనే
మీ రవధానపుంబనికి మీఱెఁడురై ప్రయతించి రక్కటా!

ఉ. నీ వచనంబు లెందుకో మనీషులు నవ్వుదు రంటసత్యముల్
లేవనియో కృతఘ్నతలు లేవనియో గురునింద లిందులో
లేవనియో ప్రమాదములు లేవనియో స్వవచోవిఘాతముల్
లేవనియో! మనీషులు మలీమసచిత్తులఁ గాని మెచ్చరో!

చ. గురునకుఁ బంగనామమిడు కోయిలపిట్టలు గాని పండితా
దరము వహింపరో! యుగవిధం బిదియో! యివి బోధ సేయ వ
ప్పురమరహస్యశాస్త్రములు బావయుఁ దాము దక్క నేరరో
యొరు! లవి నేర్వఁగాఁ దగిన దొండొకకాలను దాము నిల్పిరో!

శా. తా నేదో మనముందుఁ దుమ్ముకొని యాస్థానమ్మునన్ నన్నుఁ జే
కొ న్కమ్మకింపక పోయి, లోకులు "గురుద్రోహమ్ము గావించె" నాఁ
గా "నే నీశ్వరవేరు వారి" కనుచున్ గర్జించి నీ కోడి గే
హేనర్దిత్వముఁ బూనె నీతనిని నీ వింకేల జంకించెదో!

ఉ. "భారతనాటకమ్ముల నెబా సని లోకులు మెచ్చ వ్రాసి యీ
పాటుఁ దెఱుంగఁడే యకట! పాడినవారినె పాడఁదోలు టే
పౌరుష?" మంచు నిన్ను బుధవర్యులు దూఱరఁటయ్య! యెందు కీ
సారవిచారులం గెలువఁ జాలఁబ్రయత్న మొనర్తు? వక్కటా! 140

శా. బాలమ్మన్యుల పోరు కీర్తికరమో! ప్రాగల్భ్యసందర్భమో!
శీలాలంకృతియో! భవత్సుకవితాసీమంతినీచారులీ

లాలాస్యానుగుణంబొ ! యేమిటనికై లాభించునో ? తెల్పు మీ
యాలం బింతటఁ జాలుఁ; జాలు నిఁక నేలా తూలికాచాలనల్ !

మ. చదరంగమ్ముఁ గలావివాదగతులున్ సంగ్రామరంగమ్ములున్
ముద మీనేర పసారు లన్య లయినన్; మున్నున్న నైపుణ్యసం
పద గూడం దొలఁగించు; నీ కెచట సంప్రాప్తించి రీసత్కృతుల్ !
పదముల్ దొట్రిలు వారి కైత నడఁపన్ బ్రాజ్ఞుల్ ప్రశంసింతురే!

శా. సింగం బాఁకలి దీటి యున్నతటి వాచెంతం బ్రవేశించి వే
దృం గోమాయువు నోటిప్రక్కఁ బడుకండన్ లాగి భక్షించు, గో
లాంగూలాదులు హేలమై నరిగి వేళాకోళముల్ సేయు, వే
మిం గోపింపమ వానిపై, నటులె నెమ్మిం జూపుమీ వీరిపై.

చ. తిరిగితి కొంత దేశము ప్రతిజ్ఞ లొనర్చితి నిల్పుకొంటి ము
ష్కరుల నదల్చి సత్కృతుల గౌరవ పద్యము లందుకొంటి "ది
క్కరి కిన యాతఁ"డన్ యశము గాంచితి కాంతువు కాంచుచుంటి వో
తిరుపతిశాస్త్రి! నేఁ డనుమతింతునె భీరులతో వివాదముల్.

చ. నలుపది యేఁడ్లు వచ్చె నరనాథులచేతులు నిన్నుఁ గోరువా
రలఘుమతుల్ గలారు, ధన మట్టులె యుంచుము విద్దెలోన ని
ష్ణులుఁడగు కృష్ణభూవిభునితోఁ గడు నెయ్యముఁ దియ్యమున్న నీ
పలుకవులన్ జయించి ఫల మావల నందెడి దేమి చెప్పుమా. 145

మ. ఫలమే యందఁగ నిచ్చ యున్నయెడ నీ పాండిత్యమున్ గొనిముం
గలఁ జూపం జనఁగావలెం బిదప నీకవ్యగ్రణీవ్యగ్రతల్
తల యొత్తం గమకింప, నెత్తునెడఁ దద్వారంబు వారించు ని
గ్గులు నీ నేరని వొక్కొ ! తాతకును దగ్గుల్ నేర్పఁగా నేటికిన్.

శా. ఇంకన్ గ్రొత్తనృపాలురం గనియెదే! యీ, వెన్ని యేండ్లయ్యె రా
జాంకం బాత్మకురు ప్రభుం డిడిన మాన్యం బింతకుం బుచ్చుకో
నంకింపన్ మది లేనివాఁడ నెవరో యుద్వేగులై నోటి గా
టంకన్ గోసినపట్టికోఁతలకు నీ వేలాగు లక్షించితో.

శా. మెసగాఁ డొక్కరుఁ డాఱుమాసములు సాముం జేసి మార్మ్యాలఁ బం
బిసభీషింపన డాఁగియున్న ముసలాపెం బోరికిం జీరులా
కునఁ గూపస్థితదర్దురప్రకటదుర్గోష్ఠీవిరావార్భటీ
జనితాహంకృతి కాఁకపై పెనఁగు లేఁచందంబు నీ బోఁటికిన్.

శా. "ఏదో వన్ననివాఁడు గాన సభకే కేతెంతురా!" యంచు వి
ద్యాదక్షుండు వచించుఁగా, కితరు లాతం డెవ్వఁడో, వాని వి
ద్యాదర్పం బది యెట్టిదో, యెఱుఁగి యేలా వత్తు! రేలా యనం
తాదారుం డిది యిచ్చగించు? నిజవిద్యాత్సారసంవేదియై.

మ. ఉరువేగస్ఫురణాగపాటనపటుస్రోవాహినీవార్ఝరీ
పరిణాహారభటీపటాత్కృతులకున్ బ్రభ్రష్టసారంబులై
తరుషండంబులు నిల్చెనేని భవదుద్యద్వాగ్ఝరాసారపు
ప్కారకోలాహలముల్ సహింపఁ గలుగున్ గాకవ్యహంకారముల్.

చ. కలదుగదా! యశోధన, మఖుండు లనేకులు మిత్రు లున్న వా
రెలమిఁ గవిత్వరాజ్యరమ నేలుచు నుంటివి మున్నెపైన ని
శ్చలగతి నుండ కేమిటి కసారులతోఁ గలహమ్ము, లక్కటా!
తెలియవె "వృద్ధనారులు పతివ్రత"లంచు వచించు న్యాయముల్.

శా. ఉండుం గావుత శిష్యుఁ డొక్కరుఁడు మాయోపాయమిథ్యావచో
ఖండప్రాభవశాలి నిస్తులకృతఘ్నత్వానుసంధాయి వా
క్ఛాండుం డాతని సాదుసేయు టది నీశక్యంబె? నీ ముంద రా
తం డెట్టుల్ నిలుచున్ సభాస్థలిని? గాతర్యంబు బాధింపదే? 152

ఉ. తేజ మెఱుంగలేని యొక ధీరవిచారుఁడు సారెకున్ మహా
రాజును "మాల" యంచుఁ దన గ్రామములోఁ దన వంటయింటిలో
భాజనముల్ వినన్ బలుకుఁ, బ్రాజ్ఞుఁడు దానిని లెక్కసేయునే?
యేజనుఁ డేనిఁ జెప్పిన మఱేటికి ధాటి వరాటకోటిపై.

శా. "ఊరున్ బేరును లేక యొక్కయెడ నెట్లో యెట్టులో యున్న యా
ధీరమ్మన్యుల పేరు పైకి నితఁడే తెచ్చెన్, వినిర్జించుఁగా
కారంభింపక మున్న వెన్నిడెడి విద్యాభీరులన్ వైరులన్
బాఱుం బోతులఁ దోలి లాభమ, యశం బా?" యండ్రు నిన్నున్ జనుల్.

ఉ. దగ్గఱవారికిం దెలియుఁ దత్త్వము; దూరపువార "లిర్వురున్
దగ్గరు తుల్యులే" యనియుఁ "దగ్గిన నించుకమాత్రమే"యటం
చెగ్గులు చెప్పికొందు రిది యేటికి మానఁగదయ్య; వారి యా
పగ్గెలు లోకమే యెఱుఁగవచ్చుఁ గ్రమమ్ముగ నాఁడునాఁటికిన్.

శా. "మొట్టో మే మనలే దసత్య" మను నమ్మొట్టిన్ వినన్ రాదె! యీ
చిట్టుంబుట్టు లిఁకేల? చేసియును "నేఁ జేయంగలే" దన్నచో

వట్టావందగు దోసమైన సమారిం బౌవళ్యాక మ్ముందు రీ
ఫెట్టిన్ మానఁగదయ్యా ! కాకవిగణోర్వీజాతఝుంఝానిలా !

మ. అవధానం బన నెట్టిదో యెఱుఁగరం చవ్వానికిం బెట్టు పే
ళ్ళే విశేషించి వచింతు "ధారణము లేనేలేద"టం చందు, వా
రివచోగుంఫమె సాక్ష్యమిచ్చు, "నివివో వృత్తమ్ములం" దంచు న
య్యవధానమ్ములె చెప్పు, నే తెలుఁగ రీ వ్యాపార మాఁటం దగున్.

ఉ. ఆసభఁ జూచి రెండఱు మహాత్ములు నందఱు నొక్కపెట్టఁగాఁ
'గాసరకూసరయ్యో' యని కాని వచింపరు మేలి మాట; నీ
కీసు జనించెఁ గాక, జగ మేటి కసూయ వహించెనో ! రసా
భాసము గాకయున్న నొక పద్దెము నొక్కరుఁ డేని యిచ్చెనే !

*శా. శాంతింపంగదవోయి ! దుస్సలతనూజాతుండు మున్ గీడి వి
క్రాంతిం దా విని యేమిచేసెఁ ? గురువీరవ్రాతముం గాంచుపై
గంతుల్ మానఁడె యుత్తరుం! డకట, కంగారైన యవ్వారిపైఁ
గంతుద్వేషిశిరస్సరద్వరఝరీకల్లోలముల్ నించెడే !

† శా. వీఁకన్ దమ్మను గోకిలమ్ములుగ నుర్విం బొల్చు విద్వాంసులన్
గాకుల్గా, బకముల్గ, గప్పలుగఁ, గోకశ్రేణిగాఁ జెప్ప ని

---

*శా. "శాంతింపంగదవోయి" యంచుఁ గడు వాత్సల్యంబు పెంపార మీ
యంతశ్శాంతి వచించెఁ గాక ; కలరే! ద్యావాపృథివ్యంతరా
శాంతవ్యాపకసుప్రసిద్ధగురుశిష్యవ్యాయవిచ్ఛేదివా
గంతేవాసికృతాపరాధసహనవ్యాపార పారాయణుల్.

మ. గురుధిక్కారణకారణం బయిన మత్కోపాగ్ని కీ కర్తృణాం
కురముల్ చాలిన యింధనంబు లగునో కో ! దాని నార్పన్ ఘనుల్
దొరకో నేటికిఁ! దోడుగా నితరులం దోరించుచో వాఁడు కా
తరులం బ్రోవఁగ మీ ఘనప్రకృతిచేఁ దచ్ఛాంతి చేయందగున్.

శ్లో॥ యః కశ్చి త్త్రిసరేణు రల్పధిషణః కామం కృతఘ్నో రటేత్
కిం తేనేతి పరిత్యజంతు కరుణావంతో భవంతోఽధువా
నిందా మాం స్పృహాపాతిన స్స సహతే సవ్యాకృతివ్యాకృతి
ప్రఙ్ఞావర్ధితసాహితీసుకవితా సర్వంకష శ్శ్రీపతిః. తి॥ శా॥

† తే.గీ. కాకి తోడేలు జక్కవ కప్ప గొంగ
లార ! కేలోడ్చి మి మ్మర్ద యడిగికొ నెద

ర్భిక్షుల్ బంధుగులోఁ జగూర్చు గుణువుల్ శ్రీ మాన్యఁగాలేరో! యీ
యాకంపంబది యేల? నిన్ గెలువరాదో వారి గారామునన్?

క. ఏల పిక మ్మ్రుస్ములలోఁ
బోలనివాదమ్ము! లుబుసుపోకకు నీకీ
బాలకవు లేడ దొరకిరి!
చాలుం జాలింపు మీ విచారణ లింకన్.

క. "పనిలేని నాపితుఁడు పి
ల్లినిగొటిగె" నటన్నరీతి లేకులతోఁ బో
రొనరించి మెచ్చు గొందువె?
జను లెఱుఁగరె యెవరి శక్తిసామర్థ్యంబుల్!

చ. ఎఱిఁగినవార లేని నృపు లీ వొనరించిన పద్దెముల్ చెవిన్
జొరఁబడుమీఁద నీ మొగముఁ జూడక యేగతి మిన్నకుంద్రు! మం
తిరి తిరి వెట్టుఁగాక, కులదేవత వల్దనుగాక, లేక లోం
దరపను లుండుఁగాక, రసతత్పరుఁ డాఁగునె యిట్టిపట్టునన్!

క. నాకే ప్రభుత్వ ముండిన
నీకవితాధారఁ జూచి నీ వొకచో నా
వాఁకిటికి రాకయుండిన
నీ కడ కేతెంచి కోరనే నీరాకన్! 164

తే. గీ. పాండవోద్యోగమునకుఁ దోడ్పడు మటన్నఁ
దీర దన్నట్టివాఁడ వీభీరుకలహ
మునకు నేలాటి ధారను ముంచియెత్తి
తంపు మిఁక నైన నేఁ జెప్పుమన్న కవిత. 165

ఉ. "జీలుగు బెండ్లు మీ" రని వచింపక పూర్వమె "జీల్గుబెండ్లమే
జీలుగుబెండ్లమే" యనుచు సిద్ధపడందగు బుద్ధిమంతులన్
బోలునె నీ వెమర్కొనఁగ! బుద్ధులు కర్మముఁ బట్టి పోవుఁగా
కేల యెదుర్కొనం గడఁగి రిట్టి ప్రబుద్ధులు నిన్ను శ్రీపతీ!

---

గలకలము మాని విననిండు పలుకుచుండెఁ
గండుఁగోయిల వీనులపండువులుగ. (కవిత 2వ సంచిక చూ.)

సీ. తిరుపతి వేంకటేశ్వరుల పేరులఁబట్టి తమపేరు లొనఁగూర్పఁ దలఁపవలయు
వారి కబ్బములఁజొప్పడు పద్యముల పాదములను దస్కరణంబుసలుపవలయు
నుప్పుపత్తిరి లేనియప్పు డవ్వారి శిష్యపశిష్యులపోల్కె నుండవలయు
నేకణంబులొ సంగ్రహించి యాపైఁ గృతఘ్నతకల్మిఁగోకిలల్ గాఁగవలయు

తే. గీ. మీఁదఁ దిరుపతి నెదిరించి "మెమ్మెమే" య
టంచు "డెంకాయ పిచ్చికోం" డనగవలయు
నంచు దైవంబు నొసట వ్రాయంగఁబోలు
లేక యుండినఁ గలనె యీ లేకిపనులు.

* ఉ. కాకము నేవఁ టాయన పికం బఁట! తాను గృతఘ్నుఁ డౌట కీ
కోకిల నేర్పె నంట! వెఱిగొల్లలు మేఁకలఁ బట్టి నేర్చునో
లే కెటు పోయినో మిథునలీలలు! దుష్పథ మూన రాదుగా
కే కుటిలంపుజంతువులొ యేరికి నేర్పవు దుష్ప్రవర్తనల్!

---

* కాకమా! నీవు నల్లనిదానవు. నీ కంఠధ్వని కర్కశఘోరము. కావున నిన్నెవ్వఁడు గనుఁగొనఁడు. సుఖమున దుఃఖమున, సంపదయందు నాపద యందు, వసంతమున వర్షఋతువున, నొకప్పుడన నేల? ఎల్ల వేళలయందు నుందువు. నిన్నెవ్వరు గనుఁగొనకుండుట కిదియొక మూలకారణము......... అన్నా! నీ వట్టి యనాదరమునకు నట్టి నిగ్రహమునకును భాజనమైతివా? అయ్యో! భగవంతుఁడు సృష్టికర్త నిన్నిట్లేల చేసెను?......... నీవును నల్లని దానవే. కోయిలయు నల్లనిదే. నీవును గూయుచున్నావు. అదియును గూయుచున్నది. మీ రిరువురు గాయకులే మఱి యిఁక విశేషమేమన—కోయిల యాదరణీయ మయ్యెను, నీవు గర్హణీయమ నైతివి. దీని కేమి కారణము? అది సమయోచితముగ గానము సేయుచున్నది. నీ వట్లు చేయవు. కోయిల వసంతారంభమున మృదుమలయానిలవ్యావర్తితం బగు రసాలపల్లవము చెంత నధివసించి యభినవజ్యోత్స్నా సముద్భాసమానంబు లగు దిగంతముల ముఖరితములఁ జేయు నా ధ్వని నాలకించి జగ మెల్ల మిగుల మోహించును. .........నీవు మాత్రము నీ ప్రాగల్భ్యమును సమయానుగుణముగఁ జూపించుటలేదు. దానివలె నుత్తరంగిత మగు స్వరలహరిచే నీజగమును వ్యామోహ పెట్టుటయు లేదు. ......... కావుననే నిన్నెవ్వరును బ్రేమింపరు. నీ గానతత్త్వము నెఱుంగ నెవ్వరును బ్రయత్నింపరు. ఎల్ల యప్పుడు వినుచున్న నీగానము నెవ్వరును వినరు. కావున నీ యన్నమును దిని పెఱిఁగిన పరపుష్టము సమయానుగుణముగ నొనరించి జయము

ఉ. "బాబుకుఁ బెండ్లి యయ్యె" నని బాలుఁడు సంతసమందెఁగాని మే
కై బహివెట్టు చెట్ట సవతమ్మ ఘటించు టెఱుంగఁ డయ్యె!" నా!
రా, బధిరత్వ! మేను ఓకమైతిఁ గదా! యని యుబ్బెఁగాని యీ
శా బకపుంగవీశ్వరుఁ డెసంగు కృతఘ్నతఁ జూడఁబోఁడహో.

మ. అనుకొన్నట్లె ఓక మూాని కాకి? శునకం బావాని? యానే గజం
బెనుఁబో? తౌనొకొ పిల్లి పెద్దపులి? యా యీ జంతునిష్ఠంబు సు

---

నొందె ననియు నీవు సమయాసమయములను లోకమర్యాదను దెలియనిదానవై నిజస్వభావమునే యవలంబించి పరాజయము నొందితివనియుఁ జెప్పుచున్నారము. ఈ ప్రపంచమునను మీ వంటివారనేకులు గలరు. తఱచుగ వారిలోఁ జాలమంది కోయిలవంటి వారలే. తఱచుగఁ గోయిలవంటివారికే మిగుల శ్రేయము. ఎల్లప్పుడు దేశస్వరంబున నీచపు గానము చేయువారలు పరిష్కృతము నొకప్పుడును జయింపలేరు. ఓ వాయసకులతిలకమా! ఈ భువనమున నందఱను జయించి వాచదూకత్వము నొందుటకును దేవ్పన జగమునెల్ల వ్యామోహ పెట్టుటకును నీవు కోరుచుంటివేని సమయానుగుణముగఁ బ్రాగల్భ్యమును జూప నభ్యసింపుము. చిరకాలోపనతంబగు నీ రాగమును బరిత్యజించి మంజులముగ గానముఁ జేయఁ బ్రయత్నింపుము. అవును గాని, నీ కిట్లు చేయ శక్తిలేదు. ఏలన నీవు కాకమవు, కోయిలవు గావు. కావున నో కాకమా! నీ వెన్నటికిఁ గోయిలవు కాకుము. ......... నీ పన్నిదినములఁ గోయిలకుఁ బినతల్లివంటిదానవై తివి. యుక్తవయను వచ్చువఱకుఁ బినతల్లిచే సాదరముగఁ బెంపఁబడి సుఖముగ నున్నవారలయ్యుఁ బిదపఁ దల్లిదండ్రులను నిందింప వెనుదీయనికొందఱు నవనాగరికులవలెఁ గోయిలయు నీయెడఁ గృతజ్ఞతను వహించుటలేదు. ......... నానాప్రదేశములనుండి ముక్కముక్క తృణమును సంగ్రహించి యొక చిన్నగూడు కట్టుకొని యా గూటిలోనే కోయిలపిల్లను పెట్టుకొని గృహస్థధర్మములఁ బరిపాలించుచుంటివి ... జగము నిజముగ బాహ్యాడంబరములచే మోసపోవుచున్నది. నీ స్వతస్సిద్ధములైన యౌదార్యాది సద్గుణములను బిగ్గరగఁ దాళలయానుగుణముగ గానము చేసితివేని యప్పుడు నీవును బ్రసిద్ధిఁ జెందుదువు. ఇది నీకు సాధింప నలవి గాదు. ......... అన్నా! నీవు వచ్చి మాయింటిముంగిట నెండి యున్న మామిడికొమ్మపై గూరుచుండి తడిసిన ఱెక్కలను బటపట దులుపుకొనుచు యథాప్రకారముగనే కూయుము. మేమును నిన్ను బహుమానింతుము.. (కవిత)

స్వనముఁ శుద్ధియు దీర్ఘశారీరమయుఁ జండాతిచండత్వముఁ
దన కేలాగు ఘటించు ? వర్ణసమతన్ దత్తద్గతుల్ గల్గునే !

సీ. కాకకోకిలముల పోకలం బట్టి యెవ్వాఁడు దేశికునితో వైర మూను ?
మేఁకపోతులఁ జూచి వేలుసీతి యటంచు నెవ్వాఁడు తల్లితో నవ్వులాడు ?
వాలమందలఁ జూచి యౌ ఒకీ ! యిదియంచు భక్షించు నెవ్వాఁడు పచ్చికసవు ?
తురకబిడ్డలఁ జూచి సరియంచు నెవ్వాఁడు పినతండ్రి కొమిరెలఁ బెండ్లియాడు ?

తే. గీ. పక్షులం బట్టి పశువులఁ బట్టి యితర
మనుజులం బట్టి నీతులు మనకుఁ గొన్ని
గలవు నేర్వంగ నివి కావు కావు కావు
పిల్లకాకి యెఱుంగునే వింటిదెబ్బ!

ఉ. కాకి గురూత్తముండును బికంబును శిష్యుఁడు నాట కేసుణ
శ్రీ కరతమో, విచారణము సేయఁ గృతఘ్నత యొందు పక్క వే
త్తే కనరాదు హేతువు; పరీక్ష యొనర్ప నపశ్రుతిస్వరా
పాకులగాత్రముల్ గలవె యక్కట, కోకిల కెక్కడేనియుఁ !

క. "కోకిలము కృతఘ్నత్వము
కాకియెడం జూపెఁ" నంచుఁ గాకవి చెప్పం
గాక, యది యెట్లు సరిపడు
నీ కల్పన సమ్మతింతురే సుకవీంద్రుల్ ! 173

తే. గీ. కాకి నామరూపమ్ములు గలుగఁజేసి
కోకిలమ్మను బోషించుఁ గొన్నినాళ్లు
అంత ఱెక్కలువచ్చునై నవలి కేగు
నంతమాత్రఁ గృతఘ్న మెట్లౌను పికము ?

క. మతిమాలిన మాటిది "తు
ష్యతు దుర్జన" యన్న నీతి నంగీకారం
బతికించుకొండ మన్నను
బ్రతిపక్షికి లేశమేని ఫల మున్నదియే ? 174

క. ఇది "సహృదయ" యను పత్రిక
బొదలెడునది యనిన వారు బుద్ధిగలిగి చూ
డఁదగరె, "ఏను బోలిసిన
యది" యనఁ గట్టుమని చెప్పనగునే ద్రూడన్ ?

సీ. కల్లుద్రావుదురొక్కొ! కలఁడల్ల బలరాముఁడనియెంచియెవ్వరేనలఘుమతులు
జూదమాడుదురొక్కొ నూరు శేరేని ధర్మాత్మజాతుండు దృష్టాంత మనుచు
తల్లిఁజంపుదురొక్కొ! తగ వేవి యొవరేని పరశురాముండున్నవాఁ డటంచు
కుక్కమాంసము తిందురొక్కొ! విశ్వామిత్రముని మాలి యున్నవాఁడని తలంచి

తే. గీ. ఉత్తమగుణంబు నేర్చుకో నొప్పుఁగాక
యధమగుణమున కకట! దృష్టాంతమేల?
కోకిలము గాఁగఁ జక్కని గొంతు వలయుఁ
గాని కృతమును మఱచుట గాదు నూనె!

చ. మన మొనరించునట్టి పని మాన్యుఁడునుం బొనరించుఁ గాక; యా
తనికి యశంబు దెచ్చినది తత్కృతియో, మఱియొక్కటో? యెఱిం
గిన నరుఁడేనిఁ దా నొక యకించనకార్యము సల్పియుండె నిద
ర్శనముగ నాతనిం గొనఁడు; సార మసారు లెఱుంగ నేర్తురే!

సీ. కొండెగాండ్రండ ఉద్దండగాయకవరేణ్యుఁడు నారదునికీర్తి నొందఁ బోరు
కొంప లంటించు దుర్గుణరాసులెల్ల శ్రీయాంజనేయులసాటి నందఁ బోరు
పరభార్యలనుగూడు దురితాత్ములెల్ల దేవేంద్రుతో సామ్యమ్ము నెనయఁబోరు
అనృతమ్ములాడు నీచాచారులెల్ల సాక్షాద్ధర్మరాజులై గ్రాలఁ బోరు

తే. గీ. ఒరు లొనర్చిన మేలును మఱచి "తిన్న
యింటి వాసాలు లెక్కించు" దంటలెల్లఁ
గోటిజన్మమ్ములకునైనఁ గోకిలములు
గారునూ! కాకవిద్విపగర్వహారి!

ఉ. కోరుటఁ వార లప్పు నొగి గూబలు నల్పి వసూలుచేతు, రె
వ్వారు కృతఘ్నతాప్తి గురువర్యుని గాకమునీఁడఁ బెట్టి య
వ్వారిగఁ జట్టి తాము పికవైఖరి గంటిమటన్న తృప్తిఁ జె
న్నారుదు? రట్టివారి కెవ రయ్యెవరయ్య జగాన శిక్షకుల్!

క. "గురుఁడను నే"నన "మీరా!
త్వరపడి మా బాబటంచు భావించితి నీ
పొరపాటు సైఁపుఁ" డను ధీ
వరు శిష్యుఁడు గలుగునూ! పరిపంచకమందున్.

క. "వంటింట నిట్టికృతి తగ"
దంటకు నొక్కింత కొంకి "యహా నిది తులసీ

మంటప మనుకొంటి" నసెడి
దంట లెప్పుడుఁ గలరునా! శతమ్ములు వేలున్.

ఉ. ఉండఁగ నిమ్మ వారిక మహోదయమందము గాక యింతబ్ర
హ్మాండము మోయునట్టి పరమాత్ముఁడు వారిని మోయలేఁడె! లే
కుండిన నిట్టిసృష్టి కెటు లొప్పెడి? దేవునిదృష్టి నేఁటిపై
నుండెడునట్లు తేలుపయి నుండు నఖండుని కేటిభేదముల్!

క. నేఁటి యితరకీటమ్ముల
మాటికిఁ దనయొద్దఁ జేర్చి మంత్రించుచు వా
నాఁటికి నాత్మ భేదము
వాటించున్ దేలు కీలువడఁ బడఁ గుట్టున్.

ఉ. ఎందుల కీవివాదె? యిది యెవ్వరుతీర్తు రరణ్యరోదనం,
బందఱికిన్ భవత్కవితయందలిసారము తెలుంగవచ్చె, వా
రిందుల కుత్తరం బిడుట యెట్లు ఘటించెడి? నిన్నెదుర్చి శ
త్రింపదమారెడ నుండి కొని తెత్తురు? చిత్తరు వేమి చేసెడిన్!

మ. మనలన్ జూడమె మాటలాడ రెప్పుడున్ "మద్దేశికుల్ వీ" రటం
చనువా రెంచఁగ లేరు! వారిపయి రోషావేశమున్ జూపితే
"యవ్రుత మ్మాడి" రటంచు? నీతని యసత్యం బట్టులే నైఁప్రమె
ష్వనికి స్పష్టము చేసి నానొ గుణితింపన్ లేరె లోకుల్, సఖా! 185

మ. మనశిష్యుం డనినంత నేమి యగు! సన్మార్గాల్ ప్రశంసింప ధీ
శనిగా నైపోచ్చము లేని యాశుకవియై కష్టావధానమ్ములన్
ఘనుఁ డై వారలమెచ్చు లేని కుహనాకల్ప ప్రవిష్టుండు, శి
ష్యునియజ్ఞాము దేశికున్ బడు నొనర్పం గాదె సద్వృత్తపి!

చ. చరలకులాధిపం ద్రుని ప్రశంసయు లేదొకపట్ల, నట్టియు
క్కరములు గల్గు పద్దెము నొకండును దాఁ రచియించి నట్టి దా
ధరణిప్రసన్నిధానమునఁ దాఁ బఠియించిన దేది? చూపినన్
గురువులకెల్ల నయ్యది యొకొండె నివేదనగా చెలంగుతన్.

ఉ. నే నొకచర్లబ్రహ్మయ మనీషినె పేర్కొనినాఁడ నంట! తా
నా నియతిన్ బఠించెనఁట! యట్టిప్రధాన గురుండు వీఁడె యాఁ
గాని కలాగ్రణంద్రుఁ డెటు గాఁడగుఁ? దప్పొనరించి యింక న
ద్దాని సమర్థనమ్మునకుఁ దాఁ బడుపాటు లెపం డెఱుంగఁడో!

సీ. రఘువంశము భుజంగరాడ్గురుసన్నిధి నింపుమీఱఁగఁ బఠియించినాఁడ
శ్రీపాద కృష్ణమూర్తికవీంద్రుకడ నైదు మాసముల్ శుశ్రూష చేసినాఁడ
కాజులూరను నూరఁగామసోములయొద్ద నొక్క మూఁడుమాసమ్ము లున్నవాఁడ
చామర్లకోటలోఁ జదివితి రాఘవాచార్యసన్నిధిని మాసత్రయమ్ము

‡ తే. గీ. పైని వసంతాచార్య మారయపండితు లిరు
వురును మూఁడుమాసమ్ములు గురువులైరి
పిదప శ్రీబ్రహ్మయమహర్షి పేరు దెచ్చు
గురుఁడు నాకయ్యెఁ దన కట్టిగురుఁడ నేను.

తే. గీ. "ఎవఁడు వెత్తిముండాకొడు కీనమన్సు
వాని"దన "నేను" యని చెప్పువానిరీతి
నాకుఁ జేకూరి నందుకు నవ్వఁ బోకు
మయ్య ! యేనాఁటి కేమౌనొ యరయఁగలమె.

క. శ్రీకరము భాగవత మే
నాకృతికిఁ గృతి యొసంగ, నది కాదని నా
కీకవి కాశవ్యాసము
"కైకొను" మని కృతి యొసంగెఁ గడుభక్తిమెయిన్. 191

తే. గీ. మధునపంతుల మారయబుధునియొద్దఁ
జదివె ముందట, నామీఁదఁ జర్లకులజు
నొద్దఁ బఠియించెఁ, బిదప నాయొద్దఁ జదివి
కోకిలం బయ్యె ; నింకొక్క గురు నెఱుఁగడు.

శా. ఓ, నా, మా, లను జెప్పు నొక్కగురుఁ, డింకొక్కండు దా నక్షర
జ్ఞానం బించుక వృద్ధి సేయుఁ, బయి శాస్త్రం బింక నొక్కండు రాఁ
గా నేర్పున్, గురుమాతృలెల్లరు నమస్కారార్హులే యైన, వి
జ్ఞానం బబ్బినచోటు ప్రప్రథమకర్తవ్యంబు శ్రేయోర్థికిన్.

* చ. కను మిది నన్నుఁగూర్చి "కవిగండఁ" డటంచు నొకంటఁ బద్యమున్
మును రచియించి యిప్పుడది ముద్రణమందునఁ ద్రోసివేసి రీ
ఘనమతు, లంతమాత్రమున గండర గండఁడఁ గాకపోతినో
మును పెటులైతినో ! యివియపో మనకోకిలకున్న యోజనల్.

‡ గురుపరంపరను దెల్పు పద్యములు తుది పుటలోఁ జూడఁదగు.

* "........వెనుక వీరు యానాంలో శతావధాన మొనర్చినప్పుడు తమ

క. కోడియుఁ గుంపటి లే కే
"జాడం దెలవాఱు నన్న" సామెతగా వీ
రాడినమాట నశించినఁ
గాఁడే గండండు వీఁడు కాఁ దగియున్నన్.

చ. తినువెడ రాయి రాఁగఁ గని దీఱఁగ వైష్ణవుఁ డిట్టివాఁడె లిం
గని గ భ్రమించి తాఁ గొఱికెఁ "గట్టని" వెట్టనఁ బండ్లు వోయెఁ బే
ర్కొని యది ముద్రిణంబునను గూర్పనియంతన పోయెనోక్కొ! వ్రా
సినజను లుండరే? యది నశించెనె! వారిని వారు వ్రాసిరే!

క. పంచాంగమ్ములు చించి "న
శించెన్ జుక్క" లను గణకశేఖరులకు వీ
రెంచఁగ నన్నలొ, తమ్ములొ!
కించిత్సంబంధ మున్నక్రియఁ జూపట్టెన్. 197

సీ. చామర్లకోట స్టేషనువద్ద జరిగిన చిత్రమ్ము వినుమయ్య! చెలిమికాఁడ
అల పురాణపు వెంకటప్పయ్య రావుబహదరుగారును వారి యనుజుఁడైన
నాగభూషణముగారు కటఁ బోడకట్టి యవ్వారితో మాటలాడునప్పు
డీకోకిలయు వెంటనే యుండె నవ్వారి లడిగి "సీతం దెవ్వ" రనుచునన్ను

తే. గీ. నే వచించితి "రావుసూర్యేందుశతవ
ధాను" లని, తా వచించె సీతండు "వీరి

---

సహాయములేనిదే వారేమియుఁ జేయలేక పోయిరను ననేక దృష్టాంతములఁ జే నొక వ్యాస మేపత్రికకైన వ్రాసి ప్రకటించుటకు నాకనేక దినములనుండి యభిలాష కలదు........."

16—3—1911, పంకెద్దు రెడ్డినాయుడు.

'.........ఆపద్యము ఒకప్పుడు వెం॥ శా॥ గారి మీఁద చెప్పినామని చదివిరిగాని నాకు కంఠపాఠముకాదు. ధారణకు దెచ్చికొని యిందువ్రాసితి, వాల్గవపాదము నాకు విశ్రమస్థానమునుండి జ్ఞాపకము చాలదు.........యింత వరకు 'మాకు శతావధాన మసమాన" అని కొంత జ్ఞాపకము." వెం॥ సు॥ రా॥

ఉ. ప్రాకట సత్కవిత్వ పరిపాటిని మేటిసభాంతరమ్ములన్
వీక శతావధానములు వేనకు వే లొనరించి యందు ము
క్కాకలు దీరినట్టి కవిగండఁడు వేంకటశాస్త్రియుండఁగా
(మాకవధానపుంగృతికి మానసమందుఁ దలంక నేటికిన్)

శిష్యుఁడనె" యంచు సభలోనఁ జెప్ప కవ్వి
డేల చెప్పంగవలయునో యెఱుఁగరాదు.

శా. ఆనాఁడే కవనయ్యె నయ్యెడల విద్యాదత్తుఁడౌ శేరి కా
శీనాథాఖ్యబుధేంద్రుఁ; డయ్యవసులో శిష్యత్వమున్ దెల్పె నీ
మానవపార్థివశాలి, రాజసభలో మన్నామసంబంధ మెం
దేనిన్ సుంత వచింపఁ బాపమయి య ద్దేలాగు గాకుండెనో !

ఉ. ఇంతకు నాల్గురోజులయి యే నితఁ డుండెడి యూరికేగి "నా
చెంతఁ బఠించి రాజసభఁ జెప్ప, నొకుత్తర మేని వ్రాయ వే
వింత యి" దన్నఁ గోకిలయు వెల్వెలఁ బోవుచు "నారికేళపుం
జెంతకు గడ్డికై చనుట" చెప్పెడి సామెత మత్తరం బిడెన్.

తే. గీ. రాజసభలోన నల్లచర్లకులచంద్రు
శిష్యుఁ డగుఁగాక యాతండు చింతలేదు
పిదప నొకయుత్తరము వ్రాసి ముదము గూర్చు
పాటి విద్దెయు నావల్లఁ బడయఁ డోటు ? 201

ఉ. "సత్కులమందుఁ బుట్టితివి సత్కవి వెంకటశాస్త్రిఁ గొల్చి యీ
షత్కవనంబు నేర్చితివి చాలుఁ గృతఘ్నతఁ గాంచనేల, యీ
పత్కర"మంచుఁ జెప్పితివి బాగునకై మదిఁ గోరి; దానిచే
నుత్కటమయ్యె నాతని మహోద్ధతి నీవిఁక నేమి చేసెదో !

ఉ. అర్భకులంచుఁ దమ్ముఁ మది నారసితంట ! యెటుల్ ఘటించు నా
దుర్భరమైన మీసములు దొడ్డది గడ్డము నొడ్డు పొడ్గు పై
నర్భకు లొక్క మూగు,రెవ రాడుదు రర్భకులంచుఁ దమ్ముర! మా
నిర్భయనిస్త్రపత్వములు నీ కిటు మాన్పఁగవచ్చు శ్రీపతీ.

చ. గురుధనమే హరించి తనుకొందము దానికి నెన్నిరెట్టులో
యురువగు దేవిభాగవత ముత్తమగ్రంథ మొసంగి దేశికా
పరమున కాలవాలమయి తత్కరుణన్ సిరి గల్గి నందన
స్ఫురణ మెలర్ప నొప్పెదవు పో ! యవివేకవివాద మేటికిన్.

చ. ఇది తగునే యటంచుఁ దను నీవిపు డంటి, విఁ కొక్క రెవ్వరో
మది గలవారు నీవలెనె మంచిది గాదని మందలించుచో
నెదిరియొ యొకండు నింద పయి నెట్టులొ పొల్పి కృతఘ్నతన్ వెలా
ర్పఁ దలఁచునొక్కొ ! యెంతటి యుపాయము నేర్చెను శిష్యుఁ డద్దిరే !

ఉ. పత్రికలందు, బాలుర యపత్రపతేమిగుతించి శ్లాఘ్యచా
రిత్రులు వ్రాయవేదు "అరరే! యిది యెక్కడిపాప" మంచు స
ర్వత్ర హితమ్ముఁ బేర్కొనుచు వచ్చిరి, వారలఁగూడ నిట్టులే
ఛాత్రు "లపాత్రు" లంచవఁగఁ జాలఁ బ్రయత్న మొనర్తురో కదే.

శా. ఇచ్ఛామాత్రమునన్ బ్రబంధముల నెన్నేనిన్ రసారామపుం
గుచ్ఛమ్ముల్ బలె సృష్టి సేయు నిజకౌగ్గుల్ బల్కఁగా కీతఁ డ
స్వచ్ఛాభీయుఁడె కాక బందుగుఁడు మచ్ఛాత్రుండు గాకుండుఁగా
కచ్ఛమ్మైన కొలమ్ము వాఁ డితని వాక్కై నీవు పైరింపవే.

క. నీ వెంత కాలు దవ్విన
మావాఁ డతి శాంతమూర్తి మాటాడఁడు లో
నేవో చాటుగ ననుకొను
చే వానికి మాన్పవచ్చు, నెందుకుఁ జర్చల్ ? 208

శా. 'చూడంజాలని' మాట సత్యమె, యెటుల్ చూడంగనౌ! శిష్యుఁడౌ
వాఁ డీకీర్తిఁ గృతఘ్నుఁ డౌటయుఁ, బరిభ్రష్టావధాన క్రియా
పీడుం డౌటయుఁ, జేతఁగాని కవితన్ జెంపెది యల్లంతఁబో
కేఁడున్ లేఁ డని విజ్ఞవీఁగి తుదకి ట్లీపాటు పైకొంటయున్.

శా. 'చూడంజాలని' మాట సత్యమె, యెటుల్ చూడంగనౌ! పట్టి యా
యాడంబంబులు, కుంటి గ్రుడ్డికవితల్, హేయాతిహేయమ్ములౌ
మాడల్, కూడని పోఁడుముల్, విఱుగులున్, దుర్వారగర్వోచ్ఛ్రితల్,
త్రాడున్ బొంగ్రము లేని యాటనుడుకుల్, తత్త్వేతరాలాపముల్.

శా. 'చూడంజాలని' మాట సత్యమె, కుశిష్యున్ గర్ణునిన్ దుర్ణయుం
జూడంజాలెనె భార్గవుం, డల వసిష్ఠుండు న్నిమిన్ శిష్యునిం
జూడంజాలెనె సాపరాధు! నవయున్ శుక్రుండు ప్రక్రోశయుం
జూడంజాలెనె రావణున్! వినఁడొకో శుద్ధాత్ముఁడౌ పూర్వులన్ !

శా. 'చూడంజాలని' మాటయే నిజము, శిష్యుండైన రంగార్యుఁడీ
జాడం జూపఁగ దండిభట్లకులభాస్వజ్జ్యోతి, భాష్యాంతవి
చ్చాదాలంకృతి, విశ్వనాథబుధుఁ డీసుం జెంది యంతేవస
చ్చాదాభారము వాపకే విడిచెనే, నూరుల్ ప్రశంసింపరే !

శా. "చూడంజాలక" యాట కర్థ మిది, శిష్యుం డొక్కఁ డాత్మకుం
బీడం గొల్పు కృతఘ్నతాభరము పైఁ బేకొంద నుంకించు నా

జాడం గొంత యెఱింగి లోకులకుఁ దత్సత్త్వంబు సత్యంబునుం
గూడం దెల్పి యథార్థమార్గమునకుం గొంపోవ యత్నించు టే.

క. 'కుండలలోఁ బాండిత్యము
దండిగఁ గలవాఁ' డటంచుఁ దమ గురుపుత్రున్
దుండగమున నిందించిన
పండితు లవ్వారి కుండపలదే తెగువల్. 214

మ. యతియున్ బ్రాసయుఁ గూర్చుమాత్రఁ గవియే! యామాత్రపుం దెల్వి యీ
క్షితి "యంత్రబ్రహ్మల" కుండ దెందఱికి! వాసిన్ మీసముల్ దువ్వి యే
ప్రతినన్ దా నొనరించు దాని సభ నిల్పం జాలు నెవ్వాఁడు, ని
ష్పత్తి ముండాతఁడు; నోటివాడుకిఁక "యంత్రబ్రహ్మల్" మహాపండితుల్.

*మ. ఎఱుఁగన్ జాలరు బుద్ధిమంతు లిసిరో! "యింటింటి పూజారు" లం
చఱపంజొత్తురు విజ్ఞులుంబలెనె, యాకారాకార! బాణున్ యశ
స్కరు నేమంచుఁ దనూభవుండు వొగడెన్ గాదంబరీకావ్యమున్
సరిగాఁ గన్నులు రెండు విప్పి కని చర్చన్ జేయ విస్పష్టమా.

ఉ. ఒక్కఁడు శిష్యుఁ, డింక నొకఁడో పరికింపఁ బ్రశిష్యుఁ డయ్యె, నీ
ప్రక్కకుఁ జూడ నీవు సహపాఠివి, మాగురి మందలింపఁగా
హక్కొకయింత నాకుఁగల; దైనను లాభములేదు. నారు చె
ట్లెక్కిరి కోకిలమ్ములయి; యిక్కతన న్నిను మందలించితిన్.

చ. ఇది విని యేరిశిష్యుఁడును నిట్టి కృతఘ్నత చూపకుండుఁ గా;
కదియును గల్గెనేని గురుఁ డాచతురున్ క్షమియింప కుండుఁ గా;
కెదిరిని దమ్ముఁ దా మెఱిఁగియే చరియింతురుగాక యేరు; స
త్పదము దొరంగియున్ మరల దారికి వత్తురుగాక యుత్తముల్. 218

---

* శ్లో॥ ఆర్యం య మర్చతి గృహేగృహఏవ లోకః
పుణ్యైః కృతశ్చయత ఏవ మయాఽత్మలాభః
సృష్టాచ యేనచ కథేయ మనన్యశక్యా
వాగీశ్వరం పితరమేవ తమానతోఽస్మి. (కాదంబరి)

# 7

## ఇతిహాస పర్వము.

శా. చూడంజాలవొ నీవు భూపతిసదస్సుల్ ? జూడఁగాఁ బోయినన్
శ్రోఁ "జీతం డసమర్థుఁ" డంచు సభకు న్నిరాశ జెప్పండో ! నిన్
జూడంగూడినమీఁది పేరి నటులై జూడన్ బ్రసక్తింమనో !
చూడంబోయియె తమ్మ మన్నటని లోఁ జూడంగలే రక్కటా !

ఉ. "ఎందుకుఁ బోరు మీరు నృపుఁ డెంతయు దాత గదా" యటంచు లో
సందియ ముండవచ్చుఁ గవిసంతతి కయ్యది వాపు టొప్పు, న
మ్మం దగునేని నమ్ముదురు మానిన మానుదు, రా నృపాలమా
లిం దిలకింప నొప్పమికి లే దితరం బిది విమ్మ శ్రీపతీ.

చ. కడియము శ్రేనిగ్రామ మది కాపురమా మతి నాకుఁ బూర్వమం
దొడికవుఁగైత కివ్వఁడు మహోదధి మత్ప్రపితామహానుజుం
డెడపక శ్రీనిసన్నిధికి నేగక కాలము పుచ్చె' నప్పు డా
తఁడు గలచోటికే నృపవతంసుఁడు వచ్చె రసజ్ఞుఁ డౌటచేన్.

* శా. నీలాద్రిక్షితిపాలుఁ "డేమి వలయున్ మీ"కన్న "నా కన్నవ
స్త్రాలం దెందు గొఱంత లేదు నరనాథా ! నీవు మేల్ దాతవం
చేలా గీతఁడు గోరు నిన్ను ! సకలం బీవిచ్చినట్లే; ధరా
పాలుర్ మీ రెపుడో యొసంగునిలయే చాలించెదన్ మమ్ములన్" 222

చ. తగదని నుడువయ్య ! నాదగజేతమ్మనఁ బండితుల్ గా కెఱింగి మె
చ్చుగ మును మాదుపూర్వులకు సూరిజనావరు లెప్పుడో యొస
గ్గాగి నొకకొంతభూమి యిది గోసపాలక ! మీనృపుల్; తగా
దిగ నదిపెంచుచున్నది మదీయుల వెల్లఁగ గామకేనునై.

చ. వలపనికోరికల్ తగవు బ్రాహ్మణజాతికి, నున్నదానితో
నలుపటయొప్పు జీవనము; సంపద హెచ్చు కొలంది ముందువా
రలు మదమత్తులై చెడి పరంపరగాఁ గల వేదశాస్త్రపుం
జెలిమికి బాహ్యులౌదు; రటు చేసిన బ్రాహ్మణజాతియే చెడున్.

ఆ. వె. మూఁడు జాము లైన ముచ్చ పొద్దున నైన
నెవఁడు శాకమాత్రమేని యుంటఁ

---

* నరసకవికృత వేంకటేశ్వర విలాస పీఠిక చూడుఁడు

దనకు నున్నదానిఁ దాఁ దినునో యట్టి
వాఁడు శ్లాఘ్యుఁ డంద్రు బ్రహ్మవిదులు.

శా. అంతో యింతయొ పండు భూమి గల దావంతైననుం జింత లే
దంతేఁ జింత యొకండు గల్గినను నాయీచింతయే మాకు న
శ్రాంతమ్మున్ ఫలదాత, తత్ఫలములున్ శాకమ్ములున్ గల్గ మా
పంతం బెట్టులు చెల్లకుండు నృపతీ! భవ్యాకృతీ! సత్కృతీ.

ఉ. పొట్టకు లేనియప్పుడు నృపుల్ గల, రూరక నిన్నుఁ గోరఁగాఁ
బుట్టదు మానసం; బితఁడుపూజ్యుఁ డటంచు నెఱుంగుఁ డేసుమీ!
పట్టము గట్టుటన్న; నరపాలక! నీపరిపాటి నేఁడు గాఁ
బట్టదు పూర్వపున్ యుగమువానిఁగ నిన్ మది నెంతు" నావుడున్.

ఉ. కోరియె తీరఁగా వలయుఁ గోరిన దిచ్చి యశమ్ము నందియే
తీరవలెన్ నృపుం డితఁడు; తేజము లేనియపాత్రదానముల్
పేరొడఁగూర్ప నేరవు, కవిప్రవరుం డొకఁ డిచ్చుపద్దమే
చేరుచు స్వర్గమున్; యశముచేఁ గద! యయ్యెడ నిల్వఁ గల్గుటల్.

క. నేటని కవి కవితాఖర
వారారోహణమహోత్సవమ్మునకన్నన్,
నేరుచుకవి కవితార్వప
దోరూదారప్రహాయోగము మెఱుఁగా. 229

ఉ. ఇంద్రుఁడు చంద్రుఁ డంచుఁ గవు లెంచఱు సన్నుతు లెన్ని చేసినన్
బండకవిత్వమేని యది, పాడఱు నున్న యశంబుఁగూడఁ; బే
రందిన మిమ్ముఁబోఁటికవు లాగ్రహ మంది యొకంటఁ దిట్టినన్
బొందు యశమ్ము దాన, రసపూరిత మయ్యది గాన సత్కవీ.

క. కుట్టికవి మహిషశతకము
గట్టిగఁ గోపించి చెప్పెఁగద! తంజావూ
ర్పట్టణ విభుపై నాతఁడు
దిట్టువడియు మెచ్చుకొనఁడె ధీవరుఁ డతనిన్!

ఉ. మున్ను మహమ్మదీయనృపముఖ్యుఁడు దా ననుమాటఁ దప్పఁగాఁ,
గ్రన్ననఁ గోపగించి కవిగండరగండఁ డొకండు తొల్లిఁ దాఁ
బన్నినకైత చింపి, పయిఁ బన్నెను దిట్టుచుఁ గావ్య మొండు; దా
న న్నృపుఁ డంచె మోద మనినన్ సుకవీంద్రమహత్త్వ మల్పమే!

క. కల పెట్టిన శ్లోకము తా
కలికాలమునందుఁ గూడఁ గవుల చరిత్రల్;
కలుగు నృపాలకు లిట్టిరు
బలవంత ప్రతీతి యశము వడసినవారల్.

ఉ. కావున మీకతానఁ గృతి కావలె నీతఁడు కోరుఁ డెద్దియో,
పావనుఁ జేయుఁ డీ నృపునిఁ; బాత్రము చేకులు వెంతవారి కాఁ,
బోవు ధనం బెటో; యశము పుట్టఁగఁ జేసెడిదాన మన్నచో
నీవిధమైన సత్కవుల కిచ్చినదే యది నిల్చు నెప్పుడున్.

తే. గీ. సత్కవుల గ్రంథములు గాక సాక్ష్య మేది?
రాముఁ డెట్టిఁడో, యెట్టిఁడో రావణుండు?
తా రెచట నున్న మృత్యులే తజ్ఞు లెందుఁ
గీర్తికామున కల చక్రవర్తికేని. 235

క. అని చెప్పి కోరుఁ డని ప
ట్టును బట్టినఁ దాత గోరెడున్ విను "మోయీ
జనపాల! నాదుకోరిక
గను మది యిచ్చుటయె నాకుఁ గనకాచలమా.

చ. కల దని మున్నె చెప్పితినిగా! యిల మీ రిడినట్టి దింత, య
య్యిల కొకకొంత కట్టుబడి యేర్పడి యున్నది మున్న; దానిలోఁ
పలఁ గల మూఁడుభాగముల భాగ మొకం డది నాది; దానికిం
గలకరమున్ వెలార్చు మది గాఁడగు నాకొక కోటితుల్యమై.

క. కృతియన్న యామినీ పూ
ర్ణతిలకలో నీదు పేరు నాటించితి నిం
తకుమున్న దేవునికి సం
కిత మది చేసితిని ధన మకించిత్కరమా."

క. అని తెలిసి సమాధాన
బు నెటో పానరించె; నట్టిపుణ్యాత్మునికిన్
మునిమనుమఁడ నాసకవీం
ద్రునికిన్; నాయంత నయిగుదునె నృపుఁ జూడన్.

క. తిరుపతిక వేంకటేశ్వరుఁ
డరుగని యొడ కరుగు టొప్పు నని యెంతురె యొ

వ్వరుగాని మనకుఁ గల్గిన
పరస్పరస్నేహ మెల్లఁగు ఖండితమ్మాయెల్. 240

చ. ఇది యిటులుంచు మింకొకటి యీశ్వరవేర్లట యున్నవారు నీ
కెద భయమాఁగదా యటకు నేగ! నృపాలుఁడు పిల్చె నేనిఁ గో
విదు లెటు లెంతురో యనుచు వీసముఁ ద్రాసము లేక కైతతా
పదరిన దీవెలుంగవోళ్ళా వారలధాటికి వాఁగ నేర్తువే.

* ఉ. ఊరును బేరునుం జెఱచి "హూ" ష్షని తోలఁగఁ జాలుపండితుల్
ధీరులు రామకృష్ణు లరుదెంచి సభాస్థలిఁ గూరుచున్నచో
నోరు మెదల్పఁగాఁగలవె, నూటి కటుంచు మొకండు పద్దెముం
గోరినఁ జెప్ప నేరుతువొకో! పృథగాఁ జన నేటి కోసఖా!

ఉ. పల్లెలలోన నున్న ఖల్వదులఁ బామరసంఘమునొద్దఁ దక్క భూ
వల్లభసత్సభాస్థలుల వాక్కొటు లేచెడి నీకు! నీదు వి
ద్యోల్లసనం బెవం డెఱుఁగఁ బోరక యంకిలు నైనఁ; "పల్లెపు
ట్టే" ల్లనునట్టి సామెతగ నీశ్వరవేరు లెఱుంగరే సఖా!

ఉ. వచ్చును రెండు శాస్త్రములు వారికి నీ కొకటేని రాదు; స
ద్యోచ్చముగాఁ గవిత్వ మలయుగ్మము చెప్పెడి నీవు చెప్పలే;
నెచ్చటనో రచించుటకు నిచ్చటికిం గడు భేద ముందు; ని
న్నెచ్చట మెచ్చి రొక్కఁడును నేనియు సాక్షిగఁ జూప నేర్తువే?

చ. ఇటు మొగమోటముల్ విడిచి యే ననినాఁడ నటంచుఁ గోపము
త్కటమగునేమొ నీకు; పృథగా మఱి నాపయి రాకు మీఁగతిన్
రటనము సాటెసాటెకు దురంబుగఁ బత్రికయందు నించు మా
యటమొగపుల్ ప్రబుద్ధుల పరాక్రమపుం జెలువుల్ లిఖించితిన్.

క. కలరేమొ యిట్టివారి
క్కలియుగమున నేని యొండు కడ నక్కట! యీ
కలిబొల్లిప్రాఁతలే తమ
కలవఱచునె సుకవివీరు లను సద్యాతముల్. 246

---

* ఉ. ......... ఈ హీరహీయెంత పీఠపురి నీశ్వరవేర్లు వసించువారు నీ
యూరును బేరునుం జెఱచి హుష్షని తోలెద రేగి వాళ్లుమీ. (సత్యసందేశము 6 వ పుట)

క. ఎందులకుఁ బిచ్చివ్రాఁతలు
సందేహములేదయేని సత్సభకుం బో
డందఱుఁ గందురు మీ కీ
ర్తిం దగ దని చెప్ప నొక్క-ధీరుఁడు లేఁడే.

క. మన యవధానంబఁట ! వీ
రొనరుచు నవధానమునకు నొక నూఱవ వం
తునఁ గూడ మాఱదనియే
ఘనుఁడో లిఖియించె నంట ! కంటివె సఖుఁడా.

క. రెండును విడిచిన వ్రాఁతకు
నొండొక సందియము కూడ నుండునె? మఱియె
వ్వండేని యొకఁడు వ్రాసినఁ
గొండురె తా మట్టివ్రాఁత కోవిదులేనిన్!

క. ఎవఁడో సీతను సైతము
వివేకరహితుఁడయి యాడెఁ విని నమ్మెనె యా
యవివేకుని ప్రల్లదములు
కవిలోకము నిజము పిడపఁ గని వ్రాయనొక్కో!

తే. గీ. అట్లె యెవ్వండొ వ్రాయఁగా కంతమాత్రఁ
జంకలం గొట్టుకురె వివేచనయె యున్న
తిరుపతి యెవండు! వేంకటేశ్వరుఁ డెవం ! డ
టంచు నించుకయేని యోజించ వలదె.

క. గేహానర్దు లొనర్చు దు
రూహలవలనన యశమ్ము లుడివోయిన సై
దేహి పతివ్రతయై తా
నేహానియు లేక జగతి నెటు వెలసె సఖా!

* క. బందరులో ఘనులందఱు
నిందించి రటంచు నెవఁడో నెఱి వ్రాసె నటం
చుం దారు వ్రాసికొని రత
నిం దెలిపెఁ బిదప దాని నిక్కము తేలున్. 253

*అట్టహాసము 10-11-వ పుటలు చూడుఁడు మఱికొన్ని ప్రల్లదములకు 17 వ పుట

ఆ. వె. వ్రాలుదల్పరేని వ్రాసిన యాపెద్ద
మానిసిని దగుంబ్రమాణమొప్ప
నడుగఁ దగినవారె యడుగుదు రేలదో
బూచి దొంగబూచి బూటకములు.

తే. గీ. బందరేవచ్చి యటులేని ప్రజ్ఞ చూపి
ముసలితనపు మన పధానమునకు నేని
దీటటన్నమాటను దారు దెచ్చికొన్న
మనల మ్రొక్కింపరే వారిఘనత కొరలు!

క. మసి పూసి యొట్టులో బిరు
దు సారముం గూడఁ జెఱిచి తుందుడుకున వె
క్కసమగు కోఁతలు కోసెడి
యసత్యపుంగనుల నెవ్వ రాఁగెదరు? సఖా!

ఉ. ఆతఁడు నాయెడన్ సలిపినట్టి కృతఘ్నత కీవు లోకవి
ఖ్యాతకవిత్వతత్త్వకృతి కల్పలతావలితామ్రశాఖివై
చేఁతకుఁజేఁత చేసితివి, చేకుఱె మోదము; తిట్ట నిమ్ము, వా
రీతతి నెంత తిట్టినను నించుక ఖేదము లేదు తిర్పతీ!

ఉ. సంతసమైనదే యగును ఛాత్రుని వృద్ధి; మనంబునందు నా
పంత కృతజ్ఞతం గనఁడ యంతటఁ బోక వృథాగ వెక్కిరిం
పంతట నేనిఁ బోక యిటు లాఁడివ్రాఁతలు పిప్పిగంతులున్
బంతములున్; సభాస్థలికిఁ వచ్చునొ? రాఁడిది యేటి బీరమో!

చ. నరుఁడు శిఖండి యల్ల కురునాథుఁడుఁ దమ్ములు నొడ్లు ద్రోణు కిం
కరులయి విద్య నేర్చికొనఁగా సమకట్టిరి నేర్చిరెల్ల; రం
డలును బ్రవీణులైనను ధనంజయుఁ డొక్కఁడె తుల్యుఁడయ్యె నె
వ్వరు తన యగ్రిమందు నిలునం గలరన్న గురుం డెఱుంగఁడే.

క. గురువుల వంచించెడి ధ
ర్మరతులకున్ ధర్మరాజు మార్గముఁ జూపెన్
బరుషోక్తు లతనినోటన్
దొరల వసత్యమ్ము వానితోఁ దుల యగునే! 260

ఉ. ఆలములోనఁ గూడ గురునంఘ్రులకున్ బ్రణమిల్లి గాని స
చ్ఛీలుఁడు పార్థుఁ డెప్పుడును జేసియెఱుంగఁడు యుద్ధ; మందుకే

చాలియుఁ ద్రోణుఁడాతనికిఁ జాలినయట్లు నటించి ప్రాణముల్
బాలికునట్లు వోవిడిచి పాండవులన్ గెలిపించె ద్రేల్మిడిన్.

ఉ. నీ కసమానకత్తు యిది నే ఘటియించితిఁ దప్పు నైఁపు మీ
లోకము నిన్నెఱుంగు "నతిలోకకవిత్వవిదుండ" వంచు; ని
న్నాకవు లేమి యన్న నవి యన్నియు నోర్వఁగదయ్య! యింతకే
చేకుఱెఁ గార్యసిద్ధి; యిఁకఁ జేయుప్రయత్నము లేటికో సఖా!

చ. వలసినవారు "వీరలకు వారల కెంతటి వార యున్నదో!
తెలియుఁడ" యంచుఁ గబ్బములు దీసి వివేచన సేయరొక్కొ! యీ
కలహ మదేల నీకుఁ? గవికాంతులలో నగు నేని యొప్పఁగా
కిల నిటువంటి యర్భకుల నే మని నీవు జయించి మించితో!

సీ. తిరుపతివేంకటేశ్వర కవీంద్రులముందు నిల్తురో యివ్వారు నిల్వలేరో
వారికవిత్వమే సారవంత మొక్కొ వీరికవిత్వమే సార మొక్కొ
వారికి వీరికి నారయ గురుశిష్యభావమో సహపాఠభావ మొక్కొ
అవధాన మన్న వీ రాచరించెడితంత్రమే యౌనో యవ్వారిదే యగునొకో

తే. గీ. వారిపేరన్న నీరొక్కొ తీరుగాఁగ
నభినయించుట కేమొక్కొ యవసరంబు
అనుచు సంశయమున నోలలాడులోక
మిపుడు నిక్కమ్మెఱింగి స్వస్థపడుఁగాక.

ఉ. వీరి కసూయ యంచును, నవీనుల నైఁప రటంచుఁ, గొంది ఱె
వ్వారొ వచింత్రు గాక; యది వాస్తవమైన, వధాను లెందఱు
న్నారిపు, డట్టివారిపయి నాకును నీకు నసూయ లేక యి
వ్వారిపయిం బొసంగుటకు వారె యెఱుంగఁ గలారు హేతువున్.

క. పలుమాట లేల కోటన్
దలఁ దూరిచి రోఁకటి కిఁకఁ దలఁకం బని లే
దిల "శూరులైన మూరుల
పాలకువ లిట్టివి" యటంచు బుధు లెఱుఁగరొకో! 267

---

# 8

## ద్వైతపర్వము

* ఉ. తిట్టుచునున్నవారని పదింబది వార్తలు వచ్చుచున్న; వా
తిట్టులకెల్ల నుత్తరము దేవుఁడె తా నిడువాఁడు గాక; యా
దట్టుల కెట్టులో దొరలు తప్పఁడు కైతకుఁ దోడు తిట్టులా
కట్టుట! యట్టికైతలకె కావలె నెక్కుడు తెల్వి శ్రీపతీ!

---

* నడుమ తమ క్షేమములు తెలియుటలేదు. రామకృష్ణకవులు, తమ ఉభయులపైని "తిరుపతివేంకటేశ్వరీయ" మను నొక శ్లేషకావ్యము, అట్టిదే యొక శతకమున్నూ వ్రాసిరనియు అందు విగ్రహారాధనము చేయఁగూడదను నర్థము బాహ్యముగానున్నూ, తమరిని పూర్వులెవరైన పూజించిన పూజింతురుగాక ఆధునికులెవ్వరు అట్లు చేయరనియును అర్థమువచ్చునట! కొద్దిరోజులలో అచ్చువేసి పబ్లిష్ చేయుదురట. అందుల ఒక పద్యమొక కుర్రివానివల్ల నా వద్దకు వచ్చినది, యిందుతో పంపించినాను. పయిసంగతులన్నియూ.........గారివల్ల విన్నానని ......... శాస్త్రిగారు నాతో హేళనగా చెప్పినారు, యిందుగురించి అనగా రామకృష్ణులుచేయు అనవసర ప్రసంగములను గురించి ......... సమాధానము వ్రాయుటలో తాము ......... పూనుకొననిచో శ్రీ॥ ది॥ తిరుపతిశాస్త్రిగారు అంతశ్రద్ధగా పనిచేస్తారని నమ్మకంచాలక నాకు ......... హేళనవినుట చాలా కష్టము తోచి విశదీకరించుకున్నాను."

లక్ష్మీనరసాపురం, 4-12-10. శ్రీరాములు.

క. "కొంగొంగురనుచుఁ గూసెడు
కొంగను ముంగిఁగల మెలఁగు కొంచెపుకాకిన్
బంగారుపంజరమ్మున
సింగారింపంగ నెవడు చిత్తముగొలుపున్."

గొల్లప్రోలు 31-1-11.

".........త॥ బ్ర॥ ద్విభాష్యం పుల్లకవిగారు నిన్నటిరోజున పిఠాపురం వెళ్ళినారు. ఆయనవద్ద తిరుపతివేంకటేశ్వరశతకం పిఠాపురం కవులు చదివి వినిపించినారట. ఆయన నాతో చెప్పిరి........."

అల్లంరాజు లక్ష్మీపతి.

పై సంగతికే 8-9 సంచికలుగల కవిత టైటిల్ పేజీకూడ చూడఁదగు.

ఉ. తిట్టుట నాకు సమ్మతమె, తిట్యనిపల్కులు మేల్త్రికయ్యయున్
బెట్టినకైతయేని యది కీర్తిలుప్తం గద వారికిన్! వృథా
తిట్టుటపట్ల గ్రామ్యులకుఁ దెల్వి విశేషము గాన వారలన్
గట్టిగ మేపి తిట్టఁ జనఁగాఁ దగదో! తమ కేటి కీర్తిమల్?

ఉ. తిట్టుచుఁ జెప్పివారలఁట! తిర్పతివేంకటఈశ్వరీయ మం
టట్టి ప్రబంధమందు నఁట! యన్నియు శ్లేష్మము లంట! "విగ్రహం
బెట్టిదియైనఁ బూజ్య మిఁక నీపయి గా" దని సారమంట! సీ!
యెట్టివివేక మాకవుల కిచ్చెనొకో భగవంతుఁ డింతకున్! 271

చ. తిరుపతివేంకటేశ్వరుని దేవుని వాని యభిఖ్యఁ బూనుత
ద్గురువుల మమ్ముఁ బట్టికద తోఁచినపట్టున దిట్టఁ జొచ్చిరి
ర్వారు కవు లెక్కటా! యిచట ద్రోహము సర్వము వాని పేరునన్
బరఁగెడి మాది, యేమనినఁ బండితు లాదృతిమై వినం దగున్.

"చ. కలి గనుఁ బ్రామ నేలకలఁ గాదననేమగు! లాఁతివారలే
దలఁపరు వేల్పు లంచెడఁదుఁ, బత్త్రితమూర్తులవార్త లేమన
న్వారె! విపరీతవాసనల నాకొను వారును కీసు నీము చె
ప్పులు దల కెక్కఁ గప్పుమిడి మోయరె తిర్పతి వేంకటేశ్వరా! 1

చ. కొలఁదికి మీరు నీదు గుణకోటి గణింపఁగ నెవ్వఁడోపు! నే
తలమునఁనున్న వేల్పు లరుదా! యటుమానితు లౌట; యెట్టినో
డలకడ నేని శోభనపటంకము నీ పసునామ మొప్పు పూ
జలఁగొను వారిశోత్రియములఁ జాటుచుఁ దిర్పతి వేంకటేశ్వరా! 2

చ. కొలుతురు నిన్నుఁ బామరులుఁ గోవిదులున్ మఱి రాజరాజులున్
దెలుప నశక్య మొండొకఁడు డప్పను నీయెడ, నిప్పుడీఁగినన్
దలగొడఁగించి "దండ మిడి దాసుఁడ నే"ననఁ బ్రోతు, దానఁబూ
కలియుగదైవతప్రతిభ గాంచితి తిర్పతి వేంకటేశ్వరా! 3

ఉ. నేఁడె త్వదీయనామ మొకలీల ధరించినవార లెందరో
వారును నీవునున్ గవులె, వచ్చునె నీదు ప్రతిష్ఠ వారికిన్?
జేరుప నీదు పాటి యెటొ చేరినమాత్రన పల్వలమ్ములున్
వారిక మానసంబు లనవచ్చునె తిర్పతి వేంకటేశ్వరా! 4

తాడేపల్లి వెంకటప్పయ్యశాస్త్రి, చందవోలు (రేపల్లె తా॥)

ఉ. గవ్వయుఁ బోనిమేము త్రిజగమ్ములకున్ బ్రభువైనవాని పే
రెవ్వగనో ధరించుటకు నీకవు లొప్పక పోయి రందుచే
నవ్వఁ దొడంగి రాకుధరనాథునియోరిమిఁ జూచి; లేనిచో
నెవ్వఁడు నవ్వఁ జాలు నల యేలికఁ దిర్పతి వేంకటేశ్వరున్.

మ. అసమర్థుండు సమర్థపేరు గొనఁగా హర్షింపరెవ్వారు నె
క్కసమా తాదృశఫక్కి యంచుఁ దెలుపన్ గష్టించు మావారి యీ
వ్యసనంబున్ బుధు లాదరించుటకునై ప్రార్థించుచున్నార మా
కసి యేమైనను దీనిసార మిటులే కన్పట్టె మా కియ్యెడన్. 273

## తిరుపతి వేంకటేశ్వర స్తవము.

శ్రీమత్పరదేవతాయైనమః

"కలౌ వేంకటనాయకః"

శ్లో. "పాపధ్వాంతదివాకరం కుకవిరాడ్భద్రేభకంఠీరవం
రంగత్కోమలగద్యపద్యలహరీధారావిధారాధరం
నానాశాస్త్రపురాణపావనకరం లక్ష్మీమనోనాయకం
ఆర్తత్రాణ పరాయణం తిరుపతి శ్రీ వేంకటేశం భజే"

ఉ. నీ కరుణాకటాక్షమున నిచ్చలు నెవ్వని జూతు వాతఁడే
లోకములోన మెండుగ నెలుంగును; ని న్వినుతింప శక్యమే!
ప్రాకటమైన నీదు పదపద్మములన్ భజియించుచుండినం
జేకుఱుఁగాదె విద్యలును శ్రీకర! తిర్పతి వెంకటేశ్వరా। 1

ఉ. భారతవర్ష మందుఁ దగ భాసిలుచుండిన నాంధ్రదేశమం
దారయ నీదు నామమును నాత్మఁ దలంపనియట్టి కీర్తివి
స్తారుఁడు గానరాఁ డిదియె సత్యము సత్యము సత్యమయ్య! సు
శ్రీరమణీశ! సద్బుధనసేవిత! తిర్పతి వెంకటేశ్వరా! 2

ఉ. రాలకు మ్రొక్కఁగూడదఁట! రాతికి మ్రొక్కిన పాపమంట! భూ
పాలురఁ జేరి గొప్పగ స్తవంబులఁ జేయఁగవచ్చునంట! మే
ల్మేలు! బళీ! యెఱింగితిని మేదినిలోపల నిట్టిమాటలన్
బాలితభక్తలోక జన వందిత! తిర్పతి వెంకటేశ్వరా. 3

చ. తిరుపతి వెంకటేశ్వరుని తేజ మొకింత యెఱుంగలేక త
త్తిరుపతి నేల చేరుదురు దేవుఁ డటంచు భజింతు రేల యం
చరయఁగఁ బల్కుచున్ సతత మక్కట! భక్తివిహీనులౌదు రీ
కరణి మదాంధులౌచు; దయఁ గావుము తిర్పతి వెంకటేశ్వరా. 4

చ. తిరుపతిమార్గ మిట్టి దని తెల్పఁ దరంబె యొకింతయేని, వీర లక్ష్మీశుఁ
దిరుపతి కేగి మ్రొక్కులను దీర్పఁ గడంగుట చెప్పు ! దక్కుడన్
జరుగు మహోత్సవంబులవసంగ గని పొంగుట యొప్పు! వేంకటే
శ్వరచరణారుణాంబుజరజంబు శిరంబునఁ దాల్చి యొప్పికన్.

చ. తిరుపతి వేంకటేశ్వరులతీరు లెఱుంగనివారు లేరు, ము
క్కారములు సాఁగి రా వచట సాగిలి మ్రొక్కఁగఁ బోయి నప్పుడున్
శిరమున భార మున్న నల శ్రీపతి సైఁపఁడు; వానిఁ దిట్టుటల్
కొఱవిని నెత్తి గోకికొనఁ గోరుట యందురు భక్తులో సఖా !

---

చిత కీర్తిప్రదుఁ గా నిగర్గళవచశ్శక్తాద్రిగాఁ జేయునీ
స్థితకారుణ్యము భూమిలోఁ దిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ. 10

మ. సమదాటోపపతంగ పుంగవవిభాస్వద్దీర్ఘచంచూసమ
క్షమునం దల్పఫణావిజృంభణనటత్కాకోదరం బట్లు నీ
దు మహత్త్వం బెఱుఁగంగలేక యెప్డుం దూషించు దుర్మార్గుఁడున్
స్తిమితానందముఁ బొందునే ? తిరుపతి శ్రీ వేంకటేశ ప్రభూ. 11

మ. గురువై యాప్తుఁడవై సఖుండవునునై కొండంతచుట్టంబనై
పరభక్తాళినిఁ బ్రోచుచుందువు కృపాపాథోధివై యెప్డు; డీ
నరులేరున్ నినుఁ గొల్వఁగూడ దనుచుం బల్కంగ మాహాత్మ్యకుల్
చిఱునవ్వుల్ జనియింపవే! తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 12

మ. ఎవరేమన్నను నెట్టి భంగులను నిన్నెవ్వారు దూషించినన్
స్తవముల్ సేయకపోయినన్ మఱియుఁ జర్చల్ చేసినం బండిత
స్తవనీయంబగు నీచరిత్రి సుజనుల్ సద్భక్తిఁ బూజింపరే
శివపాదాంబుజచింతనా ! తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 13

మ. శ్రవణానందము నీచరిత్రము మహాసక్తిం బఠింపంగ స
త్కవిబృందంబుల నెల్ల నిశ్చయముగా ధన్యాత్ములం జేయవే
భువి నీనామము భక్తితోడ నెపుడున్ బూజించువారిం గృపన్
శివపాదాంబుజచింతనా ! తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ. 14

ఉ. "బొంగు బుజాన వేసికొని పొ" మ్మని కొందఱు పల్కనంతనే
భంగము రాదు మీ కెపుడు బాలురు వారలు పల్కినారు పే
ర్మిం గరుణింపు తప్పులు క్షమింపుము పుత్రులు తప్పుఁజేయ వా
రిం గనుఁగాదె తండ్రి కృప శ్రీకర ! తిర్పతివేంకటేశ్వరా ! 15

ఉ. బ్రహ్మసమాజముల్ వనికిరా వచటన్ గలికాలరీతి 'యం
బ్రిహ్మల' పేరు విన్నయెడ మండిపడున్ జామి యాతఁ, డాపర
బ్రహ్మము రాముతమ్ముని నెపంబుల కంకనిదేవదేవుఁ, డా
జిహ్మగశైలవాసుఁడట! శ్లేషకుఁ దార్చెదరంట వీరిఁకన్!

సీ. ఏడుకొండల వేంకటేశ్వరస్వామిపే రుక్కుటేశ్వరుఁ డందఁగోరు టెట్లు?
వేంకటగిరిదేవవిభుమహైశ్వర్యంబు పీఠికాపురి వేల్పు వెరయు టెట్లు?
వేంకటేశపదారవిందసౌభాగ్యంబు గయారాక్షసునికాళ్లు గాంచు టెట్లు?
అలమేలువిభుని యుద్యానంబుతోఁ గోడిపుంజయ్య ఘూఁదోఁట పోలు టెట్లు?
తే. గీ. తోడఁ బల్కెడి శేషగిరీడధిత్య
కావతంసునితోడ సామ్యం బదెట్లు
గలుగు? దుర్వర్ణకగిరీశగహ్వరాంత
రస్థితం బగు స్థానము ద్రవుఁ దలంప. 279

---

మ. సువివేకుల్ నృపులెల్ల మీదు మహిమన్ శోధింపఁగా నెంచి యి
య్యవనిన్ భక్తిని బూజసేతురు కదా! యశ్రాంత మిప్పట్టునన్
భవదుద్యత్సుగుణంబులం దెలియఁగన్ శక్యంబె మూఢాత్మకుల్
శివపాదాంబుజచింతనా! తిరుపతిశ్రీ వేంకటేశప్రభూ. 16

ఉ. పాఱుఁడనంటి నీచరణపద్మములే మది నమ్మియుంటి నె
వ్వారిని వేఁడనంటి నను బాలన సేయఁగ వేఁడుచుంటి నీ
ధారుణిలోన నీకు సరిదైవము లేఁడని చెప్పుచుంటి సు
శ్రీరమణీశ! సద్బుధసేవిత! తిర్పతివేంకటేశ్వరా. 17

చ. స్థిరముగ నీదుహస్తమున దీనులగావఁగ ధర్మకంకణం
బరయఁగఁ దాల్చినాఁడవని యందఱుఁ జెప్పఁగ నాలకించి నీ
గురుతరసత్కృపారసముఁ గ్రోలఁగ నెంచితిఁగాన వేగమే
దరికిని జేర్పుమయ్య నతతాపస! తిర్పతివేంకటేశ్వరా. 18

మ. అనిశంబున్ భవదీయ నామకచరిత్రాకర్ణనాసక్తి స
జ్జనసాంగత్యము ధర్మతత్పరత షట్ఛాస్త్రప్రవీణత్వమున్
ఘనసుజ్ఞానముఁ గల్గునట్లు వరమున్ గాంక్షించితిన్ నిన్ భజిం
చిన నేనున్ సురవందితా! తిరుపతిశ్రీ వేంకటేశప్రభూ. 19

చ. "తిరుపతి వీఁడు" మం చొకరు దెల్పిన యంతనె మాదు వేంకటే
శ్వరుఁ డటు జేయునంచు ఘనసాహసలీలను నెంచినారు భా

శా. హాలాపానము నర్చియున్ మృగయుగవ్యాపన్నతన్ గాంచి ఘు
న్నోలిన్ రాముఁడుఁ గృష్ణుఁడుం జనిరి యుద్యోగంబు చాలించి; పై
శైలన్ దిర్పతివేంకటేశ్వరమహాలిప్తంబులై దిక్కులు
ద్వేలశ్రీవహియించె నీతఁడె కలి న్వేల్పన్నహోఁ గా రోఁకల్.

మ. కలి నిం కాటఁబు సాగి రా వనుచు వీఁకన్ రాముఁడున్ గృష్ణుఁడున్
దొలి రూపంబులు వీడి యేగి రటుపై దుర్మార్గులన్ శిక్షలన్
గొలుపన్ శిష్టుల రక్షసేయ నలవై కుంఠుండు శేషాచల
స్థలి శ్రీతిర్పతివేంకటేశుఁ డయి సత్తావత్తఁ జెంపారెడిన్.

చ. "కలియుగదైవతప్రతిభ గాంచెడిఁ దిర్పతి వేంకటేశ్వరుం,
డలయికమాత్రమే మనకు నచ్చిన లెచ్చటొ కాని కానరా
విల గిరులందుఁ దద్గిరులకే గలుగున్ దినసత్తె" యంచు ని
క్కాలి తొలి రామకృష్ణులు నగద్గతికిన్ జెలియైరి తిర్పతీ.

చ. తిరుపతి వేంకటేశ్వరులతీర్థముమందఱు నెన్ని ద్వారకా
తిరుపతి వేంకటేశ్వరులతీర్థము లెందుకు మాఱునేర్చు! న
ష్పారణేక్ష్మదున్నతియుఁ బ్రాజ్ఞులు తక్కు కుభృద్విభూతిఁ దా
మెఱుఁగరు! యాత్రయొక్కటగు నేనియుఁ బిల్లులు వ్యాఘ్రము మెట్టురా!

తే. గీ. రత్నగిరియందు సత్యనారాయణుండు
వెలసెఁ దివ్యాలయము చూచి లేశియనలయు
నాయెనిమగుట్ట బదరినారాయణుండు
వెలసెఁ, దాటాకు గుడిసెయు వెలసె మీఁద. 284

---

స్కాంధుఁడును బ్రోఁకదెప్పినను సత్యము సత్యము సత్యమయ్య! యీ
కలిని ... కాంక్షిత! తిర్పతి వేంకటేశ్వరా! 20

ఉ. బ్రహ్మమతం బనంబడెను మాన్యతకెక్కిన జాతియంట! స
ద్బ్రాహ్మణు లందుఁ బొచ్చినాఁట! నహారె! నీపదభక్తిమాని స
ద్బ్రహ్మము నీవు గావనుచుఁ బాటలుఁ బాడుచు నుండిరంట! శ్రీ
బ్రహ్మమనీషి నంది! గుణరాజిత! తిర్పతి వేంకటేశ్వరా! 21

మ. నను నారాయణరావు మూర్తిసుతునిన్ బాలామహామంత్రచిం
తనసంపాదితచిత్రచాటుకవితాధారాలసత్కీర్తిచం
దను సంలబ్ధమహావధానధను సీతారామనామాంకుఁ గాఁ
చున మీకిన్వె నమస్కృతుల్ తిరుపతి శ్రీ వేంకటేశప్రభూ! 22

క. అల రామేశ్వరమునఁ గ
ల్గల రామేశ్వరుఁడు మాకుఁ దలఁతురె తత్త్వ
జ్ఞులు, తలఁతురేని యువ్వా
రలె "కంసాలు" అన మ్రొక్క రా దవ్వారిన్.

క. కలయో యభేద మని కా
రలకున్ మ్రొక్కంగఁ దలఁచు రాజులకుఁ గవీం
ద్రులకున్ బుట్టిల్లగు నో
కలికాలం ? బైన నట్లు గాని మ్మనఘా !

---

## 9

### విద్వత్పర్వము.

క. త్యాగయ్యకృతులు గల వని
జోగయ్యయుఁ జెప్పెఁగృతులు, శోధించి యటన్
బాగోగులు దెలుప మహా
భాగులు లే రొక్కొ, సుకవిఘంటాస్యంబుల్ !

క. ధనకోటి నాగరత్నం
బు నల భవానియును ధనము పొందిరి వోవం
గను బాడ వింటిఁ గోలా
రు నాగరత్నంబు గాత్రమతములు గంటిన్.

తే. గీ. హాయి యొసఁగ నల్లపిచ్చాయి యభినయించె
నౌ ! యువఁగ నింక నౌకరేను చేయుద్రిప్పె
దద్దదింతక్క మట్టొక్కతయటి ద్రొక్కి
కాళ్ళు చేసె నట్లు బియ్యయ్యతా నొనర్చె.

తే. గీ. వేణుగానంబు చేసె శ్రీవిభుఁడు ముద్దు
శరభశాస్త్రులు వద్దాన జగమునిండె
రాణఁగనె సేఁకు సంజీవరావు వానఁ
బాడుచున్నారు పసుల కాపరులుగూడ.

# XV

గ్గరావు తమకెట్టిబంధుఁడు? అతనికి గీరతము నందాసక్తి యుండుటకుఁ గారణమేమి? పైఁగా నితఁడు, వెం॥ రా॥లకు, సహాధ్యాయి, బ్రి॥ శ్రీ॥ మధునాపంతుల సూరయ్యగారివద్ద వీరు మూగురును గాళిదాసత్రయమువఱకో, అంతకొకింత తక్కువగనో చదివినవారలు. అట్టిచో నతఁడు గీరతమునభిలషించుట కర్థమేమి? అంతకన్న నెక్కుడుగ వారియాత్మబంధువు లేమి వ్రాయఁగలరు? 54 వ పుటలోని 16 వ పంక్తిలోని ఆకొండి సుబ్రహ్మణ్యులుగా రెంతమర్యాద కలవారు? ఆయన మాశిష్యుని పెదతల్లికుమారుఁడగు బ్ర॥ శ్రీ॥ ఆకొండి రామమూర్తిగారికిఁ బినతండ్రి. అట్టివారెల్ల మాగీరత కావ్యము నేల యాదరింతురో? 53 వ పుట 23 వ పంక్తిలోని, ఆకొండి వెంకటశాస్త్రిగారు, దూరదేశస్థులు, మాయుభయులకును శాఖామాత్ర బంధువులే కాఁదగుదురు, బాగుగవిచారించిచో శ్రీఆకొండి వ్యాసమూర్తి శాస్త్రులవారికి దూరపు జ్ఞాతులేని కాఁదగుదురు, వారినిబట్టి వెం॥ రా॥ లకే బాంధవ్య మెక్కుడనక తప్పదు. వారు మా 'గీరతము' నందేల ప్రేమ చూపవలయునో? ఇట్టివారికెల్ల నేదో 'పత్రపాతిపదమునో' 'మూర్ఖపదమునో', నివేదించి తమమార్గమును దామువదలి మాకుఁ బనిగల్పించు మాశిష్యుల నెట్టు సన్మార్గమునకుఁ ద్రిప్పఁగలుగుదురో కదా? వీరెల్లరును మాయొద్దఁ బుస్తకములు వెలలేకుండ సంగ్రహించుట కట్లు వ్రాయుచున్న వారలఁట! ఆమాటకే యొప్పుకొందము. తమవద్ద నట్టిలాభమును బొందువారుకూడఁ దమమార్గము నేల నిందింపవలెనో? నరములేని నాలుక యిచ్చవచ్చినట్లు దిరుగును. అంతియ కాని ప్రాజ్ఞులగువారు కూటికి విసమెన్నఁడును ద్రాగరు. అందులో నొక పుస్తక మూరకవచ్చునందులోఁ గలుగు ఫలమెంతటిది? అదిగాక 'ఆపుస్తకమేని "కుక్కమూతి పిందె" గాని రసవత్తమైనది కూడఁ గాదుగదా! అట్టిపాడు కాగితపు చెత్తకట్ట కాసించి యేప్రాజ్ఞులగాని తమ్ముమును గర్హించి మమ్ము నర్హించుచున్నారని వ్రాయుట స్వవచోవ్యాఘాతము కాక మఱియేమి? దాని తత్త్వమిది. ఎవరుగాని పాపకార్యమునకు నాహ్వాపకులుగా నుండ వెఱతురు. పుణ్యకార్యమునకో, నిస్సంశయముగాఁ బ్రోత్సహింతురు. ఇందు లాభాలాభము లకించిత్కరములు. అదిగాక, స్వల్పలాభములతోఁ బనియేమి? వారలకు మహాలాభమొకటి కలదు. అది పుణ్యపాపసంపాదనరూపము. దేనిని గోరువారు దానికనుమోదకు లగుచుందురు.

వెం॥ రా॥ ల, గీరతవిమర్శనమునకుఁ గృష్ణాపత్రిక చూడఁదగు.

# XVI

శ్లో॥ కర్తా కారయితా చైవ ప్రేరక శ్చానుమోదకః.

ఇంతతో నీవిషయము ముగించి విషయాంతర ముపక్రమించెదము. చదువరులారా! వీరి "కోకిలకాక" మునకై మేము వ్రాసిన పద్యములకుఁ బరిమితియే లేదు. కాని నానాఁటికి వీరి గోలనుండి విరమింపవలెనని యూహ పొడముటవల్లను, సత్యమిదియని ప్రాజ్ఞలోకమునకు విస్పష్టమయినట్లు వారివారి లేఖలవలన మామనికిఁ బూర్తిగా వచ్చుటవల్లను జాలపద్యములను డిగవిడిచితిమి. అందుఁ గొన్ని మచ్చుచూపుచున్నారము.

చ. "గరుసగునే వికస్వరపికస్వర" మంటివి, వారిదార్భటీ
భరభరితాంతరంబగు నభస్సు "గుభాలు గుభాల్ గుభాలు" మం
చులుమఁగ విద్యుదుద్యదసులుల్లసిలం గరుసౌనొ? సాకకున్
బిరుసగునో? పికధ్వని కపిధ్వనియై తలక్రిందు లాడునో?

శా. గాంభీర్యంబది సన్నయంచుఁ దెలిపెన్ గాకీ పికత్వం, బిమ్మదే
దంభం, బెక్కుడనేర్చె తీ యస్మృతవాక్తత్త్వం? బెడందిచ్చె? నీ
యంభోవాహవిహారఘోరవిఫలవ్యాహారబాహుళ్యది
క్కుంభిశ్రీపతిఘీంకృతుల్ వినియు మీ "కోకో"ధ్వనుల్ నిల్చునే!

మ. సభలో లేవదు బావకున్ గళము, తత్స్థానంబు మానాస్త్రమే
పరిభక్తై లేచినవెంటనే తవులు దుర్వారం బపధ్వానదూ
రభసం, బయ్యది నిల్వనీయదు సుమీ! ప్రాజ్ఞశ్రవోనిష్ఠసా
రభసౌభాగ్యపరంపరాగ్రహణమాత్రస్వైరసంచారులన్.

క. కమ్మనఁగ శిరము, కుకవుల కిమ్మనియను కొండమా? 'అకతియనఁ గాటి
ల్యమ్మడదు గతి యగున్ ది, ద్దిమ్మని కుకవితలఁ గుమ్మ దంపుట లేలన్.

కవిత్వపుఁ బోలికకు నుదాహరించితిమే కాని పైపద్యములందు నూత్నాంశము లెవ్వియు లేవు. మా శిష్యులను గృతఘ్నతాఘము నుండి తప్పింపుమనియు, దానివలన నితరు లిట్టితోవ తప్పని తెలిసికొందురనియు, మేమీ పనికిఁ బూనితిమి కాని క్రమముగా వారది బలపఱచుకొనుచుంటచే నింతటికు మాపరిశ్రమకు సార్థక్యమే కనుపట్టదు. వీరి విషయమున నిఁక నొక రహస్యము తెలిసికొనవలసి యున్నది. వీరికిఁ జెడ్డ మంచిగను, మంచి చెడ్డగను గోచరించుచున్నట్లు మఱి కొన్ని వీరి వ్రాఁతలు బోధించుచున్నవి. వీరికి వ్యాసకృతభారతము తప్పు, ధర్మ

రా జపాతుర్రీడు, దుర్యోధనాదులు పుణ్యాత్ములు, ఈయంశము వీరు ప్రచురించిన "కౌరవ గౌరవము"లోఁ జూడఁదగు. ఈ విపరీతజ్ఞానమే వీరు సర్వత్ర విని యోగింపఁదగువారు. దానిచేఁ గృతజ్ఞుఁడు మహాపాపాత్ముఁడుగను గృతఘ్నుఁడు మహాపుణ్యాత్ముఁడుగను గోచరింపక తప్పదు. వీరి కీవిషయము పరిష్కృతము గడు ముఖ్యము. కావున వీరు భారతమును వదలుకొనక తప్పదు. అది గురువును నిందించుట కొప్పదు.

(మహాభారత శాంతిపర్వమునుండి)

భీష్మః॥ శ్లో॥ మాతా పిత్రో ర్గురూణాంచ పూజా బహుమతామమ... గురుర్గరీయాన్ పితృతో మాతృతశ్చేతి మే మతిః, ఉభౌహిమాతా పితరౌ జన్మన్యేవోపయుజ్యతః... ఆచార్య శిష్టాయాజాతి స్సాదివ్యాసాఽజరాఽమరా॥ శ్లో॥ వీధ్యాం పాపం భ్రూణహత్యావిశిష్టం, నాఽన్యస్తేభ్యః పాపకృదస్తిలోకే ...శ్లో॥ మాతృతః పితృతశ్చైవ తస్మాత్పూజ్యతమో గురుః... శ్లో॥ మిత్రద్రుహః కృతఘ్నస్య స్త్రీఘ్నస్య గురుఘాతినః, చతుర్ణాం వయ మేతేషాం నిష్కృతిర్నానుశుశ్రుమ. (విస్తరస్తు తత్రైవ ద్రష్టవ్యః)

గురుశిష్య ధర్మబోధకము లగు మఱికొన్ని శ్లోకములు 32, 68, 69, 70, 71; పుటలయం దుదాహరింపఁబడి యున్నవి. పరిష్కృతము మాశిష్యు లవలంబించినది గురుద్రోహ యజ్ఞదీక్ష. దానికి వ్యతిరేకమగు ధర్మమును బోధించునది వ్యాసభారతము. 'భారతః పంచమో వేదః' అని దానిని పూర్వప్రాజ్ఞులేమి నవీనవిజ్ఞులేమి శిరసావహింతురు గాక. ఇతర పంచమవేదములయం దభిరుచి నించి తిరుపతి వెంకటేశ్వరాది దేవగురునిందల నొనరించు వీరికా పంచమవేద మెట్లు ప్రమాణము కాఁగలదు? కావుననే వారి ప్రవృత్తి కనుకూలముగా వేఱొక భారతమును మాశిష్యులు వ్రాసికొనఁ దలఁచిరి.

"ఉ. వ్రాయఁగవచ్చు వ్యాసమునివర్యుఁడు వ్రాసినయట్టి భారతా, మ్నాయములోనియంశములు మాఱిచికూరిచి వేఱె భారతా, మ్నాయము... నమ్మరు గాక, పండితుల్" (ఆంధ్రభాషా పరిషత్పత్రికలోని కౌరవగౌరవము చూ.)

ఇంతకు మున్ను 'కుక్కమూతిపిందె' అని మాగీరతమునే వీరు దూషించి నట్లు ప్రథమభాగ పీఠికయందుఁ జూపితిమి. ఇప్పటికి 'వీరికి భారతముగూడ నట్టేదశకే వచ్చినది. ఇంతతో నేమయ్యె. ఇంకను వీరివర్యులు వీరివ్రాఁతలు

# XVIII

ముందు చూడవలసి యున్నది. 'పండితులు నమ్మరఁట' కాని లేకున్నచోఁ దల క్రిందుసంగతులతో వీరు వేఱొక భారతము వ్రాయుదురంట!

శ్లో. ఆపరితోషా ద్విదుషాం న సాధు మన్యే ప్రయోగవిజ్ఞానం॥

అని కాళిదాసంత మహాకవి వాకుచ్చినది వీరికిఁ దృణప్రాయమే. విగ్రంథముగాని పండితుల మెప్పునకును అపండితుల తిప్పునకును, నాస్పదముగా నుండఁదగు. అయీయంశము ప్రథమభాగ పీఠికలోఁ గొండొక వివరించితిమి. ఇఁక నస్మచ్ఛిష్యోపజ్ఞకమగు కృతఘ్న మతమున కనుసరించు నొకవ్రాఁతయు దానికి మారకమగు నింకొకవ్రాఁతయు నుదాహరించుచున్నారము.

"ఈకారమునం దొకరి నొకరు తిట్టుకొనుటయే కవిత్వ మైనది. అతిశ్లే యామ్నాయము లైనవి. భారతామ్నాయముతోఁ దుల్యములఁట!, మూర్ఖులు వానినే యాసక్తితోఁ బఠించుచున్నారు.

ఇటువంటివారి శ్లేష వ్రాయుట యుక్తము. ఇతఁడు లేశమును సహృదయుఁడు గాఁడనుటకా సుట్టమునందలివే యీక్రిందిపంక్తు లుపోద్బలకములు.

"......ఈ వాక్యములు కాదంబరిలోనివి,...ఏవ్విధమున సందర్భము లేని యుపమలయొక్కయు శబ్దశ్లేషలయొక్కయు, జాబితాలు కొండవీటి చేను తాళ్లవలె...నొప్పారు కాదంబర్యాదులు..."

కాదంబర్యాదులే నీరసగ్రంథములని తలపోయు జ్ఞానలవదుర్విదగ్ధులకు మాగ్రంథము లేల రుచింపవలెను? రుచింపనక్కఱలేదు. అది యటులుండ, సహృదయులిట్లు శ్లాఘించుచున్నారు.

"గీరతమహాకావ్యములోఁ గాని యిటీవల గుంటూరుసీమలోఁ గాని యొక పద్యమునకు, యీ చదువరి మున్నగువారి యుపనిషదుపన్యాసములు తుదకు "అసావాదిత్యోబ్రహ్మ" చేయించుటకైనఁ బనికిరావు. మెదడులో నేమాత్రపు రసగ్రహణప్రసిరలున్నను, సహనబుద్ధియున్నను, గీరతకావ్యము లోని శాంతింపు పర్వములో నొక్కపద్యముఁ జదివి భారతీముక్తిసౌధ మెక్కి తరించఁగలరు, లేనిచో సన్నిపాతరోగికిఁ జక్కరయుఁ జేదే, యెవ్వరేమి చేయఁగలరు? (సుజనరంజనీ పత్రికనుండి,)

వారట్లు నిందించుటకు హేతువేదో గాని వీ రట్లభినందించుటకు హేతు విది. భారతము సకలసుకవిజనవినుత మేల యయ్యెను? కేవలకవిత్వ ధర్మమును

బట్టియా ? కాదు, దీనింగూర్చి వ్రాసినచో నింతట నంతటఁ దేలదు. భారతమునఁ బ్రధానరసమేదియో, తెల్పుఁడన నీనాఁ డెందఱో చేతులునలుపవలసినవారు కలరు. స్థూలదృష్టికి నందు వీరరసమేమో ముఖ్యమని తోఁచ వచ్చును. అది యట్టిదియే యగుచో దానికి నేత్రాద్యశగౌరవము రాదు. అందలి ప్రధానరసము శాంతము, యీ యంశమునకు,

"...భారతే శాంతిః, రామాయణే కరుణ, ఇతి, ఏవం రసాది ధ్వనయ షడ్విధాః॥

అను సాహిత్యకౌముదియు, మఱియు ధ్వన్యాలోకమును బ్రమాణములు. అట్లు కొన్నిపట్టుల వివాదప్రధానముగా స్థూలబుద్ధులకుఁ బొడకట్టినను, నా గీరతముకూడ శాంతరసప్రధాన మనుట నిర్వివాదము. కావుననే యిది ప్రాజ్ఞుల నుతికిం బాత్రమైనది. తదితరులు విద్వల్లోకమునకు సహజశత్రువులు.

(1) శ్లో॥ మూర్ఖాణాం పండితా ద్వేష్యాః" (భారతము.)

(2) శ్లో॥...బుధజన ఇవ గ్రామ్యసదసి; (కాళిదాసః)

ప్రకృత మనుసరింపుదము. మాశిష్యులకు నస్మత్కృతగీరతమే కాక వ్యాసకృతభారతముగూడ గర్హ్యమగుచున్న దనునది ప్రకృతాంశము. వీరి కెవరితోఁ గొంద అభిప్రాయములుకూడ నుండుట సహజమే. ఏమతమేని యొకరితో నుండుట దోషమను గని వినినది కాదుకదా ? అది యటులుండె, వీరిమతమున దుర్యోధనుఁ డెట్టివాఁడు ? కడు యోగ్యుఁడు.

మ। ... సుయోధనుఁడు...కలియంశమ్మునఁ బుట్టినాఁ డనుచు వక్కాణించుచుఁగాఁ జెల్లునే! (భారత గౌరవము)

ఇట్టి నిష్కళయోగ్యుఁ డగుదుర్యోధనునితో వీ రొక్కటఁ సమమతమునఁ దేవలామాత్రుఁ డగునొకని కథేపము చేసి ప్రకృతసందర్భమునందే కొంత నిందించి యున్నారు. దాని కర్థ మేమో? వీ రపాత్రుఁడనుకొనుచున్న వానిసి నిష్కళయోగ్యుఁడు కావలసి వచ్చుచున్నదే! లేదా, దుర్యోధనుఁడపాత్రుఁడగును. విమర్శించుచో వీరి తప్పుడు సాక్ష్యపు వ్రాఁతలెల్ల నింతటిసారము కలవియేగదా. వీరికిఁ దామొనరించిన గురుద్రోహాపరాధమును సమర్థించుకొనుట కీ తప్పుడు ప్రోవలావశ్యకము లగుచున్నవి. కాని మొట్టమొదట వీరిమత మెట్టిది? ప్రాచీనార్య సమ్మతమైనదియే! దానిని ఋజువుచేయుట యెట్లు?, ఇటు.

# XX

శ్రీశారదాయైనమః

చ॥ కులము త్యజించి శాస్త్రములకున్ బ్రతికూలత సంఘటించి య
న్యులధనముల్ హరించుటకు నూహలఁ జేయుచు పొట్టకూటి వి
ద్యలఁ గని నాస్తికత్వపు మతంబున సంచరణంబుఁ జేయు వా
రలదరిఁ జేరఁబోకుము పరాకున నైనను మూఢచిత్తమా! ౧

ఉ॥ యాచకపాళి కొక్కతృణమైన నొసంగక యింటి మూలలో
దాచి వృథాప్రయాసము లెదంగనఁ బోక ధనంబటన్నచో
గాచముతోడుతన్ సమముగాఁ గనుఁగొంటయె మేలు, చచ్చుచో
బూచిక పుల్లయైనఁ గొనిపోదువె చెప్పుము మూఢచిత్తమా! ౨

ఉ॥ విత్తమువెంట రాదుసుమి, వేదన తప్పదు మీ,భవంబు పె
న్నత్తులబోను మీ, నిజముగా దలపోయుమి, యిప్పుడున్న సం
పత్తు లిటుండఁబోవు సుమి; పాపము నొందెదు సుమ్మి పైన నీ
చిత్తము చేతనైనటులఁ జెప్పితి నించుక మూఢచిత్తమా! ౩

అసలుకు సరియైన నకలు. ది 27-6-03 సం॥రం.

ఓలేటి వెంకట రామయ్య.

పైపద్యములు మాశిష్యుఁడు నాకడఁ జదువుకొనఁబోవు దినములలో రచించినవి, అందులకందుగల తేదీప్రమాణము. ఆతేదీ శోభకృత్సం, ఆషాఢశుద్ధ తృతీయా శనివారమునకు సరిపడును. ఆసం॥ జ్యేష్ఠములో వెంకటశాస్త్రి యింట యింజారములో నూతన గృహప్రవేశము. అంతవఱకితఁడు శ్రద్ధగాఁజదువుచున్నవాఁడే. ఇందుల కాగృహప్రవేశమునకు వచ్చినవారెల్ల సాక్షులే, విద్యాభ్యాసారంభము శార్వరి సం॥ శ్రావణము. ఈమూడుసంవత్సరములను అప్రస్తుత ప్రశంసలో మూడుమాసములుగాఁ గృష్ణకవి యుపలపించెను. దానింగూర్చి యిందు ప్రస్తావించుటకన్నఁ బ్రతిసంహననమునకుఁగా నేర్పడిన లోకా రామాయణములోనే ప్రసంగించుట యుక్తము. పైపద్యముల కాగితము నా శిష్యుని వ్రాలుంబయేకాక యతని స్వహస్తలిఖితాక్షరములుగూడఁగలది. కృష్ణకవి దీని నెట్లో యుపలపింపక మానఁడు. వచ్చినపతి క్షమాపణశేఖ కన్న నీ యెక్కువ యేమి.

“న సాహస మనారుహ్య నరో భద్రాణి పశ్యతి”

# XXI

ఈ కారిక నతఁ డసత్యవిషయమునఁ జేయూఁతగా గ్రహించుచున్నాఁడు. అది యటులుండె, ఆపద్యము లిప్పటియితని 'దేవగురు నిందాత్మకమగు మతము' నకుఁ దోడ్పడవు. ఈమత మిటీవల కుక్షింభరిత్వప్రయుక్తమైన 'గురుదూషణను సమర్థించుకొనుట కవలంబించినదియే, దీనిపేరేమి? వివేకదారిద్ర్యము. అవ యవలంబించినవారి కొక మతమేమి, యొక తోవయేమి, యొక తెన్నేమి?

"శ్లో॥...వివేక భ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః"

అను భర్తృహరి బుద్ధివిహీనుఁడా? శాంతం పాపం. ఇట్టి వీరి వ్రాఁతల నేల విమర్శింపవలెను? విమర్శించుచూవంటి మూర్ఖులను,

"కొయ్యతోఁటకూరకును సిగ్గులేదు, కొడవటికిని సిగ్గు లేదు"

అని చదువరులు విసిగికొందురని మేమెఱుఁగుదుము. కాని మాశిష్యపరమాణువు లిరువురలో రెండవమానిసి లిఖియించు ననృతములకుఁ బారము లేకయుండుటంజేసి సర్వపరికాస్త్రికిఁ బత్త్షండమునకు దిగక తప్పని విధియగుచున్నది. వేయేల, ఆతఁడు వ్రాఁత యని ప్రారంభించినది మొదలు నేఁటివఱకును ప్రచురించిన యక్షరములలో నే యొకటి రెండు నిలుచునో గాని తక్కినవెల్ల 'హుళక్కని యూఁదిన నెగిరిపోయెడివే కదా? ప్రకృత వివాదవిషయ మటులుండెను. ఈ కృష్ణకవి

"అభాస్యాంతమధీతం"

అని వ్రాసికొనియున్నాఁడు. ఈయొక్కమాట కీతఁడు స్వగ్రామము నుండియేని తగిన సాక్ష్యమును దెచ్చుకోఁగలఁడేమో చదువరులు పరిశీలింతురుగాక. కౌముది చెప్పినగురు వెవరు? వ్యాఖ్యానములు చెప్పినగురువు లెవరు? భాష్యము చెప్పిన గురువెవరు? ఆతని వ్రాఁతలో— 'వీరేశ్వరాన్' అనియున్నది. ప్రకృతము యశఃకాయుఁడగు నావీరేశ్వరుఁడు మాయిరువురను నెంతయో మెచ్చుకొంచుచుండెనో శిష్యుఁడే! అనఁడీతని గురువులలో నొకఁడగు నారాయణశాస్త్రిగారికిని గురువు. ఆనారాయణశాస్త్రిగారికి భాష్యాంతమును జెప్పుటయే నికిఁ జెప్పెనో, లేక యిరువురకును గల్పి చెప్పెనో, కాక యితనికి మాత్రమే రహస్యముగాఁ జెప్పెనో? ఈవిషయము నొకవాఁడేని [illegible] యితని వ్రాఁతల తత్త్వమును లోకము గ్రహించుచుండుఁగాక. మన కీవిషయము నకుఁ బ్రకృతము వీరింబట్టి మాకు శత్రుకోటిలో నొకఁడుగా నున్న నారాయణ

-శాస్త్రిగారేని యంగీకరించినచోఁ జదువరులు విశ్వసింప వచ్చును, లేదా కృష్ణక వితండికి గారేని "మా అబ్బాయి రామడుగుల వీరయ్యశాస్త్రి వద్దఁగాని వేఱొకరి వద్దఁగాని భాష్యాంతము చదివికొనియె" నని చెప్పినచో విశ్వసింప వచ్చును ఇతనితోఁ జేయుటచే మా శిష్యుడు వెంకటరామయ్యకూడ నసత్యతత్పరుఁడుగఁ దోఁచుచున్నాఁడే కాని వాస్తవమున కతఁ డట్టివాఁడు కాఁడు. వెంకటశాస్త్రిగారి యొద్ద నీవెంతవఱకుఁ జదివితివి ఎన్నాళ్లు చదివితివి చెప్పు మని యడుగువా రున్నచో నిప్పటికేని నిజము చెప్పియే తీరును. పైఁగా గురుత్వాపాదన మొనర్చుటకుఁ బ్రకృతము చెప్పు హేతువులను జెప్పఁడు. కృష్ణకవి జంటనుండుటచే నిట్టి కర్మము తటస్థించిన దనియే చెప్పును. కృష్ణకవికి వెంకటశాస్త్రి గురుపరంపరలో వాఁడయ్యెను బరిగణింపఁ దగినంత గురువు కాఁడు, కావున నతఁ డెవరినో పేర్కొనియెను. ఇతనికిఁగూడ వారే గురువులుగాఁ గలసివచ్చినది. దానితో లోకములోఁ గలకలముదయించినది. అదితుదకు 'శ్రీశ్వర వేదు'లగుటకుఁ గారణ మైనది. దానివలన నింత మునిఁగినది. ఇది సంగ్రహము. ఎన్నిగ్రంథములేని దీనికే పెరుగుచున్నవి. ఎన్నియసత్యములేని యిందులకే వినియోగించుచున్నారు. అసత్యము నుపేక్షించుట పాడిగాదని మేము పరిశ్రమ చేయుచున్నాము. ఆయా యీ విషయములు ముందుభాగములలో విస్తరించియుందును గాన నిదె ముగింపనెంచుచున్నారము. ఇందెక్కడెక్కడ నుదాహరించిన 'గురుగీత' యను వ్రాఁతప్రతిని మాకు యాదృచ్ఛికముగా నొసంగిన బ్ర॥ శ్రీ॥ వైద్యం భాస్కరరావుగారికి మా కృతజ్ఞతాభివందనము లర్పించుచున్నారము. ఆయీ గీతభాగములు చదువునప్పుడు చదువరు లచ్చటచ్చట నుదాహరించిన యుత్తరములయందలి విషయములను బరిశోధించుచోఁ గాఁకరపర్తికి సంబంధించినవాని నెక్కుడు శ్రద్ధతోఁ బరికింపవలయుననియు నందునను కృష్ణకవికి సంబంధించిన దేహబంధువులవి మఱియును శ్రద్ధగాఁ బరికింపవలయు ననియు, ఆయా యుత్తరముల క్రిందను జెప్పు తప్పటడుగులు జాగరూకతతో విమర్శించినఁ సత్యము బోధపడగల దనియుం దెల్పుచున్నాము. ఇం కుదాహరింపకున్నను మా 'వేమవరాగ్రహార శతావధాన పత్రికలో' 67 వ పుటలో నుదాహరించిన 'వణిపల్లి సీతారామశాస్త్రు'లవారి యుత్తరము నిదర్శనమేని కాఁకరపర్తిని బరిష్కరించుకొని కల్పించి కృష్ణకవి వ్రాఁతయు ప్రస్తుతవార్త నెట్టిదో తెలియఁగలవని హెచ్చరించుచున్నారము. ఆగ్రామము పండితగ్రామ మగుటకుఁగాని అన్నదానసహితమును బ్రతిష్ఠకుఁ గారణ మగుటకుఁగాని, మఱి యేయితర యశస్సునకుఁగాని మూలకంద మాణివిల్లి

# XXIII

వారు అందులో నీ సీతారామశాస్త్రిలవారు సర్వవిధములఁ బూర్వులను బోలినవారు. అట్టియోగ్యులను మాయెడల నెట్టి గౌరవప్రతిపత్తియో, ఆయుత్తరము చెప్పును. ఈకృష్ణకవికిని, ఆయనఘునకును గల తారతమ్యము సర్వబంధుజనవిదితము. ఇతఁ డేయాయుక్తపువ్రాఁత వ్రాసి యేమి చేయఁగలఁడు కాని, ఆయీ పరస్పరసందర్భము తెలుఁగని దూరస్థులకొఱకై తత్త్వనిర్ణయమునకుఁ గొంత సామగ్రి చూపఁగలయును. గాన నిజస్మృతిప్రదర్శనమునకై యీచిన్నిపాత్రములను, జిన్ని పీఠికలును మేము ప్రకటించుచుంటిమి. సత్యముకొఱకుఁ బరిశ్రమ చేయుట ప్రాజ్ఞలోక సమ్మతముగదా ?

శ్లో॥ త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయమితభాషిణాం, యశసే విజిగీషూణాం, ప్రజాయై గృహమేధినామ్.

(ఇతి కాళిదాసః)

ఓమ్, సత్యం తపః, నాఽనృతం - జేత్.

ఇట్లు

తిరుపతి వేంకటేశ్వరులు.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గీరతము

## గురుదక్షిణ

(అను రెండవ భాగము)

## I

### ఆశీర్వచన పర్వము

క. శాస్త్రుఁడు గురుదక్షిణ యిడ, నుత్సాహం బెంతయేనియును జూపఁగ "నో
వత్సా! వల" దనియెడి గురు,వత్సలు నిరతంబు మానివరుఁ బ్రణుతింతున్.

ఉ. 'తప్పక శైవ నంగఁ దగు దక్షిణ దేవ' యంచు వేఁడుటే
తప్పుగ నెంచి శిష్యవయుఁ డాఁ గను రెట్టఁగఁ జేసి "పొమ్ము తె
మ్మిప్పుడ కోట్లకోట్లు" అని కోరుగుఁ దానతి వెట్టెఁ దత్కథన్
జెప్పిన కాళిదాసకవి కేతురుఁ డెల్లజగమ్ము నేలుతన్.

తే. గీ. అంత ముక్తర్షి, నంత దయార్ద్రచిత్తు,
నంత నిస్పృహు, నంత ధర్మైకలుబ్ధు,
శాంతు, సంతోషవంతుఁగా నిలుపు శాస్త్రు
చరిత దురితాపహము సర్వసమ్మతంబు. 3

క. గురుశిష్యధర్మముల నెఱుఁగరు వఱ్ఱావు పెద్దఱికుడు కలికాలవశన్
తిరుపతిశాస్త్రీ! వారల కొఱకుఁ గనుమీ గీరతాఖ్యగురుఁడు దేర్పడియెన్. 4

క. గురుదక్షిణ నూఱార్లు * శివరామకవి నాకు నిడఁగ వచ్చినకంటెన్
బరమానందమొసంగెడి, గురుదక్షిణ చూడవె 'కాకకోకిలము' సఖా! 5

---

(బెజవాడ శతావధాన పీఠికనుండి)

*... అట్టిబహుమతిని నవధానిగారు (శివరామశాస్త్రి) తమకుంగల గురు

దానికిం। గానము సెప్ప సిద్ధపడెఁ గాకము లోకమువారు నవ్వఁగన్॥ క॥ లోకోత్తరమగు గానము। కోకిలడింభకము చదువుకొనవచ్చుట నెం। తో కులుకుచు మన్నించెను। గాకిగుణం బెవ్వఁడేని కాఁదనగలఁడే॥ గీ॥ దినదినము మేఁతకై దేశదేశములకుఁ। జనుచుఁ గలవారి ముంగిళ్ళఁ గుక్కిపాట్లు। పడుచునుండిన విడువక భక్తితోడఁ। గొలుచుఁ గోయిల పిద్దపైఁ గలుగు ప్రేమ॥ ఉ॥ గొప్పకు నెందుఁ బోయినను గోయిలఁ దోకొని పోవుఁగాని దా। నెప్పుడుఁ బొట్టకూటికొఱకే తిరుగాడుచునుంట నేమియున్। జెప్పదు కాకి కోయిలకుఁ జెల్లియొకప్పుడు సెప్పఁజూచినన్। జప్పని కూఁతదక్క నసనంబగు పల్కొకటైన రాదుగా॥ గీ॥ ఎన్నఁటికినైనఁ జెవులకు నింపునింపు। నొక్క పలుకైన తెలుపనోనో! యటంచుఁ। గోకిలము పుట్టెఁ దానతోఁ గోరెఁ గాని। యెప్పటికి దానికొక్క యాపేరదయ్యె॥ క॥ ఎఱుఁగను పికపోతము దన। గురువనకుం గలుగుపిన్యకోలఁదిఁ బసితనం। బఁగిన పేఱుండినే యా। త్తైఱఁ గంతయు దానికొయ్యఁ దెలియఁగనయ్యెన్॥ గీ॥ కాకి వైఖరి మన మెఱుంగనిది కాదు। కాకి గానము గ్రొత్తది గాదు మనకు। గండుఁ గోయిలపిల్ల యకాలమందుఁ బసితనంబాటఁ దెలియక భంగపడియె॥ గీ॥ చాలఁ గాలంబు విసిగి నేసారి తుదకుఁ। గాకపికి గానతన మెట్లు గలుగు ననుచు। రెల్లుకుటయుఁ మివులఁ జింతిల్లి పికము। కాకమును వీడి తనవారిఁ గలసి చెలఁగు॥ గీ॥ అంతఁ గోయిలపిల్ల వసంతకాల। మంతరింప రసాలము నధివసించి। సరసులెల్లరు మెచ్చ స్వజాతిసులభ। మయిన గానంబు కర్ణపేయంబు సేయు॥ ఉ॥ కోయిలపిల్ల మేలు తనకున్ లభియింపక గాంటఁజేసి యా। త్మ్యాయత మానసూయ హృదయంబుఁ గలంప నహర్నిశంబు నా। న్యాయసమూతిన్ భూమిఁగల వారికిఁ గోయిలపాటఁ జేయుగాఁ। జేయు తలంపుసం చెవులు చిల్లులువోవఁగ గూయు నీగతిన్॥ గీ॥ విబుధవరులార! కోయిలపిల్లపాట। కర్ణపరుషంబు; మున్ను నాకడనె విద్య। నేర్చె; దీని కొకింతయే నేరుపు; కలకంఠములు గౌరవార్హములు "కావుకావు"॥ గీ॥ చాలఁగాలము నుండి ముచ్చటగఁ బాడు। కాకములసొమ్ము గానము; గాని మొన్న। మొన్న నాయొద్ద నేరుచుకొన్న పికము। కలరవమ్ములు మధురముల్ "కావు కావు"॥ గీ॥ కాకియోర్వఁగలేక యిక్కరణి నెప్డు। 'కావుకా'వని కూయునకాని ధరణి। నెఱుఁగరొకో కలకంఠము నెల్లవారు। వినరొకో! దానిగానము వీనులార॥ క॥ కాకము దనకొక గురువని యే కోయిల సెప్పె, నైన నేమి? యనూయం। జేకొని

పికముం గాకం। బేకరణినా నిందలాడనే తలపోయుచున్॥ గీ॥ కాకి యొకనాఁడు
కోయిలకడకువచ్చి। యోరీ! పికపోత! నీగర్వమధికమయ్యె। తొల్లి గానంబు
నెల్ల నాతోడఁ జదివి। కృతమెఱుంగవు నీకింత గరఁదంటె?॥ క॥ అంచుం గించు
దనంబునఁ। జంచువుఁగదలించి వాయసము దన్నున్ యీ। చించిన నొజ్జనికముఁ
బ్రచురించె దన నని కోకిలమ్మ చేసెన్ నవ్వున్॥ ఉ॥ తేఁకు గల్గువాఁడు పరదేశ
ములం జరియించు వాఁడతి। శ్లోకుఁడు వేఁపపండ్లుతిని చొక్కెడు కాకవిసార్వ
భౌముఁడే। నాకు గురుండు నమ్మఁ దనెనన్ మన కోకిలపాక; వేలొకో।
లోకమువారు నమ్మరది లోపముకానగ వారిబుద్ధికిన్॥ ఉ॥ కాకము గాయకుం
డఁట! పికంబునకుం గురుఁడంట! తన్ను నుం। శ్లోకులలో వాకొనని లోపము
కోయిలపిల్లదంట! తా। నే కడు స్మృత్రిమాఁట! యుద్ధగుణాండఁట! వింటి
రయ్యా! యీ। సాఁకు లటంచుఁ జెప్పెదొనసాగిరి లోకులు వింతవింతగన్॥
క॥ కోయిలకుం గురుఁడను నే। నే యని యెప్పుడును బాటు నెల్లెడలను గా। నీ
యేరును బాటింపమిఁ గా యందని లోకమునఁ గలఁతపడు వాయసుఁడున్॥ క॥ ఈ
యున్నతజని గంతం। గోయిల కాకము నగ లనుఁ గొంగొంగని యెం। దో యొత్తిలి
నగెనఁట; యది। యేయొకెడఁ గ్రియగ విగ్రహింపఁగఁ గొనఁగెన్॥ ఉ॥ కోకిల
మట్లు కయ్యమునకు స్మృతి నొప్పదు ముద్దులొల్కఁగా। నాంకొని యెల్లలోకులను
వశ్యులజేసినదయ్యె నెప్పుడో। కాకమునొద్ద నొక్కెడరి గానము సేర్వఁగఁ బోయి
యుండుటన్। గాకికిఁ గోకిలమ్మనకుఁ గయ్యము తియ్యము గాక యుండుటన్॥
క॥ అదికారణమ్ము గాఁదు। న్నెదురుగ గతే దని తలంచె నేనా? కాకం। బొంది
పికకూజితమ్ములు। వెదకి వెదకి చూపసాగె నెట్టివొ సంగుల్॥ చ॥ ఎఱుఁగదు గాక
కాక మొకయించుక యేనియు నాత్మశక్తి; వా। డఱిన నపస్వరంబులుగదే!
తనకుం బొడసూపు! గాయకో। త్తరకలకంఠనాదమునఁ బాసును దప్పులు పట్టఁ
జూచినన్। గరుసగునే పికస్వర పికస్వర మెస్వరకేసి యంతలోన్॥ క॥ కాక
మొకపక్త, కోయిల! మూకంబని మదిఁ దలంచి మొఱకులఁ దెలుపన్। లోకోక్తి
మగు ఫణితిని। కోకోయని కూయసాగెఁ గోకిలమంతన్॥ ఉ॥ చేసెడు చేఁత
యుత్తములచిత్తము నుత్తలపెట్టుచుండుటం। గూసెడుకూఁత కర్ణములకుం బరుసం
బుగఁ దాఁకుచుండుటన్। వాసియు వన్నెయుం గలుగువారలు "హుం"షని పాఱఁ
దోలినన్। నాసరివారు లేరనియె నమ్మను వాయసుఁడేమి సెప్పెదున్?॥ క॥ కొం
గొంగురనుచుఁ గూసెడు। కొంగను ముంగిళుల మెలఁగు కొంచెపుఁగాకిన్। బం

తాను గోకిలమాటఁ దప్పంట కాకినా నను గురుగాఁ జెప్పికొనెదు నెడల!
నయినను జెప్పుట కంగీకరించెనం, టామాఁట లోకు లీయంశము విని

తే. గీ. "కాకమఁట! తాను గురువఁట! కోకిలకఁట!
యిందులకుఁ గోకిలమొకింత యేని సిగ్గు
లేక యెటు చెప్పికొనియె సుశ్లోకులకడ"
నంచు నచ్చెరు వడిరంట! యనఘులెల్ల 10

క. అచ్చెరు వటఁ జెందెడి యో, సచ్చరితులు! మీరుఁగూడ జగమునఁ గలరే!
పొచ్చెము లేక వచింపుఁడు, చచ్చెనె మీలోపలఁ గూడ జ్ఞానలవంబుల్ ?

క. గురువుగ 'గురుని' చెప్పిన, మరితమ్ము సహింపఁగోటు! దుర్మార్గముగాఁ
బరికించితిరె మీరలు, సరిగా నహియింపుఁ డయ్య! సజ్జనులారా! 12

క. క్షమియింపుఁడు మీరును లోకమునం దున్నారటంచుఁ గాంచనుజాం డో
యమలాత్ములార! యీ యక్రమపుఁ బ్రాఁతలకుఁ జేయి కదలుట యెట్లో!

సీ. నాకంఠరవము వర్ణన చేయు మీరెల్లఁ గాకవులంట! యక్కట తన నాకు
గర్వం బెదిగెనంట! కాకికి మువ్వంట పుట్టినారఁట! పలుగాకినంట!
పటుతరంబుగ నేను బటుపటుకుక్కలుదులు పుకొంచును జరింతునఁట! యకటా,
తాను నాయొద్ద విద్యను నేర్చుకొని రాఁగ మన్నించి చెప్ప నవ్మందిరేనము

తే. గీ. నాఁడుఁ గూడనెపని యంట! గొప్పకంట
తన్ను నే వంటఁ గోలాని తరలు జెల్ల!
నంతయేనాఁ జెప్పలేనంట ముక్క!
యెక్కడున్నాఁడో భగవంతుఁ, డెందు లేఁడో! 14

క. ఔరా! భగవంతుఁడ! నీ, నేరుపు మెచ్చంగ వచ్చు నేఁటికి సృష్టి
ప్రారంభ మాది యిప్పటి, కీకీర్తి మహాత్మ్య జగతి కిచ్చిన కతనన్. 15

క. మాంతనపు సంగతుల నలు, సంతయుఁ దూచాలు తప్ప కంతయు నే ను
స్వాంతమునందెఱుంగు నా భగ, వంతుం డున్న యెడఁ దెలియవలయు న్నిజముల్.

క. ఎంతో నీచ మగు తటా, కాంతరమున నేన్గుపాప మల్లనఁ గొను దు
శ్చింతము మొసలి నెఱుఁగు భగ, వంతుండున్న యెడఁ దెలియవలయు న్నిజముల్.

క. ఇంతి ద్రుపదాత్మజాత స, భాంతరమున దుస్ససేను నవమానంప్రం
గంతులకుఁ బాపఁగల భగ, వంతుం డున్న యెడఁ దెలియవలయు న్నిజముల్.

క. భ్రాంతిఁ బ్రాజదువు లుద, ధ్వాంతునిలో డాఁచు దొంగవాని వసుర దు
శ్చింతుని గనుఁగొను నా భగవంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్

క. ఇంతి జగన్మోహిని దా, సంతర్పణఁ జేయ సురలసందున నరి య
ల్లంత నిలుకు వెటెఁగిన భగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క. సంతమసములోన సుప, ధ్వాంతునిలో నుండుకొంపపక్క జరుగు వృ
త్తాంతమ్ము నెఱుఁగు నా భగ, వంతుం డున్నయెడఁ దెలియవలయు న్నిజముల్.

క. ఓయీ తిరుపతిశాస్త్రీ!, నాయీ శిష్యుండు కాకి నాయుసు నాకున్
వేయాఱు లిచ్చుటకు బను, లాయురారోగ్యములు గోరి యర్పణఁ జేసెన్. 22

ఉ. ఏనును నీవు నిక్కముగఁ గవీంద్రులమై యుగు టొప్పు నేని దు
ర్మాని మదీయశిష్య నపరాధము నెంతటిదైన నేమి యా
జ్ఞానకృతంబుగాఁ దలఁచి కాచి నిను న్నను సత్యసంపరా
ధీనులఁ జేయుఁగాతఁ బరదేవత శిష్యుఁ బరాయుఁ జేయుతన్. 23

మ. మనలం బెట్టినవాఁ డెట్టుఁగాక, తగ నస్మచ్ఛిష్యుఁడౌ నీతనిన్
ధనధాన్యాదిక మాయువున్ వినయము న్విద్యాబుధులం గూర్చి వృ
ద్ధిని నందించెడిఁ గాత మాత, గురుభక్తిన్ వచ్చుజన్మానకే
ననుసంధించుతఁ, గీర్తియుం గలుగుఁగా కానాఁడె యవ్వారిగన్. 24

మ. కలుగుం గావుత సూర్యరాడ్విభునకున్ గళ్యాణపారంపరల్!
దలియుం గావుత వేఁకన్నఁ గవులే దేవాంశసంభూతులం!
చిల నీతోఁ దొరవరించు పుణ్యములె మాయీశిష్య దుర్దోషపుం
గలికాలంపుఁ బరిపక్వతనం బుడిపి పైఁ గాపాడి రక్షించుతన్! 25

సీ. మొదలంట నడుమింటి మూలమూలలనుండు వేపిశాస్త్రమ్ములు నేకిరుచ్చె
మనకు దిక్కెవ్వరో యనికుందు నాంధ్రకవుల కవిత్వము నేఁడు వెలికివచ్చె
నెందుకు సృష్టించె నీమమ్ము నని కొట్టుకొందుచు నడవలవంత లడఁగ
నెట్టునిల్చెడినొకో యీపాపకాల లిమ్ములనన్ని శాల లుజ్జ్వలత కెక్కె

తే. గీ. నెవని కతమున నట్టిమనీషిపాద
రేణుపావితసత్సభాశ్రీవికాసుఁ
డార్యసూర్య రాయేంద్రు నవర్ఘసుకృత
మగును గాక మా శిష్యుని కంగరక్ష!

సంగర మేడ" నంచుఁ బెలుచన్ లిఖియించిరి హేతు, వింతలోఁ
గొంగవు కాకి వెట్లయితో ? గొంగ యనంగను శత్రు వందురో. 38

క. అటుమీఁద శత్రువునకున్, డటకాఁడి మూలఁబడుట తథ్యముకాదే!
యొటు వ్రాసి కొన్న నేమి క, పట మెఱుఁగం బడదె జగము పాషాణంబే.

గీ. డోమ యేనుఁగుకడ కేగె దొరకుపట్టుకు
రక్తమును గ్రోలనిచ్చె, భద్రగజరాజు
నొడలు తనపాలు చేసె, నీవెడఁగుడోమ
సొడుతుండంబునకు లేదు పాటవంబు. 40

క. నాకును మండంబున్న ఎ, నేకపరాజునకుఁ గలద యిది యని యాపై
డీకొని పోరఁగఁ వచ్చిన, నా కదనం బెట్టులుండు నరయుము సఖుఁడా!



(2) సూర్యరాయపర్వము.

సీ. ఆకొండివారింట నాకంటముని మెక్కి నత్రంబు చెప్పిన జాణతనము
మధునపంతులసూరిబాధు దేశకల్పమ్ము మున్ను చెప్పినరీతి నున్నయెడట
అటుమీఁదఁ దాఁ ఓకంతై నన్నుఁ గాకంబు గావ్యాసములు వ్రాయఁగా జాణతనము
ఆవ్యాసములు గూడ నట నట గోమయోదక సేచనము గొని వెకలితనము

తే. గీ. గాంచి 'సోమి పరాగతం' బంచు నడుగు
వాఁడొకండు లేఁడు గా! యని నగుచుండ
దొరకె నొక్కఁడు సూజివీట్సుమునందు
నొగి, రసజ్ఞుండు, సత్కవిచరణరతుండు. 42

క. విరస యను నూరుకాఁపుని, మరసినవాఁడతఁడు సకలమగు కావ్యములున్
సరిగారు వెలమలన్ ధీ, వరు లతని కటన్న జనులు వాకొన నేలా? 43

క. ఎఱుఁగవె ? సంస్కృతభారతి, పరమార్ఘజ్ఞుండు రావు పంగడమున నీ
పరిసరమునఁ గలవారలకు, శిరోవిభూషణము సుగుణసింధుం డెంకన్. 44

ఉ. వెంకటసూర్యరావు సుకవిత్వవిమండగు రామచంద్రనా
మాంకుని వ్యాసకుండు ఘనమం దెటులైనను జీకాపురీ

పంకజబాంధవుం డనఁగ భాసిలు చేలికి ధర్మమూర్తికిన్
వెంకటసూర్యరాయనికి వినుమ వివేకి * యథార్థవాదియున్. 45

క. అతం డడిగెడ నవె; నిఁక, బూతులపంచాంగములను బొగడున్ వదలున్
జాతురికిఁ దక్కు కోఁతలు మూఁతఁబడు నమ్మఁ డతఁడు బొంకుంగూఁతల్.

క. 'దానన్ లాభంబే మని, యా'? నీవడిగెదవు, వారి కాపై నేనిన్
జ్ఞానంబు గలుగు ననియున్, దానన్ యశమబ్బుననియుఁ దలఁచెద సఖుఁడా!

గీ. ఎఱుఁగు నీతండు నాయొద్ద నెంతవఱకుఁ
జదువుకొన్నాఁడొ, పిదప నీసాహసమున
కెట్టిలోడిగట్టి పాపంపు గుట్టనెక్కఁ
దలఁచుచున్నాఁడొ, సర్వమ్ము తథ్యముగను. 48

క. నాకడకు వచ్చునప్పటి, కీతని జ్ఞానం బదెంతొ, యీడెంతయొ, నా
కాకత్వ మిదిది కోకిల, సాకత్వముగూడ నెఱుఁగు భవ్యుఁ డతండే. 49

---

* "మహారాజశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి. శిష్యుఁడు రావు వెంకటసూర్యారావు కృతానేకవందనములు........... నేను యిచ్చటకువచ్చి వారంరోజులు అయినది. అది మొదలు యిప్పటికిన్నూ, అత్యద్భుత శతావధానులదర్శనం చేదామని ఎంత యత్నించినా నాకు సంపద్భించక పోయినందున రెండుసార్లు వారిబసకే వెళ్ళినను, సమావేశం కాలేదు. కారణం నేను వ్రాయచాలను. ఇంతకూ అట్టిలాభం నాకు ప్రాప్తించినదికాదు అని అనుకున్నాను...... ప్రస్తుతం చాలా పశ్చాత్తాపంలోకి వచ్చినట్లు నా ఆప్తులవల్ల రూఢిగా విన్నాను. నేను వక్కసారి సమావేశమయినచో ఎంత అందముగానైనా యుండును. గాని వీలుపడ్డదికాదు వక్కసారి సమావేశమయిన యెడల మీకు నేను శిష్యుడనైనందుకు గురుఋణం తీర్చుకొనిన వాడను అగుదును ఆపని ఈసమయంలో నెరవేర్చలేనందున నేనున్నూ వారిపట్ల గురువిషయంలో కృతఘ్నుడనే కావలసివచ్చినది......... నా ఆప్తులున్నూ నేనున్నూకూడా మీగీరతమునే త్వరలో చదివి ఆనందించు కుతూహలంతో నున్నాము. గీరతంయొక్క పూర్వోత్తరం పిఠాపురంలో వున్న పండితులు అందరికిన్ని పద్యములు నోటికి రాకపోయినా సంగతియావత్తున్నూ చెప్పినాను. అటువంటి గ్రంథం బయలుదేరితే లోకమునకు ఉపకారమవుతుంది అని అన్నారు. అంతా......వేస్తూన్నారట........"

రా॥ వెం॥ పిఠాపురం, 16-1-11.

ఉ. ఏ వలనూజివీడుపురి కేగి పధానము సేయునాఁటి కీ
జ్ఞానిశిరోవిభూషణము ధాతుశ్రీఁడుగాఁ జనుఁదెంచె నాకు వి
జ్ఞానము బోధ సేయుటకుఁగా దయ గల్గిన వాఁడుగాన, ని
వ్యానిని సూర్యరావప్పుడు వాస్తవ భక్తిని జూచినాఁడటన్. 50

శా. సూరిశ్రీసకలస్వవేత్త యగు నీసూర్యేంద్రుఁడెసూ! పూర్వ మ
ప్పారాయేంద్రుని సన్నిధానమునఁ గాపట్యంపు విద్యాఘనిన్
శ్రీరామాఖ్యశతావధానిపసఁ దేల్చెన్; మీఁదఁ నాసూరి న
ప్పారా వొక్కఁడె కాక తన్నగరమే వాఁడోదు తత్త్వజ్ఞుఁగన్. 51

శా. అప్పారావునసంతరమ్మునను విద్యావేదులైనట్టినా
యప్పారావును, నమ్మహాత్మననుజుం డైనట్టి సింహాద్రి శ్రీ
యప్పారావును జూడవచ్చినతఁడు; డయ్యార్యుల్ "భవచ్ఛక్తి మా
కొప్పన్ బో" దని తండ్రిపోల్కిని రార్యుల్ తత్త్వ మూహింపరే.

ఆ. వె. ఈరసజ్ఞమూర్తియే కాదు శ్రీకూచి
కులుఁడు నారసింహకోవిదుండు
గూఢ నెఱుఁగు నికనిగురుతయు, నాశిష్య
భావ మదుగ నతఁడు పలుకు నిజము.

క. ఎవ్వారుపలుక నేటికి, అన్వయము రట్టును నిజేల రసికులకు? ననున్
గాఢిశ్రీవ్వాఁగఁ బట్టిన వ్యాసమె, ముక్కలు గట్టికొని యిట్లు మెఱుఁగుచునుండన్

మ. ఎన రీకోకిల! శ్రీమనోరాటికులాహీనాబ్ధిరాకావిధుం
డవు శ్రీ వేంకటరామశాస్త్రియను లోకాహానె; కాకం బెవం?
దెవఁడో యెట్లగు శాస్త్రిగారి గురువా నీవేంకటేశుం డహో!
యెవఁడీ కొంగ? దివాకరాన్వయమణీ! యీవేసమిా శ్రీపతీ! 55

సీ. నాయెడఁ దాఁ గృతఘ్నత్వనామకమహాపాతకి యాట విస్పష్ట మంట!
ఈపాతకమ్మున కేర్పడ్డశిక్షఁ దాఁ బరమందుఁ గనుట తప్పనిదె యంట!
అంతియే కాని నాకాతఁడు శిష్యుఁ డం చని నేను జెప్ప టనర్హ మంట!
పైవానఁ దనకీర్తిఁ బబలించు నేకాని నాకు యశంబు సున్న యగునంట!

తే. గీ. ఔర! యెటువంటివేదాంత మభ్యసించె?
"నేమి శాశ్వత మాగోడ యించుకంత

యవల జరిగించి "పెట్టికొం" డని వచించు
నెట్టివేదాంతితన మిట "బట్టు" మనిరియె. 56

## (3) సంబుద్ధిపర్వము-

క. "మావాఁడతిదుర్మార్గుఁడు, మీవాని శిరమ్మునందు మేకులు గొట్టుం
డేవేళ నేమి సేయునో, కావలమున" నన్న నీతి గనఁజేసెదవా! 57

ఉ. వేంకటరామశాస్త్రి! విను విద్య పఠించితి నంచు నొప్పుకో
జంకియుఁ గోకిలమ్మనయి చక్కఁగ స్పష్టము గాఁగ నెంతయో
పెంకెతనంబుఁ జూపియును "జెప్పెపెమెమ్మెమె" యంచు నేఁడు ని
శ్శంకగ నొప్పుకొంటి; వది చాలు జయం బగుఁగాక నీ కిఁకన్. 58

ఉ. "కాక" మటంచుఁ దిట్టుదువు గాక, శ్వపాకుఁ డటంచు గాక, యిం
కే కలుషంపు పేరు లిఖియింతువు గాక! స్వకార్యసిద్ధి నేఁ
జేకొనినాఁడ నేఁడుగద! చేకుఱె మోదము; నీవు తిట్టవే;
దీకవి నీతఁడే యనక యిట్టులు తిట్టుకొనెన్ సుమారకా! 59

ఉ. "చప్పనికూఁతలే" యనుము ఛాత్రుఁడవై గడి! నన్ భజించుచున్
జెప్పినఁ జెప్పికొంటివి ప్రసిద్ధుఁడ వప్పటి కయ్యు నీవు నీ
చెప్పను గాని నాదరిని శిష్యుఁడ వైతివి తండ్రి! నీమనం
బొప్పెనె యిట్టితిట్టుల కహో! యిటు కృష్ణుఁడు వ్రాసిపెట్టెనే? 60

చ. మొదట "రిజస్టరుత్తరము" మోటుతనం బగుపట్టకుండ నేఁ
గద లిఖియించి తిర్పతిని గయ్యము కై పురికొల్పినాఁడ; నీ
వది గని యెంతగా బెదరి తయ్యయొ? పాతకినైతిఁ దండ్రి! నా
యదయత సైఁపుమయ్య! యిఁకనైనను భీతిని మాను మర్భకా! 61

చ. "తిరుపతిసింహ మొక్కఁడు మొగిఁ దీవ్రతరంబుగ వచ్చి పీఠికా
పురమున నున్న నాపయి 'గుభుక్కున' దూఁకు" నటంచు నెంతకా
తరపడినాఁడవో యకట! తండ్రి! కృతఘ్నత కాదు హేతు 'కీ
శ్వర' యను వేరుసుమ్మ నిను జంకఁగఁ జేసిన దేమిసేయుదున్. 62

శా. నీయజ్ఞానము నీదులోభగుణమున్ నీదౌ కృతఘ్నత్వమున్
నీయల్పజ్ఞతఁ జేసి గాక యకటా! నీమీఁద నే నెంచు యు
ద్ధాయత్తుండయి రాఁగడంగు నొకఁ? డే నవ్వానిఁ బ్రాణాలతో
డాయ న్నిత్తునె? నన్ను వీడిగద! కట్టా! చెట్ట వైతింతకున్. 63

చ. తిరుపతిసింహమున్ సరిగఁ ద్రిప్పి పరిశాంతమొనర్ప వేంకటే
శ్వరునకుఁ దక్క నీయనుఁగుబావకు గీవకు నోజ గూర్చ నీ
గురునకుఁ జగ్గచందురునకుఁ గూడ వశం బెటు లయ్యెడిన్ ? దురు
ద్ధర మది, నేను దానిబలుధాటికి నొక్కొకవేళ జంకెదన్. ౬౪

ఉ. కాఁకరపత్రిపై కులుకఁగా గమకించె నెఱుంగుదే ? "శత
ఘ్ని"కృతి సాహ్యకర్తలను నీవును బావయుఁ బోలె 'శృంగభం'
గాకలనప్రసంగ మది యజ్ఞతమై లిఖియించినట్లు వా
పోకయ పోయినట్టులుగఁ బూర్తిగ చేఁకొని జ్ఞప్తియున్నదే? ౬౫

ఉ. వెంకన బందు వొకతన వేఁదుఱు వ్రాఁత లాకింత సైఁచు; ఏమా
ర్జంకుటగాఁ దలంచి పెలుచం గుఱుచల్ లిఖియించుచుండ్రి; వా
పెంకెతనాలు సాఁగ -ల జెబ్బలికై; నెలనాఁటి సింగ మి
ట్జింకల నింకఁ జేయు నెపుడేనియు; డొంకకు నూ! శరణ్యముల్. ౬౬

ఉ. ఏది, సముత్తరం బతని దుర్ద్రష్టవాగ్రతకుఁ జెప్పుమా ? శి
ర్శ్ఛేదముకాదె పందె మిదె! సిగ్గు గలట్టి నృపాత్మజుఁడేని * "పీ
ఠే దెస లేని బోం" డనుచు నీయఁగఁ జేయునె యుత్తరంబు దా
యాదుని పేరు పెట్టి! యయురా, యిఁకరా ! చవిదాఁకిబీరముల్. ౬౭

ఉ. "పోం డల పీఠికాపురికిఁ బోం డటుపోం" డని నీదుబావ బా
వాం డొకలేఖ వ్రాసె, నది యూఁతగ నయ్యెడ పేగుదేర న
వ్వం డొకఁ డెంతో "మీ రిటకు వచ్చితి రేటి?" కటంచు, నెందుకీ
గండతనంపు వ్రాఁతలు జగంబు మొగంబుల నవ్వుచేఁయు నూ. ౬౮

చ. "పిలిచినయప్డు రాక యటు * జెట్టుగ నుత్తర మిచ్చి యెవ్వరో
చలపతి 'పీఠికాపురము చక్కికిఁ బో' మ్మనినట్టు లెవ్వరో
గిలికిన నచ్చువాఁడనె ? నగించెడి నీదుప్రసక్తి" యంచు న
వ్వల నల డేఁదు నవ్వలరఁ బల్కిన నుత్తరమేది పుత్రకా! ౬౯

* గీరతము, 1 భాగము శాఖాచంక్రమణపర్వము చూ. 10 వ పుట

* శ్రీపిఠాపురీ రాజపుత్రోదయవిషయిక పద్యత్రయము.

సీ॥ ఉదయించె రాజు రావూవన్వయోదన్వదభివర్ధనుండు సూర్యాంశవలన
జన్మించె సంతానశాఖి నందనశుభశ్రీ పెంపుమీఱఁ బిఠాపురమున। నెనలెఁ

ఉ. కరుణ గలట్టి మెత్తనగు శాకిని గేరడ మాడినట్లు గా
దొ యొకఁ గొంగపై కరుకు టంచని పూర్తిగ బుద్ధి వచ్చియున్

---

దినాసంభవుఁడు సూర్యునందు నారాయణాంశం బున్నదంచుఁ దెలుపఁ, బోడమే నాండాలమ్మకడుపు చల్లఁగ రాజసస్యంబు సజ్జన క్షేమ మడఁప॥ గీ॥ మంగళాంబ గణించిన మాననీయ। సుకృతపరిపాక మెల్ల నేఁటికిలభించెఁ। గంటికగపడె రావు గంగాధరోప। పదుఁడు రామావనీపాలవరుఁడు మరల॥ గీ॥ తనిసాసాధారణం బసాధారణముగ। మఱియు నందును నాల్వయోజ్మాసబహుళ। పక్షముఁ దృతీయయును శుక్రవాసరంబు। మకరలగ్నంబు సూర్యసంభవునిసలన॥ మ॥ గురుఁడున్ సూర్యుఁడుఁ జంద్రుఁడున్ గుజుఁడు శుక్రుండున్ బుధుండున్ శనై। శ్చరుఁడుం గేతువు రాహువుం గలసి యశ్రాంతంబు నీబాలునిన్। సిరి దీర్ఘాయు వొసంగి, పోషితురు బుధాశీర్వాదముల్ తోడు గా। నరసింహదాత్మునకుం సహాయు లయి సూర్యారాయభూపాలకా!

25-10-10 }
కాకినాడ. }

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.
శ్రీరాజా కొచ్చెర్లకోట రామచంద్ర వెంకట
కృష్ణారావు బహద్దరుగారి యాస్థాన విద్వత్కవి.

True copy of letter from the Private Secretary to the Rajah of Pithapuram dated 29th October 10, addressed to Brahmasree Satavadhani D. Tirupati Sastri Garu.

"I am desired by the Rajah to convey his thanks to you for your congratulatory verses on the occasion of the birth of his son and heir."

(పుత్రలేఖ పంపినప్పటి విజ్ఞాపనము.)

మ. ఘనవంశావళి గల్గువాఁడవని చక్రస్త్రీదరిన్ జేరి నే। దినచిర్యోత్తిన దుర్గజమ్ముల నఖక్రీడావినోదమ్ముగాఁ। దునియల్ సేయఁదలంచుచుండినమ్మ। నేందుప్రింహారకే వచ్చిపో। యిన గర్హింపరె? యెవ్వడేని యిటఁ జల్లే పద్మ భూభృన్మణీ!

తి॥ శా॥

దిరిగియు * "జార్జి" పద్దెములఁ దేఁకువమాలు దోసంగులన్ గసం
బిఱుపఁగఁ బూను మీకుఁ బరువా? కఱవా? తెరువాటుదాఁటులన్.

ఉ. "ఈశ్వరవేఱు లున్న యెడ కేఁగుఁ" డటం చొక బంధుమాత్రునిన్
బశ్వపతారు నూఁతగొని పల్కితి; రాతని చెయ్యి లన్నియున్
శశ్వదుదారకీర్తుల పరిసంగములో బయలయ్యె వింటి: లో
కేశ్వరుఁ డెట్టిచుట్టఱిక మేర్పడఁజేసె సెబాసు! షేల్! బళీ!

క. విను నీపినతండ్రికుమా, రుని గనుఁగొను మతఁడు చెప్పు రూఢిగఁ; బావ
ష్ఠును నలతిర్పతిఁ బెట్టం, గనుబూన్పితి కెంతలేని గలవాఱు సుమా.

క. అతఁడేల చెప్పవలె? సం, స్కృతనిశ్శేషావదాతకృతనిద్రాసం
గతిగతకాఁకరపత్త్రి, స్థితసుశ్రిత నేత్ర మడుగఁ జెప్పు నఖిలమున్.

ఉ. అట్టిఁడతండు కావునసె యాతని వ్రాల్ గలయుత్తరమ్ము మా
పట్టుననుండె నం చెఱఁగి బావ "యతం † డని వ్రాయలే" డటం
చొట్టులు సత్యముల్ గిలికి యుత్పథచారిగ మాఁకుఁ జొచ్చె "వీఁ
డిట్టిఁడు బొంకి యాత్మకెటులేని యెం బాడఁగొంచ్చ" నం చొనన్.

క. తాదృశులుండక్క విడుదు, ర్వ్యాపములకుఁ దోడునూప రా; రతఁ డేనిన్
బాదాక్రాంతత గోడఁబడి, నీడగు నఘు మడఁచెఁ గొంతనీతి గలాఁడే!

(*కవితా పత్రికలోని "అట్టహాసము" నుండి)

*... ఈపద్యము వ్రాసిన మహాకవి యెతడోయని యాలోచించుచున్నట్టున్నారు ఈయన పోలవరము సంస్థాన పండితుండు దివాకర్ల తిరుపతిశాస్త్రి శతావధాని గారు... పరి యాచకమున కేమిగాని యీపద్యము వెనుకటిజానకన్నను మస్తిలోనున్నది. ...... ఇట్టితప్పులతడకను బ్రకటించి సంసులకుఁ గొంకినను కాఁబోలు విశేషజ్ఞుఁడనిపించుకొనుచున్న వేంకటశాస్త్రిగారీపద్యమును నోసి రాజని కృష్ణాపత్రికలోఁ దక్కిన పద్యములను మాత్రము ప్రకటించియున్నారు. (ఇట్టివనేక హాస్యములు)

† తి॥ శా॥ గారు శృంగభంగ గ్రంథకర్తకు రిజస్టరు జాబు వ్రాసియుం జేఁగాని యాతఁడు వ్రాసినట్లు యాథార్థవాది యభినవ సరస్వతీపత్రికలోఁ బ్రకటించిన యుత్తరముచేఁగాని ప్రయోజనము లేదు. ఆయుత్తరము సత్యాసత్యములు సమయము వచ్చినప్పుడు తేలకపోవు. ...

(నవంబరు 24 వ తేది 1911 సం॥ కృష్ణాపత్రికనుండి.)

చ. కలతెలుఁగుల్ లిఖించె నలకాతఁడు దక్కుట! పేరు పెట్టి; య
ప్పల నెవరో లిఖించు నలపత్రిము తన్ను ఘటించి తిర్పతి
జ్వలనము చుట్టుముట్టు నని సందియ మందఁగఁ బోలుఁ బాప? మే
కొలఁదియుఁ గాని తన్నెదురుకొన్న జగంబు మఱింతనవ్వదే!

క. తిరుపతి ధోరణి తెలిసెనె, "శని"యని నీబావకై యశస్కాగ్రం దతోన్న
దరి నిడినబావమఱఁదినిఁ, బొరిఁబొరిఁ బలికించి కాచు ప్రోచెన్ గరుణన్.

చ. అతఁడు కృతజ్ఞుఁడౌటఁ బ్రామి యాత్మకు వెంకననాము వీని నీ
చతరపికాభిఖ్యనుని ‡ సద్గురుఁగా లిఖియించె; దానిచే
నితనికి వాఁడు తక్కువని యెంచుచుఁ దిట్టితి వెంత బేలవో!
కృతమును జూపనంతటనె కేవలనీచుఁ డెవండుఁగాఁడునూ!

చ. కృతమును జూపకుండు నరుఁ డేమగునో! యిపుడేని స్పష్టమై
మతి నతికెంగదా! సకలమర్మ మెఱింగియుఁ దత్తఱంబునన్
మతి చెడి "కాక" యంచు నొకమాటను గల్పనఁ జేసి నన్నుఁ ది
ట్టితి పది యేమికార్యము! కడింది యశమ్ము గడించుతో ప్రియా!

చ. "తిరుపతి నాపయిం గవిసెఁ దీవ్రత మద్గురువైన వేంకటే
శ్వరుని కతానఁ గాదె" యని శాంతి యెఱింగిన నీవు తద్గుణ
స్ఫురణము చూపి యుత్తరము సూటిగ వ్రాయక యేటికయ్యొ? యా
పరిపవిత్రిత; కృష్ణుఁ డెటు దోఁచఁగఁ జేసెఁ గుమార! చెప్పవా.

క. నకలకు శాంతిం గఱపెడి, పరమోత్తమగురుఁడ వీవు బాలక! నీకున్
గఱపఁగ నేఁ జాలుదునే, దురితపుఁగాకి నని నీకుఁ దోఁచినదె కదా!

చ. "గురు వని చెప్పనందులకుఁ గోప మిదేమిటి? కీపనుల్ యశ
స్కరమగునే?" యటంటివి; పది సమ్మగవేఁ; కొమరుల్ గలారు నీ
కరయఁగ సద్ధమాను లిటు లాచిరజీవులు నిన్ను నిల్పిన
త్తరుణమునందు నీహృదయతాపమ దెట్టిది యౌనో తెల్పవే 82

‡ మ. భవునిన్ భావపదారవిందభవుఁ దెల్వొప్పిళ్ళకంఠార్ణవో! । ద్భవునిన్ శాస్త్రసదంపదాసహాభవున్ భాస్వద్గవున్ సాహితీ। భవునిన్ మేఘగభీర విస్ఫుటరవున్ ధైర్యాపరిభామేరువున్। గవితాసద్గురు వేంకయాభిధుని సత్కాలముల్ నెంతు నెక్కాలమున్ (ఇది తి॥ శా॥ గారి మొదటికవిత్వము, కుమారసంభవములోనిది)

క. గురునకుఁ దండ్రికి భేదం, బరయంగా లేదు; శిష్యుఁడనఁ గొమరుండే
యెఱిఁగినవారికి; వాఁడే, తిరస్కృతిన్ జూప మదికిఁ దగులు గలుగదే.

క. ఇదిగాక నీవు చుట్టము, వదియుఁ విచారింపఁ బుత్త్రికాపాదకమే
గద! * 'బా' బనివ్రాసిన నీ, పదములకును లేఖ కలదు చదువుము దానిన్.

క. నీజనకు నాయనమ్మయుఁ, నాజనకుని తల్లి యొక్క నాయనకును నొం
డే జననికి జన్మించిన, యోజ నెఱుంగుదువొ? మఱచితివొ? గురునిబలెన్

ఉ. ఏ నల చర్ల బ్రహ్మయ మనీషియొడన్ గడుభక్తియున్ గృతం
బూనినవాఁడ నంచెఱుఁగు యోగ్యుఁడ వీ వది నమ్మదేని నా
మానసమందు నున్న యిది మాత్రము నమ్మక పోవు కాన నీ
శానుని సాక్షిగా వినుము సర్వము చెప్పెద నారహస్యమున్.

ఉ. ఏ నల పిఠికాపుర నరేంద్రుని చెంతను జేరి తన్మహా
స్థానమునందు నుండుటకుఁ బద్ధతిఁ గోరినవాఁడ నాదు నీ
పైని నసూయ నొంటి నని పల్కులు దేల్చితి వీవు వ్రాఁతలోఁ;
నీనుడి నిక్కమే యగునె? నీవు నెఱుంగుదు నాదుభావమున్.

---

సీ. తనకు వేంకటశాస్త్రి తగిన సహాధ్యాయిగాఁ బాణినీయాబ్ధి కడచి యెంపు, భాషలలోఁ దర్కృపన్ గవియయ్యు ననేకముల్ శతకాన్యనీకవిత్వ, తంత్రములు పెక్కు గ్రంథమ్ములాతనిసహాయమునఁ గావించి యయ్యనఘుఁ గూడి, శ్రీపీఠపురవరప్రభుభూపాలుఁ డాంగ్లేయ భాషాపరీక్షణంబు బహుకరింధు, తే గీ. రం సఖండతిశాంతుండు సోముఁడునగు, రామచంద్ర వేంకట కృష్ణరాయచంద్రు, డొద్ద బుధుఁడును గీర్తిమాన్యుండునై చె, లంగు తిరుపతి శాస్త్రి తెలుంగు జేసె.

* బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వెంకటశాస్త్రులబాబుగారి సముఖమునకు. ఓలేటి వెంకటరామయ్య నమస్కారములుచేసి వ్రాయు శుభలేఖార్థములు... శుభముహూర్తమునకు సకుటుంబపరివారముగా దయచేయగలందులకు ప్రార్థించుచున్నాఁడను... తమరు రచియించి అచ్చువేయించిన గ్రంథములు ఒక్కొక్కటి చొప్పున పంపించగలందులకు ప్రార్థించుచున్నాను. దయయుంచవలెను.”

పల్లిపాలెం, ఓ. వెంకట్రామయ్య.

ఉ. ఎందఱు రాజు లుండిరి ! యహీనులు నాయెడఁ బేర్మి భక్తియున్
విందుకనంబు గల్గిన వివేకులు; వారలయొద్ద నుంటినే !
గందరగోళ మైన మది గల్గినవాఁడ, స్వతంత్రుఁడన్, జిదా
నందుఁడ నే ‡ నొకానొకని నాయకుఁగా వరియించి యుందునే.

ఉ॥ అన్నములేదొ ! వస్త్రమునకై కొదవుండెనొ! యున్నదానినే
యెన్నఁగ నెవ్వఁడుం దినఁగ నిప్పటికిన్ మఱి గానరాఁడు; నీ
యన్నముకోసమై మనమునందుఁ బ్రియత్న మదేల నాకు ? నీ
చిన్నతనంపుమాటలకుఁ జేతము పొక్కెడి దుఃఖ మెక్కెడిన్.

ఉ. నిక్కముగాఁ బితాపురికి నేఁ జనుదెంచెడివాఁడనేని ని
న్నుక్కడఁగింపఁగా వలయునో ! నరపాలుఁడు నిన్ను నన్ను నొం
డొక్కరుఁగూడ నేలుకొనఁడోటు ! సమగ్రత లేనివాఁడొ ! నా
కక్కఱయున్న నేనికడ కంతకుమున్ జనుదేరకుందునే?

ఉ. ఎందఱొ భార్యలుండియును నింకొకచాన స్వయంవరంబుగా
నందము నొల్చుజాణ తనకబ్బినఁ గైకొనరే నృపాలు? రా
చందమునన్ మదీయకృతిచందనగంధిని గూడ మీనృపుం
డందఱితోటిపాటు తనయా ! కొని యేలఁగవచ్చు నచ్చుగన్.

తే. గీ. ఏకపత్నీవ్రతముగూడ నిట్టిపట్టు
నందు రామాదులకుఁ బోలె నడ్డు పడద;
రాము పేరిట నెందఱు ధీమహీశులు
తమ కృతికుమారికల నిచ్చి తనియరయ్య !

ఉ. జంకితినందువో ! యఘపుసన్నిధికిన్ దగ నందువో ! తదీ
యాంకణమందు నొక్కఁడును నక్కట ! నాసవాఁడు లేఁడె, "ని
శ్శంకగఁ గాకి పంజరపు సత్కృతికిన్ దగ" నందువే ! యెటుల్
బొంకెదు సర్వముం దెలిసి పుత్రిక ! తండ్రికిఁ జేటు గూర్చెదే?

---

‡ మ. నరనాథుల్ పలుమంది మిత్రులయి యున్నంగాని తత్సన్నిధిన్
స్థిరవాస మ్మొనరించునట్టి పని నాచేఁ గాదు; నీవంటి స
త్కరుణాశాలిని పెంపఁగాఁ బెఱిఁగి విద్యాబుద్ధుల న్నేర్చి నేఁ
బఱుల న్నిత్యము గొల్చు టొప్పగునె యంబా! దేవి! కామేశ్వరీ!(కా॥శ॥)

ఉ. కడియములోనఁ గల్గు జనకాండము సర్వము నెన్నిమార్లు నన్
గడెగడె కా నృపాలమణిఁ గాంచఁగ నేగు మటంచుఁ జెప్పె? రా
నుడు లవి నేను నాఁకొనియు నన్ నృపుఁ జూడమి కేమి హేతువో
కొడుక! యెఱుంగవే! యెఱిఁగి కొంకక "కాక" మటంచుగిల్కెడే?

క. కడియమునకు నూనికి నె, ప్పుడు సంబంధంబు గలదు పుత్త్రిక! నీయా
ర్పుడమికి నూనికిఁ గల దె, క్కడిసంబంధంబు? చెప్పఁగలవే నాకున్.

*క. ఎందుకుఁ జన మానితినో, పొందుగ మును వ్రాసినాఁడ; బొంకందువొ? కే
కందుల కొప్పుదువో? నా, కిందులకున్ జింత లేద యించుక యేనిన్.

క. ఎన్నో బూతులు దిట్టితి, వన్నియుఁ గోకిలపుఁగూఁత లనుకొనియెద; నా
కున్న యభీష్టము దీర్చితి, వన్నా! "కాక" మన నేమి, యదియు సుదంబే.

తే, గీ. కడుపు నిండిన జేరమ్మ గాని నాకు
నేనృపాలుని జూడంగ నేమివలయు?
నట్టిచో మానృపాలకుఁ డాతఁ, డతని
నేలదర్శింప రాకుందు నెఱుఁగఁజెపుమ?

‡ తే. గీ. ఎలమిఁ బిలిపించి స్వాయముగ నెంతొ పేర్మి
గారవించుచునుండెనూ! గౌరినాథ
శాస్త్రి; నుక్కులు నను నోగసరణినుంచి
యతని విడి వత్తునెట్టు లేనవుల కవుర!

---

* గీతము 1 వ భాగము ఇతిహాసపర్వము చూడుఁడు.

‡ శ్రీవేదమూర్తులైన శతావధాని చెళ్లపిళ్ల వెంకటశాస్త్రిగారికి. జంధ్యాల గౌరీనాథశాస్త్రి అనేక నమస్కారములు... మీ వుభయులున్నూ ప్రతిసంవత్సరం సంస్థానములలోకి వెళ్ళివస్తూ సంచారాభ్యాసం కలవారుగాన స్థాయిగా యేకత్ర వుండడం దుష్కరంగా తోచునేమో? ఇంతకు వెళ్లదగిన స్థలములు అయినవి వయస్సుకూడా వృద్ధియగుచున్నది. ఇట్టిస్థితిలో స్థాయిగా నిరుపద్రవమైన జీవనోపాధి యేకత్ర దొరికినప్పుడు అక్కడనే వుండి తీరిక కొలది గొప్పగ్రంథములుగాని పాండిత్యముతో చేరిన మరివకటి గాని చేస్తూ కాలయాపనం చేయడమందు మీకు తాత్పర్యం వుండవచ్చునని నేను తలుస్తాను. మీ వుభయులలో నెవరో యొకరు యీ ఉపాధ్యాయస్థానమును అంగీకరించు

## (4) బందరుపర్వము.

క. గౌరీనాథ బుధుండనఁ, గా రాజో? రెడ్డొ? చెప్పు కాకమ! యన్నన్
సూరియుఁ ద్యాగియు భోగియు, గౌరవభాజనుల నెఱుఁగు కష్మరుఁడును తా!

క. న్యాయైకశాస్త్రులు మాకై, చాలన్ యత్నించి సభనుసల్పియు మొనమొ
న్నేలాగు గౌరవించిరొ! బాలక! పొత్తమ్మునందుఁ బఠియింపవొకో?

క. బందరన నిట్టి దక్కడ, "సందేహములేదుబావ శాబ్దికజీవుల్"
చిందులుద్రొక్కఁజనఁగ గో, విందా! యనిపించు కవులు వేవేలు సుమీ!

క. బందరనఁగ నిట్టిదియట, నెందఱోయున్నార యెల్లయెడ విద్వాంసుల్;
తందరపడు నవధానుల, చిందు లచట సాగిరావు శిష్యుఁడ! వింటే?

క. 'బందరనగనెట్టిది' యని, సందేహములేదు బావశాబ్దికజీవా
నందుని బోలెడు శ్రీరా, ముందగ నొకమాఱడిగి సమూల మెఱుఁగువిరా!

క. బందరులోఁ గోకిలకవి, చందిరులకు బిచ్చమైనసాగదు; కాకం
బుం దిలకింతురు, కపటపు బొందలయత్యద్భుతములు పొసఁగవు సుమ్మా!

క. బందరునకె యొకపరి మీ, "సందేహము లేదు బావ శాబ్దికజీవా"
నందునినే రమ్మంటిని, జిందులు సాఁగవని యటనుఁ జేరఁడువినుమీ!

క. అప్పటికిఁ జిలుక కాలే, దెప్పుడు పంజర మనంగ నెట్టిదొ యెఱుఁగం
డిప్పుడొకసారి యడుగుము, చెప్పు నతఁడు ధారణావిశేషము కలిమిన్.

క. ఇప్పటి కేనియు బహుమతు, లిప్పించెద నచ్చునేమొ? కృష్ణకవీంద్రున్
దప్పక ప్రేరేపింపుము, చెప్పుము నరపాలుఁడేల పెల వీఁడు? సుతా!

క. సంగన్నగారు వీణా, శృంగారవతీవినోదచేష్టాహృష్టో
త్సంగులు తత్త్వంగ్యా, లింగితులై మెటకునేని లేదే చనుటల్?

తే. గీ. ఒక్కసంస్థానమందు మీయునికికేమి,
ఏటిపోలిక వారికి నెందు మీకు?

---

వలసినదని నా తాత్పర్యము. మీరు కావలసిన ప్రతిష్ఠను యిదివరకే పొందినారు. వచ్చే ఆదివారం తిరిగి మీటింగుచేసి యెవరినో వకరిని మేము అప్పాయింటు చేయవలసి వున్నది. ...అంతకంటె విళంబనము చేయజాలము. త్వరగా జవాబు పంపించకోరుతాను.

జంధ్యాల గౌరీనాథశాస్త్రి.

అక్కటా! * వీణరూపంబు నడుగఁ బాడు
చేసినది చూచి నేనెంతొ సిగ్గువడితి.

క. ఈసిగ్గున నేమయ్యెడఁ, జేసిన యవధానమందుఁ జెప్పిన కవనం
బేసరసముగాఁ బడినదొ, యా సర్వేశ్వరుని కెఱుక యది యట్లుండెన్.

క. ఆనరపతికిని మన యవ, ధానులు గండ లనఁ గీర్తి దవులు, నదియుఁ గా
కేనాఁడు నాజ్ఞఁ గొని విద్యానిధు లెక్కడికిఁ గాని యరుగుట లేదే!

క. ఇది యిటులుంతేము; బందరు, పదనెట్టిదొ రామశాస్త్రిఁ బరమాద్భుతపుం
బదము గలశతవధానం, గదిసి యడిగి తెలిసికొన సకలమును దెలుపున్.

క. అప్పండితు నవధానము, నప్పుడు 'జడ్జి కలెక్టరు' లాదులు సభలో
నొప్పిరినూ! వార్ 'సీ' యనఁ, జెప్పె పియని యొకనమస్సు పెట్టె నదోగుమీ!

క. ఇది యప్రస్తుత; మతఁడును, సదమత నినుఁ బోలెఁ గాక చక్కఁగఁ గొన్నా
ళ్ళొదిగెం గాకము కడ బ, ల్లిదుఁడగు మాకృష్ణసుకవి లీలన్ హేలన్.

---

(5) సమృద్ధి పర్వము.

క. ఇఁకఁ బత్రికృతము వినుమయ్యా, ఓకరాజమ! వెనుకఁ బోలెఁ బృథివీపతులన్
వకనకలాడెడి పొట్టకుఁ, గకవికఁ గనుఁగొను పరిసక్తి కలుగదు సువర్ణా.

ఉ. పొట్టలు మూఁడు మావి, సరిపోవును బుట్టెలు మూఁడు మాకు; ని
ప్పట్టున నాకు మాన్యముల వచ్చెడి శిస్తది చాలదొ కొక్కా, నీ
కెట్టులు దోఁచె, లోకు లిది యెట్లులు నమ్మెదరంచు వ్రాసి తీ
చెట్టుకలంపుమాట! యిటు చెప్పుట పాపముకాదె పుత్రికా!

చ. నెల కొక నూఱురూపికలు నీదయ కక్కొ 'కనీసపక్ష' మొ
ప్పొ లోలుకు నాదు పుస్తకపుఁ బుత్రిలు దెచ్చి యొసంగువారు; పై
నెలమిని రోజు కొక్కకటి యిత్తురు రూపిక నూర్కులులోన; నెం
దుల కిఁక దేవిరింపవలెనో? నను గోరని యుండ్ల సన్నిధిన్.

---

(వెంకటరామకృష్ణ గ్రంధమాల 74 వ పుటనుండి)

* వీణాస్వరూపము, (సంగమేశ్వరశాస్త్రిగారు కోరినది)

క. వీణాస్వరూపమెన్నఁగ, వీణాగానంబుఁ బొగడ వేడుకతోడన్
వైణికుల నభినుతింపఁగ, వాణియె యసమానురాలు వసుధాధీశా!

ఉ. ఎక్కడి కేగ కూరకయ యింటనె యుండ మటన్నఁ గాని నా
కెక్కడినుండియో సభల కెన్నియొ ♦ జాబులు వచ్చుచుండు; సం
దొక్కసభకు బోవర్చినను నొక్కశతావధానకుఁ జావు లేదు! నీ
కెక్కడి యూహపుట్టె? నిది యెవ్వరి కిత్తునో తెల్పు పుత్రికా!

---

(1)♦ విధేయుడు బంగా శ్రీశయిలం కృతానేకశిరసాష్టాంగనమస్కృతులు. ...తమవలన జరుపబడు అష్టావధాన శతావధానములయొక్క కష్టము తెలిసి తమకు సరియయిన మన్నన రాజలోకమువల్ల జరుగవలయునే గాని మాబోట్లు యేమిచేయగలమా అనే భయము ముందుగా కలుగుచున్నది 'అయితే చంద్రునకు నూలుపోగను సామెత ప్రకారం మాయొక్క శక్తిని గనిపెట్టి తమవంటి మహనీయులు యట్లయినను మా కోరిక తీర్పడమె ముఖ్యముగా ఆలోచింపవలసినదయి వున్నది. ...గనుక నా మనవి సంపూర్ణదయతో అంగీకరించి యెప్పుడయినను దర్శనమిచ్చి నాగృహపావనమయ్యేలాగు యీ పేదవాని గు...కు విజయం చేసి కోర్కెను తీర్చగలందులకు ప్రార్థించుచున్నాఁడను. ......

ఆటపాక, 30-1-10 శేక్డు, బంగా శ్రీశయిలం.

2 నే చంద్రంగి రామారావు అనేక నమస్కారములు చేసి చేయుంగల విన్నపములు... వెనుక నేను మనవిచేసుకున్నప్పుడు తమరు శతావధానం చేసెదమని సెలవుయిచ్చినారు గాని అప్పుడు మాయుద్దేశము నెరవేరలేదు. ఇప్పుడు తిరిగి యిక్కడ కాలేజీ విద్యార్థులు అతి కుతూహలముగా నున్నారు. ఈవిషయమై యిప్పుడు తిరుపతిశాస్త్రులవారి దగ్గరకు వెళ్లి వారి అనుమతిని పొందినాము. కాబట్టి మాయందు దయయుంచి మాప్రార్థన కనుకూలమగు జవాబు తిరుగు టపాలో వ్రాయగలందులకు కోరుచున్నాము చిత్తగించవలెను.

పిఠాపురం రాజావారి కాలేజి
హాస్టలు, కాకినాడ, 27-11-11 పంపోంగి రామారావు.

3 ఇక్కడ కాకినాడలో స్టూడెంట్సు అవధానము చేయించెదమని అడుగుచున్నారు. వీరికిను వ్రాయుదురు మీ అభిప్రాయము చెప్పుడు... ది॥ తి॥

---

(4)...కర్ణాకర్ణి వినియుండి మిమ్ముఁ బ్రార్థించినచో బ్రహ్మశ్రీ తిరుపతిశాస్త్రిలగారి సహా మీరు వస్తారను నమ్మకముతో నిచ్చట నీకెల 19, 20

ఉ. ఇంతటిదవ్వు వ్రాసికొనుటే విషయమ్ము స్వకీయ మాటచేఁ
గొంతవొసంగు, 'దాత' నని కూడ లిఖించుట యెట్టు లొప్పుఁ? గా
నంత యుదారతాగరిమ యంటనిశిష్యులు బ్రహ్మశాస్త్రి స
త్ప్రాంతరభోక్తలందుఁ గల రంచనుకోకు కుమార! చెప్పితిన్.

---

తేదీలను తమ యుభయులును శతావధానము సల్పుటకు నేర్పాటు చేసినారము గాన మీరు తప్పక 18 వ తేదికే దయచేసి మమ్ము నానందింపజేయ మిక్కిలిగా బ్రార్థించుచున్నాము. తిరుపతిశాస్త్రిగారిని తీసుకొని మీరు తప్పకవత్తురని నమ్మకముతో కొన్ని ప్రయత్నములును జేసియున్నారము. కావున తమరు తప్పక రావలయును. చిత్తగించవలయును.

ఇట్లు విధేయులు

గుంటూరు 12-8-11 } రంగావఝ్ఝల హనుమయ్య. (జిల్లాకోర్టు ప్లీడరు)
వేమూరి వెంకటసుబ్బారావు, (జిల్లాకోర్టు శిరస్తాదారు)

(5)...రైలుదగ్గరనుండి గ్రామములోనికి సకలసంభ్రమములఁ దీసికొనిపోవలయునని కుతూహలపడుచున్నారు. గనుక తాముభయులు సమకాలమునకే వత్తురని యెంతును శిష్టా హనుమచ్ఛాస్త్రి.

(6)...తమకు లోగడ యుత్తరము వ్రాసియుంటిని ...తమరు శ్రీతిరుపతిశాస్త్రిగారు ఒకసారిగా గుంటూరుకు దయచేసినయెడల పుత్సవరూపకముగా గ్రామములోనికి తమరిని తీసుకరావలయునని నాకోరిక. ...గుంటూరు స్టేషను వద్ద స్నేహితులందరు తమరాకకు యెదురుచూచుచుందురు గనుక యీప్రకారము చేయుదురని నాకోరిక.

గుంటూరు, 15-8-11. మజుందారు వెంకటహనుమంతరావు.

(7)...తామున్ను ఆరోజుకు యిచ్చటికి దయచేసి సభ జరుపగలందులకు మిక్కిలి వేడుకగలవారమై యున్నారము. ఇట్లు విధేయుడు

పినపాడు, 15-9-1911. తూములూరి కోటయ్య.

---

(8)...12-12-11 అద్దంకిలో అవధానమట వత్తురా? సత్తెనపల్లికి వచ్చే ఆదివారం రాగలరా?...

గుంటూరు, 4-11-11. రంగావఝ్ఝల హనుమయ్య.

## (6) బ్రహ్మగురుపర్వము

ఉ. అమ్మహనీయు పేరహరహమ్మును నీవును బావయుం జప
మ్మిమ్ముగఁ జేయఁ బోఁ గృతము నీగతిఁ జేసినపాపమెల్లనుం
వమ్మయి పోవు; నట్లొనరుపం బ్రియతింపుము; రామదేవుపా
దమ్ములు వొల్చు క్షేత్రమునఁ దానమొనర్చి పొనర్చు మీక్రియన్.

చ. ధవళగిరిన్ మహామహుఁడతం డొకసత్రము వెట్టి, శిష్యులం
గవులను జేయుచున్ సుఖముగా మఱి వారికి నర్థికోటికిం
బ్రవిమల మన్నదానము నపారముగా నొనరించెఁ దద్గురుం
దవిలిన శిష్యుఁ డించుక యుదారత నేర్చుటదేమి లెక్కయా!

ఉ. అమ్మహనీయునింట నెల యయ్యెడు సంతకు నొక్క ప్రొద్దెటి
య్యమ్ము సుమారు వారఁ దమదైన కుటుంబముగాక శిష్యసం
ఘ; మ్మతిథివ్రజమ్మును సుఖమ్ముగ భోజనమాచరింపఁ; బు
ణ్యమ్మన బ్రహ్మపండితునికన్న మఱొక్కని కెన్న నున్నదే!

ఉ. ఉన్నది రెడ్డిసీమ, తమ కుండెడి దించుక వృత్తి, దాని కె
న్నెన్నియొ యోగముల్ కుదిరెనేని ఫలించు, ఫలించు దానిలోఁ
దిన్నదిగాక తా నయితు దెచ్చి యొసంగుఫలమ్మదెంత హా
చ్చెన్నను వీరి కొక్క నెలయొప్పునొ, యొపదొ! సందియమ్మగున్.

క. ఆయనఘాత్ముని భార్య గ, దా యిల్లాలనఁగ! నాఖ్యయననేల? నిజం
బే యన్నపూర్ణ యాపె, వృథాయంతురె యట్టివేరు తజ్ఞులు పెద్దల్!

ఉ. చిన్నఁటిమోముచూచి యొకశిష్యుని నేనియు 'నేమిరా' యటం
చు న్నిరసించి పల్క దిది చోద్యము; దేశికభార్య లెట్టివా
రున్నది యింటిమే? మఱియు నొక్కటి, లోకులు తిన్నఁ బెట్టినన్
సన్నుతిఁ జేసినన్ సమము; సాటిమ రెవ్వరు? బ్రహ్మరాణికిన్.

ఉ. "జాతకచర్య"యందు గురుసంతతిఁ దెల్పెడుపట్ల వీరివి
ఖ్యాతిని విస్తరించితిని నక్కడఁ జూడఁగలాడఁ, వందులోఁ
జాతకహారి తచ్చరిత పాఠము నీకును, నాకు, బావకుం
జాతకదోషసంఘులన్ దొలిచి భద్రములన్ గలిగించు నత్తితిన్.

శా. ఏనేకాదు మఱొక్క శిష్యుఁడును మాయీసద్గురుబ్రహ్మవి
ద్యానాథుల్ సురభాషలోఁ దెలిపి కార్తఘ్న్యఘభారాపహా
ధీనానూనవచస్కృతుల్ బరఁగెఁ దద్దివ్యద్వచోధార, ని
త్యానందాత్ముఁడు, మద్గురూత్తముఁడు నిన్నత్యంతముల్ బ్రోచుతన్.

ఉ. ఎంతటి పాపమేని రచియించునుగాక, కృతఘ్నుఁడై ఋజు
స్వాంతు గురూత్తముల్ దెగడి వర్తిలుఁగా, కలచర్ల బ్రహ్మవా
క్కాంతుచరిత్రముల్ జదివి కాఁగలఁ డుత్తముఁ డంచు నెంచు మ
త్స్వాంతము; తచ్చరిత్రము కృతఘ్నుఁ గృతజ్ఞు నొనర్పఁజాలదో!

క. ఆచరిత వ్రాసి నతఁడును నా చినతండ్రికొమరుఁడును నాకడఁ,దిర్వ
త్త్యాచార్యు నొద్ద శిష్యత, నోఁచి పిదప బ్రహ్మసేవనోఁచి రెఱుఁగుమీ!

క. కావనతండు సతీర్థ్యుఁడు, మా నిజశిష్యుండు వగుట మాకడ కల * బ్ర
హ్మానూన చరిత నంపెను, దీనిని ముద్రింపుఁడని విధేయత కలిమిన్.

చ. అలచరితంబు నీకు శుభమాపని కెంతయుఁ జాలునంచు ని
మ్ములఁ గొని కొంత యియ్యెడల ముద్రితముం బొనరించువాఁడ; యో
గ్యులు గురుపట్ల నిల్లనుమి కొందఱు శిష్యులు వ్రాయువ్రాఁత; లే
ఖులుఁడును పాడువ్రాఁతలకు గా దిగఁ జంచిది చెప్పు నొప్పగన్. 130

---

* శ్రీచర్ల బ్రహ్మగురువరచరిత్ర సంగ్రహము.

...శ్లో॥ విద్యావాసగృహం పరోపకరణోత్పత్తిస్థలం సత్కృపో। పఘ్నం పుంజిత సత్త్వ మున్నతయశఃకాయం ప్రతిష్ఠాలయం। రాజత్సద్గుణరత్నరోహణ గిరిం ధర్మస్వరూప మ్ముదా। విద్వద్బృన్దవతంస మాత్మనిధికే బ్రహ్మాఖ్యవిద్యాగురుం॥ ...శ్లో॥ గోదావరీమండలరాజమానో నీలర్షభగ్రామవర (కటెయెద్దు) శ్చకాస్తి। ఆరాచ్చ విద్యాధరతీర్థవర్యా, ద్యత్రాస్తి విరాసీ ద్భగవాన్ కుమారః॥ శ్లో॥ ద్విజస్తస్మి న్నేకో ఽవస దుపవదాన్యవిడవరః। ప్రసిద్ధో వీరాఖ్యో జనిము పగతో లోహితకులే। లసచ్ఛ్లోపాఖ్యో నియమితమనా స్సం చ్చుచిరపి। ప్రా దాలో కేకుర్వ న్నివకరనతీ ర్భక్తికలితః॥ శ్లో॥ ప్రాణాంభోనిధిరంధ్రవారిధిమితే ష్వబ్దే ష్వతీతేషు స। త్స్వకల్యాదిచ శాలివాహనశతే షట్చత్రమానీందుషు శ్రోధ్యబ్దేచసహాస్యమాస్యధవళే పక్షే తృతీయే తిథా। జజ్ఞే తస్య చతుర్థసూను రిహచాఽ ముత్రాఽర్థసంపాధకః॥ శ్లో॥ ధాత్రా నా ముచబృంహాణా మతలస

ద్ధర్మస్యపుణ్యస్యవా। విద్యాయా అథవా నచే దధిగతబ్రహ్మైకభావస్థితేః।
యద్వాఽశేషజనోపకారక కలాశాలాది నిర్మాణతో। బ్రహ్మేత్యుత్తమనామ
సార్థకతయా పిత్రాఽస్య నిర్ధారితం॥ ...శ్లో॥ వారాణసీం। జగమిషుః పరిశిష్ట
శాస్త్రం। పాఠాయ భూసురవరస్స గురోరనుజ్ఞాం। లబ్ధ్వాతికౌతుకయుత స్తదను
ప్రతస్థే। పౌరైస్సతీర్థ్యనివహైరపిభువ్యయూణః॥ .....శ్లో॥ కాశీనాధబుధో
హి యద్గురువరః కాశ్యాంపశిష్టాయితో। యచ్ఛిష్య స్సకలార్థవిద్గురుయశాః శ్రీ
బాలశాస్త్రీ మహాన్। ఏవం శ్రీహరిశాస్త్ర్య నుత్తమగుణో వాక్యార్థచాన్ద్రీకరః।
కాశ్యాంభూపనిషేవితో వ్యజయత శ్రీరాజరామో బుధః॥ ...శ్లో॥ ఇతి షోడశ
వాసరా నుషిత్వా। నిజగేహే స్వవివాహసంభ్రమేణ। నిజ
సోదర దుర్గపండితేన ప్రతిగన్తుం ఖలు నిశ్చికాయకాశీం॥
...శ్లో॥ షట్శాస్త్రేషు షడంగేషు షడ్భాషా షణ్మతేషుచ। ప్రజ్ఞా యస్యస్థితా
తస్మై బ్రహ్మాంతర్వాణయే నమః॥ ... శ్లో॥ ఇత్థ మేవన్నృపసన్నిధౌ బుధైః।
శ్శాస్త్రిషడ్గపరీక్షితో భవన్। శ్లాఘితో బహుమతస్సభాస్థలే। నిర్జగామ బుధ
నిర్జయాయ సః॥ ... శ్లో॥ దూరేణ కాలనియమేన బహుద్విజానాం। క్రోలా
హలేన నియతాశనభోజనేన సత్రేషు భుక్తి రధికశ్రమకారిణీతి। జ్ఞాత్వైష
శిష్యనివహాయ దదాతిచాన్నమ్॥ శ్లో॥ ఇతి జగదుపకారస్య। ప్రతిపద మఖిలైస్తు
నుత్యమానస్య। పరిణామశూల బాధాఽపరిణతవయసోఽపి దేశసంచారాత్॥
...శ్లో॥ శనకైరగమద్విద్వాంత్స్వగ్రామం "నుకడియద్ద" నామానం। శ్రీరామో
వనవాసా। దివ సాకేతంన్నృణాం ప్రమోదేన॥ ... శ్లో॥ స్వస్యాలకః పఠితు
మారభతాఽగమం య। శ్శాస్త్రాణి పాఠయతి శిష్యగణం స్వపశ్చాత్। విద్యార్థి
తాం తిరుపతిః కవివేంకటేశో। యాతౌచ యౌ కవితయా గురుకీర్తిసాన్ద్రౌ॥
...శ్లో॥ న కేవలం ఛాత్రగణాయ భోజనం। దదాతి పాంథావళయేచ సన్తతం।
తత స్తదీయం సదనం సమీర్యతే। న పాఠశాలేతిన సత్ర మిత్యపి॥ శ్లో॥ రాత్రౌ
త్రిహోరాసమయే ప్రబుద్ధః। క్రమేణశిష్యానఖిలా న్ప్రబోధ్య। శాస్త్రాణి
సంపాఠయితుం ప్రవృత్తః। స్నమాపయేద్ద్వాదశ ఘంటికాస్తే॥ శ్లో॥ చిత్రంకేచన
కావ్యనాటక మహాలంకారచమ్పూముఖ। గ్రన్థా న్వ్యాపకశిష్యవర్గ సవిధేసమ్యా
క్ప్రతన్తేఽనిశం। సాహిత్యప్రచు రాస్తత స్సవిషయం బ్రహ్మాఖ్య సూర్యన్తికే
శ్రీమద్వ్యాకృతి మధ్యగీషత కిమస్త్యస్మాత్కలాకాంక్షిణాం॥ శ్లో॥ యాదృక్షే
మగురో స్స్వశిష్యనివహే గుర్వ్యా స్తతోప్యున్నతం, ఖ్యాతైః కిం నుతనిర్వి
శేషమపితా సంపత్యతో జంత్యతీ, దూరే బంధుజనా న్వివాహాయ పితరా దేశంద.

విద్యార్థినాం, బాలానాం కిము సౌఖ్య మస్తి గురుసత్కారుణ్యతోఽన్యద్భువి॥ శ్లో॥ దానం కలావమృతసాధన మిత్యవోచన్, దానే ష్వసుత్తమమితిస్మృత మన్నదానం, ప్రత్యక్షభూతపరితృప్తి నిదానభూత, మిత్యన్వహంచరితనోత్యమి తాన్నదానమ్॥ శ్లో॥ నిస్స్వాననన్యగతికా నితరా న్ద్విజాతీ, న్విద్యార్థినశ్చ కృతదారపరిగ్రహాంశ్చ। కాశ్యామివ ద్విజనమస్కరితా ప్రదాన, లబ్ధాతిదోష హరణాయ కరోతి విద్వాన్॥ ... శ్లో॥ మధ్యే మధ్యే కేనచి ద్ధేతునాఽయం। భక్ష్యైర్భోజ్యై ర్లడ్డుకై రన్నదానం। భూదేవానాం సంభ్రమా త్సంతనోతి। ప్రాజ్ఞస్యాఽస్తే భూతతృప్తేః పరంకిమ్॥ శ్లో॥ చిత్రం ద్వాదశవాసరేషుమిళితాన్ గోదావరీ పుష్కర, స్నానార్థం ప్రతిపత్తి చోపదిశతో విప్రాం త్సహస్రాధికాన్, నాఽలోచ్య శ్రమమున్నతం ధన మయం సంపాద్య భక్ష్యాదిభి, స్సంతర్ప్యైక గకపుణ్య మాప భువి కింస్రష్టుః క్వచిత్తత్సమః॥ ...శ్లో॥వికారినామాఽ సువికాసకారీ, సమాగతష్షడ్గ్రహకూటతోఽబ్దః, పుణ్యోచ్చయం బ్రహ్మగురో రతీవాన్, సహిష్ణునాజ్ఞప్త ఇవాబ్జజే॥ శ్లో॥ భూదేవాయుతతర్పణం దశదినై ర్గోపాదతీర్థోజ్జ్వల, త్కోప్పూర్వరాఖ్యపురేఽస్తిక ప్రవిలసచ్ఛ్రీ కోటిలింగస్థలే, క్షేత్రే పాదగయాహ్వయేఽపిచ నిజశ్వే తాద్రిపుర్యాం తథా, కర్తుం బ్రహ్మసుధీ రియేష జగతః క్షేమాయ కామాయచ॥ శ్లో॥ దశమ్యాం కృతార్థస్థితిః బ్రహ్మవిద్వా। నుపక్రాన్తమన్త్రాదికాన్తింసమాప్య, సుభుక్తేషు విప్రేషు పశ్యంత్సు తుష్యన్। పరిత్యజ్య దేహంగతో బ్రహ్మణైక్యం॥ శ్లో॥ దివంగతే బ్రహ్మబుధే గరాఽసీ త్సుస్వబద్ధహీనా బతధర్మశూన్యా, కలార్థివర్గో విఫలో బభూవ। క్షుంధాతురః పాన్థగణ స్తదాఽసీత్॥ ... శ్లో॥ తతస్స్వలః పతితాగను స్సగుణభి, శ్రీవిశ్వనాథో బుధ। స్థిత్వా తత్రతదార్జితావనిఫలై ర్వ్యర్థాంసై స్సతర్పైః। విద్యార్థిప్రికరం యథాకథ మథో తత్పూర్వకాలాగతం విద్యాబుద్ధియుతం కరోతిహి గురో ర్ధన్యత్వమాపాదయన్॥ శ్లో॥ వేమూర్యపాఖ్యనరసింహకృతం సభక్తి శ్రీబ్రహ్మపండితచరిత్రమిదం పవిత్రం, యావద్దివాకరనిశాకరతారకాశ్రీ। స్తావజ్జమే త్సుఖయుతా మనుజా భవేయుః॥ శ్రీ

మ॥ కలిమానం బొకరైదువే లరుగ నేకత్రిస్థపత్తగ్రహ, మ్మాలకున్
కాంతి దొసర్చుచున్ శ్రమ లవమ్మున్ లేకయే బ్రహ్మమున్, గలిసెన్ బ్రహ్మ
ముహూర్తముందు దశమిన్ గంజాప్తవారంబునన్, ఖలసంచారి వికారి కార్తిక
పరీక్షు శ్రీకపక్షమ్మునన్. తి॥ వెం॥

మ. గురుభక్తిన్ బరశుప్రచారనిరతక్రూరావనీపాలసం
హరణప్రాప్తయశోభిశోభి జమదగ్న్యాత్మోద్భవున్ దెల్పు నా
కరరే! యిట్టిఁడ వెట్లు శిష్యుఁ డయితో? యంతేవసద్ధర్మదు
ర్మరణోపజ్ఞదురుద్యమక్వథితధీరవ్రాతచేతోంబుజా!

మ. గురుభక్తిప్రథితుల్ మహామహు లనేకుల్ సర్వలోకైకదు
స్తరవిస్తారిత నిస్తులైనసనితాంతధ్వాంతనిర్మూలనా
చరభాస్వత్తమభాస్కరుల్ వోలుచు నిక్కాలంబునన్ నాకు నీ
వరరే! శిష్యుఁడ వెట్టులైతివో కదా, యాచార్యనిందావహా!

మ. ఒకఁడున్ గన్పడఁడిట్టి యీకలిని నీకో శిష్య! తుల్యుండు, పా
య కుపాధ్యాయునిఁ గొల్వకున్న నతఁ డత్యంతమ్ము పాపాత్ముఁ డం
చకటా, వ్రాసెడియంత సాహసి; మదీయాఘపరిభావంబె నిన్
వికలాత్ముం బొనరింపఁబోలును జుమీ, వేత్తృత్వసత్త్వాఖనీ!

శా. నీకున్ జిక్కిన యీకృతఘ్నతను నేనే నేర్పినట్లే తుదిన్
లోకుల్ వాకొనువార లేమొ? యని లోలోఁ జింత నేఁ గాంతు; వి
ద్యాకల్పద్రుము లస్మదీయగురు లేతన్నింద రాకుండ నా
పాకం బేర్పడఁగా వచించి నను గాపాడన్ బ్రియత్నించుతన్.

ఉ. ఏకుటిలంపుఁ బాపములు నీయఘతుల్యము కావు; భారత
శ్లోకము లిట్లు చెప్పు, నవి సూరివరుల్ శిరసావహింత్రు; నా
లీకచరిత్రలోఁ గను, మలీకము గాఁ దలపోయఁబోకు; మా
రా! కలికాలమేని యఘ మంత సహింతురె ధర్మచింతనుల్?

చ. గురుఁ డొకచో సహేతుకము గొండొక వేఁడిమి నూనఁగాక కో
ప రసము తగ్గఁ జేయుట కుపాయము లుండవె? వానిమీసముల్
బెఱుకుట, వానిగ్రంథములు వెక్కిరిపించుట, 'వేరు' లౌటయున్
జరిగెనె యెన్నఁడేని? యొకధాత్రి నుదాహరణంబు చూపెదే?

ఉ. ఊరక యుండు నేని యఘ మూరక యుండదు నీకు బాధకం
బై గ్రహిఁ బీడ వెట్టు, నది యస్మదభీష్టము గాద; యిప్పుడో
కారణ ముండి కాళ్లఁ బడఁగాఁ జనుదేరక యుందుగాక నీ
దూరచనన్ గుఱించి మది దుఃఖము చెంది సుఖింతు వాపయిన్.

చ. ఎఱిఁగి యెఱుంగ కేయఘము నేని పొనర్చియుఁ బిమ్మటన్ జనుం
"డరరె! యఘంబు చేసితి" నటం జొకకొంత మదిన్ దపించి దు
స్తరమగు పాపమేనియును దాఁటఁగఁ జాలెడిఁ, బైకిఁ బాపమున్
బొరయుట తెల్పనేని సరిపోయె నిరాగసుఁ డాతఁ డంతలో.

ఉ. ఎన్నఁటికేని గాళ్లఁ బడుటే సదుపాయ, మఘంబు నాఁడె పో
సన్నగిలున్; గురున్ దెగడుసాహస మూని యెదో శిక్షించి సం
పన్నగృహస్థులా జనులమన్నఁ గైకొన, నెవ్వరో నినుం
"బన్నము బాగు బా" గనినఁ బాడకు నోరికి వచ్చినట్లుగన్.

ఉ. చెప్పెడివారు నీ కకట! శ్రేయము గూర్చెడివారు గారు; నా
చప్పనికూఁతలే తుదకు సద్గతిఁ జూపును నీకు; నూర్యరా
విప్పుడు నిన్నుఁ గైకొనుట కేనియు నే నిడు చప్పకూఁతలే
తప్పక కారణంబునుమి! తప్పదుతోఁ విఁక నేని వీడుమి!



## (7) ఆత్మ వైభవ పర్వము

ఉ. నన్నను గారవించు నరనాథులు లే కొకసాకు పన్ని నీ
యున్నపదంబునం దెటులనో పడ నెంచితి నంచు నెంచ; కెం
దు న్నను గారవించు నృపతుల్ శత మన్నను లోక మొప్పు; నీ
వన్నను విశ్వసింపవలదా? యిలఁ దా సకలం బెఱుంగదా!

ఉ. అప్పనృపాలుఁ డింక నొకయబ్దములోఁ దన పోకెఱింగి మేల్
చిప్పిల "శాస్త్రిగారి కిటు చేసితి వార్షిక మెల్లకాలముం
దప్పక యట్టులే యిడుఁడు నాకు ముదం బగు దానఁ జేసి" యం
చొప్పఁగఁ జెప్పె, నీ వెఱుఁగవో సుత! కోకిల వైతి వంతకే!

చ. ఎఱుఁగుదె యప్పరాయనృపుఁ డించుక యాతనిసొమ్ము కాకితోఁ
దిరిగెడునప్డు తింటి, వది తేనుపు వచ్చినయప్పుడైన న
న్నరపతి నన్నుఁ జూచెడు ఘనంబగు చూపు స్మరింపుమయ్యా! త
త్పగులు కుమారు లానృపువిధమ్మునఁ జూతురు నన్ను నేఁటికిన్.

తే. గీ. * ఆత్మకూరును గద్వాల యరయుచుండు
నాము రాకకు నేఁటేట; నీమురూహ

* "మీరు ఈడిసెంబరులో సెంతత్వరగా రాగలిగిన అంతత్వరగావచ్చిన మా అందఱికి చాలా సంతోషము గలుగును......"

నూజివీడు, 16-4-11. నారయ్యప్పారావు

నీకు నుదయింపనేటికి నిన్నుఁ జెప్పి
బాగు పడనేల యిందఱు ప్రభువులుండి?

మ. ధనిగాఁ దా బెజవాడలో డిగ్గుమా ప్రార్థించె 'మున్నిచ్చు భూ
మిని చేర్మింగొని తండ్రిగారి యశముం మెప్పెక్కఁగాఁ జేయుఁ' డం
చును శ్రీయాత్మకురుప్రజాధిపు తనూజుం; డాతనిం బోలు వా
నిని జూపింపుము నేఁటిరాజులను నెందే శిష్యచూడామణీ!

తే. ఇచ్చినభూమి పుచ్చుకొనవేగని మాపయి నల్కఁ బూనకే
వచ్చి గ్రహింపుఁ డంచను నృపాలురు గూడను నేఁటి యూకలి

# * TELEGRAMS.

"Starting Bezwada to-morrow morning 8-15 train come Bezwada"

Madras, 29th July 1911. Raja of Amarchinta.

"Atmakur Raja coming Bezvada to-morrow evening meet Positively." Cocanada, 19—7—11.

శ్రీరాజా సూరానేని వెంకట నారాయణరావు బహద్దరు జమీందారు వరగణే మయిలవరం వగయిరా దొరవారు దండం.

ఈనెల తా॥19 తేదీని మయిలవరం గ్రామములో మీచే శతావధానము చేయించ దలచినాము. గనుక మీరున్ను బ్ర॥ శ్రీ॥ తిర్పతిశాస్త్రిగారున్ను మయిలవరం మకాముకు 18-4-11 తేదీకే రాకోరుతాను.

మైలవరం 7-4-11, R. S. V. Narayana Rao, Bahaddar.

———

శ్రీరాజా వెల్లంకి చినవెంకటరామారావు బహద్దరు జమీందారు ఆఫ్ వడిమితిరువూరు అండ్ వినగడప వగైరా యస్టేట్సు దొరవారు దండము.

......అప్పుడు శతావధానము కూడా మీవలన చేయించవలెననివున్నది. మేము 1 డిశంబరుకు బందరు చేరుచున్నాము......వెంటనే జవాబు వ్రాయింపవలెను.

31-11-1912 మదరాసు Raja Vellanky China Venkata Rama Rao Bahaddar

గ్రిచ్చుట నుండిరే ? యశముగాక మఱొక్కటి నిల్వఁ బోదు; త
త్సచ్చరితంబు శాశ్వతము దానము మే మని పట్టుకుండినన్.

ఉ. గుంటురి పోరు హేతువునఁ గోరిన యానరపాలుఁ జూడఁ బో
కుంటిమి; యానృపాలమణి యొండొక సైఁచునుగాక మమ్ము; "హు"
ష్షంట మ ఱెవ్వరో నడుపుమయ్య ? భవన్నరపాలుఁ డొక్కఁ ? యా
దంటయు నొప్పఁ డీనుడికిఁ దజ్ఞుఁడు యోగ్యుఁడు నే నెఱుఁగుదున్.

ఉ. ఆయనయొద్ద సెక్రటెరి యత్యమలుం డతఁడేని యిట్లుగాఁ
గాయమునెడన్ సహింపఁ, డలకోపిదుదర్శన మాయె నాకు, బల్
ధీయుతుఁ డం చెఱింగితి; విధేయుఁ డతండును 'హుష్షు' పల్కఁడో
హో ! యెవ రాడకుండినను 'హుష్షు' జనించె భవన్ముఖంబునన్.

క. గుంటురి గుంటల ప్రాంతలు, గంటిని బల్కితి నటంచుఁ గ్రమ్మికొనెదొ? య
ప్పంటికి గుంటురి గొంటరి, జంటలు జనియింపమిన్ బొసంగ దది సుతా !

తే. గీ. ఇంకెవరు 'హు' ష్షనిరొ పేరిసెత్తితెల్పు
మల్లవారిని మెప్పించి యడఁతు నీదు
తప్పుడుప్రసంగమును; వృథా మొప్పెపగుచుఁ
బాడువార్తలు గిల్కెదే భయము విడిచి.

శా. * సన్యాసుల్ మొద లెల్లరాజులు ననున్ సారజ్ఞుఁగా నెంచి పే
ర్మి న్నామాటలయందు నించి యనువర్తింతు ర్గురున్ బోలె 'హు'

Madras, 24-10-12

(శ్రీరాజా నడిమిలిరువూరు అండ్ వివగడపవర్గె రాయ్యెట్ట్సు దొరగారి వద్దనుండి)
......శతావధానముకూడా చేయించుచున్నాము ...... 6, 7 తేదీలకు తమరు బందరు మకాములో వుండుటకు ప్రార్థించుచున్నాము ...... మీ జాబుకు యెదురుచూచుచున్నాము. చిత్తగించవలయును.

———

శ్రీమత్పర దేవతా ప్రసాదోస్తు.

క. *దేవీ భాగవతాంబుధి, భావామృతము స్మరించి భక్తపరుల సం
భావించు మీదుచరితము, పావనమై దచ్చికడలఁ బ్రఖ్యాతి గనున్.

గీ. చక్కెర మెక్కెడి చలిచీమ వడువునఁ, దీపిసీటి కెక్కు చేఁపపగిది
భాగవతామృత పానసంసక్తిమైఁ, దనివి చనదదేమి దాహమహిమొ.

(పరమ శివేంద్రసరస్వతి) జ్ఞానానందుఁడు

ష్షన్నా! యెవ్వరినోట వచ్చినదో నా కామాట వ్రాకుచ్చు, వా
రి న్నేనే చని యడ్గెదన్ ఘనుఁడో? సూరిశ్రేష్ఠుఁడో? భ్రష్టుఁడో?

ఉ. భ్రష్టుఁడు వల్కెనేని యలవానికి వందనముల్ ఘటింతు; న
త్కృష్టుఁ డెవండుగాని చని కే ల్మొగిపింతు; వృథాగ నెందు కీ
ముష్టిప్రసంగ? మూరవుర, మూర్ఖత యింతకు వచ్చెఁ! దిర్పతి
స్రష్ట నెదుర్పలేక పెలుచన్ గుఱుచల్ లిఖియింతువే, సుతా!

మ. ఘనతేజుండు దివాకరుం డనఁ * గృతఘ్నఘ్నుండు తద్దేవుపే
రున నెవ్వానికులం బిలన్ వెలసె సారూప్యస్థితిన్ వానితోఁ
బెనఁగన్ జాలుకృతఘ్ను లుండు నెడ రేపే వచ్చి సాక్షాద్విరో
చను నోడించుఁ దమస్సమూహ జలదస్వర్భానుకేతుప్రభల్.

మ. ఎవరీ 'హు' ష్షనువారు? నీ వెఱుఁగుచో నేర్పాటుగాఁ జెప్పు, వా
రవనీపాలురో? మంత్రిసత్తములో? లోకాలోకపర్యంతభూ
భువనవ్యావృతదివ్యకీర్తికలనాస్ఫూర్తిన్ విడంబించువా
రెవరేనిన్ జని వారిమెచ్చు గొని నీ యీవాక్కు బంధించెదన్.

మ. ఎవ రా '' వాసియు వన్నెయున్ గలుగువా, రెందుండువా, రెట్టివై
భవ మొప్పారెడువార, లేమతమునన్ బద్ధాదరుల్? సెప్పు నీ
కవనమ్మున్ గురుభక్తియున్ మిగుల శ్లాఘాపాత్రమం చెంచి న
న్నవమానింపఁగ "హుష్షు హు" ష్ష నిరో కో? యంతేపసద్ధూర్త్వమా.

ఉ. భావత్కప్రతిభం గసుంగొని భవద్వాణిన్ విలోకించి నీ
భావంబున్ సరిగా గ్రహించినయెడన్ బల్కం డొరుయన్ "హుష్షు"; నీ
చేవల్ సూచిన వాని కింకొకనిపైఁ చీకాకునుం బుట్టునే?
దేవానాంప్రియతాఖనీ? గురుని నిందింతే యసత్యోక్తులన్.

మ. ఒకసందర్భముఁ జూచినన్ సకలమున్ యోజింపఁగా వచ్చు నీ
యకలంకత్వము వేఱె చెప్పవలెనే! యీయీ దురుద్యోగమే
ప్రకటించున్, బునరుక్తి కాస్పదుఁడనై వర్ణించుచోఁ, 'జై ప్యాకం,
డొకఁడో? సిద్ధి' యటన్న సామెతసుమీ యూహించుకొ' మ్మాత్మలో.

---

* (శ్రీమద్రామాయణములోని ఆదిత్య హృదయమునుండి.)

శ్లో॥ కృతఘ్నఘ్నాయ దేవాయ జ్యోతిషాంపతయే నమః

మ. 'గురుఁ డెటువంటివాఁడు? గుణకోటియెడన్, జరితంబుపట్ల, శాం
కరి! నను నెట్టివానిగను గన్గొన నేర్చితి? తచ్చరిత్రమున్
బరిపరి నాచరిత్రమును బట్టి వచింపు' మటన్న స్వప్నమం
దరయఁగఁ జేయుసంశిక యథార్థ మటుల్ భజియింపు మీశ్వరిన్.

ఉ. ఆపె వచించు సర్వమును, నాయమ కెందును లేదు గోప్య, మే
పాపము నెట్టి పుణ్యమును బాలన చేసెడి తల్లి "హుష్షు" దా
నీవయి నుంచునో? నిను గణింపక నావయి నుంచునో? వృథా
లాపము లూడ్చి కన్గొనుము లక్ష్యము తప్పక కొల్వు మంబికన్.

క. గురుశిష్యధర్మముల శం, కరుకతనన్ వినియె నాపె స్వాంతమునం ది
త్తెఱఁగు కనంబడు నీకున్, పరిణోపాయంబు చూపఁ దగు నాపె సుతా!

క. ఔరా! నను హుష్షు నీ, సారాచారములు మెచ్చు జనులుం గలరో
లేరో? సమ్మర మ్మా పోవుద, మేరాజస్య కడ కేని యిది తేటపడున్.

ఉ. మూల ముడింగి సారెకును ముష్టిప్రసంగము నీవు బాపయున్
జాల శిక్షింప వచ్చు, నెకసక్కెము లాడఁగ వచ్చుఁగాక, టా
ట్టా లెటు సాగు వేరొకయెడన్? బొనరించినలోపముల్, వృథా
పేర్మిలుటలున్ శరమ్మునకు వ్రేఁగు ఘటించక యూడఁబోవునే.

ఉ. ఎన్నిటి నేనిఁ గప్పఁ జగదీడ్యతరం బగుశక్తి, యట్టిదే
యున్నయెడన్ గుపం దెగడి యున్నతిఁ గోరఁగ నేల? కీర్తికిన్
దిన్నని తోవ నెస్సోకలను, దేవుఁడు దాని నొసంగకుంటయే
యిన్నిదొసంగు లిక్కురణి నీవొనరించునిమిత్త మర్భకా! 163

శా. పాపంబుల్ పలుకేతు, లంటెడియె యొప్పాటన్ మనుష్యుండు తా
మాపో రేపొ యొనర్పకుండుట యసంభావ్యంబు; నేఁ డన్న, హా
లాపానాదులు సైరముగ్ ఘనులె హేలన్ జేయుచున్నారు నీ
వాపాదించు కృతఘ్నతాభర మెం? త్యాజ్యంబొఁ జుమీ యేరికిన్.

ఉ. దీనిమహత్త్వమున్ దెలిసి తిన్నని త్రోవను బెట్టకున్నచో
హీనునిగాఁగ నన్ విబుధు లెంతురు, నీకును లేదు ముక్తి; దెం
దానఁ బునఃపునర్మనన నాగురుతన్ గుతిచేసి చేసి వ్యా
ఖ్యాన మొనర్చి తిన్నఁబడి కైకొనుమయ్య కుమార! భద్రముల్.

క. నినుఁ జెఱుప నెంచినవాఁడ, వన్నను * 'నేదో' కవి, యటంచును౦ దిట్టినజా
బును ఱేనియొద్ది కంపినఁ, బనుపడదే, నాదుకోర్కె బ్రహ్మాండంబే? 166

వల్లెపాలెము.

* "శ్రీగంగాభాగీరథీసమానులగు... రావుగార్కి. నీవు వెంకటరామ కృష్ణకవులకును తిర్పతి వెం(+కవులకును తంత్రము పెట్టినట్టు విన్నాను నీకు అందువల్ల వెం(+కయైనను లాభములేదు. ...నా పేరు వ్రాయకపోవుట మరచి వ్రాయలేదు. '(బూతుమాటలతో చేవ్రాలు)

ఇందు చేవ్రాలు మాలమాదిగలుకూడ నుచ్చరింపని బూతుమాటతో వ్రాయుటట్లుండ నిది యెవరినుద్దేశించి వ్రాయఁబడినదో వారిని దిట్టిన తిట్లకుఁ బరిమితిలేదు. మఱియు నీయుత్తరము కాని కార్డుపై వ్రాయఁబడినది. మొదట పెనిసిలుతో వ్రాసినపిదప వేఱొక సిరాతో దిద్దఁబడియున్నది — ఇఁక నొకమాదిరి సిరాతోఁగూడ నొక క్రాముడియుఁ గొమ్మును సవరింపఁడి మొత్తము మూఁడు వ్రాత లుపయోగింపఁ బడినవి కార్డుపైని అడ్రెస్సు మ॥ రా॥ రా॥ అని యున్నది. లోపల వేరువిధముగా నున్నది. బూతుపేరితోఁ జేసిన వ్రాలు కార్డుపైనిగూడ పెన్సిలుతో వ్రాసినది కలదు మఱియు నిట్టిదే వేఱొక యుత్తరముగూడ నిట్టి చేవ్రాలుతో నీయాన నుద్దేశించియే వ్రాసినది కలదు. విషయభేదము లేదు గాని యందలి యంశములు మఱియుం బచ్చిగానున్నవి. ఇందు రెండుబొమ్మలు వ్రాయఁబడియున్నవి. ఎన్నో బూతు లనేకవిధముల నసందర్భములుగా లిఖింపఁబడి యున్నవి అవియేవియు నిందుదాహరించుటకు రాజశాసన మొప్పదు కాని యందుఁ దుట్టదుదను వ్రాసిన తప్పుడు సీసపద్యముమాత్ర ముదాహరణయోగ్యముగా నున్నది.

"సీ॥ పురుషుండవో కలిపురుషుండవో కాని ధూమకేతువుతోడ తుల్య
మగుచు భయమొకింతనులేక నిర్భయంబుగ నీవు గ్రామమృగరాజుతో తుల్య
మగుచు, నీపలుకును దాని పలుకొక్కటియె కాని కూయుటప్పు డొక్కసారిగాని
తే॥ గీ॥ యిట్టి నీ దుష్టచరితంబు యింపుమీర, వ్రాసినాడను నేను వహ్వాయనగ.

చింతగింజపలెను.

యు. మిస్టరు. (అవాచ్యపు చేవ్రాలు)

యీపత్రికలు యితరులకుకూడా పంపినాను.

ఉ. "ఎప్పటికేని నీవచటనే సుఖముండువుగాక, నాదు పే
ర్చెప్పకయుండినన్ నృపతిచే వినిపించెదఁగాక; నీదు నా
తప్పడు పేరు లీశతవధానమునుండి మరల్తుఁగాక" యం
చిప్పని( బూనితిన్ జరిగె నిన్నియు నొక్కటి తప్పకుండఁగన్.

ఉ. ఇప్పటికేని నీయెడలనే దయ నా కధికంబు, నీదు నా
తప్పుఁ బ్రసంగ మంతగ నెదన్ జెదరింపదు, నీవు పెట్టు నా

---

☞ పై యుత్తరములు వ్రాయువారు వ్రాయించువారు వీనియం దుద్దేశింపఁబడినవారును జాల దగ్గఱబంధువులు. మాశిష్యులొనర్చెడి యసందర్భ ప్రసంగమును విని మందలించినందులకై వారిపంకనుండి యిట్టి యుత్తరములు వెలువడఁజొచ్చినవి. వీనికి సంబంధించిన రికార్డు సర్వమును మావద్దనున్నది. ఒకవేళ నీయవాచ్యపు టుత్తరములంగూర్చి బంధుసముద్రులు కొందరు చేరి మందలింపఁగా జరిగిన యంశము క్రింద నుదాహరింపఁబడుచున్నవి.

..."ఈమధ్య వెంకట్రామయ్య యిచ్చోటికి వచ్చినాడు. అప్పుడు యీయుత్తరము నాకు వచ్చినట్లు ప్రసంగవశమున వచ్చినది. ......వెంకట్రామయ్య తమ్ముడు సత్యనారాయణ ఎరుగక వ్రాసినట్లు దక్షిణామూర్తి మొదలగు వారియొద్దను అన్నాడట. ......దగ్గరబంధుత్వకారణమున నేమియుదలచక మాటలాడ కూరకున్నారము. పాపపుణ్యములు భగవంతునకే యెరుక. ...మా మీద లేనిపోని మాటలాపాదించి ఎవరు వ్రాస్తే వారే యనుభవింతురని...... యూరకున్నారము... వెంకట్రామయ్య తమ్ముడు మాత్రము "మా అన్నయ్య వ్రాయమంటే నేను వ్రాసినా"నని అక్కడక్కడ అంటున్నాడు. (చేవ్రాలు)

☞ దీనికి గువాయిని చూడఁ గొన్ని పంక్తు లీక్రిందవి వ్రాయఁబడినవి.

"వెంకట్రామయ్య తమ్ముడు సత్యము అక్కడక్కడ మా అన్నయ్య వ్రాయమన్నాడు గనుక ... రావున కుత్తరములు వ్రాసినానని చెప్పడముచేత వెంకట్రామయ్యయే వ్రాసినాడేమో యని నేతలచి మొదట మీవిరోధములు నామీదను కూడా వచ్చినవి యని మీ పేర వ్రాసినాను."

☞ శ్లో॥ కర్తాకారయితా చైవ ప్రేరకశ్చానుమోదకః। అను నార్యోక్తింబట్టి పైయుత్తరములలోని సంగతి సందర్భములను బట్టియుఁ బ్రాజ్ఞులు విచారించి మాశిష్యుఁడుగారి గురుభక్తిని నిర్ణయింతురుగాక. ఇతఁడు చెప్పి వ్రాయిం

తప్పుడుఁ బేరు లాలితధానము పేరును మాపుచుంట నా
ముప్పు నడంచుపొంటె నిది పూనితి నిక్కము నమ్ము మర్భకా.

ఉ. పూనిన పూనికన్ దెలిసి "పొట్టకుఁ బూనితి సైఁపుఁడంచు నా
పై నెనరుంచుఁ డంచు నొకపాటిది యుత్తర మంపికోక, దు
ర్మానపుఁ ద్రోవఁ ద్రొక్కి యపరాధము పెంపొనరించి కొంటి; వి
ద్వేనియు మంచిత్రోవఁ బడు మిం కపరాధివి కాకు వాకులన్.

ఉ. ఛాత్రత దాఁచి వేఱొక యసహ్యపు మార్గముఁబట్టి పూర్తిగా
శత్రుత వెల్లఁబెట్టియుఁ బ్రసక్తికిఁ గాని ప్రసక్తిగా గురు
స్తోత్రము లన్యథా సలుపఁ జూచెద, వింతటిలోనె నాయశ
స్సత్ర మపాత్రమాయెనె? పలుసజ్జను లుండఁ గవీంద్రు లుండఁగన్.

మ. 'అవధానం బొనరింప లేఁ డతఁడు, నాయాచార్యుఁడుం గాఁ' డటం
చవనిన్ మెచ్చఁగఁ జేయలేవు విను మబ్బా! "తప్పు సైరింపుఁడీ
యవివేకం బొనరించినాఁడ" నన నాప్తస్తోమముల్ మెచ్చు "ము
ల్లు వెలార్పంగను గొట్టి గొట్టికొనుటల్" లోకుల్ ప్రశంసింతురే.

క. "దాసునితప్పులు దండము, తో సరి"; నామాట వినుము తుచ్ఛపు వ్రాఁతల్
వ్రాసి కలహమ్ముఁ బెంచకుమో సుత! బుధు * లాడుమాటలూఁకొనదగునా.

ఉ. గుట్టును మట్టునున్ దెలియ కోయిలపిట్టవు గాన నా యెడన్
జెట్ట యటన్న నిశ్చయముఁ జేకురె నీకుఁ గుమార! నాకడన్
జుట్టమొ, దైవమో యనిన చూపున నున్న నృపాలు రెందఱో
పట్టణసీమలం గలరు పల్లెలయందుఁ గలారు పుత్రకా! 173

---

చినచో నడుగ నేయక్కరలేదు. పనంతటఁ దానె యాతనితప్పుఁడు వ్రాసి నచోఁ దమ్మునింబట్టి యన్నగారి వివేక మనుమేయముకాక మానదు. అయా పోకలయందలి యోగ్యతను గూర్చి భగవంతుఁడును దత్తుల్యులగు యోగ్యులును విమర్శింపఁ దగువారు.

* బ్రహ్మశ్రీ చెళ్లపిళ్ల వేంకటశాస్త్రులవారి సన్నిధికి. (నవరత్నమాల)

చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీతిలకుల్ విలసచ్ఛతావధా। నరతిదలిర్పనై
జనరనాథ సభాస్థలులన్ జయంబుగాం। చిర వరకీర్తి దిక్తటులఁజెంది సముజ్జ్వల

ఉ. అందఱుఁగూడ మూర్ఖు లని యాడిరి, వేగతి నోరు వచ్చెనో
వందలు వేలు పండితులు పత్రిక లిచ్చిరి; యిందు నొక్కఁడున్
మందుఁడు గాని పండితుఁడు మంచి వివేకి యొసంగఁ డొక్కఁ ? నీ
చందముఁ జూచినన్ దెలియు సాహసి వం చెటువంటి వందకున్.

చంద్రికాపరి! స్ఫురణముఁజూపఁ బండితులు భూరిముదంబున సన్నుతింపఁగన్। ఉ॥ ఆరయ సర్వశాస్త్రములయందు సుపంచితమైన సాహితీ। ధోరణి మేలుమేలని బుధుల్గొనియాడఁ గవిత్వవిద్య కా। ధారము వీరలే యనఁగఁ దద్దయు మించు ప్రాగద్తగాంచి యా। ధీరు లుదారభావమున దీపితులై విలసిల్లుచుండఁగన్. ఉ॥ వేంకటరామకృష్ణు లను పిన్నకవీంద్రులు నేఁడు వారికిన్। వంకలఁ బెట్టి వారల ప్రబంధములందు విమర్శనంబునాఁ। గొంకక వ్యర్థలోపములు గూర్చుచు తాతకు దగ్గు నేర్పరై। యింకిటఁ బండితోత్తములకెల్లను గర్వముగాఁగఁ దోఁచెడున్॥ ఉ॥ పిన్నలువారు పైకొను కవిత్వమదంబున బద్ధులే యిఁకా। కొన్నను రాజబాట గొని కుంజరమేగ మృగంబులెన్నియో;। వెన్నడి కూసినన్ బరువు వీడ్కొనునో కరికంఠము వించి లో। నెన్నక పీరియ్యాది యుపేక్షయొనర్చుట మేలు సూడఁగన్... ఉ॥ వేంకటరామకృష్ణసుకవి ప్రవరుల్! వినుఁడీరు సత్కళా। సంకలితుల్ కవిత్వరసజ్ఞులనం చెఱింగిరి మీరు ప। ద్యాంకములం గనుంగొనిన నద్భుతలీల శతావధానమా। తంకములేక చేసిన విధంబును దెల్లము సేయు మీకృతుల్॥ ఉ॥ ఐనను మీకళావిభవ మంచిత చారుకవిత్వశక్తియున్। ధీనిధులందుఁ గీర్తిగను తిర్పతి వెంకట సత్కవీంద్రులన్। మానక నిందఁజేసెడి క్రమంబునకున్ బనిపూనినట్టుగాఁ। గానఁగనయ్యెడున్ పగవు గాదిది పండితులైనవారికిన్॥ ఉ॥ పిన్నలు మీరు వారు కడుఁ బెద్దలు విద్యలకున్ ప్రాగద్తకున్। వన్నియ గాదు మీకుఁ బెడవాడను వారలతోడఁ బూన; మీ। కున్న కవిత్వశక్తి బుధులొప్పఁ బ్రబంధములందుఁ జూపుఁడీ। చిన్నతనంపు చేఁతలు రుచించవు మీకపకీర్తి దెచ్చెడున్॥ చ॥ తిరుపతి వేంకటేశ్వర సుధీమణులార! యనేకరాట్సభాం। తరముల మీరు గాంచిన యుదారయశంబున కీర్ష్య ఁ డెట్టుటె। వ్వరు విలపించినన్ గొదవ వచ్చునె సూర్యుని జేటగప్పినన్ గురువగు తత్ప్రకాశమునకుం గొఱవచ్చునె కాన మీరు బం। ధురమగు శాంతిభావమున నూల్కొని యెప్పటి యట్ల యుండుఁడీ॥

ఇట్లు

ఆడవి సాంబశివకవి.

ఉ. 'కాకవు లెల్లఁ గాకవికిఁ గాలికి మువ్వనుగట్టి' రంటివే !
యేకముగా జగమ్ము లివి యెల్లను మ్రింగెడి నీదు బావ "ము
క్కాకలుదీరినట్టి కవిగండని గా" నెటు సెప్పె నోట? నీ
కాకవిఁ గూర్చి, తాను నొక కాకవియో, కపియో, పికంబొకో?

చ. "భయపడ కేను రా" ననుచుఁ బల్కితి జ్ఞప్తి యొకింత లేద! యా
శయమునఁ జూచికొ మ్మొకట స్వాంతము మండి పిఠాపురంబు నా

---

"...తే॥ గీ॥ అట్టిమీయొద్ద విద్యల నభ్యసించి, కయిత మల్లంగ నేర్పును గాంచి తుదకు, మీరుగురువులు కారనిమిమ్ముఁ దెగడు, ననుఁగుశిష్యులు గలరని యనఁ గవింటి. క. వారలదెసఁ గోపింపక, తారూరక యుండవేఁడెదను గాకున్నన్ దారించుక కోపించిన, వారికి సేమంబుగాదు పండితులారా! ఉ. ధర్మన ముఖ్య లోకతపధానశతాంగమ! దారినూపఁగా, నిర్మలమైన మార్గమున నిన్నల తిర్పతి వేంకటేశ్వరుల్, కూర్మిని దేశదేశములఁ గ్రుమ్మరఁజేసిరి నేడునీదుదు, ష్కర్మమదేమొ యార్పుచును గాకవులీడ్వఁగ దోర్లెదక్కటా. క. నీకుఁగల యశము నెడదిదె, కాకవులంబాఱఁదోలి ఘనతిర్పతి సు, శ్లోకుఁడును వేంకటేశుఁడు, సాఁకుచున్నారు నిన్ను జయ మగు నీకున్. సూర్యభట్ల వైద్యనాథం.

— — —

................................. శ్లో॥ యేగిరతం ప్రతిదినం పఠంతి సుబుధాస్తుతాః, తే గురుద్రోహ పాపాత్ప్ర, విముచ్యంతే న సంశయః

ఇట్లు, రామనాగేశ్వర భక్తిరస ప్రధాన కీర్తన శతకత్రయ నిర్వచనాంధ్రరఘువంశ కావ్యకర్తయగు:— భమిడిపాటి అయ్యప్పశాస్త్రి, హెడ్ మాష్టరు.

మండవల్లి, లింగాలపోస్టు, కృష్ణాజిల్లా. 11-12-12

**Injeram 6-8-10**

"...ఉ॥ పూతచరిత్రులైన తమబోఁటిమహాకవులందు వ్యర్థపుం, జాతురిమీఱు వాగ్వ్యయము, సల్పినచోఁ దమరెంతయో మహా, ఖ్యాతిని గాంతురంచు మదిఁగర్వముచే నిలఁగొందఱుందురా, నీతివిదూరులన్ గనిన నేరమటంచుఁ దలంచకుందురే. చ॥ కవులని పేరుపెట్టికొని కాలముపుచ్చుచు నొక్కచో మహాకవులను ధిక్కరించుటయె కార్యమటంచుఁ దలంచువాఁడు కా, కవియగుఁగాని సత్కవికిఁ గాకవి నామ మదెట్లు చెల్లు స, త్కవులకు దీనలోచమది గల్గ దొకిం

దయకు నివాసమైనయెడఁ దత్తఱ మందవొ? పాఱిపోవొ? ని
శ్చయముగఁ దెల్పుమీ! ప్రతిన జార్చెద, వెంటనె వచ్చి తీరెదన్.

ఉ. చక్రముఁ బట్టనే ననుచుఁ జక్రి ప్రతిజ్ఞయొనర్చియున్ దురా
పక్రమ మేగు దేర నది పార్థునుపేక్ష యటంచు నెంచి 'యీ
యక్రమ మెట్టుసేతు నన్నతాత్ముఁడ నయ్యెద' నంచుఁ గొంకకే
చక్రము దాల్చె శౌరి, యది సాహస మిచ్చెడుఁ గాక నాకిటన్. 179

---

చుక యెంచి చూచినన్. గీ॥ గురువులనె వెక్కిరించెడు కుమతులింక, తల్లిదండ్రుల నేరీతిఁ దనుపగలరొ, యహహ? వారల నేమనియనఁగవచ్చుఁ, గాలమాహాత్మ్యమనియెఱుంగ వలెఁగాక.

వెలువలి వీరశంకరమూర్తి, సా॥ చింతామణి.

---

మ॥ గురువే బ్రహ్మ, గురుండె విష్ణువను, వాక్యాన్ దూలఁగాఁ బుచ్చియే తెరువో మాకమరెన్ గదా యనుచు నెంతే యుబ్బి చబ్బిబ్బుగా, సరసుల్ మెచ్చఁగ నెట్టులోఁ బరమదే చాయన్ బొసంగున్ బరా, త్పరుఁడెట్లారక యుండుఁ, దప్పని ననేలా ప్రశ్నమే లేదు, మీ, రరయుండీ యిదె బోధనేతువని సత్యం బెల్లఁ జాటించు మీ, గురుశిష్య క్రమబోధి గీరతమునాకున్ బంపుఁడీ యొండు......

ది 4-3-1911

శిష్టా వెంకటసుబ్బశాస్త్రి
పొన్నూరు పోస్టు, కరికిపాడు

క॥ శ్రీ తిరుపతి వేంకటకవి, నేతలకు జగత్ప్రసిద్ధనిరుపమనిత్య, ఖ్యాతి శ్రీవృతులకుఁ గరు, ణాతత్పరులకు విపక్షనాగహరులకున్. గీ॥ అస్మదీయాభ్యోగేశ మాహాత్మ్యమందు, గురుమణీమాలలో మిమ్ముఁ గూర్చుకొనెడి, వైభవము పట్టుకున్నను వ్యాకరణము, గలిపి ముందేని సద్దాని గరుణ నిడరె. గీ॥ వాయస వ్యాసముఖమున వారెకృష్ణ, పక్షితకునొప్పికొనినట్లు స్పష్టమగుటఁ గోకిలలకు రామాభిఖ్య కూడ దనుట, వారె కాకములుగను గావలసియుండు.... సీ॥ కాకంబు పేరిడి గ్రంథంబుమందు గాఁ గష్టించి చేసిన కారణమున, 'పాపీచిరాయు' వన్వాక్యానుగతిఁ జిరజీవితకు గురుదూషించుకతన, పులిఁజూచినక్క" యనొప్పిల్కినే తద్వాచ్యబాధక నామము ల్వదలుకొనుట, బలివేయువిభువీడి బయలెక్కినను తలన్ దక్కువమనకని తారియుంటఁ గీ. గాకవీట్పద పట్టాభిషేకమునకుఁ

మ. అవధానం బొకమూల నుంచు మది యేలా, చక్కఁగాఁ బద్యముల్
జవిగాఁ గూర్చి పఠింపఁ జాలుదువె? నీచాతుర్యముల్ జూతు మీ
యవనీశుం డయిదే నిమేషములు నా కర్పించుఁగా, కా దినం
బెవియుల్ జూడక వీడకే నిలుచునట్లోఁ జేసి మెప్పించెదన్. 180

చ. అయిదు నిమేషముల్ "టయిము" నర్పణఁ జేసియు నైదు యామముల్,
పయి నెల లైదు, పిమ్మటను వత్సరముల్ మఱియైదు నిచ్చి "మీ
దయ" యనిపించుకోఁదగిన దార్ఢ్యము సద్గురుపర్య లిచ్చి; రీ
మెయి నది చూపఁ గాకము ప్రమేయము గల్గిన నోపికల్ బికా. 182

చ. వెనుకటి పోల్కెఁ గాక మిది వృద్ధగుటం బని సేయలే పటం
చనుకొనినాఁడ వో తనయ! యజ్ఞుఁడవై కద? కాక మంటి దా
నిని జరకేవిగాఁ దెలుపు నిర్ణయముల్ విన వోకొ? యెప్పుడో
క్కనియతి నేకనంబడెడిఁ గాకము లోకమెఱుంగదే సుతా. 182

ఉ. "కాకము వచ్చె" నంచు నృపకాంతునితో వచియించు వాఁడవో!
లేక "బక" మ్మటందువో? మలీమసఁ డందువో? కోఁడు దర్శనం
బీక యనాదరించు నటులే ఘటియింతువొ? తత్సభాస్థలిన్
మూకత సంఘటించెదవొ? మొక్కెదవో? మఱి యేమి చేసెదో. 183

---

దగిన వారలు వారలే తగరు మీరు పరిభృతత్వంబు "సందర్భ పద్యములను, జెప్పి కొనుటకు ఫల మిదె సిద్ధమయ్యె.... గీ॥ మొదల శిష్యగాఁ గొనుఁడని మొదలు పెట్టి తుదకు నే పేరెము చెప్పఁగాఁ బోఁడఁగినట్టి, తప్పు సైరింపు నాయెడ దయ నుంచి, వారితోఁ బోరు చాలించవలె క్షమించి. గీ॥ అహాహా! యెవరెంత ఘనులైన నన్మృత గాదు, లగుచు గురుశిష్య మర్యాద నంతరింపఁజేయఁగాఁ గూడదటువంటి శిష్యులేల? యున్నకీర్తికిఁ జోటు లేకున్న పిమ్మట. గీ॥ ఎవరి పాటవ మెట్టిదో రూప మెఱుంగ, రెండు కసములతో వాద మేమి ఫలము, పెనిచి విషవృక్ష మేనియు జెఱుకరాదు, తమకుఁ దెలియని ధర్మముల్ ధరణిఁగలవె. ఉ॥ గీరతపద్య పుష్పములఁ గింకవి పంకజముల్ ముణింగ గం, ధీరవచోఘునద్యముల పెంపునకుం గవికేకిలోక మిం, పారఁగఁ దాండవించెను మహాత్మకదంబము లుల్లసిల్లె నా, భారత మేమి లెక్క యను భంగిని గీరతమున్ జెలంగెడిన్.

బందరుతాలూకా
పెడన.

సాధుజన చరణసేవకుఁడు
మల్లంపల్లి మల్లికార్జునుఁడు.

క. నాకింపనాదమును విని, కాకమె యనుకొనునో యేఁడు "కవిమూర్ధన్యా
నీ కిట్టు లనఁగఁ జెల్లునె!, సీ! కలిపురుషుండ వంచుఁ జీవాట్లిడునో". 164

---

# సతీర్థ్యసంప్రార్థనము.

(జే. ప్రభాకరశాస్త్రి) స్వధర్మపత్రికనుండి.

శా॥ అమ్మా! భారతి! కేలుమోడ్చుకొని నిన్ యాచింతు నొక్కింత నీ
సమ్మానమ్మునఁ జేసి యీభరతవర్షమ్మందు విద్యాతరుల్ రెమ్మల్ కొమ్మలు గల్గి
పల్లవతుల వర్ధిల్లన్ వలెన్ సర్వశాంతమ్మై పోవలె నెందుఁ బండితవివాదస్ఫార
దావోద్ధతుల్॥ మ॥ ఉపసంహరిండయ్య సతీర్థ్యులార! యుడుగుం డోహో యనో తప్పౌ
నో మీ యుడుగుల్ దుష్క్రిక్కి విధేయభావమున నభ్యర్థించుచున్నాఁడ, మీ నుడు
గుల్ పత్రికలోఁ బఠించి రవి కేసుల్ సూచినట్లయ్యెనే, చెడుగుల్ కోకిలకాక
ముం గనిన మీ చెద్దిమ్ములన్ మెత్తురే॥ ఉ॥ శ్రీకర చెళ్లపిళ్లకులసింధుశశాంకుని
వేంకటేశ్వరాఖ్యాకుని సద్గురుప్రవరుఁ గాకినిగా మతి నిష్కళంక స ద్దీక్షుని
దత్తమున్ దిరుపతిన్ గురుపండితుఁ గొంగఁగాఁ దనుం గోకిలఁగా వచించు
కొని కొండొకకైతము వెల్లడింతురే॥ శా॥ అచ్ఛానేకమహర్షినిర్మితకుహార్హా
చార నిర్మాణముల్ స్వేచ్ఛాచారులు నేఁటికాలమునయం దెందెందటో విజ్ఞవే
షచ్ఛన్నుల్ పడఁగొట్టి నందు గురుశిష్యన్యాయనిర్మాణ మూ లోచ్ఛేదమ్మున
కీపు పాల్పడితిరో కో! రామకృష్ణాహ్వయుల్॥ ఉ॥ చిల్లులగవ్వయే నఖిలషిం
పక విద్దియనేర్పె కూర్మి సం ధిల్లఁగఁ గాంచు సద్గురు విధేయతమైఁ గనుచుం
బాడిం బడం బల్లనివేశె సంస్మరణ సల్పుచు నుండుటలేక యిచ్ఛమైఁ గల్లలుపల్కు
చేమి యధికమ్ము గణింపఁ దలంపుఁ గొంటిరో॥ చ॥ శ్రమపడి విద్యలం గఱపి
సాఁకి ప్రయోజకుఁ జేసి వృద్ధికిం బ్రిమదముఁ జెందు సద్గురు సభాస్థలిఁ బేర్కొను
టాత్మగౌరవ క్రమపరిహారకారణముగాఁ దలపోసెడువారి నేరిఁ గా నము
చిన మెప్పు; శిష్యుడు కనన్ విన నయ్యెఁ గదయ్య యియ్యెడన్॥ మ॥ గురువుల్
తిర్పతివేంకటేశ్వరులు మీకున్ మాకు నొక్కంబు; త త్కరుణాసారమె కార
ణమ్మరయ విద్యాబీజ మొక్కింత యం కురమందన్ మన కెల్ల నిక్కముగ
మాకున్ వారికిన్ శిష్యతా గుణతల్ లేవను మానుడుల్ వినిన చేకూర్రుండు
నుం గుందెదున్॥ ఉ॥ "చెప్పుటలేద" యంచును వచించితి రొక్కఁడఁ జెప్పె,

ఉ. చూడఁగ నిచ్చయున్నయెడఁ జూపెద నాదగు వార్థకంబు, నిన్
జూడ మనంబునం గలదు నూ సుత! పుట్టెఁడుకోర్కె; బావ కీ
జాడ తెలుంగఁ జెప్పి యొక జాబును బంపుము "ఫైరు" తీరు నె
న్నాడెడ, శక్తిఁ జూపెద నహో! యని మీనృపుఁ డక్కజం పడన్. 185

---

సేసియుం। జప్పనికూఁతలే" యనుచు సాహసమెల్లను వెల్లడించినా। గొప్పలకుప్ప లార! జగ ముందు టెక్కింగి యిటుల్ లిఖింపఁగాఁ। జెప్పఁగ మీకు నెప్పగిదిఁ జేయియు వాయియు నాడెనో గదే॥ ఉ॥ అన్నా! వీరును బండితప్రవరులే యన్పించుకోఁ గల్గిపై। నెన్నండే నొకశిష్యుఁడుం గలిగి వాఁడింతేని యంతేని వి। ద్యన్నిక్కమ్ముగ మీకడం జదువనై యల్పజ్ఞుఁడే యయ్యె మీ। కన్నన్ మిన్న నటంచు మిన్నుఁ గన నెట్లో మీకుఁ జింతింపుఁడీ॥ ఉ॥ వేంకటశాస్త్రిపండితకవిప్రభుపాదము లాశ్రయించి ని। శ్శంకముగాఁ గడించితిమి శక్త్యనుసారము సంస్కృతాంధ్రికా। లంకపసాహితిం గవనలాఘవముం దగు శబ్దశాస్త్రముం। జంకము యేము; మాచదువు సర్వముఁ బెక్కురుణాత్తమే చుఁడీ॥ ఉ॥ పొల్పుగ నభ్యసించితిమి మువ్వుర మేకముగా ననల్పమో। స్వల్పమొ శబ్దశాస్త్రమునయందు నవారి కులీనుఁ డేనునుం। దెల్పఁగ నేమిలాభము! గతించెను వేంకటరామశాస్త్రి యుఁన్। వేల్పెలుఁగున్ గురూత్తముఁడు వేంకటశాస్త్రి మహార్థబోధముల్॥ ఉ॥ అంకిలిలేని చెల్మి కిరవైనయతం డతిశాంతమూర్తి ని। ష్పంకస్పృదంతరుండు ప్పిసుపాటికులోద్భవుఁ డాత్మవేదిశ్రీ। వేంకటశాస్త్రిసద్గురుని ప్రేమునిడి కెంతయుఁ బాత్రి మింక మా। వేంకటరామశాస్త్రి కెన వేయిటి కొక్కరుఁ డేని కల్గునే॥ మ॥ 'గురుఁడున్ దైవము లేఁడు నేఁ డకట! యాంగ్లో విద్యలన్నేర్చు బా। లుఁ' కంచున్ వచియించు పండితుని సోల్లుంఠమ్ముగా నొక్క నే। ర్పరి యాంగ్లేయు కలార్థి "మీచదువు నేర్చన్ శక్తి చేకూరునా। వరయుం" డంచును మిమ్ముఁ జెప్పె నఁట, యయ్యా! యింకఁ జాలింపుఁడీ॥ ఉ॥ ఏల వృథాపరియాపపడ నెవ్వరలుంగరు మీకవిత్వపుం। బోలిక చాలికల్ తెలుసవో గురులెవ్వరో తేటతెల్లగాఁ। జాలును జాలుఁ గన్గొన నశక్యమటంచును బాలుదాత్రిపు మా। జ్ఞాలము కన్నమూఁతలిడు చందము దోఁచెఁ గదయ్య యియ్యెడన్॥ ఉ॥ పుట్టకమున్న వెత్తలయి పొల్చినఁ బొల్తురుగాక పాదముల్। పట్టిపఠింపరే నిజముపల్కుఁడు వేంకటశాస్త్రి చెంత; హా। దిట్ట లటన్న పేరు చనుదెంచెనో లేదో యొకింతలోన

క. నీవుగ్ర, బావయ్య, నృపుఁడును జేవ యనఁగ నిట్టి దనుచుఁ జెప్పికొనంగా
నా వెఱ్ఱిపాట పాడెద, దేవుఁడు గలఁ డంచుఁ దెలిసి తిరుగుము తండ్రీ! 186

మీ! కిట్టిమతుల్ జనింపవలెనే గురుఁ గూఱిచి సత్కవీశ్వరుల్॥ మ॥ నుడికార
మ్మొవ మించుగ్రంథము లనెన్నో కూర్చుచున్ 'శిష్యుఁడా! కొడుకా!' యంచొరు
లెంచ మించుదయఁ గన్గొంచుం దగన్ విద్యనేర్పెడు కారుణ్యపుఁ బ్రోవుమీఁద
నదె తప్పుబుద్ధుల్ వచింపించె దో! చెడుకాలంబ! యోఁతింగి యింకఁ జనుమీ!
చీవాట్లపాల్గాకుమీ॥ సీ॥ వీనుదోయికి విందు వియ్యంబిడుమేల్మి నుడికారము
లకుఁ జేర్పడినవాఁడు! సిద్ధంపుఁ దేటతేనియచవుల్ గలకైత వెలయింప నెన్ను
కొసలవాఁడు గొరుశిష్యులకుఁ జిక్కులుదీర్చి నెఱవిద్దె నెలమి నేర్పఁగఁ బద్దు
గలుగువాఁడు! తెలుఁగు దేశమున వర్తిలు నెల్లరాజుల నలరించి విఖ్యాతినలరువాడు
గీ॥ 'కావు కావని' మొఱ చెడుకాకి యయ్యెఁ! జిప్పకూఁతలు నేర్పెడు చేలయయ్యె
నకటకటా! విపరీతమ్ముగాఁ బికత్వ! మెనయఁగా నతని శిష్యుఁ జేకొనినకతన.

చంపకమాల.

"తిరుపతి వేంకటేశ్వరులు తేఁకుఁ మాకడ వారు విప్పనే। రరు,
మముఁ గూడఁ గొంకుదురు, రా రిటకున్, పిలసిల్లినార మే మిరువుర మిప్డు వార
లిసె నీళ్లు వేళ్లు" మటంచుఁ గొంచకే। తలుచుగ వీరు పల్కిన పదంపడి
వైరము మీకె మీరలా। తిరుపతి వేంకటేశ కవిధీరుల శిష్యులటన్నమాట సు।
స్థిర; మిఁకఁ జాలుఁజాలు గురుశిష్యులకా యిటు గ్రుద్దులాట! యె। వ్వరయిన
విన్న నేమనుదు; రద్దిర! యేమనుచున్నవార లి। త్తఱిని యెఱుంగుఁ; డెంత క
వితామహనీయత కల్గెనేనియుం। గురులకు పంగనామములు కూర్పఁదలంచుట
పోలునే? నిజం। బగయుద మైనఁ గాని కలదా యల తిర్పతివేంకటేశులం।
దొరసెడిపాటివేత్తృతయుఁ। దుందుడుకం దిలికేరు; నిక్క- మెక్కఁడిని బోల్ప
వచ్చు శతఘంటమహాకవితావిలాసినీ। సురుచిరభోగభాగ్యములఁ జూరలఁ
గొన్న రసజ్ఞవర్యుల। తిరుపతి వేంకటేశ్వర సుధీవరులన్। మొనమొన్న వారి
డ। గ్గఱిని పరిశ్రమం జరిపి కైకొనినట్టి యొకింత పాండితిన్। విరిసెడు కైత
మున్ గెలిచి వీధికి నెక్కుచునున్న మిమ్ములన్। తిరుపతి వేంకటేశ్వరుల దీటగు
వారని పేరుకొందురే। తలుచుగ వీరునున్ శతవధాన మొనర్తుమటంచుఁ జెప్పి
కొం। దురకద! యెయ్యదీ పటుమతుల్ మన తిర్పతి వేంకటేశ్వరుల్। జర

శా. "పీడన్ జాలక నెంటవెంటఁ బడు నీ వేయిండ్లపూజారి యే
వాఁడన్ జూచినను బరించు" టది భూపాలుండె పాలించఁగా
'శ్రేడీ యాతఁ' డటంచు నేత్రములు కెంపెక్కంగ నిన్ జూచుఁ గా
కూడన్ గొట్టెడుఁ గాక నిర్భయదురుక్త్యుద్రేకసౌభాగ్యముల్. 187

---

పిన వానికిన్ సవతు సల్పఁగ నొప్పగునట్టి దెవ్వఁడె। కన్నరణిని జల్పి లెక్కడఁ?
బ్రకాశము సేయుఁడు దాని వైఖరుల్। చిఱుతలు పోవఁబోవఁగఁ బ్రసిద్ధి
వహింపఁగ నర్హులక్కటా। గరువపుఁ జెద్దయముల్ గలుగుఁ గా కవి యొండొక
చోటఁ జూప కా గురువులపట్లఁ జూపఁ దొరఁకొంటిరె ? లేక జగమ్ము మెచ్చ
మీ। పసువున కల్లవారు గురుపట్టమునంద వనర్హులైరె! భా। స్వర శరదిందు చం
ద్రికల చాడ్పున నెల్లెడ వెల్లిగాంచి దు। స్తర మగునట్టి వారల యశంబును
దాఁటఁగ, మాటుపుచ్చ మీ। తరమగునే! తలంచుఁడు వృథా కృధ నింపకుఁడయ్యా!
అయ్యో బో। జరిగినదానికేమి సువిశాల మనస్కులఁ జింతచేసి యి। ప్పరుసున
నింక దండుగ వివాదములన్ మతి నమ్మ చేయ కా। తిరుపతి వెంకటేశ కవిధీరుల
శిష్యుల మంచు మించు సం। బరమున నాత్మశుద్ధిమెయిఁ బల్కినమే ల్కవితా
ధూటి మీ। పరమయి యింపునింపు, గురువర్యులకుం పగు శిష్యులంచు మి। మ్మర
యుదు రాదరింత్రు ప్రజ లందఱు, దాన యశంబు మీకుఁ జే। కుఱు, గురువర్యు
లున్ మిగులఁ గూరిమిమీఱ మిముం దఃంతు, రీ। శ్వరుఁడును మెచ్చు, మేముఁ
గడు సంబరముం బడువార, మేమి యుం। బొరయను బొచ్చెముం గలుగఁబోదు
యథార్థముఁ జెప్పినాఁడ న। క్కఱగొని నాదు పల్కు వినఁగల్గిరయేనియు
నాఁటనాఁట దు। ష్కర నిరవద్యహృద్యశతఘంటమహాకవితాలతానవాం। కుర
ములు వాడిపోక చెలఁగున్ మెలఁగుం పలు తావులందు ముమ్మరముగ నల్లిబిల్లి
గొని మంజులపుం జిగురాకులెత్తి క్రొం। బరిమళముల్ వెలార్చు కుసుమమ్ములఁ
బేరిమిగాంచి మిమ్ములం। బరిణత సత్ఫలమ్ముల ననారతముం దనియించు
చుండెడున్. మ॥ 'తల కెక్కం గరువమ్ము, వీఁ డెవఁడురా! ధైర్యమ్ము మై
మాకుఁ ద। ప్పులు నొప్పుల్ గణుతింపఁబూనెఁ దలవంపుల్ కావలెన్ వీని'కం।
చలుకం జూపఁ దలంతురేని యొక లెక్కానే! నుపాధ్యాయునిం। దలదాఁటం
దలపెట్టు మీకు భయమందన్ రామకృష్ణాహ్వయుల్. శా॥ తేటల్ దేరిన సత్క
విత్వమునఁ గీర్తిం గాంచుచున్నట్టి మీ। బోఁటుల్ యత్కవితామృతాంబుధికి
నంభోదంబులై రా నిరా। ఘాటుల్ తిర్పతి వేంకటేశ్వరులకుం గారాపు
శిష్యుండ నామాటల్ కొంచెము వీనులన్ జొనుపుఁడీ మన్నింపుఁడీ వేఁడెదన్.—

క. వృద్ధుఁడ నని, ప్రకటించితి కుద్ధుం డగు భీష్మముందు "కోఁకిస్క" గజ
శద్ధుండు కర్ణుఁ డేమగు ?, శ్రద్ధమెయిన్ భారతమ్ముఁ జదువు కుమారా !

తే. గీ. ఒక్కనీవు నన్నాడెడి యూషరోక్తు
లెన్ని భూషణోక్తుల జనియింపఁజేసెఁ!
గాక నేనెంతవాఁడ సత్కవిగణంబు
నన్నుఁ బొగడుట కోయవినయధురీణ! 189

ఉ. వందల లెక్కయే మకట! వారక లక్షలు వచ్చుఁగాక యే
వందయుఁ దండ్రిపేరు గురువర్యుని పేరును మార్చి చెప్పఁ; డీ
చందములం దొకానొకటి సాధ్యముగాఁ గనుపట్టె నీకు; ము
న్నుం దిఁకనొక్క టింక నొక మోఱకు సాధ్యము చేయునో కదే ! 190

మ. 'అల నారాయణశాస్త్రి నీ వెఱుఁగుదే?' యన్నంత నవ్వారికిన్
దల పంకించి యెఱుంగుటన్ దెలిపెదో? 'తత్పూనుఁడ న్నే' నటం
చెలమిన్ బల్కెదొ? చెప్పుమయ్య! యటులే యీవన్నుఁ బ్రశ్నించినన్
దలపంకించెదవంట! "శిష్యుఁడనె" యన్నన్ లోపమే పుత్రికా! 191

---

......చ. తిరుపతి వెంకటేశ ఫణిదేవుల వీడ్కొని రామకృష్ణు "లీశ్వర! మఱి వేరులైతి" మని పల్కఁగ "నీశ్వరవేరు" లన్నయా । ట్లరసి యపార్థమూని శర ణార్థుల వ్యర్థులుగాఁ దలంతురే । తిరుపతి వేంకటేశ్వరులు నీనశరణ్యులుగాఁ సత్కవీ! చ॥ తిరుపతి వేంకటేశ్వరులు దేశము లన్నియు గెల్చియుండియున్। సరి సుఁడు పీఠికా నగరనాథుదరిం గల రామకృష్ణులీ । చిఱుతపుఁ బ్రాయపుం గవిత చెప్పగఁ నేర్చుట తా మెఱింగియున్ । దురమొనరింప రమ్మనుచు దూఁకఁగ ధర్మమె సుంతయైన మా । నరపతినైనఁ జూడ వలదా? వలదా? మరియాద శేరికిన్.

ద్విభాష్యం ఫల్లకవి
గోదావరి జిల్లా, పిఠాపుర డివిజన్, దుర్గాడ.

(మఱియు నీసుకవి శ్రీరాజావారి సన్నిధికంపికొన్న ప్రకృతవిషయపుఁ బద్యములలోఁగొన్ని)

.........చ॥ తిరుపతి వెంకటేశకవిధీరులు వేంకటరామ కృష్ణధీ, వరులు కవిత్వసంగతుల వాదములాడఁదలంచి పత్రికల్, జరుపుచుఁ గయ్యముల్ పెనుచ

చ. జనకుని పేరు డాఁచినను సత్సభ నంతగ శంక రాద, త
ద్దినమునఁ దండ్రి యెట్లొ సభ దేశికుఁ డట్టిఁడె; యెట్లు డాఁపఁగాఁ
జను గురుపేరు? నీ కెఱుక చాలక కీరితి కిట్లు డాఁచితె
ట్లును బయలెక్కఁ గన్గొనుము లోకము మూయను మూకు డున్నదే!

---

సాగిరి తామడిగాఁచి తీర్పఁడీ, మఱపక రావు వెంకటకుమార మహీపతి సూర్యరాట్ప్రభూ ......... ఉ॥ గాసికిమూలమన్న? మొనకాదిది, నోటికి వచ్చినట్లుగాఁ, గూసెదరే మొకో! యనినఁ? గోవిదగోష్ఠి, దురంతకృత్యముల్ దోసములన్న సత్కవులతోఁ బని, రాజసభాంతరంబులం, దీసభ సేయ నొప్పమికి హేతువు లెవ్వియు లేవు భూపతీ! క॥ మనరామకృష్ణకవులును, ఘనతరవిద్యాప్రవాహ గాంభీర్యులు నా, చ్చను గెల్తురు గెల్వక పో, యిన మాత్రము చేఁ గళావిహీనులగుదురే! ఉ॥ ఈకవిశూరవైనము మహీపతిపిన్నను గంటలో పలక్, బాపక యుంచునే పతి వినంపగు యత్నము సల్ప మంచునన్, లోకులు ప్రోత్సహింప జనలోలుఁడనై శ్రుతపఱ్చుకొంటిఁ గా, మ్మా? కవిపాల వేంకటకుమార మహీపతి సూర్యరాట్ప్రభూ?

దుర్గాడ
గోదావరిజిల్లా.

ఇట్లు, పిన్నవించుకవి, రాజవిధేయుఁడు
ద్విభాషిఫుల్లకవి.

ఉ॥ పోకగన్న నాఁడు గని ముచ్చటచే రసముంచి పెంచితీ। వోకవి రాజ! సద్గుణకళోదయశాలివి గాన దాని కిం। పాకసమాఖ్య వృద్ధి గను పట్టునఁ దాఁగను పట్టె నెట్టనన్। నీ కెన పోలకున్న నిఁక నేర్తురె? యన్యులు మిన్నకుండగన్. ఆ॥ వె॥ ఉభయ శాస్త్రములని కాక యుపరశాస్త్ర। మొండు నుపదేశమాత్రిన యూహసేయఁ। జాలియును జాల మింతటి మేటిగురులఁ। దిట్టి నోరెత్తు కోయి దిట్టతనము.... ఆ॥ వె॥ శ్రోత్రియుఁడు పుత్రుఁ జూడరావు డదధి। కారియగుటఁ దోడి ఘను లడిగినఁ। దనకుఁ దెలియదన నితని తల్లి సరయుఁడీను చతండు పల్కవనఁగఁ బిసవె.... ఆ॥ వె॥ మగని మంచి దాఁచి మన్నించు గోమ యొడ్డ। గురుని దొలఁగి లాతి గొప్పసేయు। శిష్యుఁ డింక నెద్ది సేయనోపఁడు కలఁ। గూడ దీ జగడము గురువరేణ్య. శా॥ నీ హంసత్వము గాంచి యెల్ల బుధులు న్నిన్నాత్మ నసోల్లాసిగా। నూహం జేర్చిరి యొద్దుకా కవిజనశ్రీరాజించిసద్భావ భూ। పాహారత్వమె కాంతుని క్కొరుల హంసమ్మన్యులన్

శా. ఏఁ దిట్టన్నను నీవు దిట్టెదవుగా! యేసీమలోఁ జెల్లు నీ
వాదం బేగతి నెగ్గు? నేల విడి యెవ్వారేని వర్తింతురే!
లేదే! శిష్యుఁడు దేశికుం డనునెడన్ లేశంబు భేదం బహో!
పాదంబున్ శిరసెక్కఁడౌనె యరరే? ప్రాజ్ఞుండ విట్లాడదే. 193

ఉ. చప్పనికూఁత కాకికడ సంగ్రహణంబొనరింపపట్ల ని
న్నెప్పుడుఁ గాని తిట్టుటదొ యించుక మెట్టుటయో తటస్థమా
టొప్పఁగదా! సరాసరిగ నొజ్జను దిట్టితొ? మెట్టితో? దగన్
జెప్పఁగదయ్య! యిప్పుడటు సేఁతకు సిద్ధపడన్ గడంగెదే! 194

---

గ్రాంకృతి। వ్యాహారోద్ధతుల స్వర్గల్లు రిఁక నేలా వారితో వాదముల్. చ॥ సిరియును వాణియు న్నిను భజించెను మున్నె యనన్య యుక్తిఁ ద। కొఱఁత లెటుఁలాడ నేమి గుణకోటిఁ దలిర్చితి రాజు పెల్లఁ జా। మరములుదాల్చి భూషలిడి మాటికిఁ గొల్చిరి యుప్పసంబు గూ। ర్చిరి యసమానకక్ష యిటుఁ జెల్లునె? తిర్పతి వేంకటేశ్వరా.

ఇట్లు,
తాడేపల్లి వెంకటప్పయ్య శాస్త్రి, చందవోలు.

---

ఆ॥ వె॥ గురుఁడు కాక మనుచుఁ గోకిలమని తాను। పిల్చువీఁగ నెపుడు బెదరి బెదరి। తిరుగుచుండి గానవరములఁ బ్రాపించెఁ। ద్యాగరాజు రాయోగవిదుఁడు.

హరి నాగభూషణం వ్రాలు.

హితోపదేశము.

ఆ॥ నవశతావధాన కవిలోకమణులార। రామకృష్ణులార ప్రాజ్ఞులార। శిష్టహితుఁడు గాడె శ్రీ జగన్నాథము। చేయు హితము మీరు చేకొనవలె. తే॥ కాక కోకిల వ్యాసంబు, గడఁక వ్రాసి। గురుల నిందించినా రీసీ? కొంక కింత। మీరు విద్యా విశారదుల్ సారమతులు। కారె మిమ్ము నేమంచు నేదూఱువాఁడ. క॥ ఎఱుఁగనివారికి బుద్ధులు। గఱపుట మఱి దిద్దుటెందుఁ గరము సుకరమా। నెఱిఁగియు నెఱుఁగనివారల। తెఱఁగునఁ జరియించు మీకుఁ దెలుపం దరమే! క॥ అపచారంబని యోచక! కృప విద్యలు నేర్పు వెంకటేశ్వర

ఉ. కాకము మీఁదఁ బెట్టి యిటుకాఱులు మీఱుటకన్నఁ జక్కఁగా
'నాకు గురుండె యాతఁ' డని నన్ను వచించినయంత నిన్ను సు
శ్లోకులు కొట్టిరే! నృపతి సూరిగ నొప్పఁడె? యిప్పుడేని యీ
పాకము నేర్చికొమ్ము గుణవంతుల మెప్పును గొమ్ము పుత్త్రికా! 195

---

గురుతో । విపరీతబుద్ధిఁ గలహం। బు పెట్టికొంట దగదెందు, ముప్పుగుఁజుండీ.... చ॥ తిరుపతి వేంకటేశ కవిధీరులకంటెను మీరు పాండితీ । గరిమను గొప్పవారొ? మఱి కారొ? యెఱుంగను గాని వారితో। సరిగఁ గవిత్వమున్ నెఱపఁ జాలినవారని యెన్నఁ జాల నీ। తెరవునఁ బక్కనాఁడనని, తిట్టకుఁడీ భవదీయమిత్త్రుఁడన్. మ॥ అరయన్ దేశికదేవ ధిక్కరణ శ్రీయస్కములై నట్టి యే। వ్వరికిన్ గూడ దటంచుఁ జెప్పవలెనా? ప్రజ్ఞావిశేషంబునన్ । గురుఁడే చూడఁగ వేంకటేశ కవి యోగ్యుల్ మెచ్చ మీరిందు మీ । గురుపాదంబులుపట్టి బాగుపడుఁడీ, క్రోధంబు లో మిగ్రుంగుచున్....ఉ॥ శ్రీపద కృష్ణమూర్తి కవిశేఖరు సన్నిధి మీగురుండు వి । ద్యాపఠనంబు చేసినది యారయ మాసచతుష్కమయ్యె సం। దీపితబుద్ధి నాతని దేశికుఁడంచును జెప్పుచుండు "నే । నేపగిదిన్ గురుం డగుదు నీతని" కంచు వచించు నాతఁడున్.......

బరంపురనివాసి.

గాదె శ్రీజగన్నాథస్వామి.

---

బ్రహ్మశ్రీ తిరుపతివేంకటేశ్వర శతావధానుల సన్నిధికి.

తమగీరతము చూచి శ్రీరామకృష్ణకవులఁ గూర్చి యీక్రిందిపద్యముల వ్రాసియభినవ సరస్వతీ పత్రిక కంపియుంటిమి తాము చిత్తగింతురని సమ్ముఖమున కనిపితిమి: "... మ॥ అరుదెంచెన్ గద రామకృష్ణకవులారా! సర్వదిగ్దేశభా, స్వరసాంద్రోత్సుకవిత్వకీర్తినిచయశ్యామామనోహారులై, వ్వారో ఆ తిర్పతి వేంకటేశకవితాప్రాంచద్ధనుర్ముక్తమై, పరఁగంగాఁగల గీరతప్రదరమువ్వా! యెట్లు సైరింతురో?...సీ॥ గుళికాత్రయంబులోఁ గుంటుశతఘ్నిని బాణు ఒతంబట్టి పాఱఁదోలె, కవితావిమర్శన ఖండనమ్మునకు సర్వాంగముండనమద్దె యల్లుకొనియె, కాశవిగాజుపింగాణిబుడ్డుల జీల్గు బెండులమేకుతోఁ బీఁకు టూరొ, ఏదేశమిష్టమో యెఱిఁగింపుఁడీసభ, కన నిరుత్తరమునఁ జనుటమయ్యె

ఉ. వంకరతోఁక లెన్నఁటికి వంకరతోఁకలె యందుఁ జొచ్చినా,
శంకరుఁడైనఁ దీరుగఁ జాలఁడు; చక్కనితోఁకఁబోవు మీ
వెంకనగారి పట్టుదల వేల్పులు సైతము త్రిప్పఁ జాల రో
వెంకటరామశాస్త్రి! యవివేకి వహైతి వెఱింగి సర్వముల్. 196

ఉ. శ్రీ కలవాట నప్పుగొని చెచ్చెర దీర్పక మానెనేని త
త్పాకము గారణంబుగను దద్గృహ మందెటులో జనించు నట్
వాకులు సత్యమయ్యెఁ గుమి; నాఋణముల్ నను గాకిఁ జేసి నా
వాకిటఁ గోకిలంబ వయి వస్వారె! తీర్చితి; ముట్టెఁ బుత్రికా. 197

క. అప్పు గొని తీర్పకుండిన, యప్పురుషుఁడు కుక్క యగుట యనుభవసిద్ధం
బిప్పుడు కోకిల లగు టిది, తప్పదు కలికాలనూత్నధర్మంబు సుతా. 198

(౬) గీరతప్రశంసాపర్వము.

ఉ. * గీరత మున్న యిట్టి కృతికిన్ భవదీయ విజృంభణంబె సూ?
కారణ మయ్యె నిక్కతనఁ గల్గినలాభ మవారి నాకు, నీ
పేరిటఁగాఁ యిట్టి సుకవిత్వము చెప్పితి; నాకు నే జమీం
దారున కీనిబోలె నెఱదాత యటంచును దోఁచ దర్భకా. 199

---

గీ॥ శక్తిలోఁ దారతమ్యంబు చాటనయ్యె, కవితలోఁ దారతమ్యంబు గాంచ నయ్యె, నింకనీమాఱువేసంబు లెన్నివేసి, నిజము దాఁచుఁగనుంటిరో సుజను లార.

ఇట్లు సోదరులు, దూపాటి తిరుమలశేషాచార్యులు.
వెంకటరమణాచార్యులు

......* గీరతము కొంత భాగమయిన నచ్చుపడి యుండినచో నొక ప్రతి పంపఁగోరెదను.

ఆనందబాగ్ పేట
మదరాసు 19-12-11

చిత్తగింపుఁడు,
జి. రామయ్య

శ్రీరాములు.
శుభమస్తు.

సీ. అవధాన విద్యామహాశాఖ నింతింత వారి నెక్కించిన ధీరమణులు,
రసవత్ప్రబంధనిర్మాణచాతుర్యధుర్యుల నెల్లరను జేయు లలితకవను, లుద్దండ

క॥ ఒకగంట నేను వ్రాసెడి, చకచక కొకవత్సరంబు చాలదు నీకున్
ఖకబకలాడుచు వాదము,నకు దిగకుము మంచిత్రోవ నడువుము పుత్రా. 200

క॥ గర్వియనుచు లోకులు నను, నిర్వచనము సేయనిమ్ము; నిను బోలెడి గం
ధర్వుండు శిష్యుండు దొరకిన, గర్విని బాతకుండ గూడం గావచ్చుంగదా! 201

---

భాషాద్వయోద్దామసాహితీ సతుల నెల్లరం జేయు ప్రౌఢగురులు, బహుచమత్కృతి యుక్తభాషణోపన్యాస పటిమ నందఱకిచ్చు పటువచస్కు, లరయం దిరుపతి వేంకటేశ్వర కవీంద్రు,లే యటంచు మహాలోక మెల్లనుడువ, వాసిం గాంచినకవితా విలాసులార, దిక్స్థితర భవ్యకావ్యవర్ధిష్ణులార! మ. అతినీతిప్రదమై రసప్రచురమై యాహ్లాదసంధాయియై, మతిమత్సత్కవిహృత్కుజాగ్ర్యసమమై, మాయాలతా ప్రాభవ, స్థితిదూరంబయియొప్పు గీరతము భక్తిన్ గ్రమ్మెక్కు నాకిప్డవిగో కృతికృచ్ఛేఖరులారా! పంపుడు దయా శ్రీచేత మైత్రిగన్.

ది 21-7-1912 } గరికిపాడు }

ఇట్లు విధేయుండు,
శిష్టా వేంకట సుబ్బశాస్త్రి.

---

శా. బాపట్లాదిసమస్తపట్టణములన్ బ్రాహ్మల్ మిముల్ వేడం, దా, మేట్లో గ్రహియించి గీరతమునం దించించు పేదెల్ప నే, నాపట్లన్ విని నీతిబోధక కథా వ్యాహారమా గీరతం, బీపట్లన్ దయచేయ వేడెదను స్వామీ వీ. పి గా గ్రక్కునన్.

ఇట్లు సుధీకవి విధేయుండు
25-5-1912. శ్రీరామకవి పుత్రుండు జమ్మలమడక కోటయ్యశాస్త్రి.

---

...క. మీయంతటి మహనీయులె, యీయొక గీరతము వ్రాయ కెద గానున్నన్, సిరా పచ్చి గుంజలు సైతముం, బాయక తలపండు ప్రిలన్న భావములైనన్.

కొండపాటూరు, 20-7-12. వంకేటి వేంకటనరసింహము.

......ఉ (పంచపాది.) తిక్కనసోమయాజి కవిశేఖర కల్పితమైనభారతం, బొక్కటి దక్కనింకొకటి బోధనసేయునె నీతులంను నే, నెక్కుడుగాం దలంచ నొక నెచ్చెలి యిచ్చటికేగుదెంచి నీ, వెక్కుడుగాం దలంచుపది యల్లడియయ్యెను గీరతంబునం, దెక్కుడు ధర్మమార్గములు, తేట తెల్లుంగని తెల్ప నంతటన్ ... ...

12-7-1912 వనగల గోపాలకృష్ణయ్యవారలు
పెదనందిపాడు.

క. 'ఎవ రిచ్చిరి కవితను నీ, కవనీపాలకత'యంచు ననవత్తువె! తా
నెవరిడిరి సింగమునకు న, టవిలో రాజ్యమ్ము మృగపటలములమీఁదన్? 202

క. 'గర్వం బెదిగెనుగా!' నా, గర్వము చూచెదవుగాక, కానీరాదే!
సర్వాహంకృతివారణ, ధూర్వహ మగుసభ నొకఁడు దులిపెద రిక్కల్. 203

క. 'ఎవరిడిరి జోడుకాగడ, లవినీతుఁడ! నీకు'ననిన 'నాముదపుం జే
నివి యొసఁగె' ననుచుఁ జెప్పిన, యవివేకికిఁగాకి నెఱుఁగు,మన్న యటంచున్

---

శ్రీశివాయనమః

...తిరుపతివేంకటేశ కవిధీర వతంసములార! మీకు నే, నెరఁగి త్రియీ సుధిన్ బుధ హృదీప్సితలక్షణ లక్ష్యభార సం, భరితము నీతిదాయకము ప్రాజ్ఞ గురూత్తమ శిష్యవృత్తి సం, స్ఫురణ ధురీణసంఘజన సన్నుతిపాత్రి మరిత్రిపా ఠనస్ఫురణచణప్రచారణము సారపదర్థ సమర్థశబ్ద సం, చరణము తత్తదుత్తమ రసప్రతిభాగతిభాసితంబునై, పరఁగెడుగీరతమ్మొకఁడు బంపఁగ మిమ్ము నుతమ్ము వేఁడెదన్.

బాపట్లతాలూకా, బాపట్లపోస్టు, విధేయుడు

కొండపాటూరు. జమ్మలమడక శ్రీరాములు.

శ్రీ వీరవెంకట సత్యనారాయణస్వామి వారి సన్నిధిని వున్న ఆస్థాన పండితులు ధేరం మహాదేవ శాస్త్రిగారున్ను, యింకావున్న శ్రీస్వామివారి నవుకర్లున్ను, మీగ్రంథములు అన్ని చూచేనిమిత్తం కుతూహలులై యుండి అందులో గీరతమందు చాలా ఆసక్తితో వున్నారు ... తప్పక ప్రస్తుతం గీరతము పంపించ కోరుచున్నాను.

చామర్తి జగ్గారావు, బెండపూడి.

...... క॥ ంటాశత పత్రిధముల మం, డంటారఁట! లోకమెంతకైనఁదగును మా, కంటిని నేనని యొకఁడిటుఁ, గొంటి...... బొట్టుపెట్టి గోలయొనర్చెన్ ...... శా॥ గంగోత్తుంగతరంగఘుంఘుమరవాకారానుకార్యార్భటీ, భంగిన్ దాత్రిక్షుగుళుచ్ఛనిస్స్మృతరసప్రచ్ఛన్నవేషంబు మీ, సాంగత్యమ్మునఁ బొల్చు సత్కవితకే చందంబునన్ సాటి? భూ, మిం గ్రీఁగంటిప్రసార సూక్ష్మకవితా మీసాక్షు లూహింపఁగన్......

ఇట్లు జూపూడి హనుమచ్ఛాస్త్రి, శతావధాని.

చ. ఉడుగక వ్రాసి తెందులకొ యుజ్జలకుణ్, "గురుఁ డాతఁ డంచు నే
నొడువక యున్న శిష్యుఁ డని నూటికిఁ గోటికిఁగూడ నీవు నె
ప్పుడునది చాలదే" యనుట పెంకెతనం బిది, "యింటివాఁడు పే
రిడి యిది గొడ్డుగేద" యన నింకొకఁ డాడును పాడి నెరగణ్. 205

క. కల రెండ తెని శిష్యులు, కలిలో నాకుఁబలె నితరకవులకు; మఱి నా
కలకుణ్ వారికిఁ గలహము, గలుగని దెటుఁ, నీకు నాకుఁ గలిగినదెట్టుల్? 206

సీ. నారాయణాస్త్రమ్మునకు నమస్కారమ్ము శ్రీకృష్ణుఁ డావాఁడు చేయలేఁడె!
భీష్మసాయకవహ్ని బిట్టేర్చి మండంగఁ గృష్ణుని ప్రీతిని చెప్టెక్కలేదె!
పదునెన్మిదవ నాఁటి పడుచుపాలునిబారి కెదఁగొంకి పాఱఁడే కృష్ణుఁ డెటకొ!
సైంధవవధకు నాచార్య వ్రేముక్కులుంపఁడే శ్రీకృష్ణుఁ డా నాఁడు క్రీడిచేత!

తే. గీ. నిజముగా నామసామ్యంబు నీదు బావ
మఱఁది కృష్ణునకున్న నమ్మహితగుణము

---

...... చ॥ చదువుదు నూరనాది కవిచంద్ర చతుర్థ్వి కవిత్వసారముణ్, ముద
మెద నూరుచుండ మురుమున్నిఁక నెప్పుడు గూడ నల్లెనా, హృదయము గీ
తామృత మొకింత చవిఁగొను నాఁటఁగో లెఁడా, యదురుచి సర్వకాల మవురా?
కవనం బిటులుండు టొప్పదే. ఇట్లు విన్నవించి నమస్కరించు

ఆర్యాపుత్రుఁడు, విధేయుఁడు

రాజమహేంద్రవరము 18-1-1913 భమిడిపల్లి సీతారామయ్య.

---

......నవీనముగా రచింపబడిన పంచను వేడ ప్రీతిమానంబగు గీరతంబును దయ చేయించ గలందులకు ప్రార్థనచేస్తున్నాను

సా॥ వెలగదుర్రు, పెనుకుతాలూకా. నరసింహ దేవర గవరయ్య

---

(1) ... కలకత్తాచేరినాను, తమగీరతము వినపలచుటన యిచ్చటి యాంధ్ర విద్యార్థులందఱు నువిళ్లులూరుచున్నారు. కాన యీజాబు చూచినవెంటనే తము గీరతము నీక్రిందీ విలాసమునకు పంప ప్రార్థించుచున్నాను.

(2)... గీరతమును శిరసావహించితిని ఆగ్రంథరాజము నొక్కపరి చదివి తనివిదీరక యవకాశము చిక్కినప్పుడెల్ల నందలి భాగముల మాటిమాటికిం జదువి యానందించుచుంటిని

191 Bow Bazar Calcutta Dantu Subbavadhany

గూడ నున్నను గీర్తి చేకూఱనీఁడు
ఎట్టులో నిన్నుఁగాపాడి యేమిఫలము.

సీ. సకలాగమాంతసంచారి యాకృష్ణుండు సకలాగమాంతసంచారి యితఁడు
పరమసత్యాసక్తభావుఁ డాకృష్ణుండు పరమసత్యాసక్తభావుఁ డితఁడు

---

......గీరత సందర్శనార్థమై చంద్రచకోర న్యాయముగా వేడుచున్నాడను. వేగిర మంపకోరెదను. చిత్తగింపవలెను.

K. V. Kristna Rao.

...... గీరతము అనుమహాగ్రంథమును పకటి నాకు పంపకోరుచున్నాను. యీ గీరతము నేను చదివి జన్మసాఫల్యము చేసుకొనుటకై వ్రాసుకోవడమైనది

చీరాల ది 30-6-12 తేలప్రోలు సుబ్బారావు వ్రాలు.

......మ॥ జన్మంబోలిన మీకవిత్వ మొకబల్ విందయ్యె మమ్మెప్పుడే, గన్నారంగని చేఁ ధన్మఘుఁ పాగ్యాభాస్యాలోక నో, త్పన్నానంద విచిత్రచారు మణి సౌధంబెక్కఁ గాంక్షింతుర, మ్మున్నె పచ్చెఁ దెల్లపిల్ల పరవంతాగ్రణ్య ముక్తామణీ. సీ॥ అష్టావధానశతావధానము లనుపని చిన్ననాఁడె నేర్చినదికాదె! వాగ్వాదమందు విద్వాంసుల గెల్చుట కరతలామలకమ్ముకాదె! రసవత్ప్రబంధ నిర్మాణ చాతుర్యమ్ము తమకు స్వార్జితమైన ధనముకాదె! దిక్సాధించ రత్కీర్తి మీకొక స్వయంవరలబ్ధయౌ ధర్మపత్ని కాదె! గీ॥ యనుచు నుతులను సామాన్యజనమె కాదు, నైరులకునైనఁ జేయక తీరదనుచు, నాకుఁదోఁచెను సత్కవిలోకతిలక, వేంకటేశ్వర కవివర్య! వినుతచర్య. చ॥ మఱియొక చిన్నవిన్నపము మన్నన చేసెద రంచునెంచి యి, త్తెఱఁగున వేఁడుచుంటి భవదీయకృతి పరిజమందు సత్ప్రభా, కిరదకలంకసంఘటిత గీరతముం బరికింప వేఁకటే శ్వరకవివర్య! మీకృతులు సర్వముఁ జూడఁగ వేడ్క యయ్యెడిన్.

ఇట్లు అకొండి వెంకటశాస్త్రి
బొబ్బిలి సంస్కృతపాఠశాలాపండితుఁడు.

...... ఆ. వి పి. సంతోష పూర్వకముగా ౩-౮-౦ చెల్లించి పుచ్చుకొని గీరతం చదివి పరమానందమును పొందినాను, రెండవ భాగముకూడా త్వరలో అచ్చువేయించి పంపించగలందులకు కోరుచున్నాను మ॥ రా॥ శ్రీ. వెం రా॥ గ్రంథమాల ద్వితీయగుచ్ఛకములో శృంగభంగమందు "కాముని జేతఁబట్టి" యను పద్యము మొదలు నాలుగు పద్యములు చదివినంతనే వాని వ్రాతలయందు

గాంగేయగౌరవాక్రాంతుఁడా కృష్ణుండు గాంగేయగౌరవాక్రాంతుఁడితఁడు
పూతనానాశనస్ఫీతుఁడా కృష్ణుండు పూతనానాశనస్ఫీతుఁడితఁడు

తే. గీ. అర్థభేదమ్ము దక్క లేదతని కితని
కెందు శబ్దంబు లొకగతినే పొసంగు
నేర్చికొను మాతనిగొనాలు నీకు నిహప
రంబులఁ బ్రతిష్ఠ కధ్యంతరంబు లేదు 208

వ. గోవర్ధనుఁడాతండా, గోవర్ధనుఁడితఁడు వీని కుచ్చితమే ని న్నివిధిఁ ద్రిప్పెఁ దప్పుడు, శ్రోతలు నీవింత మును పెఱుంగ వెఱుఁగుదుర్.

---

సందేహములో నుండిన మమ్మును మీ గీరతమువల్లను సంశయనివృత్తి చేసి నందుకు చాలా సంతోషముగా నున్నాను.

Baruva Post }
Ganjam District. } P. Janardanam Naidu.

...యీ గీరతంలో పర్వాంశములున్ను వున్నవనిన్నీ బహుబాగా వున్నదనిన్నీ, చూచినవారు చెప్పడంచేత నాకు చాలా కుతూహలంగావుండి యీ వుత్తరం వ్రాసినాను గాన ముఖ్యముగా పంపించకోరుతాను.

ది 14-10-12, ఆ॥ సుబ్రహ్మణ్యం.

......గీరతము ఇప్పటివరకు కొంత చదివితిని. యింతవరకు నాకు తీసి వేయవలసినపద్య మొకటియు కనుపడలేదు ఇది నాయొక్క నిశ్చయమైన యభిప్రాయము (తమయొక్క) గీరతములో 34 వ పేజీలో "కృతి" యన్న కంద పద్యములో ప్రాసపోయినటులు నాకుదోచినది.

నూజవీడు, 28-7-12. నారయ్యప్పారావు.

అయ్యా! 12-7-12, చిత్రాడ.

తమరు పంపించిన గీరతము అందినది. గ్రంథంబు చదివినకొలది మాయుల్లంబపరిమితానందవార్ధిఁ దేలుచుండె పంచమవేదం బనంబడు భారతంబునీతి మీ గీరతపుస్తకంబు పెక్కునీతులచే విరాజిల్లుచుండె. తక్కిన భాగంబులుకూడ అచ్చుపడిన వెంటనే పంపించగోరెదను. తమరు కావించిన శతావధానగ్రంథము లన్నియు వి. పి. గా పంపించకోరెదను. ఇట్లువిధేయుడు

చెలికాని లచ్చారావు.

ఉ. ద్రావిడులందు మాగురుగదా! గుణవంతులు, నేను బాపడన్
నీవును సర్దుకొందము; "మనీషులు నవ్వెడికూళ్ళ" తిర్పతిన్
జేవరయటుల్ స్మరించు! గురుశిష్యవినోదము లింత చక్కఁగా
నావలె నీవలెన్ దెలియునా! వెలనాఁటి శతావధానికిన్. 210

శా. శ్రీకృష్ణుం డుదయించు హేతువున సుశ్రీమించె వేపల్లె, నీ
యా కృష్ణుం డుదయించు హేతువుననో! యాకారపల్లీసమా
ఖ్యాకగ్రామము దుర్యశోభ్యుదయపారావారమున్ దాఁటలే
దే కాకాంతఁ గుందునుండెఁ గనుఁగొంటే శిష్యచూడామణీ. 211

---

శా॥ అయ్యా! వీఁడను శిష్యకోటికిఁ బ్రశిష్యప్రాయుఁడౌ వీరమ। ల్లయ్యాఖ్యుం డొకఁడు వచించు విన్నపము నిర్యాంతర్యమందుం గొనుం। డయ్యా! యీయన మానకక్షురము బోంట్లా పూను? టూరాముక్కు। ష్ణయ్యల్ పిన్నలు సర్వనర్మముల మీరైనన్ గృపన్ మానుఁడీ॥ ఉ॥ వారలతప్పు తొల్త గురునర్యుల నెన్నక యుంట,పిమ్మటన్। మీఁఱుట; రెంటిలో మొదటి దోసము తప్పని వారెయొప్పి రా.। వేఱొకదోసమేమి? తమరు వేసము పోషణ సేసికొంటకా। దానిఁ బోయి గంధులకుఁ దగ్గ చివాట్లిడి రంత చాలదే. ......

Bezvada. 12—1—1911,

ఇట్లు విన్నవించు భవద్విధేయుఁడు,
కాశీనాథుని వీరమల్లయ్య.

— —

31-1-1911, గుంటూరు.

శుభము.

(1)...క॥ శ్రీతిరుపతి వేంకటకవు। లూతేకులు వినుఁడు నాయపూర్వపు మనవిన్। మీ తెలుఁగు గీరతమ్మొక। గీతతతి నాకంపఁజేయుఁడీ వీ. పీ. గాన్॥ క॥ అప్పటికా భారతమిఁక। నిప్పటికి గీరతంబు నెన్నో విధములన్। చెప్పఁగఁ దెలుపదె ననియెద। చెప్పుడు చూతునో యటంచు నేననుకొందున్. ......

(2)...గీరతము కడపటిపుటదాఁకఁ జూచితిని సక్రమము, సరసము, సుసందర్భము నై యున్నది. ధారాస్వారస్యాదులకు మెచ్చనివారు ముందుపుట్టవలెను.

ఇట్లు, శిష్టాహానుమచ్ఛాస్త్రి, గుంటూరు.
తెలుగుపండితుఁడు, టౌనుహైస్కూలు.

ఉ. కాఁకరపత్త్రి లేఖలను గాంచి సదుత్తర మేదిలేమి వా
ర్తాకు సమీప బంధు లనిన న్ జగమొప్పెడి నంచు నెంచి,యా
పాఁతున దూరదేశగతసజ్జనుల న్ గికురింప నెంచెదే?
యీకపటంబు కృష్ణకవిదే యగునో? మఱి నీదియో? సుతా. 312

---

(1)... గీ॥ మీ కవిత్వమున న్ బహు మిన్న గునఁట!। బహుకవులచేత సన్నుతుల్ పడసినదఁట!। ప్రతికృతులంగూడ సంతోషపఱచినదఁట!। భారతమునకుఁ బ్రతియగు గీరతంబు.

(2)......మీరంపిన గీరతమందినది. దానిని సమగ్రముగా జూచినాను. మీగీరతమందు మాకు తెలిసిన విషయములు వారివిషయమై వినుండు. (1) గురువును మఱచుట. (2) రిజష్టరుత్తరం త్రిప్పివేయుట. (3) చాటువపద్యములల్లుట. (4) వ్రాసినమాటకు బదులు వ్రాయకుండుట. (5) శృంగభంగములు వ్రాయుట మొదలయినవి గ్రహించితిమి. మార్గముఁ జూపినను తెలిసికొనలేనివారితో నేమి సార్థకము. ... తెలికేపల్లి రామకృష్ణయ్య, వేలూరు, చిల్కలూరిపేటపోస్టు.

---

...ఉ॥ గీరతమన్న సర్వగుణ కీలితమార్దవ పాకసారమ। వ్వారిగఁ జూచి దానిప్రతివర్ణసరద్రసప్రసారమానఁ డ। ద్భారతపై ఖరించెగడెఁ దక్షిణభాగము లన్ని పూర్తిగా। గూరిచి వేగమంపుఁడిది గోరెదఁ దిర్పతి వేంకటేశ్వరా.
18-11-12, సోమవారం. గుంటుపల్లి గోపాలకృష్ణయ్య.

---

అయ్యా!

తమరు చేసిన గీరతము చాలా బాగావున్నదనిన్నీ, మిక్కిలి రసవంతముగా వున్నదనిన్ని, మీవాక్కు అనేసరస్వతికి ఈగ్రంథము ముఖ్యస్థానమనిన్ని వింటిని.

చర్ల సూర్యనారాయణ వ్రాలు.

---

(1)...గీరతము 1 ప్రతిన్ని... ఈ నాల్గుప్రతులు వీ. పీ. గా పంపవలయునని విత్యాయి నమస్కరించుచున్నాను.

(2) ... గీరతామ్నాయము కడవరకు చదివినాను. యియ్యది కలియుగభారతమనుటకు యేమిన్ని సందియము లేదాయెను.

పేరిచర్ల హనుమంతరాజు వ్రాలు, ది 6-9-1912.

కాకాని, సంతమాగులూరుపోస్టు.

* శా. నీమేనత్త కొమారుఁడే తెలిపె ? వానింగూడ నా బందువం
చేమేనిన్ లిఖియింప నేరుతువె ? మీకృష్ణుండు నీతండునున్
సామాన్యంబుగ నన్నదమ్ములసుతుల్ ; సత్యంబునందొక్కఁడు
ద్దాముం, డింకొకఁడో ? యసత్యము విద్వాంసుండు శిష్యాగ్రణీ! 213

---

ది 18-9-10.

గొల్లకోట భైరవశాస్త్రి అనేక నమస్కారములు ... యీమధ్య తమరు అచ్చువేయించిన వాదపత్రిక నాకు వినడమందు చాలా కుతూహలముగానున్నది. పిఠాపురములో తమ పత్రికను చూచినవారు చాలా సంతోషించుచున్నారు... ...యీపత్రికయున్న పంపించితే దానిఖరీదులు దాఖలు చేస్తున్నాను.

ఇట్లు విధేయుడు గొ॥ భై॥ శాస్త్రి.

......ఉ॥ వింటిని గీరతమ్మనను వేదమె యౌనని ధర్మబోధయం| దుంటిని, వచ్చుబెడ్డాయని యో గురుశేఖర ! గీరతమ్ము నేఁ| డంటిని వేదమే యనుచు నారసి యోగసవిల్ కవీంద్ర ! నా| కొంటిని వీ పి. గా నొకటి కోరిక నా కొకఁడంప మిమ్ములన్.

ఇట్లు

శిష్టా హనుమత్ శాస్త్రులవారి శిష్యుఁడు,

మంత్రాల కామేశ్వరరావు.

---

...... శ్లో॥ శ్రీమద్వేంకట రామకృష్ణకవిభి ర్మిథ్యాప్రలాపాత్మకో, దుష్టర్ణగ్రంథవిమోచనాత్మకతయా గ్రంథస్తు యో నిర్మితః, దృష్ట్వాతం బహుధా వినిశ్చితధియా— మస్మిన్ప్రజానాంచచ శ్చిత్తే కించిదపి, ప్రవక్తృమలస త్వద్గీరతా దర్శనాత్॥ శ్లో॥ యుష్మన్నిరాఘాట కవిత్వధాటీ, సముత్థితాఖండయశోఘురీం తాం, సభాసుకీర్తాయితుం మనోమే, నిరీక్షితుం కాంక్షతి గీరతంచ॥

ఇట్లు తమ విధేయుడు, మేడవరం సుబ్రహ్మణ్యశాస్త్రి,

కర్నూల్ జిల్లా, [illegible] తాలూకా, యోగిగొండపాలెం

* ...తమ గీరతామ్నాయము అనేకమార్లు నేను చదివియున్నాను. దానిశైలి యిట్టిదని వర్ణించుటకు తగినంత సామర్థ్యం భగవంతుడు యివ్వలేదు...చప్పట్లపర్వములో మా సూర్యనారాయణశాస్త్రులను నాటి అల్లరికి అంతకీ కారకుడుగా వ్రాయించినారు. అది అన్యాయమని నేను దలచుచుంటిని. అతడు వెంకట్రామయ్యవలె తమకు చిరకాలపు శిష్యుడు కాకపోయినను మా రామకృష్ణయ్యంత శిష్యుడు

ఉ. వేదుల రామకృష్ణునకు వేదులవారును, జర్లకుల్ స్వదా
యాదులును విరుద్ధులయి యర్భక! సత్యము తెల్పఁ బూను టు
న్మాదము పుట్టికా; దది ప్రమాదములోఁ బడు వారిఁబట్టి దు
ర్వాదము చేయు టొప్పదని వారు తలంచుట నుమ్మి పుత్రికా! 214

చ. ఒకఁ డెవఁడో వివేకవిరహంబు దుదయించిన నంతమాత్రి స
త్ప్రకరపరంపరాజనిపదంబులు వంశము లప్రతిష్ఠచేఁ
గకవిక గాంచఁబోవనుచు గట్టిగ చాటుట కున్నమాట వా
రకుటిలచిత్తులై దెలిపి రంచు జగంబు గ్రహించుఁ గావుతన్. 215

---

కాకపోదు. వీరుభయులున్నూ మీయందున, మీకవిత్వమందున, విశేషమైన భక్తి కలవారైనను, మా పెత్తండ్రిగారి అబ్బాయి యిటీవల భక్తిలేనివాడుగా మీకు కనుపించుచున్నాడు. అతనిని గురించి నేను వ్రాసినను వీలులేదు గాని నిజానికి అంతరంగమునందు మీరన్నా, మీకవిత్వమన్నా, ఇప్పటికిన్నీ భక్తిగలవాడే అని నేనేకాక మాగ్రామమంతా కూడా యెరిగిన సంగతియే, మా సూర్యనారాయణశాస్త్రియో మీవిషయమై యెప్పుడుగాని, యేవిధమైన చెడుప్రసంగము చేసినవాడు కాడు. యితనిని శృంగభంగంలో సీసపద్యంలో సాక్షిగా వేసుకున్నను సమయంవస్తే నిజం చెప్పేవాడే కాని వేరు మోస్తరువాడు కాడు, యితడే కాదు వాళ్లు వ్రాసిన సాక్షులంతా ప్రమేయంవస్తే, ఆవేళను జరిగిన పని తప్పుడుపని అనిన్నీ దానికి ముఖ్యకారకులు మా రామకృష్ణమ్మ మాట అటుండగా, శ్రీవ్యాసమూర్తిశాస్త్రులుగారి తమ్ముడువల్లనే అని మాగ్రామంలో చెప్పనివారు ఒక్కరు వుండరు. యిట్టిస్థితిలో మా సూర్యనారాయణశాస్త్రి ముఖ్యకారకుడు అని తాము అభిప్రాయపడుట అతనికిన్నీ నాకున్నూ చాలా విచారముగానున్నది. యీ సంగతి అతడు చాలాసార్లు నాతో ముచ్చటించినాడు. శృంగభంగము తప్పుడుకూతలు అయినప్పటికిన్నీ అతడు అచ్చునకు తీసుకొనివెళ్లుట, అనాలోచన పనిగా తమరు సమ్మసలెను, ఇటీవల అవధానము లలో తమరిని గురుస్తుతిగా నటించినాడు. ఆపద్యము నాతో చాలాసార్లు పిన మని చెప్పినాడు. ఆపద్యములు ముందు అచ్చులోనున్నవి, చూడగలరు. ఆరెండవనాటి అల్లరిసంధిలో కాకరపర్తి వెంకటశాస్త్రియున్నూ; నారాయణశాస్త్రి గారున్నూ, వీరికీ సంబంధించిన వారున్నూ కాక మిగతా వారికీయుద్దేశం కల

చ. ఎఱుఁగని వారి కన్నుల నెఱే నిసు మూరక చల్లవచ్చు; ద
గ్గఱఁగల బంధుజాతపు మొగంబులు మూయఁగనేర; పూరకే
పరుగిడ కిప్పుడేనియు సెబాసనిపించు కొనంగ యత్నముం
బొరయుము; కృష్ణసత్కవికి బుద్ధిని జెప్పి మగల్చు మర్భకా! 216

వారు కారు. మీరుమాత్రం అప్పుడు అంతా దురుద్దేశం కలవారలే అని అనుకొనియుందురు. యిటీవల సత్యనిర్ధారణకు తోడ్పడినవాళ్లను తప్పించుటచే మా కార్యర్థము స్పష్టమవుచున్నది మాసూర్యనారాయణశాస్త్రి అల్లాతోడ్పడకున్నప్పటికి దురుద్దేశము కలవాడు కాడు, యితడు మీగీరతంరాకకై యెదురుచూచుచు నన్ను ప్రతిరోజున్నూ అడుగుచుండేవాడు. వచ్చినతరువాత మిక్కిలిగా సంతోషించిన వ్యాకరణశాస్త్రి వగైరాలతో పాటితని నొక్కనిగా భావించుచు రెండవకూర్పులో యితనిని సవరించెదరని నమ్మెదను...... మరువినమందు పశ్చాత్తాపపడని వారేలేరు, ఒకనాడు మా రామచంద్ర పెదనాయనగారు, మా రామకృష్ణమ్మను చీవాట్లువేయగా నేనువిన్నాను. యెవళ్ళు యెంతదాచుకున్నా సంగతులు తెలియకపోవు కోకిలకాకములలో 'కావు, కావు, కావు, కావు, అను కల్పనయె యిప్పటికిని మీ కవిత్వమందు వాళ్లకు భక్తి కలదని చెప్పుచునేయుండును. సీ॥ ఇవి రాజసుతులు చేయఁదలసిన పనులు కావు కావంచు గాకమ్ములఱచె' అను బుద్ధచరిత్ర సీసపద్యమును జూచినవారికి విస్పష్టమే, లోకములో సత్యమును గ్రహించేవారు పలువురు వున్నా అనృతపు వ్రాతలు వ్రాశేవారు వ్రాయకమానరు. వేమవరంలో తమకు జరిగిన సన్మానమును తమకు అక్కడ జూపిన అసాధారణశక్తియు ఒకవిద్యార్థి అక్కడ స్వయంగా చూచివచ్చి మావూరిలో నాకు చెప్పినాడు. శ్రీశీతారామశాస్త్రి, మరియు మొదలైనవార్లు చాలాసంతోషించినారు. విచారించే కూటములో వారు గూడా కొంతమంది నాదగ్గర సంతోషించినారు. యిటీవల నేను యేలూరు వస్తిని అక్కడ ఆంధ్రపత్రికలో కామేశ్వరకవి వ్రాతచూస్తిని, ఆవ్రాతకున్నూ నేనువిన్నదానికీ సంబంధములేదు. ఆ వ్రాతలు ప్రకటించిన పత్రికాధిపతి తెల్వితేటలను గూర్చి నాకు చాలా విచారకరమైయున్నది. ఎప్పుడున్నూ దుర్మార్గులు చెడుపనులు చేస్తూనే వుంటారన్నందులకు, ఆవ్రాత దృష్టాంతముగా యున్నది. యీవ్రాతల నిజము మావాడు యెరిగివుండి కూడా యేదో పేరుపెట్టి ప్రకటిస్తూయుంటాడు, యిట్టి వ్రాతలవలన గాని పట్టికోతల వలన

చ. సకల మెఱింగి నా కపయశం బొడఁగూర్పఁగ నెంచి నెట్టి దు
ష్ప్రకటనముల్ పొరింబొరిగఁ బత్రిక నించెదరే? కొండవీటివా
రికి మఱి బాసటయ్యెదె? యరిపత్రికరంబు లిఖించు దుర్వచః
ప్రకరము పాత్రమందుఁ గొని పల్లదముల్ లిఖియింతువే సుతా! 217

ఉ. పుట్టినదుత్తమాన్వయము, పోయి వసించినచోటు ధర్మపుం
బట్టము పీఠికాపురము, పార్థివుఁడో యలధర్మరాజె, నీ

---

గాని మీకీర్తికి యినుమంతయు లోపంబురాదు ........ బ్రహ్మానందశాస్త్రి వ్రాసినట్టుగా మా గ్రామములో కొంతమంది కోతిమూకవున్నది ...... పుంగవుల కొరకు గుంటూరులో మూడుమాసములు వసించిన మీరు మా గ్రామములో రెండురోజులైనను వసించినయెడల మీవైరులెంతగంభీరులో తెలియక పోవునా, చర్ల చలపతి వ్రాసిన క్షమార్పణ ప్రత్యుత్తరం వల్లనే తమకు గోచరించివుండవచ్చును... పిడుగువంటిది తిరుపతిశాస్త్రిగారి ప్రత్యుత్తరం వచ్చినతోడనే అతనికే కాదు ఆపక్షములో పెద్దతలకాయలకును గుండెజలజనించె... వీరిఘాటికి వారేవరు. వీరెందులోవారు. మహాగజాః పలాయంతే మశకానాంతుకాకథా, యిది పిచ్చుకపై వజ్రాయుధ మున్నట్లు యున్నది. అయిన సరె ఒకమిషచేసుకొని మీరు మాబోంట్లందరికి గురుశిష్య ధర్మాలను వుపదేశించుటచే లోకోపకారమని చాలామంది పెద్దలెల్లరు నుడువగా నేను విన్నాను మీగీరతమునుజూచి నారాయణశాస్త్రికూడా సూర్యనారాయణశాస్త్రితో 'నిన్ను కారకునిగా వ్రాసినారు. గాని యింతచేసిన మమ్మ యేమియు దూషణవ్రాత వ్రాయనేలేదు గదా. బాగుగానున్నదే' అని పకనాడు అనివున్నాడు ... రెండవ కూర్పులో సూర్యనారాయణశాస్త్రిని తప్పక నిరపరాధినిగా వివరణచేస్తారని నానమ్మకము యివియే అనేక నమస్కారములు.

సామవేద్ల సూర్యనారాయణావధానులు వ్రాలు.
సాకిన్ కాకరపర్రు.

---

క్షేమము, ఆశీర్వచనములు.

మీరు మావూరు వచ్చినప్పుడు ఇంకా వుంటారుకదా అనుకొన్నాము. వెంటనే వెళ్ళిపోయినారు. మీరు యెంతగొప్పవారయినను బంధువులను అనాదరించడము న్యాయముకాదు. మావూళ్ళో యెవళ్ళో అల్లరిచేసినారని మేమంతా

భూపులఁ జిన్నఁబుచ్చెదవు పొచ్చెము పన్నుట కీవు నేరవే?
దాపున దావ లేఁడె? యిది తజ్ఞులు దక్క జగం బెఱుంగునే! 222

ఉ. కోయిల యెల్లకాల మొకకోటరమందె వసింప, దొక్కటొ
తీయని మావిగున్నెగతిం దలపోయదు; మావిగున్నలం
దేయెడ సంచరించు టది యెవ్వ రెఱుంగరె? యొక్కసారి పైఁ
బోయి స్వశక్తిపద్ధతులు పొంపిరివో విహరింపు మర్భకా!

ఉ. కాకులబాధ బాల్యమునఁ గాని యనంతరమందు నుండ దీ
పాకము నీవెఱుంగవొకొ? ప్రౌఢత గల్గిన కోకిలంబుతో
డీకొనవెందుఁ గాకములు దేకకు మూలల, సత్సభాస్థలిన్
బ్రాకటశక్తిఁ జూపుము ప్రపంచక మెల్ల నిజం బెఱింగెడిన్. 224

ఉ. అల్లెదు పద్దెముల్, సరిగ నయ్యవి యుండెడి, సందియంబు లే;
దల్లెడియంత నే జగము లల్లన మెచ్చునె? యెన్నిశక్తులో
పల్లవితంబులై నయెడఁ బ్రాజ్ఞులు మెచ్చెద; రప్డుగూడఁ గీ
ర్త్యుల్లసనంబు దుర్లభమె యో పిక! యోపిక నెంచి చూడుమా! 225

ఉ. నిద్దుర వోవుమోము, గణనీయము గాని గళంబు, మేటియా
పద్దెపు దెల్పుధార, విన వాంఛ జనింపనివాక్కు గాక యే
పిద్దియగాని నేర్చిన వివేకులు సత్సభలోనివారలన్
దద్దయు మెచ్చఁజేతు రని దజ్ఞులు దెల్పుదు రీ వెఱుంగవే! 226

ఉ. పెద్దలు వచ్చువక్కలఁది బిట్టుగ విస్మృతమౌ శరీరమున్,
గద్దతమూఁకఁ జూచునెడఁ గంకెడు పెంకెతనమ్ము, వాక్కులం
బెద్దతికంబుఁ బ్రౌఢిమయుఁ బెక్కుగుణమ్ములు వొల్చు జాణయే
తద్దఁ బ్రపంచపున్నుతికిఁ దాఁ దగు సన్యు లనన్యులే సుమీ. 227

ఉ. పెంకెతెంఁ బెంకె, పెద్దను పెద్దగ నెవ్వఁడు సంచరించునో
లంకకు వాఁడు వోయినను లక్ష్యము లేక జయించి వచ్చు, ని

---

చేసెదమనిన్ని వుభయపార్టీలకు పత్రికవుత్తరములు వ్రాయించెదమనిన్ని యీ
ప్రత్యుత్తరం అందినతోడనే ఒకరోజు శెలవుపుచ్చుకొని రావలసినదిగా శెలవుయిచ్చి
నందున విన్నవించెదను. ది 11-8-11 (చేవాలిలు)

శ్యంకుని నాంజనేయుని నట సాక్షిగఁ గైకొను; మాతఁ డెంతయో
వెంకె సురారికోటి యెడఁ, బృథ్వీతనూజ యెడన్ వినమ్రుఁడే. 228

ఉ. ఈ వచియించు లక్షణము లిన్నియుఁ గల్గినవార లెందఱో
భూవలయమ్మునం దొకటఁ బొల్పువహింప రొకండొ యిద్దఱో
హా! వెలయంగలార, లివి చొప్పడెఁ బో శివరామునం దెటో
దైవవశమ్మునన్; వృథగఁ దజ్ఞుని వానిని దూఱు టొప్పునే. 229

ఉ. దూఱుము నన్ను సారెకును దూఱుకొలంది యశమ్ము నీకు నేఁ
జేరఁగఁజేతు; నూరక ప్రసిద్ధిఘటిల్లుచునున్న యప్పుడీ
వేరికి నేల జంకెద? విదే యొక విద్దెగఁ జేసికొంటి నా
ఘోరణి మేలు! మేలు! గురుదూఱి యశమ్ము సహించి తౌ బళీ! 230

మ. * "అవధానం బది చేయలేదు శివరామాఖ్యుండు తద్దేశికుల్
శివరామున్ గవిఁ జేసి వారె పనులన్ చేసెతఁ గావించి" రం
చు వివేకం బలరార వ్రాసితి మహో! కుంఠల్ ప్రసంగించు దు
ర్వ్యవసాయంబులు నీకు సాక్ష్యలొకో? నీవన్యునికిన్ మాఱెదే. 231

ఉ. అతఁ డతిఘోరమృత్యుకరత నాఱడికూఁతలు సైఁచినాఁడు; ప్రా
జ్ఞతగలవాఁడనే నతని ప్రశ్న గనుంగొను; మింతయేల ధీ
యుతుఁ డతఁ డొక్క పద్యము నొహో యని లోకము మెచ్చఁబోఁడు, నా
చతురత నీకు కాదు చుమి సాక్ష్యముగా దది యెట్టిపట్టునన్.

చ. అతనికి నీకుఁ బోల్కి యగు నంచును దజ్ఞుఁ డెవండుగాని సూ
నృతమును బాహుసేయని మనిషియెయేని వచింపఁబోఁడు; నీ

---

(అట్టహాసమునుండి)

*......కృష్ణ— ఇప్పుడు తిరుపతి వేంకటకవులు తమపుస్తకముల జాబితాలోఁ గలిపి ప్రకటించి యమ్ముకొనుచున్న యవధాన మదియేనా యేమిటి!

దేశమాత— ఔను. అదియే. మొదటనుండియుఁ బాపము! వారు దాని విషయమై చాల శ్రమ పుచ్చుకొన్నారు

కృష్ణ— సరే! తెలిసినదిలే. శివరామశాస్త్రిగారనఁగా బిరాలో వ్యాఖ్యాన కర్తయేనా?

ఆంధ్రకేసరి— (పరిహసించుచు) ఆఁ. ఆఁ. ఆయనయే (చెవిలో) ఇట్టు లిటులు.

కుతుక మదెట్టి? దెవ్వడును గోవిదుఁ డుండనెకూడ దొక్కొ? నన్
బతితుఁ డటంటి సమ్మతమె, ప్రాజ్ఞుల నన్యుల దూఱనేటికిన్ ? 233

ఉ. చూడ మశక్తియున్నయెడ సూరిహితం బగు సత్స్వభాస్థలిన్
వాఁడె ఘనుండొ ? నీవు మఱి బావయు వానినిమించు మిన్నలో ?
రాఁడనుకొకు రాఁగలఁడు రమ్మన, వచ్చెదవేని దానికిన్
గాఁడు పరాఙ్ముఖుండు సరిగా లిఖియింపుము జాబు దీనికిన్. 234

ఉ. *కాఁకరపత్రి కమ్మనెదొ? కాఁకరపత్రికె వచ్చు, శృంగభం
గాకలనంబు నల్పఁగల యయ్యలు తోడుగ నీవు బావయున్
దాఁకఁగ నేర్తురె యతని ? నాలుక వచ్చిన యట్టులెల్ల నె
ట్లోకలహమ్ము నల్పెదరె! యోగ్యులు లేరె! నిజమ్ము తేల్పఁగన్. 235

ఉ. మానుఁడు వ్రాఁత లింక, నవమానపువ్రాఁతలు వ్రాయు దొంగదు
ర్మానుల నెల్లఁ బట్టుకొనిరాఁ దగుశక్తిని దేవుఁ డిచ్చెఁ జూ !
నూనృత మాఁగ శక్యమె ? సుషుప్తిని లోకము సర్వదా రతిన్
బూనదు. మేల్కొనున్ నిజము పూర్తిగఁ దానెఱుఁగుం గ్రమమ్ముగన్.

ఆ. వె. పత్రికాధిపతులు 'బాబో ! ప్రమాదమం'
చన్నవ్రాఁత నూని యానృతకల్ప

---

(తాలుకుట్టనమునుండి,)

*చ॥ శివుఁడనొ లేక రాముఁడనొ చేసెదనోమఱి చేయలేనొ నా, కస నము చూడఁగాఁ దెలుపుగల్గిన జాబులిఖింపుఁ డేటికే, సుపనుపిఁ గ్రొక్కు పద్దెముల నూరులు వ్రాయ లిఖింపనేల? యే, కవితయు తేటగా నొకటి గల్గుట కున్ ఫలమిట్టిదౌనొకొ ? మ॥ నరకున్ రావలె నోరువిప్పవలె మీసామర్థ్యముం జూపి వాగ్విఘతన్ గాంచవలెన్, వృథాగ నొక చక్కిన్ డాఁగి నానాఁటి రాసభముల్ గోఁకిన పాడువ్రాఁతలకు దాసత్వమ్ము గావించు మీ, కు భయంబా? మఱి శక్తియా? యటకెటో ఘోషింతురిచ్చాగతిన్. ఉ॥ వచ్చెదరమ్మటన్న నృపవల్లభు నాజ్ఞను బొంది మీరలే వచ్చిన నింతకన్నను శుభంబిఁక నేయుఁడు లేదయేని యే, వచ్చియు వెళ్లఁ గ్రిక్కుకుఁడు పెద్దలు నవ్వుచుమన్న వారు మీ, కుచ్చితవుం బ్రసంగములకుం జెవియొగ్గఁడు ప్రాజ్ఞుఁ డొక్కఁడున్ (విస్తరమా గ్రంథమునందే చూడఁదగు)

నములు చేయుచావనాలుకఁ గొకచంద్రి
హార మిత్తు, నెదుటి కనుపఁగలవె ? 237

ఉ. కల దొకకొంత నేర్పి, యది గాదని నేనన, నంతమాత్రచే
నిల సకలమ్ము మోసమున నే మునిఁగింపఁగ నెంచి యేదియో
గిలుకుచుఁ * "జేటభారతము" గీరతధోరణి నద్దునంచు వా
క్కులు పరిచరింప నేల? వినఁ గూడనిపోకలు కట్టిపెట్టుఁడీ! 238

చ. తిరుపతివేంకటేశ్వరుని దిట్టుచుఁ జెప్పినయట్టిపద్దెముల్
గురువరు నింద సల్పినను, గొండొక చక్కఁగ నున్నవంచుఁ జె
ప్పిరి వినువారు, తిట్టినను బిప్పికవిత్వము కాదుగాన వా
విరి నవి బైటఁబెట్టుఁడు, ప్రవీణత కయ్యవి సాక్ష్య మిచ్చెడిన్. 239

ఉ. తిట్టిన నేమి? న న్నరక దేవునిఁ జేసితి వంటు! దాన నో
దట్టుఁడ! దేశికత్వమును దాఁటినమేల్పద మబ్బఁజేయు నా
తిట్టులు నాకు దీపనలె, తిర్పతివెంకనపేరు నాకు ముక్
జెట్టిన యందు కీవు సరిపెట్టితి వంచు నుతింతు నిన్నిఁకన్. 240

ఉ. ఊరక యిచ్చినన్ గొనని యప్పనిచప్పనికూఁత లెల్ల నె
వ్వారలొ "కర్చు" లిత్తురని వారక యచ్చునఁ గ్రుచ్చ నేల? దు
ర్వారరసప్రసారగుణబంధురదివ్యతరప్రబంధసం
సారులు గందు, వర్ధిలుఁడు, జాడ్యము మాని సుఖింపుఁడింపుగన్. 241

ఉ. బీజము లేని వ్రాఁతలవి పెంపువహింపవు; మీకు బీజ మే
యోజ ఘటిల్లు? 'నే మురకయున్న గురున్ దిగఁద్రావి తిట్టఁగా
నా జడుఁ డూరకుండక యహంకృతిఁ జూపె' నటందురోటు! మీ
బీజము దెల్పినట్టులె వివేకులకున్ బొడకట్టెడిన్ జుఁడీ. 242

మ. యతులున్ బ్రాసలు పెట్టి యెట్టులొ కవిత్వాడంబరం బూని తి
ట్టితిరే యందము, దాన లాభ మది యెట్లేఁ గల్గఁగాఁబోదు; పం
డితు లాధోరణి మెచ్చుకొన్న, నల గోష్ఠిన్ సత్యవాక్చాతురీ
వితతప్రాజ్ఞత చూపకున్న వితయా వేయేల? చాలింపుఁడీ! 243

---

* ... మనపిఠాపురపు వారు "చేటభారత" మొకటి వ్రాయుచున్నారట! ...
6-2-12 సుందరరావు

ఆ. వె. రాళ్లబండి శశిధాని వ్రాసినట్టి
పద్యముల సారమును మదిఁ బట్టుకొల్పి
శ్రోతకుల్ రండు; దేశద్రోహచింత
వలనిదోసంబు ననుతాపభరము మ్రింగు. 244

తే. గీ. ఏమిసార్థక్య? మేదియో యీవు వ్రాసి
వెంటనే యేను ఖండించివేసినంత;
సత్యమె జయమ్మునిచ్చు, యశమ్మునిచ్చు
సత్యమునఁ బొమ్ము మంచి యశమ్ము గొమ్ము. 245

ఉ. వెంకటశాస్త్రి నేరొ యవివేకులు తిట్టి రటంచుఁ గాని, యే
కుంకయొ సత్సభాస్థలిని గొట్టె నటంచును గాని యెవ్వఁడో
జంకక వ్రాయ నయ్యది యసత్య మటంచుఁ దలంపకుంటయే
వంకము, నమ్ముచో వాద మపారము గాంచుట చెప్పనేటికిన్! 246

తే. గీ. శత్రునకు నేని యూఁకద సైఁపరాదు
పైని సంతసపడు టెంత పాతకంబు ?
పరమశత్రులు గిలికెడి పాడువ్రాఁత
లౌర ! పుస్తకమంచు వ్రాయంగఁ జనునె? 247

తే. గీ. అంతయో యింతయో యక్షరాస్యులైన
మీకుఁ బారమ్ములేని నామీఁద పక్ష
రములె నేరని వారెమి రాఁ దలంతు ?
రింతమాత్రము తెలియ విఁకేమనంగు. 248

క. మిమ్ముఁ బట్టి కొప్పరము కొ, ప్రముఁబట్టియు మీరు తప్పువ్రాఁతలు గిలుకన్
శ్రమ మొకటి దక్క వెంకన, కమరునొకో యప్రతిష్ఠ యరయఁడిఁకైనన్.

క. బ్రహ్మోత్సవములతోడన్, బ్రహ్మాండం బగులుకీర్తి పరిబలించెడి యో
జిహ్మగులారా ! మీ 'యం, బ్రహ్మతకు విచారమేల పడవలె నకటా !

శా. మీయజ్ఞానము కొంపరిపుం దెలివియున్ పేల్లూర్చెడి న్మాకు, మీ
రాయాసం పడకుం డసత్యములు వ్రాయంగా ప్రయత్నింపకుం
డో యీశిష్యుఁడ! "వేఁడినీళ్లకు గృహం బొక్కింతయున్ గాల" దా
హా ! యజ్ఞానపుటట్టహాసములదుర్వ్యాపారపారీణతల్. 251

ఆ. వె. అట్టహాసమంట! అద్దాని నిండఁ ద
వ్వుడు ప్రసంగమంట! పుడమిఱేఁడు
చూచియుండఁడొక్కొ? చూచియు వారింపఁ
డొక్కొ? మూఢుఁడనుటె యొప్పవలయు. 252

ఉ. చూచిననూరకుండఁ "డిది కుంతప్రసంగము మానుఁ" డంచు వి
శ్రేచి చివాటులన్ గొలువ కెట్లును మానఁడ, ప్రాజ్ఞుఁడై యెటుల్
నీచత సమ్మతించు? నవనీపతి నిక్కము చూచియుండఁ డీ
తోఁచియుఁ దోఁచరాని నుడి, త్రోవలు ఱేనికిఁ జూడ నేటికిన్! 253

చ. ఎవరు చివాట్లు పెట్టఁ బని యేమి? గురుండను నేనె చాలు, దు
ర్వ్యవహృతి స్ఫూర్తిగా నెఱుఁగు పండితమండలి చాలు, బుద్ధి చె
ప్పవలసివచ్చినన్ గురుఁడుఁ బండితవర్గము, వీరిపైని బా
ర్థివుఁడు వచింపఁగావలయుఁ; దేఁకువ గల్గిన వీరె చాలరే? 254

ఉ. తప్పుడు వ్రాఁతలందును "శతఘ్నిని" వ్రాసెడునంతదాఁక వ్రా
లొప్పఁగఁ జేసితే; విపుడొ యొక్కఁడె బావయ చేయుచుండె; నీ
కిప్పుడు బుద్ధివచ్చినదియే? వచియింపు "శతఘ్ని" యూరకే
'టు'ప్పని ప్రేలి పాశుపత ఘాంకృతి కుప్పనుగాక మ్రగ్గుటన్. 255

ఉ. నీ కటు బుద్ధివచ్చుటయె నిక్కమయేని వచింపు మింకఁ బె
న్వ్రేఁకఁ జరించు బావకు వివేకము గూర్ప యతింతుఁగాక! యా
కాఁకరపత్రివాసికి నఖండమృషావచనప్రతాపికిన్
బాంకటధర్మముల్ పలుకు పద్ధతి వేఱుసుమా! కుమారకా! 256

ఆ. వె. అకట! పాశుపతము నడఁపఁ బరాస్త్ర పా
శుపతమనుచునొక్క "శ్రాంతికాయ"
వ్రాఁతఁ వ్రాయు బావ వైఖరి గనియు నీ
వేలయూరకుంటి వెఱుఁగఁ జెపుమ? 257

క. అందుఁగల యనృతఘోరణి, "సందేహము లేదు బావ శాబ్దికజీవా
నందుని" సారము తేల్చెడి, నెందుల కా పిచ్చివ్రాఁత లెఱిఁగింపు సుతా!

శా. ఏదో వ్రాసెడివానిపోల్కి నెదియో యింతింత పంపంగఁ బై
"నేదో వచ్చుఁగదా?" యటంచు నకటా! కృష్ణాఖ్యపత్రింబు నై వ

క్కో దూఁకెన్, బయి సిగ్గిలెన్ జుమీ; వృథాకుంఠీభవచ్ఛౌర్యారే
ఖాదార్భాగ్య వచఃప్రచారకలనాగర్వాంధ్య మిట్లుండునే! 259

ఆ. వె. 'వ్రాఁత యట్టులుంచు పాశుపతమ్ము పైఁ
బాలు పేరునీకుఁ బట్టుపడెనె?'
అంచు బావతోడ నాడు మీ! నాకునై
గురుని కింత సలుపు చరణసేవ. 260

క. ♦ బావ వచనములు వినకుము, భావవచనములను వినుము బాగుపడుము సం
భావించి భవుఁడు చెప్పిన, భావుకవచనములు భావవచనములనఁగన్. 261

గీ. అల్లకృష్ణుండు సంధికి వంకనీక
పార్థుల నపార్థుల నొనర్చె; బావమఱఁది
యంచుఁ గృష్ణునిబోధల నాలకించి
తాదృశుఁడ వీవు కాకు వృథావిధముగ. 262

ఉ. అన్యులతోడ మాకు నెపుడైనను వేరొకకారణమ్మునన్
జన్యము సంభవించునెడ సాయము వారల కాచరించి నీ
వు న్యశమున్ గలంచుటకు బుద్ధిని ద్రిప్పితి వెంత వెఱ్ఱివో?
ధన్యత లేనివారలను ధన్యులఁ జేయఁగ నీకు శక్యమే. 263

మ. ఒకచో గుంటురి కీవు పోదువనుకో వెఱ్ఱి పెత్తిశిష్యుండ! శా
ఖకునై వారలు నిన్ను నిట్టిగతి గాఁ గారింప యత్నింత్రు; నీ

---

♦ స్కాందోత్తర ఖండస్థగురుగీతనుండి.

శ్లో॥ అత్రినేత్రశ్శివసాక్షాత్ ద్విబాహుశ్చహరిస్స్వయం, అచతుర్వదనో బ్రహ్మాశ్రీగురుః కథితః ప్రియే... శ్లో॥ గురోః కృపాప్రసాదేన బ్రహ్మవిష్ణు మహేశ్వరాః, సామర్థ్యమగమన్ సర్వే కేవలం గురుసేవయా... శ్లో॥ నగురో రధికం నగురోరధికం నగురోరధికం నగురోరధికం, శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనత శ్శివశాసనతః॥...శ్లో॥...గురునిందాంకరోతియః, సయాతినరకాన్ ఘోరాన్ యావచ్చంద్రదివాకరౌ॥...శ్లో॥ "హుం" కారేణ నవక్తవ్యః ప్రాజ్ఞైశ్శిష్యైఃకదాచన, గురోరగ్రే నవక్తవ్యమసత్యంతు కదాచన, గురుం త్వం కృత్య హుం కృత్య...సభవేద్బ్రహ్మరాక్షసః॥ ...శ్లో॥...కాలమృత్యుభయాద్వాపిగురు స్సంత్రాతిపార్వతి॥ ... శ్లో॥ గురుదేవార్పణం యత్తు తేనతుష్టోస్మి సువ్రతే॥...

కకటా! దిక్కెవ్వఁడున్నె? నాకొ? మఱి నీవా! కాదు, నీవంటి వా
రొక వేయైనను లెక్కలేదుసుమి యోగ్యుల్ పండితుల్ స్నేహితుల్.

ఉ. వారలె లేకయున్న యెడ వాండ్రును నీవును గూడి దబ్బఱల్
సారెకు వ్రాసి యిట్లయిన సాయము పట్టఁ బో; రసత్యపున్
భారము మోయుపజ్ఞగల పండితులా కతనన్ యథార్థవి
ద్యారసికుల్ భవత్కృతుల నడ్డుము రేమియొనర్ప నేర్తువో. 265

ఉ. కావున నిప్పుడేనియు వికారపుఁ జెయ్వులు మాని ప్రాజ్ఞులౌ
ధీవరు లాడుపల్కులను జెల్లముగాఁ దలపోసి సత్యపుం
ద్రోవను రమ్ము, నిక్క మగు ద్రోహము నీ వొనరించియున్ బుధా
శ్రీ విలసిల్లు హేతువున శిష్యుఁడ! మంచియశమ్ము గల్గెడిన్. 266

క. మనువచనమ్ములు విని తగ, మను, మనువచనములనంగ మనువచనము లే
మనుకొంటివో? మనుమార్గ, మ్మనుమాన మ్మడిగి పట్టు మది యఘు మడఁచున్.

మ. ‡ త్రివిధేయుండు త్రిలోకజేతయనుచున్ ''త్రిష్వప్రమాద్యన్'' మను
ప్రవచస్సారము తెల్పు నీవు కడగా వర్తిల్లుచున్నట్టి యా

---

...శ్లో॥ గురోః పరతరం నాఽస్తి త్రివారం కథయామి తే॥ ధన్యా మాతా పితా ధన్యో గోత్రం ధన్యం కులం భవం, ధన్యా చ వసుధా దేవి యత్ర స్యాద్గురుభక్తతా ఆకల్పజన్మకోటీనాం యజ్ఞవ్రతతపః క్రియాః. తాస్సర్వాస్సఫలా దేవి గురుసంతోషమాత్రతః... శ్లో॥ ఏకాక్షర ప్రదాతారం యో గురుం నైవ మన్యతే, శ్వానయోనిశతం గత్వా, చండాలేష్వభిజాయతే॥ ... శ్లో॥ సప్తకోటిమహామంత్రాశ్చిత్తవిభ్రమకారకాః, ఏక ఏవ పరో మంత్రో గురురిత్యక్షరద్వయమ్...... శ్లో॥...కవిత్వాది గద్యం సుపద్యం కరోతి, గురోరంఘ్రియుగ్మే మనశ్చేన్న లగ్నం తతః కిం తతః కిం తతః కిం తతః కిమ్ (విస్తరస్తత్రైవ ద్రష్టవ్యః).

‡ శ్లో॥ త ఏవ హి త్రయో లోకాస్త ఏవ త్రయ ఆశ్రమాః, త ఏవ హి త్రయో వేదా స్త ఏవోక్తా స్త్రయోఽగ్నయః॥ ౨౩౦ పితా వై గార్హపత్యోఽగ్ని, ర్మాతాగ్ని ర్దక్షిణస్స్మృతః (గురు రాహవనీయస్తు) సాగ్నిత్రేతా గరీయసీ॥ ౨౩౧. త్రిష్వప్రమాద్యన్నేతేషు త్రీన్ లోకాన్ విజయేద్గృహీ॥ ౨౩౨. (మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ)

(అభియుక్తోక్తి)

శ్లో॥ లజ్జా మేకాం పరిత్యజ్య త్రిలోకీవిజయీ భవేత్॥

పావనీయాగ్నిని గాలఁద్రొక్కియును వత్సా! మూఁడులోకమ్ము లా
హావరంగమ్మున గెల్చుటన్ పృథయ ధర్మాధర్మ దుర్మర్మముల్. 268

శా. † ఆజన్మంబు గురున్ భజించు నెడ బ్రహ్మప్రాప్తికర్హుండుగా
యోజింపుచున్ స్మృతివాక్యముల్, మృషయనుమ్మా వత్స! యమ్మాట; నీ
కీజన్మమునఁ గొంత సేవయును 'హీహీహీ'లు 'హూహూ'లు త
ద్రాజద్బ్రహ్మసమాజమాన్యతకుఁ బాత్రత్వమ్మ్ఁ జేకూర్చుటన్. 269

మ. * తనయార్జించిన క్షేత్రముఖ్యధనముల్ దాతవ్యముల్ ముందుగాఁ
దన యాచార్యునకంచుఁ జెప్పు స్మృతి, తద్ధర్మంబు గన్పట్టె నో
తనయా! నీయెడ; నెట్టులన్న, విను దుర్ధర్మంబుల వ్యర్థిత్త మా
త్తనయా! నాయెడఁ దొల్త నీవు వినియుక్తంబౌట సూచించుటన్. 270

శా. ‡ ధాత్రిస్వార్జితవిత్తమందు నొక షష్ఠంబంత యీమున్ గైకొనం
బాత్రుండంట! గురుండు వింటివె? భవత్ప్రాజ్ఞార్జితాచార్యుదు
శ్శృతిప్రాఖ్య ధనంబు సర్వమును నస్మత్సాత్కృతం బయ్యె; నే
మాత్రంబో యిడ కంతయున్ బెఁచు నిమ్మడిక్రాన్ గురున్ జేర్తురే. 271

మ. ♦ శ్రుతిదూరంబయినన్ స్మృతిన్ దవిలె నెచ్చో నీస్థితుల్ "నిత్యము
ద్ధృతపాణిత్వము" చెప్పెఁగా? మనువు, నీధీమత్త చే దాని నా

---

† శ్లో॥ ఇమం లోకం మాతృభక్త్యా పితృభక్త్యాతు మధ్యమం, గురుశు
శ్రూషయా త్వేవం బ్రహ్మలోకం సమశ్నుతే॥ 233. శ్లో॥ ఆసమాప్తేశ్శరీరస్య
యస్తు శుశ్రూషతే గురుం,సగచ్ఛత్యంజసా విప్రోబ్రహ్మణస్సద్మశాశ్వతం॥ 244
(మనుస్మృతి ద్వితీయాధ్యాయము చూ౦)

* శ్లో॥ స్వాధ్యాయంస్తు గురుణాజ్ఞ ప్రశ్యక్త్వా గుర్వర్థమాహరేత్, క్షేత్రం
హిరణ్యం గామశ్వం ఛత్రోపానహమాసనం, ధాన్యం శాకంచ వాసాంసి, గురు
వేప్రీతి మావహేత్ 246 అతిప్రాఖ్యాత్వా॥ స్వాధ్యాయస్సద్గుణాదత్తాజ్ఞో యథాశ
క్తిధనివం యాచిత్వాఽపి ప్రతిగృహీతనాఽపి గురవేఽర్థ మాహృత్యాఽ
శ్యందద్యాత్॥ (మనుస్మృతి ద్వితీయాధ్యాయము.)

‡ శ్లో॥ షడ్భాగం స్వార్జితం విత్తం కృత్వాఽనందాత్మకో నరః। ఏకంతు
గురవేదద్యాత్ ......

♦ శ్లో॥ నిత్య ముద్ధృత పాణిస్స్యా త్సాధ్వాచారస్సు సంయతః, ఆసతాం
మితి చోక్తస్సన్నా సీతాభిముఖంగురోః॥ (మను 2. అ.)

దృతముఁ జేసితి; వ్యగ్రమం దగపడఁ దేలుం జుమీ నీమను
ధృతపాణిత్వఫలమ్ము, స్మార్తమతవర్తీ ! నీకగుఁ భద్రముల్. 272

కం. ♦ భారతవచనమ్ముల మధిఁ, జేరుతమని బావనడుగు శ్రీరతులుఁ స
ద్ధీరతులు నీదుపద్ధతి, ఘోరతరం బనెడిరీతి గొనకు మిఁకైనఁ. 273

కం. గురుశరవహ్నికిఁ గృష్ణుం, డఱిముతి భీతివడు ధర్మజాదుల సత్య
స్థిరుల నసత్యంపుమహా, దురితమ్మునఁ ద్రోచె నెఱుఁగుదో యెఱుఁగవో 274

---

(భారతాదిపర్వమునుండి)

♦ కశ్చిదృషి ర్ధౌమ్యోనామ ... తస్య శిష్యాస్త్రయో బభూవు రుపమన్యు రారుణి ర్వేదశ్చేతి, సఏకంశిష్యమారుణిం పాంచాల్యం ప్రేషయామాస "గచ్ఛ కేదారఖండంబధానేతి ... యస్మాచ్చత్వయా మద్వచన మనుష్ఠితం, తస్మాచ్ఛ్రేయో౽వాప్స్యసి, సర్వే ఏవతేవేదాః ప్రతిభాస్యంతి సర్వాణి చ ధర్మశాస్త్రాణీతి ... తంచోపాధ్యాయః ప్రేషయామాస" వత్సోపమన్యో గారక్షస్వేతి ... మయ్యనివేద్య భైక్ష్యం నోపయోక్తవ్యమితి ... భో ఉపమన్యో క్వా౽సివత్సేహీతి, స ఉపాధ్యాయవచనం శ్రుత్వా ప్రత్యువాచ ... కూపేపతితో౽హమితి, తముపాధ్యాయః ప్రత్యువాచ. కథం త్వ మస్మిన్ కూపే పతిత ఇతి, స ఉపాధ్యాయం ప్రత్యువాచ. అర్కపత్రాణి భక్షిత్వా౽ంధో భూతో౽స్మ్యతః కూపే పతిత ఇతి, తముపాధ్యాయః ప్రత్యువాచ అశ్వినౌస్తుహి ... త్వాం చక్షుష్మంతం కర్తారా వితి, ... అశ్వినౌస్తోతు ముపచక్రమే, ... అశ్వినావాజగ్మతురాహతు శ్చైనం, ప్రీతౌ స్వ ఏవ తే౽పూపో౽శానైనమితి, ... నత్వేవాహమే తమపూపముపయోక్తు ముత్సహే గురవే౽ నివేద్యేతి, ... తమశ్వినావాహతుః, ప్రీతౌ స్వస్తవానయా గురుభక్త్యా,... చక్షుష్మాం శ్చభవిష్యసి శ్రేయశ్చా వాప్స్యసీతి, ... లబ్ధచక్షుః ... ఉపాధ్యాయమభ్యవాదయత్, ... ఏషాతస్యా౽పిపరీక్షోపమన్యోః, అథాపరశిష్యః ... వేదోనామ ... గౌరివనిత్యం గురుణాధుర్షు యోజ్యమానః, తస్య మహతా కాలేన గురుః పరితోషం జగామ తత్పరితోషాచ్చ శ్రేయః సర్వజ్ఞతాంచావాప, ఏషాతస్యా ... ప ... వేదస్య......

(శ్రీ సరస్వతీ తెలుఁగు ప్రతి)

క. నిజమైనతిట్లు తిట్టుము, గజగజ నీకేల? లేని కార్లనకుము భూ
ప్రజలు సహింపరు లోలో, * స్వజనంబేనియును దప్పు సైఁపదెఱుఁగుమీ.

క. చదువెఱుఁగఁడనియుఁ, గంతము, మృదువైనది గాదటనియు, నేరికి విద్దెల్
గుదిరి వచింపఁడనియు నా? పదరి జగము మెచ్చుగోరు పద్ధతిచెపుమా.

క. 'నాయొద్దఁ జదివినదె' యని, కోయిల నీవాయసంబు గూయుట తప్పో
నే? యరయుమయ్య! బావయె, వ్రాయఁగ వలె,నీకుఁజేయి రాదిటు వ్రాయన్.

క. ఇరువుర చేవ్రాళ్ళుండుట, యరసియు నీ కిట్లు వ్రాయు టది రాదనియే
పొరఁబడితిఁ గొంతకాలము, పరమాప్తుఁడు రామమూర్తి పలికెడిదనుకన్.

చ. తతమతి నీ కతండు పెదతల్లికుమారుఁడు, నాకు మిత్త్రుఁడు
న్నతుఁ డనృతం బతండు జననంబును బొందిన వంగడమ్మె యా
కృతయుగ మాదిగా నెఱుఁగ; దిప్పుడు నీకయి నేర్వఁబోఁడు; సూ
నృతవచనుండు నీకతన నే విని నాకు వచించె నర్భకా! 279

చ. కుతుకముతో నొకానొకటఁ "గోకిల కాకము" నాకవిత్వ మం
చతనికిఁ జెప్పినాఁడవఁట! యయ్యది జ్ఞప్తికిఁ దెచ్చికొమ్మ; శ
త్రుతకలిమిన్ వచింపఁడు బుధుం డతఁ డేదొ ప్రసంగమందు సం
గతమగుటన్ వచించె నదుగం దగు సందియ ముండెనేనియున్. 280

చ. అనయుఁడవై పృథాగ నెపు డాఱడివ్రాఁతలు వ్రాయుచున్ నిజం
బు నడఁచి నేఁటికేనియును బుద్ధిపికాక పరాక్రమించు ని
న్నును సుజనున్ బొనర్చుట కనుంగుఁజెలిన్ ఘనురామమూర్తిగా
రిని నొక సాక్షిఁ జేసితి నెఱింగి యతండు క్షమింపకుండునే 281

రాజమండ్రి.
ది 28-8-13

*...తమరు కాకరపర్రు వెళ్లినప్పట్లో "లోకములోని కవులందరు నా జంధ్యములోనివారు" అని అన్నందుచే యీ అల్లరి జరిగినదనిన్నీ పిమ్మట తప్పు అంతయును కాకరపర్తివారిదే అనిన్నీ శ్రీ అ॥ వ్యాసలింగశాస్త్రులవారు నాతో చెప్పినారు. యింకా కొన్ని సంగతు లున్నవి కాని విస్తరించుటకు స్థలములేక వ్రాయలేదు. ... రామకృష్ణులు ముందు భారతము ప్రచురించెదరట. వారు యెన్ని వ్రాసినను గురుద్రోహమును బలపరచేవే అని శ్రీ, అ॥ వ్యాసలింగశాస్త్రి గారు అన్నారు......

చె. కొండయ్యవ్రాలు.

ఉ. అందఱు నాకు బంధుగులె యంచు లిఖించెద వింతసాహసం
బెందుకు ? దూరగుల్ బలెను యింజర కాఁకరపట్టు వానులున్
బొందఁబడంగలారె యిటు బొంకఁగనేటికి ? రామమూర్తి నే
మందువొ చెప్పుమా యకట ? యాతఁడు నా పెదతల్లి పుత్త్రుఁడే. 282

శా. చాడీలన్ వచియించువాఁడొ ? జడుఁడో ? చండాలపుంబుంత లే
నాఁడున్ ద్రొక్కినవాఁడొ? త్రొక్కఁగలఁడో? నా బోఁటి లెక్కేమి యే
పోవిడల్ నెత్తిని బెట్టుకోఁదగిన సత్పుణ్యుండు, గణ్యుండు తా
వాడంబోయెనొకో యసత్యము ? కుమారా ! నిన్ను వంచింపఁగన్.

శా. ఆడుంబో యనృతంబు నీకొఱకు వ్యాసాకొండి యొడ్డేని, పాపి
ద్దాశంగాక మఱొక్కచోఁ బొడమి కామాకొండిచేఁ బల్లదం
బాడింపంగలదేమొ చూచెదనుగా కంచున్ బరీక్షార్థమై
నేఁ డిచ్చో నొకసాక్షిగా నతని వర్ణింపన్ బ్రిసక్తించెఁ జూ 284

చ. ఘనుఁడల రామమూర్తి యెటుగా లిఖియించిన నెందుఁజేరునో ?
తన లిపి యంచుఁ గొంకుఁజుమి తథ్యమె తెంగియుఁ, బెద్దతల్లికిం
దనయుఁడె వేఱొకండిపుడు దా ధవళాద్రి వసించు; నాతఁడున్
ఘనుఁడు తదంబయు న్మిగులఁ గందురు నేఁటికి నన్నుఁ బేర్మితోన్. 285

†క. కృతమీవు మఱచితివి నీ, కతనంగద ? వారు నాకుఁ గడుఁ గూర్తురు; నీ
కతిశత్రుఁడు వారలకే, గతిఁ బ్రేమాస్పదుఁడొ ? తెలుపఁగాఁగలవెసుతా.

క. గురుఁ గాకము గానుడివిన, దురితపువ్యాసమ్ము గాంచి దుఃఖింపక యె
వ్వరొ మెచ్చిరనియు వ్రాసెద, వరరే ! యిటువంటియోగ్యు లవనిం గలరే.

‡క. శత్రులుమిత్రులు సైతము, పుత్రా ! తలయూఁచిరనుచుఁ బొంగెఁగదా ! మీ
పత్రిక, యూఁచుటకర్థ మ, పాత్రవ్యాస మని చేయుపని గాదుగదా ?

---

ధవళేశ్వరము, 26-8-13

† ...శ్రీ మానాన్నగారు శ్రీ మాయమ్మగారు, సదా మీ శ్రేయోభివృద్ధిని గోరుచున్నవారలు. కా॥ నారాయణమూర్తి.

(కవితమండి)

‡ కోకిలకాకము, ఇది కోకిలమును గాకమును గూర్చిన యొకచిత్రకథ.-శత్రులు మిత్రులుగూడఁ దలయూఁచిన పద్యములు.

క. నీకవితాప్రాశస్త్య, శ్రీకతనన్ గలుగు యశము చెందెడి దను; నీ
కో! కృతముమఱచు పాతక, మే కడకున్ మిగులు సారమిదియొ కుమారా.

క. ఎందుకుఁ బెంచెద వఘమిది? యందఱకు న్నిజము దెలిసె; నాఁగునె కస్తూ
రిందాఁచినఁ బరిమళమది, బొందఁబడక నిజమునుడివి పొందుము శుభముల్.

## (10) మంగళపర్వము.

చ. తిరుపతి! నాకు నింతటి విధేయుఁడు శిష్యుఁడు గల్గె వాని సం
చరణము లీశ్వరున్ దెగడు సాహసమూనెడి, పట్టివానికిన్
గురువన నెంత? తాదృశుని గొండొక యోగ్యునిఁ జేయ వేంకటే
శ్వరుఁ డొనరించె ధర్మపుఁ బ్రసంగ మెసంగు ప్రసంగసంగతిన్. 291

చ. తిరుపతి వేంకటేశ్వరుని దిట్టి దిసంతులు గొట్టు వానికిం
దిరుపతి! వేంకటేశ్వరుని దిట్టి దిసంతులు గొట్టు టెంత? యే
మఱఁజన దైననున్ మనకు మంచికిఁ ద్రిప్పు ప్రసంగమేదియో
జరుపుట యొప్పు వానికిఁ జే సాయముఁ జేసినఁ జేయకుండినన్. 292

చ. హితము వచింపఁ దావొసఁగు నెవ్వఁడు వాఁడె ప్రోడుఁడున్ వినండ; భా
రతమున నేమి, తక్కిన పురాణములందున నేమి, యెవ్వఁడే
హితముగ్రహించె? నట్లని మఱెవ్వఁడు చెప్పుట మానె? చెప్ప నే
చతురునికో యగున్ గణనసల్పి కృతార్థుఁడు వేఱొకండగున్. 293

ఉ. కావున నేరొనర్చినను గష్టము లోకముకోసమే యశ
శ్శ్రీవిమలీకృతోజ్జ్వలదశేషవిశేషదిగంతరాళు లా
ధీవరులెల్ల లోకమునఁ దేలవలెన్ బరిశుద్ధలోకసం
భావితులే సుమీ జగతి భవ్యులు సేవ్యులు కావ్యభావ్యులున్. 294

ఉ. లోకము మెచ్చఁగాంచు నతిలోకుని యాదవపట్టభద్రు గు
ప్పాకుఁడు దుర్నయుండు శిశుపాలుఁడు పట్టుకతిట్టె; దానిచే
నాకటివేల్పు పూజనము లడ్డెనె? సాక్షికలోక మెన్నఁడున్
లోకములోనఁ జేర; దరిలోకపు శోకము కీర్తికే యగున్. 295

సీ. ఖరముఖాసురకోటి కహకహార్భటిలేక రాముకీర్తికి నట్టిరాణ యెట్లు?
శిశుపాలదుర్వివాదప్రశుపస్ప్రశలు లేక కృష్ణుకీర్తికి నట్టి కెలస యెట్లు
కనకకశిపుదుష్టకష్టచేష్టలులేక నరసింహుకీర్తి కాగరిమ యెట్లు?
కలినృపాలకహలాహలహళాహళి లేక కల్కికీర్తికి నట్టి కలిమి యెట్లు?

తే. గీ. ఎంతవాఁడేని విమతులాక్రాంతసాయ
మాచరింపక పేరెక్కఁడట్టులగుట
నిరతసత్కృతిదాతల నిర్గుణస్వ
రూపుల నుతించి కీర్తిఁ బ్రేరేపవలయు. 286

ఉ. నుతియింతున్ మనరామకృష్ణకవులన్ సువాన్నార్యధైర్యైకస
ద్గతులన్ సూనృతవాగరాతుల, వృథాదంభాశుఘోషానృత
శ్రితులన్ దాదృశకావ్యపుంగవుల, నశ్లీలాపవాదప్రద
ప్రతిభానూతల వారివీరిహితులన్ బ్రాపించద్యశోదాతలన్. 297

మ. దయకై కొల్చుటకన్నఁ దిట్టుటయ మేల్ దైవాలకున్, బూర్వమే
జయుఁడున్ శ్రీవిజయుండు శాపహతులై శాసించి రీత్రోవ, త
ద్దయ సౌకర్యము దీనియం దగపడున్, దైన్యంబు గన్పట్టదా
శ్రయణక్లేశము సున్న, తుల్యము ఫలైశ్వర్యంబు యోజించినన్. 298

మ. కలికిన్ మంగళమస్తు దానికి సిరిన్ గల్పింప యత్నించు ధీ
వులకున్ మంగళమస్తు నిస్తులవచోరూఢిన్ గలిన్ ద్రుంచునా
ర్యులకున్ మంగళమస్తు వేదమతశాస్త్రోక్తాత్యధన్యైకవ
ర్తులకున్ మంగళమస్తు గీరతవచోదుగ్ధాబ్ధికిన్ మంగళమ్. 299

గద్య

ఇది శ్రీ...తిరుపతి వేంకటేశ్వర విరచితంబగు గీరతామ్నా
యమ్మునందు గురుదక్షిణ యను ద్వితీయభాగము,
సంపూర్ణము.



# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు |
|---|---|---|---|
| 2 | 1 | కోల | కోకిల |
| 7 | 1 | బాహ్రిజదువు | బాహ్రిఁజదువు |
| 8 | 1 | నెపుడో | నెపుడ్డో |
| 11 | 18 | మెఱుఁగుచు | మొఱుఁగుచు |
| ,, | 20 | కాహోది | కాహ్లోది |
| ,, | 26 | బబళించు | బ్రిబళించు |
| 16 | 23 | ర్ధమాను | వర్ధమాను |
| 22 | 17 | ద్దేము | ద్దేశము |
| 24 | 25 | గలాడఁ | గలాఁడ |
| 28 | 7 | నికా్యలంబునన్ | నిప్పట్లన్ వృథా |
| 33 | 15 | వేరోక | వేఱోక |
| 38 | 17 | గిరతం | గీరతం |
| 62 | 18 | దజ్ఞులు | తజ్ఞులు |
| 67 | 28 | రైవ | రై |
| 71 | 3 | బారత | భారత |
| 75 | 9 | దైవాలదున్ | దైవాదులన్ |

గిర. ద్వితీ.

# ఉపోద్ఘాతము

చదువరులారా!

("వివేకభ్రష్టానాం భవతి వినిపాత శ్శతవిధః")

అను భర్తృహరిసుభాషితమున కుదాహరణముగ నుండునట్లు మా "దైవవంచితులు" ప్రకటించిన "తిరుపతివేంకటేశ్వరార్ధశతకమును" జదివియుందురు. చదివిన వారిలోఁ గొంద ఱెట్టిసందేహమును బొందిరో ఆసందర్భమును దెల్పు నుత్తరములు గొన్నిటిని 41 వ పుటలో నుదాహరించియుంటిమి. లోకముచే నట్లు గర్హింపఁ బడుచున్న తిప్పఁడుఁగూఁతల కుత్తరము వ్రాయుట వ్యర్థమని మే మెఱింగియుఁ బ్రసక్తానుప్రసక్తముగాఁ గొన్ని లోకోపకారములగు సద్ధర్మముల నీవ్యాజమునఁ బ్రచురింపఁ దలఁచి యాతిప్పఁడుఁగూఁతలనే గౌరవించి 'విగ్రహారాధనము' అనుపేరితో నీగీరతతృతీయభాగము ముద్రింపించితిమి. ఇంతకు మున్నిది గీరతచతుర్థభాగముగా ముద్రింపించెద మని ప్రచురించి యుంటిమి. కాని గుంటూరిసభలో దీనియందలి పద్యములు కొన్ని విన్నది మొద లిద్దానికై నిత్యమును వచ్చునార్డర్లమితములుగా నుంటంజేసి లోకాభిరామాయణముకన్న దీనినే ముందు ప్రకటింపవలసినవారమైతిమి. అనేకమహావిషయము లిం దున్నవి, అవి చదువరులే గ్రహింపఁగలరు. అక్కడక్కడఁ గల విశేషముల నేకత్రి చేర్చి సమన్వయించుకొనువారికి బోధపడినట్లిది యితరులకు బోధపడదు, కానఁ జదువరు లప్పట్ల జాగరూకులుగ నుండఁగోరెదము. ఇది యిటు లుండె. ఈయనర్థశతకమును జూచి లోకులెల్ల నిష్ఠీవనమాచరించుచుండఁగా నీమర్యాద చాలక కాఁబోలు 'రామకృష్ణమ + హాభారత' మనఁదగుధోరణితో "రామకృష్ణమహాభారత" మను నేతిబీఱకాయ నొకదానిని మనదైవవంచితులు లేవఁ దీసిరి. ఇది పడుచు, లేచుచు, చచ్చుచు, పుట్టుచు, "దచ్చిచెడిచేయఁ గలవిన్నపములు" కావించుచున్నది. ఇప్పటికి 128 పద్యములు, 24 పుటలు 7 పర్వములుగాఁ దలచూపి రోదనసంఖ్యాపర్వ మసమాప్తిలో నుండఁగనే మరల నాఁగిపోయినది- అప్రగల్భానృతవచఃపూరితమగు నియ్యది వెలువడి నది మొదలు ప్రాజ్ఞలోక మిట్లు గౌరవించుచున్నది.

"తిరిగి యీ నడుమ 'కవిత' పత్రికలో నిదివఱకు కృష్ణాపత్రికయందుఁ బ్రచురించిన 'పరాస్తపాశుపతమును' ప్రచురించుచున్నారు. 'పాడిందే పాడరా పాచిపండ్లదాసరి' అను సామెతకుఁ దగియున్నది. మీ గీరతమునకు మరల 'భారతమును' వ్రాయుచున్నవారలు. ప్రారంభపర్వముమాత్రము వ్రాసిరి, వ్రాసినను మీరు దయచేసి వానికిఖండనముగా గ్రంథములు వ్రాయక యేవియో కొన్ని వ్యాసములు వ్రాసిన బాగుండును. కారణ మేమన? వారు వ్రాయుదానియందు విషయవిమర్శనముండదు కాఁబట్టి."

సికింద్రాబాదా (డక్కన్) చివుకుల అప్పయ్య. 24-9-13.

---

19-5-14. సికింద్రాబాదు, సెకండుబజారు.

"గీరత" ద్వితీయభాగమందలి సంబుద్ధిపర్వాదులను జూచిన రామకృష్ణసత్తుర్యులిఁక శాంతింతు రేమో యనుకొంటిని. మరల వారు తమ చేటభారతమందు, తొంటి యవివేక ప్రసారమును గుమ్మరించుచున్నారు. వదలుకొననిందు. యీ దేశమందు వారిని కూర్చి యేవపడని వివేకులు లేరు.

ముదిగొండ నాగవీరేశ్వరుఁడు.

---

(1) అబ్బో!, 'శతపర్వభారతంబఁట? మతిమంతులు వ్రాసిరంటఁ?' ఇత్యాద్యుక్తులు కొంతపట్టు క్రాలుచున్నవి. స్థాణువు పల్లవశోభ నందవచ్చును గాని మనవారు త్రోవకు వచ్చునట్లులేదే? ఇది కలిమాహాత్మ్యము. కేవలము వారి లోపము గాదు.

మ. కలికాలంబ? భవన్మహత్త్వగిరిశృంగస్థానశృంగాటకో
చ్చలదత్యద్భుతచర్యపుణ్యజనవాచాకీచకస్వానని
స్తులసత్యప్రతిబంధకల్పనకు సంతోషించి భక్తాగ్రగ
ణ్యులు మ్రొక్కుల్ పదివేలు మ్రొక్కెదరు మాయోపాయసంధానమా!

అని వేఁడఁ దగియున్నది, "బ్రహ్మాఽపి నరం నరంజయతి" కోటిలోనికి వచ్చినది..." శ॥ హ॥ 1-9-13.

(2) "కవితఁ" జూచి యుందురు, అందు శ్రీ "వారి" భారతము బయల్పడినది. ప్రారంభపర్వము ముందుదారిని సూచించుచేయున్నది. తత్త్వము లోక మెఱుఁగినపిమ్మటఁగూడ వీరి కీప్రయత్నములు శుభకరములు కావనియే ప్రాజ్ఞసంఘము నుడువుచున్నది... శ॥ హ॥ 20-9-13

"ఉ॥ "శిక్షయొనర్చి, యక్షరముఁజెప్పి, ప్రయోజకుఁ జేయు నొజ్జనే దక్షుఁడనైతి నంచుఁ, గడుఁ దానవమానమొనర్పఁగూళ" అని శ్రీమూర్తి వసుప్రకాశిక, రామకృష్ణకవులు మున్నగువారే, పయిసంగతికి నాధారమవుదురు. వీరి శృంఖలగాని, బృహద్భారతముగాని, భవత్ప్రతిభాయశః ప్రసరణములకు, ప్రతిబంధకములు కాఁజాలవు తాము మనుష్యమాత్రులుగా, నేప్రాజ్ఞులచేతను దలఁపఁబడుటలేదు. మీ ప్రబంధరాజములను అందు మరియు మీగీరతామ్నాయముఁ జదివిన విద్వత్కవులు, సాక్షాత్తుగ, మీరు తిరుపతి వేంకటేశ్వరులే యని, భావించుచుండిరి."

బాపట్లతాలూకా
పెదనందిపాడుపోష్టు.

జమ్ములమడక శ్రీరామకవి.
కొండపాటూరు.

———

అతివిస్తరమేల. "పువ్వుపుట్టినతోడనే పరిమళము—పుట్టినతోడనే కంపు" అను సామెతకు మన సువివేకులభారతము ప్రథమోదాహరణము. అది యింతవఱకుఁ గొంచెము తక్కువగా నేడుపర్వములు వెలువడిన దని వ్రాసియుంటిమి. ఏడుపర్వములలోఁ దుట్టతుదిపర్వము పేరు 'పునరుక్తిపర్వము'. దీనిలోని యీ పద్యముంబట్టి చూడ నయ్యల కప్పుడే నాడి వెనుకకు లాగుచున్నట్లు మూర్ఖులకుఁ గూడ సుగమమే.

గీ. "చాటుపద్దెములెద్దాని జాటితెలిపె
శృంగభంగమునందెద్ది చెప్పఁబడియె
సత్యసందేశమును దేనిసంప్రతించె,
నదియె వివరింపవలసె భంగ్యంతరమున"

ఏడవపర్వమునకుఁ బెట్టిన పేరుం బట్టియేమి, పైనుదాహరించిన పద్యపువాలకముం బట్టియేమి యయ్యల భావిగతి సూచితమగుచున్నది. చాటుపద్దెములగతి నెఱుఁగని వారెవరు? శృంగభంగ సత్యసందేశములదుర్గతి నెఱుఁగని వారెవ్వరు? ఆ ప్రల్లదములుతప్ప గతిలేని దేవయ్యలంత పెద్దపేరుతో వ్రాఁతకు దిగుటెందులకో? ఇప్పటికిని శృంగభంగ సత్యసందేశములనుగూర్చి సత్యాన్వేషులు మరలమరలఁ బ్రయత్నించి నిజమరసి "తస్య ప్రహారణములను" దగిలించుచునే యున్నారు. చూడుఁడు.

పినపాడు. 6-11-13

"నేను యీ నెల, 2-11-13 తేదీని కాకరపర్తిదగ్గిర నున్న "వడలి" అనేగ్రామమునకు కార్యార్థినై వెళ్లియుంటిని. అక్కడికి కాకరపఱ్ఱు చాలా సమీపమని తెలిసినది. కాకరపర్తితగాదా విషయమై ఎవరినైనను కనుక్కొందామనే కుతూహలముతో నుండగా, 3-11-13 తేదీని సాయంత్రం, 7 ఘంటలకు కాకరపర్తినివాసులగు బ్ర॥ శ్రీ॥ కూచిభొట్ల మహాదేవయ్య, అనేవారు తటస్థమైరి. వారిని యీ తగాదా విషయమై నిజము యెంతవరకు, అని ప్రశ్నించితిని. వారు యీ క్రిందివిధముగా చెప్పిరి. మీరు కాకరపర్తిలో సభ చేసినప్పుడు తానుకూడ అక్కడ నున్నాననిన్నీ తమరు ప్రథమంలో గ్రంథము (గీరతము) చదువుచుండగా అందరికీ చాలా సంతోషంగా నుండెననిన్నీ తరువాత అక్కడ వారు యెవరో రచించిన పుస్తకమును మీకు చూపి మీ అభిప్రాయమును కోరగా అది మీకు నచ్చదన్నట్టున్నూ అక్కడనుంచి అక్కడ నున్నవారందరు అనేకవిధములుగా మిమ్ము అవమానించవలయు నని పట్టుపట్టినట్టున్నూ అట్టివాండ్రలో తనకుమారుడుకూడా వుండినట్టున్నూ, వానిని వారు మందలించినట్టున్నూ, చెప్పినారు. తమయందుమాత్రం ఏమీ లోపము లేదనిన్నీ, లోపము వాండ్రిదే ననిన్నీ మిమ్ములను ఎట్లాగైనా అవమానించాలని వాండ్రందరు అదివరకే అనుకొని వున్నట్టుగాకూడా వారు అభిప్రాయము కనుపరచినారు. యింకను బ్ర॥ శ్రీ॥ రామకృష్ణకవులలో కృష్ణకవి అనేవారు తమదగ్గర శుశ్రూషచేసి అవధానరహస్యములున్నూ ... మీవద్దనే తుదనెగ్గించు కొన్నట్లు సెలవిచ్చినారు. అంతేకాక మీకవిత్వముతో ఆవూరిలో ఎవరికవిత్వమున్నూ సరితూగచాల దనిన్నీ మిమ్ములను జయింపలేరనిన్నీ బ్ర॥ శ్రీ॥ పెద సీతారామశాస్త్రులవారు పదిమందిలో చెప్తూ యుండగా తాను విన్నాననిన్నీ చెప్పినారు వారి సంభాషణవల్ల ముఖ్యపరిపోర్టు ఏమనగా, మోసము రామకృష్ణకవులదనిన్నీ, ఆవూరియందు యింకా కొంతమంది దనిన్నీ, తేలినది. అప్పుడు నేను "లోపము ఎవరియందువుంటే వారిని మీవూరి పండితులు మందలించరాదా" అని అంటిని. అందుకు వారు రామకృష్ణకవులు అక్కడివారికి చాలా దగ్గరబంధువులు కావడమువల్ల ఏమీ అనుటకు వీలులేకున్నదనిన్నీ, తిరుపతి వేంకటకవుల కీర్తి యితరులవల్ల పొయ్యేది కాదనిన్నీ, మావూరియందున్న పెద్దలు వూరకుండియున్నారు. అని సెలవుయిచ్చినారు. మీరు గీరత

ములో న్యాయముగా వెళ్ళినట్టు వారు చెప్పిన మాటలవల్ల నామనస్సుకు (తోఁచి) చాలా సంతోషించినాను..."

**T. KOTAYYA.**

ఈ. టి. కోటయ్యగారి గ్రామ మెక్కడిది? గుంటూరు డి॥ లోనిది. సత్యాన్వేషణతత్పరత్వము తప్ప నీయన కీపరిశ్రమమేల? సత్యజిజ్ఞాసువులు చేయు పరిశీలనమున కెన్నాళ్ళు చాపక యసత్యజీవనుల పదరులు నిలువఁ గలవు? అట్టిచో నా పాడుఁగూఁతలనే మరల మరల నేల వదరవలయునో? పైవిషయ మును గూర్చినదే మఱియొక యుత్తరము.

"నాలుగుదినములక్రిందట బ్ర॥ శ్రీ॥ చెర్ల రామశాస్త్రులుగారును, వారితో బ్ర॥ శ్రీ॥ ఆణివిళ్ల సీతారామశాస్త్రిగారును యీగ్రామము లౌక్యసం॥ కార్య ముమీద విచ్చేసిరి. మమ్ముల జూడవచ్చిరి. పేరువినుటతోడనే, బ్ర॥ శ్రీ॥ సీ॥ శా॥ గారిని "శృంగభంగపు" వ్రాతలనుగురించి ముచ్చటించితిని. అందు బాలురచేష్టలును, తా మచటి కేగుట మొ॥ సంగతులు చెప్పిరి; తమయందు మంచితాత్పర్యం కలదు"

1-7-13 ఏలూరు. మై॥ కృ॥

ఇట్లెందఱిచేతనో ప్రతిక్షణమున విమర్శింపఁబడుచు నిగ్గు తేల్పఁబడుచు సీ, యని రోయఁబడుచున్న తన కుకల్పనయం దింకను రామకృష్ణమ్మకు నాశా భంగము కలుగనేలేదు పైఁగా నా, శృంగభంగసత్యసందేశములలో రెండవ దానిని మేము మాగీరతమునఁ గైకొననేలేఁదట? కైకొన్న "శృంగభంగము" వలనఁ దనకుఁ గలుగుచున్న మర్యాద చాలదా? పునరుక్తిప్రాయ మగుదానిం గూడ నేల కైకొనవలెనో? ఆ ప్వాయమే యననేల? ప్రకృతవిషయమునఁ దా నేది వ్రాసినను నయ్యది యప్రగల్భనృతమయముగానే యుండెననుట యెవ్వ రెఱుంగనిది? శృంగభంగసత్యసందేశముల కర్తృత్వ మెవని నెత్తిని బులుమఁబడినదో యీ చర్ల చలపతి వర్తనముం బోలె నాయీ ప్రకటనములును వెలుఁగఁ గల వని తలఁపని ప్రాజ్ఞు లెవరు? చర్ల చలపతి వర్తనము కొంత గూఢముగా గురుదక్షిణలో 15వ పుటలో సూచింపఁబడినది. మఱికొంత తెలి యఁగోరువారు మాశిష్యుఁడు వెంకటరామయ్య శాకవేశ్రిలు విడిచిన పినతండ్రి యగు బ్ర॥ శ్రీ॥ ఓలేటి నారాయణశాస్త్రులవారి సరిక్రొత్తయుపానద్ద్వంద్వ మును బ్రశ్నింపఁ గోరెదము. అట్టి యుత్కృష్టునికి స్యాలకుఁడగుట కర్మవశ

ముగాని యందులకు దుఃఖింపక యవ్వానితో క్షీరనీరన్యాయమున నుండి కుకల్పనలు ప్రకటించుట తత్తుల్యత్వ సంపాదకము కాక తీరదు. కావుననే దూరగులు సైతము ప్రత్యయము చాలక రామకృష్ణుని వ్రాఁతలు ప్రతిపదమును విమర్శించి తజ్జ్ఞులవలన గుట్టుమట్టులను గనిపెట్టి త్యజించుచున్నా రనునంశ మింతకుమునుపే సిద్ధాంతీకరింపఁబడినది. దానినే బలపఱుచు నతని స్వయంకృతాపరాధబోధకము లగు నక్కరములు మఱికొన్ని చూపఁబడుచున్నవి.

(రా॥ కృ. భా. కథావతారపర్వమునుండి.)

చ. ఒకతఱి రామకృష్ణకవులొద్దకు వెంకటశాస్త్రి చూడ ను
త్సుకుఁడును బోలె వచ్చి "తగుచోట ననుంగొని మీగురుండుగాఁ
బ్రకటన సేయఁ గోరెద భవద్గురుతాపదలబ్ధి నాకుఁ గొం
డొకయుపకార మామతి లెడున్ భవదీయనృపాలసన్నిధిన్.

ఉ. వేసవికాల మేగుదును వెంకియు నేమరుదెంతు మింతలో
మాసడి మీనృపాలుని సమక్షమునందుఁ బ్రసంగమార్గముం
జేసి సచింపుఁ డేను నృపశేఖరుదర్శన మబ్బ యత్నముల్
చేసెద"నంచుఁ గొమ్మ మెయిఁ జెప్పెను దత్సమయోచితంబుగన్.

ఉ. మంచిది "వేంకటేశ్వరుఁడు మాకు గురుం డని పల్కు మీకు లా
భించెడి దున్నవల్లె కలిపించెద" మంచు వచించి యాతనిం
బంచిరి రామకృష్ణులటు ప్రాప్తమనోరథుఁడౌట నాతఁ డిం
చించుక సంతసంపడియు నీసును వీడఁడు లేశ మేనియున్.

ఇట్లు వెం॥ శా॥ తమ్ము నాశ్రయించినది నిక్కమే యగునెడల నీయంశము "లఘుస్తుతి ప్రశంసలో" వ్రాయమానుటకుం గతము పూజ్యము. వెం॥ శా॥ రాజదర్శనార్థియే యగుచో వీరి నాశ్రయింపవలె నేమి? అసత్యమాడుపట్టులఁ గూడఁ గొంత తెలివి యుండవలయును. అదియే యున్నచో నీమా "దైవవంచితు" లీయంశమునుగూడ స్వాప్నికపర్వములో నేనిఁ జేర్చుకొనినఁ గొందఱు కాకున్నఁ గొందఱైన "పాపము వారికట్లు స్వప్నము వచ్చియుండఁబోలు" నని యనుకొనుటకైన దటస్థించునేమో? ఎట్లుఁతటస్థించెడిని? వాదిప్రతివాదులలో నొకరుఁ డింకొకఁడు చెప్పినట్లు తన కనుకూలించు సంగతులను గిలికి "ఇట్లాతఁ డెప్పుడు చెప్పె" నను ప్రశ్నము వచ్చినప్పుడు "స్వప్నమునం" దని యుత్తర

మిచ్చుచో నమ్మ తీర్పరు లెక్కడనుందురు? కావున నీస్వప్నప్రసంగము కూడ మా "దైవవంచితులు" శుద్ధాసత్యములను వదరు నికృష్టులని లోకులకుఁ జెప్పక చెప్పుట కేర్పడినదియే యని మేమిందు వేఱుగ వ్రాయనక్కఱలేదు. స్వప్నములో వెం॥ శా॥ చెప్పినట్లు లెన్నో సంగతులు కల్పింపఁబడినవి అందు రామకృష్ణమ్మకుఁ గల రిక్తమనోరథమును దెల్పఁదగు నొక యుపగల్భముఁబద్దె మిట నుదాహరింపఁబడుచున్నది

ఉ. "పగ్గెకు మిమ్ము గెల్తు నని పల్కుచునుందును గాని కృష్ణతో
నెగ్గఁగ లేము తిర్పతియు నేనును వారని పేరు విన్నచో
దిగ్గురనుఁ మనం? బెప్రడు దృప్తమృగాధిపడింభమో యనన్
దిగ్గనఁ బైఁ బడంగ నరుదెంచునొ యంచు భయంబుఁ జెందుదున్."

పాపము వీని కెంత కోరికయున్నదో? అవును.

శ్లో. ఉత్పద్యంతే ప్రలీయంతే దరిద్రాణాం మనోరథాః
బాల్యవైధవ్య దగ్ధానాం కులస్త్రీణాం...ఇవ.
"రిక్తుని మనసుకోరికలు పెద్ద"

అది యటు లుండె. ఇట్లని వెం॥ శా॥, వెం॥ రా॥ లతోఁ బల్కినదెప్పుడు? స్వప్నమునందు. స్వప్నఫలవేత్తలిట్టి పట్టున నర్థ మెట్లు చెప్పుదురు? "ఇట్టిమాట వెం॥ శా॥ వలన నీవెన్నఁడును విన నేరవు" అని చెప్పుదురు. అట్లేల చెప్పవలె నందురా? వేఱొకప్పుడు వెం॥ శా॥ యెదుటికి రాఁగానే నిలువఁ దమ యూపిరు లెగిరి పోయినట్లు కల వచ్చె ననుకొనుఁడు. అయ్యది యట్లు జరుగ వలసినదియే యగునోటు?

(దేవీభాగవత షష్ఠస్కంధమునుండి.)

శ్లో॥ నిద్రయా చాల్యతే చిత్తం భవన్తి స్వప్నసంభవాః। నానావిధ మనోభేదాః... శ్లో॥ మృతం పితామహం స్వప్నే పశ్యతి స్వగృహాగతం...। భ్రమోఽయ మితి నిశ్చయః॥

దీని కిన్ని ప్రమాణము లెందులకు, నిజముగా స్వప్నము వచ్చెనే, వెం॥ రా॥ లట్లు వ్రాసినను నది వృథా, వీరలకట్టిస్వప్నమే రానిచో నిఁకఁ జెప్పవల సినదేమి? స్వప్నముగాదుగాని యిది యొకజాతిప్రలాపసన్నిపాతప్రయుక్త మగువికార మైనఁ గావచ్చును. ఈవికల్పములకేమి, "రామకృష్ణమ్మకు, తి॥ వెం॥

కవులను జయింప వలయునను మనోరథ మున్నది. అట్టిశక్తి భగవంతుఁ డియ్య లేదు. అందుచే నిట్టిపాటులు పడవలసివచ్చుచున్నది." ఇది సారము, పై మనోరథ మెట్టిభయముతోఁ గలసి మెలసి వర్తించుచున్నదో, అభయ మెట్టి తెల్వి తక్కువ పరిసంగమును జేయించుచున్నదో, యీక్రిందిసాకులవలనఁ దెలిసికొన వచ్చును.

(రా॥ కృ॥ మ॥ భా॥ పునరుక్తిపర్వమునుండి)

"చ॥... తారు తుల్యపదభాగులె మే మెసరేఁగి తాఁకఁగన్.

క॥ సమశీలోద్యోగులకున్, సమవిజ్ఞానులకు సమసుచారిత్రులకున్
దమలో సఖ్యమును వివా, దము దగు నని వ్యాసభారతమ్మనలేదే."

ఇందుచేత తి॥ వెం॥ కవులు పిల్చినను వెం॥ రా॥ లు విద్యావివాదమునకు రారఁట? సత్యమే కావచ్చును, వేదుల రామకృష్ణమ్మకీ విషయమైన పట్టుదల పూర్తిగానున్నట్లు బలవత్తరమైన సాక్ష్యమున్నది గానఁ బైసంగతి విశ్వసించి తీరవలయును. ఇతఁడు చర్ల చలపతితో వివాదమునకుఁ గాకున్నను వివాహము నకును స్నేహమునకును నంగీకరించి యశ మార్జింప యత్నించుట లోక విదితమే! శీలాదులయం దితని కతఁడు సముఁడు. "సర్వం సంపన్నం". ఇఁకఁ బైపద్యమునకు బీజభూతమగు భారతశ్లోకముదాహరించి కొండొక చర్చింప వలసియున్నది.

శ్లో॥ యయోరేవ సమం విత్తం యయోరేవ సమం శ్రుతం
తయో ర్వివాహ స్సఖ్యంచ నతు పుష్టవిపుష్టయోః

ఈశ్లోకమునకును ఆపద్యమునకును విశేషభేదమున్నను బ్రకృత మది యంత గణ్యముగాదు. "పైవాక్య మెవరిది? ఎవరిని గూర్చినది? ఈవక్తకుఁదుష్ట తుదకుఁ బ్రాప్తమైన గతియేమి" అనునది ప్రస్తుతము, పైపదనము రాజ్య మదాంధుఁడగు ద్రుపదునిది; ద్రోణునుద్దేశించి పలుకఁ బడినది. ద్రోణశిష్యులచేఁ దుష్టతుదకు వక్తకుఁ దటస్థించినదుర్గతి సర్వవిదితము. కావున దానిననుకరించు వాండ్రగతి విచారింపనేల? ఔరా! దైవవంచితుల ప్రమాదములు! "నీదయా, నీవయా, నిదృియా". ఇంత తెల్వితక్కువలో నున్న తమకప? †ఉన్నతస్థానమం

---

† ఉ॥ క్రిందుగనున్నవాఁడు... తెగియించు... యున్నతిం బొందినవాఁడు ...సందియమందు...॥ (రా॰ కృ॰ భా॰ పునరుక్తిపర్వముచూ.)

దున్నారము ! తి॥ వెం॥ కవులము! అథస్థానమున నున్నారము! వీరి కోడినను గెల్చినను లాభమేనము! తమకో? యోడిన నష్టమును ! కావున విద్యావివాదమునకు రారము! అంతియకాని సామర్థ్య మేమో చాలానున్నదము !!! ఏమి యున్నతస్థానస్థితి, సిగ్గుసిగ్గు

"ఎన్నఁడు నెఱుఁగనివాని కేగానిదొరకితే యెందులోఁ బెట్టనేకందుల బుఱ్ఱా",

అది యటులుండె, ఇప్పటి కచ్చయినంతవఱకు వీరి నేతిబీఱకాయ భారత మిట్టియప్రగల్భానృతోక్తులతో నిండి యున్నయది, అందింతవఱకుఁ జెల్పినకథాంశమేమియును లేదు. "కథావతారపర్వమని" ప్రారంభించి అందు మాశిష్యుఁడు చదివినగురువులను గొండొక పేర్కొనిరి, అందు వెం॥ శాస్త్రిని మొట్టమొదట వదలిరి, వదలుడి జ్ఞప్తికివచ్చి కాఁబోలు.

ఉ. ...చెళ పిళ వేంకటేశ్వరా,
ఖ్యాతునితో నెటో చదివెఁ గౌముది నిర్వదినాల్గుపత్రముల్.

అని యొకచోఁ దప్పుడుఁగూఁత నొకదానిని గూసిరి. ఈ కూఁతకర్థమే లేదు. లేదన్నందులకు * అప్రస్తుత ప్రసంశలో వ్రాసిన 'స్త్రీప్రత్యయాంతమే' అనునదియే సాక్షి. స్త్రీప్రత్యయాంతము 24 పుటలలో నిమిడియున్న కౌముదీ సంపుటములు కానరావు. చదివినది స్త్రీప్రత్యయాంతమును గాదుసుఁడీ! దానికిఁ గౌముదిలో నెన్నియక్కరములు వచ్చునో అవియన్నియు వెం॥ శాస్త్రి భిక్షయే యని పంచభూతములును సూర్యచంద్రులును దక్షులును నెఱుఁగుదురు కాన విస్తరింపఁ బనిలేదు. యీ ఆ పరస్పరవిరుద్ధాప్రగల్భానృతవాక్కులతోఁ గాగితములు నెఱుచు మాదేవయ్యలకు జాగ్రత్సన్నిపాత మంకురించినదని యను మానింపఁ దగు నంశములుగూడ నా నేతిబీఱకాయలోనే కలవు. అందొకటి వృథాగా పింజరగ్రామమును బట్టుక వడఁదిట్టుట. దీనింగూర్చి యీగ్రంథము తొట్టతుదను గొండొక విమర్శింపఁ బడి యున్నది. 49 వ పుట మొదలుకొని చూడఁదగు మఱియు నాయీ యీపర్వములలో మా 'దైవవంచితులు, వ్రాసిన సంగతులు సంగ్రహముగాఁ జెల్పుచున్నారము. "వెం॥ శా॥ గారికి శాస్త్రము

* "వెంకటశాస్త్రి గారివద్ద వెంకటరామశాస్త్రిగాను వ్యాకరణము ప్రారంభించి కొన్నిమాసములకుఁ గౌముదిలో స్త్రీప్రత్యయాంతమే— ఎంతైన నేమి, చదివిరి. (అప్రస్తుతప్రశంస చూ.)

రాదు. మాయకవిత్వము వచ్చును. శ్రవణానంద, పాణిగృహీతా, నానారాజ సందర్శన, పాండవాశ్వమేధములు పనికిమాలిన చెత్తపుస్తకములు; గీరత మిన్నిటి కన్నఁ బాడు. దీనిం జదివినవారికిఁ బాపము. వెం॥ శా॥ గారి యాజ్ఞమీదనే మే మీభారతము వ్రాయుచున్నారము. స్వప్నములో వచ్చి, వెం॥ శా॥ తాఁ దోషి నని యొప్పికొనియెను. వెం॥ శా॥ వ్యాసమూర్తిశాస్త్రిలవారికి మున్నె పుడో విందు చేసి విలువగల నూత్నవస్త్రములు కట్టఁ బెట్టెను. కావున వ్యాస మూర్తిశాస్త్రిలవారు చాల గొప్పవారు. వీరి కతఁ డొనర్చిన విందు శబరి శ్రీరా ములవారి కొనర్చిన విందువంటిది.'' ఇత్యాదులు వ్రాయఁబడినవి. ఇందుల ' నీవిందుమాట మాత్రము సత్యము. కాని శ్రీశాస్త్రిలవారికి శబరివలె వెం॥ శా॥ యెంగిలిపదార్థములను బెట్టెనని వ్యంగ్యమర్యాదచే స్ఫురించునట్లువ్రాయుట దండ్యమగు దోసము. మఱియు నీవిందు వ్యాసమూర్తిశాస్త్రిలవారు పెద్ద పండితులు బంధుసముద్రులు అను గౌరవము వెం॥ శా॥ కిఁ గలుగుటకే బోధక మగును గాని వారి కవిత్వమున్న నతని కేవము లేదని తెల్పుటకుఁ బనికిరాదు. వారి కవిత్వమునందు లోకుల కెంత గౌరవమో, వెం॥ శా॥ కిని నంతియు య విజ్ఞు లెఱుఁగుదురుగాక. అది యటులుండె. ఇట్టి అసంబద్ధయుక్తులకు మఱి కొన్ని సంగతులు వ్రాయఁబడియున్నవి, అనునది ప్రకృతము. అవ్రాసిన సంద ర్భములలోఁ దక్కినవి విమర్శనకు నాఁగనియసత్యము లగుట యంత తప్పుగాదు గాని వింజరదూషణ ముపానప్రియోగార్హమని యననివా రుండఁగూడరు. ఆభాగము ప్రచురించునెడల నంతవఱకు వచ్చుటయు, దానిపై నవి కొన్నిమాసము లాపి తుట్టతుద కొక సీసపద్యములో నాగామస్థలలోఁ గొందఱను భూషించి "టెంకాయపిచ్చికొండ" చేయుటయుఁ బలువు రెఱుఁగుదురు. మఱియుఁ నాయీ తప్పుడుభారతములో వెం॥ శా॥ గారి మీసములనుగూర్చి తాము వెక్కిరింపలేదనియు, నేమో యనియుఁ గొంత వ్రాలపింపఁబడినది. 'రా రప్పింపఁ బనిగానరాదు మాకు'అనుదానికిఁ దెల్పితకుఁ గావగా వ్యాఖ్యాన మొనర్పఁ బడినది. దానివలనఁ దేలు సారము "మీరు వచ్చునెడల మేము మిమ్ము రప్పిం పము గాని మిమ్ము జయించుట కే ప్రదేశమునకేని మేము వత్తుము. వచ్చుట మాత్రమే కాదు. విధిగా జయింతుము. అనునది, అటులో నొకపరి బందరు పట్టణమునకే వచ్చుట యుక్తము. ఇందునుగూర్చి, గీరత 1 భాగము 45 పుటలోని "తే॥ గీ॥ బందరే వచ్చి" అను పద్యము చూడఁదగు. ఎప్పుడుపత్త్రులో తెల్పునెడల సభ యేర్పఱిచి వారి రాకకై ప్రతీక్షింపఁబడును. చేవ యే

యున్నచో శ్రీరాజా రావు చెల్లయ్యామ్మారావు బహద్దరువారి షష్టిపూర్తికావ్యా నింపఁబడి 'వత్తు' మని యంగీకృతిం దెల్పి కూడఁ బలాయనమంత్రము స్వస్తి చెప్పుటకుఁ గత మేమో యెఱుఁగనివా రెవ్వరు? "పిల్లి కనులు మూసికొని పాలు ద్రావిన" నని దాఁగు టెట్లు. ఇందుఁగూర్చి యీపత్త్రమున 51, 52 పుటలు చూడఁదగు. ఆ యీ సందర్భములెల్లఁ బరికించువారికదె 'రామకృష్ణము + మహాభారతము గాఁ' గన్పట్టక యెట్లు మానెడిని. అది యటులుండె గీరత ముత్తమగ్రంథమని తెల్పఁదగు నుత్తరము లెన్నో, 1, 2, భాగములలోఁ జూపఁబడినవి. దిఙ్మాత్ర మీభాగమందును బ్రచురించితిమి. కాని యెన్నో యుత్తరములింకను నిల్వయున్నవి. కొన్ని యిటఁ జూపఁబడుచున్నవి.

(1) ఉ॥ శ్రీపతి వేంకటేశకవి సింహములార! శతావధాన వి। ఖ్యాపకభాగభారసకలాంధ్రధరాధరసత్సభాప్రభా। దీపకకీర్త్యుదంచితవిధిప్రకటాత్మకులార! సత్కృతి। స్థాపకులార! నేఁ దమపదంబులకుం బ్రణతుల్ ఘటించెదన్॥ చ॥ చరితములందు గీరతము చాల నసారమయ్యె నీతి। విస్ఫురణము గాంచనయ్యె, గురుసూరులమన్నన హెచ్చనయ్యె నేఁ। డరుదుగ 'సీమ'యన్ చరిత మాన్యులు తాము రచించినట్లు నే। నెఱిఁగి లిఖింతు నొక్క ప్రతి నీయెడకుం దయసేయుఁడు వీ. పి. గాన్॥ క॥ అన్యతనోభయకవులం। దున్యత్కీర్తిప్రతాపయుక్తులకలనన్। మాన్యులగు తమకు నే నన। నన్యప్రణతిం బొనర్చి ప్రమదము గాంతున్. 6-3-18.

(2) తాము ప్రచురించిన 'గురుదక్షిణను' జూచితిని, ఇంతకు ముందటి ప్రథమ భాగముం జదివియుంటిని. ఇక్కాలమున శిష్యహితోపదేశము చేయ నింతటి సత్కృతిగ్రంథమును రచియించి, లోకోపకృతిఁబొనర్చుచున్న తమ్ము సహస్రధాఁ గొనియాడుచు నొక్క గురుదక్షిణను వీ.పి. గా దయచేయఁ బ్రార్థించుచున్నాఁడను.

గుంటూరు — పెరవలి, పార్వతీశశాస్త్రి,
16-11-13. — ఏ, ఈ, ఎల్, ఎమ్, కాలేజీ, సహాయాంధ్రోపాధ్యాయుఁడు,

---

పెద్దింటి హయగ్రీవస్వామి అనేక ప్రణామములు సా॥ ఆర్యవటం-గొల్లపాలెంపోష్టు, కాకినాడతాలూకా, గోదావరిడిస్ట్రిక్టు. తాము చెప్పిన గీరతము నాకు నొక ప్రతివెంటనే వీ. పీ. గా దయచేయించుటకు ప్రార్థించుచున్నాను.

చదువరుల కపరిమితానంద దాయకమని మన ప్రెసిడెన్సీ యంతయు కీర్తివిస్తరించెను. గాన సదరు గ్రంథము చదువ నెంతో వేడుక కలిగి యీ విజ్ఞాపనపత్రిక వ్రాసినాను. ది 16-11-13.

---

తమ రిదివరకు రచించిన గ్రంథములు కొన్ని మాత్రము నావద్ద నున్నవి. అందు, సర్వజనోపయుక్తంబై, కల్పభూరుహంబువలె సకలార్థదానశాలియై, కాలమేఘంబుచందంబున గంభీరధ్వని విరాజితంబై, భారత కథావిధంబున, నానావర్ణ సమస్తపదభూయిష్టంబై, యొప్పారుచున్న గీరత ప్రథమభాగమును జూడ నా డెందం బమందానంద తుందిలంబయ్యె. మల్లాది వెంకటసుబ్బయ్య. గుంటూరు

14-3-1913.

---

19-1-13.

తమ గీరతము నామూలాగ్రముగఁ జదివితిని. మిక్కిలి యొప్పుగను దెలుపుచు నానంద మొనఁగూర్చుచున్నది.

పురాణం, రామచంద్రశాస్త్రి. ముక్త్యాల (సంస్థానం) కృష్ణాడి॥

---

సీ॥ పరవిఁ గృతఘ్నుల జక్కాడి జయమొంది ప్రభవిల్లు మీపాశుపతము
గంటి...భ్రాంతప్రతిభమైఁ బండితకోటిని దన్పెడు మీగీరతమ్ము గంటి..."

దార్వెముల, వెంకటశేషశాస్త్రి. 22-3-14

గోపువారిపాలెం, వీపూరుపోష్టు, వినుకొండతా॥ గుంటూరుడి॥

ఇక్లైండలో నిర్వ్యాజముగా నుతించు పాత్రమును వెం॥ రా! వెట్లు తిట్టిన నేమి ప్రయోజనము? అదిగాక వారేని స్వస్థచిత్తులై వ్రాయువ్రాఁతలో నిందించుచున్నారా? పాపము! గీరతమును జదివి అవసరముం బట్టి ఖండింపనెంచి వీలు లేక చేయు "హాభారతము" లోఁగదా తిట్టుచున్నారు. దుఃఖసముద్రములో మునిఁగినవా రేమన్నను నవి విజ్ఞులు పాటింపఁ దగదు. అదియటులుండె, చూచినంతలో నీ "హాభారతము" సత్యమునకుఁ జాలదూరముగ నగపడుచున్నది. కాని యతిప్రాసాదు లనుకూలముగ నున్నవని జెప్పుటకు సందియము లేదు. అందీక్రింది పద్యమును, వెం॥ రా॥ లెందుకో వ్రాసికొనియుండిరి.

క. 'ఒకపండితుఁ డొకపామరుఁ, డొకలోకంబైన నేమియో యనవచ్చున్
సకలమ్ముం దముఁ దెగడిన, స్వకీయదోషమును దెలియఁజాలరు కుకవుల్.'

ఉ. తా నొనరించుకర్మ మది తన్ను ఘటించి కలంచుపట్ల న
జ్ఞాని యిటేచుమీ, వృథగఁ జాల దురుక్తులు వల్కు దేవు; సు
జ్ఞానియొ కర్మమున్ దలఁచి, కష్టము లెట్టులొ సైఁచి, వచ్చుజ
న్మానకుఁ గూడఁబెట్టుకొనఁగా గమకించు సుకర్మపుంజముల్. 129

(ముష్టిచెంబుంగొని...బొంగు బుజానవేసికొనిపోదురు)

ఉ. "బొంగు బుజాన వైచికొని పోయినఁ" బోదురుగాక, "ముష్టిచెం
బుం గొనిపెట్టు" మంచడుగఁ బోయినఁ బోదురుగాక, "గంగిరె
ద్దుం గొని దేవుఁ డంచుఁ బలుత్రిప్పలఁ బోదురు" గాక; దేవనిం
దం, గురునింద సేయరుగదా! యలవారల కేల యగ్గెదో ? 130

ఉ. శక్తుఁడవేని దేవగురుసంస్మరణం బిగఁద్రావి, ♦ పై నికృ
ష్టోక్తులు ప్రేలు దుర్మదుల దుల్లములం బగులింపు, ధర్మశా
స్త్రోక్తులు సమ్మతించు నిది; యూరక తీరికకర్మ నేటి య
వ్యక్తుల, బిక్కుదాసరుల కగ్గదు నీసరులేమి కైసరా? 131

(బొంగుబుజాన వైచుకొని పొమ్మనఁ జెప్పితి వేంకటేశ్వరా)

ఉ. "బొంగు బుజాన వైచుకొని" పోఁడు; వరాంగముమీఁద నెక్కి న
ర్తంగికరావ ముప్పతిల "దద్ద దదిందిక దద్దదోం దదోం
గొంగిణలెక్కు తక్కు" యని తొల్లిటి కాళియమర్దనంబు జ
ప్తిం గొనఁ ఘూర్ణిలుమీ, తుదకు వేంకటనేతపదారవిందముల్. 132

(మాసినమూసవేషమునకేమండనము...నీవేసముసూడ నెవ్వరికివేడుక)

ఉ. దాసుని కోరికిం బరగ దైవము తత్తదుపాధిరూపముల్
భాసిలఁ జేయు; నీవు నగపట్టైను దేవుని కిట్టి నక్కటా!
"మాసినమూస పేరు"; కనుమా యని వజ్రపుజోడు గల్గు శ్రీ
వాసుఁడు నీకుఁ గన్పడఁడు వాస్తవరూపముతోడఁ బుత్రికా. 133

ఉ. స్వామి ధరించు * వజ్రకవచమ్ము నెఱుంగుదె? యెన్నికోటు లౌ
నో? మహిపాలుఁ డెవ్వఁ డిడెనో? యటువంటి వివేకశాల్లరు
న్నామరులా? దురుద్యములపద్ధతుల న్నెగడింప సొమ్ము న
ట్మామయ మూసి కొన్నెడి నరాధిపతుల్ సువివేకులా సుతా? 134

(♦ స్కాందోత్తరఖండము చూ.)

(* వేంకటాచలమహాత్మ్యము ౨ అ, చూ)

(శౌర్యము లేనివాఁడుగద శంకరుఁడు)

ఉ. ఈశునకమ్ము కృష్ణుఁడయి యీశుఁడు పూస్త్రితయుం బటుల్ పారి
న్నాశము సేసినాఁ డనుట నమ్మెడిచో నెటు “శౌర్యహీనుఁ”డ
రాశికి రానిమాట జనరంజక మా ? మదిలోన నర్థనా
రీశుని బెట్టి వ్రాసితివొ యీనుడి; దానఁ గవిత్వభంగ మా. 135

ఉ. “శౌర్యము లేనివాఁడుగద ? శంకరుఁ” డంచొక బొంకు బొంకి, తే
యార్యులు విశ్వసింతు ? “నిటలాక్షుఁడు శూరుఁడు గాఁ” డటన్న; నీ
ధైర్యమదేమి ? దేవగురుతత్త్వముపట్టునఁగూడ బొంకులన్
గార్య మకార్యమున్ మఱచి క్రక్కెద, నెక్కడి పాప మక్కటా ! 136

(నిం దిరుపతివేంకటేశుఁ డనఁ దీరదు తిర్పతివేంకటేశ్వరా)

చ. “తిరుపతివేంకటేశుఁ డనఁ దీర” దటం చొకవాక్కు డొక్కెఁ, బైఁ
“దిరుపతివేంకటేశ” యని దీర్ఘము నేమని తీసితోయి ? యే
మతితో ? విడంబనో? యది ప్రమోదమొ? హాస్యమొ ? తప్పమాటనీ
నతిమతిఁ బాచితమ్ముగఁ దదాహ్వయమున్ వ్రయియందుఁగో సుతా! 137

(దాసరుల్ తిరిపము నెత్తువేళ వినఁ జెల్పఁగ)

చ. తిరిపము నెత్తువార లొకతిర్పతివేంకటదేవుఁ బ్రియమే
స్మరణ యొనర్తు; రొక్కొక రుమాగమునన్, మఱి రాముఁ, గృష్ణుం
స్మరణ యొనర్తు; రేటికివి సాఁగఁగఁ గల్గెన ? యింతమాత్రినే
వరదుఁడు వేంకటేశ్వరుఁడు వైష్ణవులౌ దొరల్ కుమారకా? 138

ఉ. ఎంచి కనంగ లేదుకద ? యెన్నఁడు నక్షర ! * నాగయప్పరా
వంమను “స్వామిసన్నిధి” యటంచును ‘బైకె’ యటంచుఁ దెంబురాఁ
గొం చరుదెంచు భిక్షుకులఁ, గొందొక రేల స్మరింపరేమి ? య
య్యాంచితువాసి గాసిలుట కన్నదొ ? యీ నము లిట్టిగానముల్. 139

హిందూస్థానీ కీర్తన.

* అప్పారావు, దునియామే, నైరాజా, అప్పారావు స్వామిసన్నిధి బైకె, అప్పారావు వైకుంఠమే నై రాజా. అప్పారావు కాశీమేయినకటి॥ పల్లి॥ ఖానే లడ్డూ దియా, పీనే తంబళ్ దియా, హాత్మే లకిడీ దియా, సోనే కంబళ్ దియా, దునియామే నై రాజా, అప్పారావు। ౧॥ పీనేలోక్కు రాజా,

ఉ. ఎవ్వని పేరు చెప్పికొన నింపుగ ముష్టియుఁగూడఁ బుట్ట దా
గవ్వ నెపండు పాడుఁ? ద్విజగమ్ములు పోసినవానిఁ దక్కఁ; నీ
నవ్వున కర్థమేమి? యలనారయభూరమణాంగ దలంతివే ?
యెవ్వరు నీకుఁ జెప్పఁ గల? రీవియు పేర్చెదు తోఁచినట్లుగన్. 139

చ. అతని చరిత్రమున్ వినిన, వానృపుఁబాడిన, నాతవాన్య దా
తృతకు నమస్కరించినఁ, బదీయయశమ్ము పఠించు భిక్షుక
ప్రతతి పదస్ఫురద్విజము ఫాలమునన్ ధరియించినన్ భవ
త్కృపము కృతఘ్నతాపర మొగిన్ శమియించు, నటుల్ పొనర్ప్పమా. 140

---

హుకాం దియా రాజా, కడ్డుక్ దియా రాజా, చిల్మ దియా రాజా, గంజాయి దియా రాజా, చిట్టా దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥ ౨॥ బైట్కె చత్తర్ దియా, సోనేకా తక్ దియా, రేలూమే, యేక్ బడా సత్తర్ దియా, దునియామే నైరాజా, అప్పారావు॥ ౩॥ దూకాణ్ తీర్థియా, పాంకు సూతీ దియా, సికె లోసె దియా, ఘోడీ దియా, దునియామే నైరాజా, అప్పారావు॥ ౪॥ గోటే ఖానేలోకు , గోటే దియా రాజా, ఘూ త్పి నేలో కు, ఘూ, ద్దియా రాజా, దునియామే నైరాజా॥ ౫॥ బాపణ్ లోకు రాజా, పీక్ సత్తర్ దియా, అల్లా దియా రాజా, నైగ దియా రాజా, దాల్, దియా రాజా, ఘీ, దియా రాజా, ఘు, దియా రాజా, నమక్ దియా రాజా, దునియామే నై రాజా, అప్పారావు॥ ౬॥ కాశీగోట్టుదియా, జగన్నాథ గోట్టుదియా, మదరాస్ గోట్టుదియా, ప్రయాగ గోట్టుదియా, గయా గోట్టుదియా, దునియామే నైరాజా. అప్పారావు స్వామిసన్నిధిబైఠే॥ ౭॥......శ్రీ.శ్రీ.శ్రీ.

(ప. రా: — ఈ మహాపురుషుని పుణ్యకార్యముల నిదేకీర్తిని లోకులు హృద్గానము చేయుచుందురు. ఇయ్యనఘుఁడు సాక్షాద్భగవత్స్వరూపుఁడై జనులపాలిటికి భగవంతుఁడేయై యుక్తాయుక్తవిచక్షణత నెఱిఁగిన దాతయై నెగడెనఁట? ఈతని యుక్త దాతృత్వమునుగూర్చి యొక మహాకావ్యము వ్రాసినఁగాని యింతలోఁ దేలునది కాదు. భస్మాసురాలిప్రాయముగ సొమ్ము దుర్వ్యయపరిచు నేఁటి దాతల కనేకుల కీయనఘుని చరిత్రను నీతిగఱపఁగలదని యెంచి కొలఁది దినములలో నీ ధర్మాత్ముల రాజుల పుణ్యచరిత్రమును వ్రాయనెంచి యిప్పటికి గ్రంథవిస్తరభీతిచే నింతతో విరమించుచున్నాము.)

మ. అసహాయమ్ముగఁ బోకు; మేఁగునెడ వయ్యాద్రింద్రమం దెందు *వ్యా
ఘ్రసమాజమ్ములు "గాండ్రు గాండ్రు" మనుచుం గర్జిల్లు నందెందు బ్ర
హ్మసమాజంబులు నేసమాజములు నేమం బీయ; వీదోసముల్
పసి గట్టం గల వామెకంబు లచటన్ భద్రంబు సూ పుత్రికా. 147

ఉ. భక్తు లనేకు లయ్యెడకు వచ్చుచుఁ బోవుచు నుండ్రు; వారిపై
రక్తిగ నుండు నంట యవి; బ్రహ్మసమాజము భక్తదూరమా
రిక్తమతిత్వ గానఁ జెలరేఁగఁగ వచ్చు నటంచు నెంచి సు
వ్యక్తముఁ జేసితిన్ దగినయట్లుబకుం జని చూడు వెంకనన్. 148

క. కుసుమతియని కుమ్మతియని, కుసుమూర్తియు వాఁగ మతియుఁ గుమ్మూర్తియనన్
బరఁగెడిగిరి యాది; యచటం గురుమూర్తియె నీకుఁ దోఁచు గురువిక్షపముతో.

చ. "తిరుపతి, వేంకటేశ్వరుని తేజమునన్ యశ మంచె" నంచు ను
న్నతమతి వారిని; తిర్పు చేయ ఱంగుకు ఫీస్నుము గాఁగ వ్రాసి; తే
మఱితివో? బుద్ధి పెద్దదవొ? "మాపిగమంచవుఁ" గుక్కమో? రెదో
యెఱుఁగఁగ రాదు; పంకిలము చేవు గ్రంథముపుటల్ కుమారికా! 150

చ. తిరుపతివేంకటేశ్వరుల తీరది యిట్టిక! చండ్రికాంగికా
స్ఫురణము భాస్వదాతపవిభూతి జ్వలజ్జ్వలనప్రభాధురం
ధరుణు గాఁ నెఱుంగుదురు క్షుణ్ణులు; వేఱుకులో, రెమోజేనయుం
దిరిగెడి వారినాలుకలు తెల్లుబు గావు సుమీ కుమారికా 151

ఈ. అంబ నెఱుంగుదే? మహిషనాయక మాఁగినతల్లి, యమాపెసిం
గంబు నెఱుంగుదే? రతిరాగ్యము భవ్య మొనర్చి చేర్చె; నా
యంబయు లింగము న్ పడిగ నాక్కతులన్ గృతి మాని యున్నె? యా
నెంబడి గొట్టు నాఁడుముల నీపబయు గ్లిఖియుంచు వేటికో. 152

(కాసుల పూరుషోత్తముఁడు... శ్రీకరుణాంగ్రీకల్పలైఁ జేసినయట్లు నేమును
రచించితి మాతికార్థము)

ఉ. కాసుల పూరుషోత్తముఁడు గట్టిన పద్దెము లెల్ల భక్తి కా
వాసము; లీవుగట్టినవి బ్రహ్మసమాజసమాశ్రయత్వపుం

*వ్యాఘ్రసమజ ఇతి తు యుక్తం, తథాऽపీదం కేవలస్వార్థమాత్రతత్పరత
యా నపవ్రత్తిరితి కృత్వా సమాజ ఇత్యేవ ప్రయుక్తమితి తు రహస్యమ్

ర్భావపు గూఁతలఁ జదరి పాఁగ్రిమికొనందగు భాగ్య మేమొ; పు
త్రా! వెఱ పేల? ఖండితపదమ్మున కింపుగ వచ్చి తెల్పుమా! 159

కర్తలకు మతి యున్నఁటికిని బుద్ధిరానేరదని నాయభిప్రాయము..."

విజయపురి, 1-9-13. **K. S. Raghuramaswamy.**

(2) చెప్పెక్కినవారింతతో శాంతిఁ బొందిన సరసముగానుండును. ఇప్పటికే యపయశమ్ము లెస్సగా వ్యాపించినది చేయుపని యెంతమేలు చేయుచున్నదో గమనించుకొను ప్రతిజ్ఞకూడ సామాన్యము కాదుగదా!

గుంటూరు, 2-8-14. శ్రీ॥ హ॥

(3) "నేను స్వగ్రామముప్రక్కకు వెళ్ళినప్పుడు వీరి యర్థశతకాది ప్రశంసను జెప్పఁగా యోగ్యులెల్ల 'రిది యేమియన్యాయము... చదువుకొంటిమని యెంతటఁ దామే యొప్పికొనియు సన్న్యాపదేశముగనో మఱియెట్లో యింకను నిట్టి తిక్కనుబడుము దర్వారిక్కులు దైవవంచితులగుచున్నారే' యనియే పగవసాగిరి. వారికి మనవిగఁ గొందఱుఁ వ్రాసికొనుమనియుఁ జెప్పిరి మొత్తమున వీరి ప్రసక్తికి సంతసించువారు లేరు. కావథమున కెవరభిముఖులగుదురు?" శ్రీ॥హ॥

(4) శిష్యులు గురునిందాపరులైరని, తాము మందలించుచుండఁగా వారు "అదేమి చూచెద విదిమాడు" మన్నట్లు కవితలో వేంకటేశ్వరునిఁ దిట్టి దిసంతులు గొట్టసాగిరి. దేవా! పురాకృతపుణ్యవశమున నిట్టిశిష్యులు లభించినందులకు ననుకొనవలెను గాని వేరేమియుండును కానిందు సాధారణముగా ధర్మచ్యుతి కల్గెడి యీయుగంబున మీగీరతధర్మసంహిత తద్దోషనివారకంబై మహాసుహర్షదాయకంబై వెలుంగుఁగాక. బృందావనము నరసింహాచార్యులు.

పెన్నూరుపోస్టు, గరికిపాడు, బాపట్లతాలూకా.

(1813 సం॥ సెప్టెంబరు 30 తేది మంగళవారము శశిలేఖనుండి)

శ్రీరామకృష్ణకవులు, విగ్రహారాధననిరసనము.

అను పేర నేఁబది పద్యముల రచించి తమ కవితారత్నమునఁ బ్రకటించి యున్న సంగతి పాఠకులందఱెఱింగినదే. వానిం జదివిన వివేకులకు శ్రీరామకృష్ణకవులు సర్వలోకగురు తిరుపతి వేంకటేశ్వర పూజానిరసనరూపమునఁ దమ గూఢశత్రువుల నెవ్వరినో దూషించుచున్నట్లు బోధపడకపోదు. అయినను వారుంచిన నామమును బట్టియు వ్రాసిన టిప్పణమును బట్టియు జనసామాన్యమునకు విగ్రహా

రాధన నిరసనమనియే తోఁచుటనిశ్చయము. కానఁ బామరజనాళిబాగును గోరియుఁ "స్పర్ధయావర్ధతేవిద్యా" అను నార్యోక్తిని దలంచి పండితులును కవిసత్తములునై నగు శ్రీరామకృష్ణకవులతోడి ధర్మవివాదమువలన నాకు విద్యాభివృద్ధియగుననియు నమ్మి వారు రచించిన విగ్రహారాధన నిరసనము మాత్రమే యించుక నిరసింప మొదలిడుచున్నవాఁడను గాన సదయహృదయులగు చదువరు లిందలి యుచితా చితముల నారయుదురుగాక....

శ్రు॥'దేవపితృకార్యాభ్యాం నప్రమదితవ్యం,' అని శిక్షావల్లి, దేవపితృకార్యములవలన ప్రమాదము చెందకుము, అనియర్థము దేవకార్యమన దేవతాపూజయని మనము తలంచవలయును (పరాశరమాధవీయము 41వ పుటయందు)'సంధ్యాస్నానం జపోహోమో దేవతానాంచ పూజనం' అని పరాశరుఁడు చెప్పియున్నవాఁడు; ఇందువలన దేవకార్యమన దేవతాపూజ యని స్పష్టపడినది. దేవతలనేకులు కలరు. మనమే దేవుని బూజింపవలెను? దేనియందుఁబూజింపవలెను? ఇదివఱకెవరు పూజించిరి? అని ప్రశ్నలు కలుగకపోవు. వీనికన్నిటికిఁ బ్రత్యుత్తరములు గలవు. వినుఁడు. "సర్వజ్ఞశ్చ హి మాధవః" అని ప్రాశిశోనియున్న బ్ర॥ మాధవాచార్యులవారు తమపరాశరమాధవీయమున 68వ పుటను అగ్నేయేపి, శ్లో॥ అర్చనం సంప్రవక్ష్యామివిష్ణోరమితతేజసః, యత్కృత్వా మునయస్సర్వే పరం నిర్వాణమాప్నుయుః, ఇందుఁజేయవలసిన పూజ విష్ణుపూజయనియు విష్ణునారాధించి మునులుముక్తినిబొందిరనియుఁ దెలియవచ్చినదికదా? ఇఁక నీపూజనెందుగావింపవలెనను విషయముంగూర్చి ముచ్చటించుకొందము. ఆశ్లోకము వెంటనే "అప్స్వగ్నౌ హృదయే సూర్యేస్థండిలే ప్రతిమాసుచ, షట్స్వేతేషుహరే స్సమ్యగర్చనం మునిభిస్స్మృతం......

సత్యాహ్నం స్నాత్వాదేవర్షి పితృభ్య ఉదకదానం ప్రతిమాదిషు సర్వహారాదదేవపూజనం, ఇట్లు శ్రుతులు స్మృతులు పురాణములు విగ్రహారాధన గావింపు మనఁగా, మునులట్లుచేసి ముక్తిపొందఁగా, నది తెలిసి యాచరించిన కుల్లూకభట్టమాధవవిద్యారణ్యాది వ్యాఖ్యాతృశిరోమణులు బోధించియుండఁగాఁ బాతాళలోకము (అమెరికా) వఱకు వేళ్లు దిగి దిగంతవ్యాప్తి నందియున్న యీ విగ్రహారాధన సాలవృక్షము శ్రీరామకృష్ణకవులఁబోంటివారు చేయు నల్పవిమర్శన చిత్రోడములయూఁపులకుఁ గదలునా? కదలదు. ఇంతియకాదు. వీరి బోధలనే రాజులవలనను పండితపామరులవలనను నిరంతరము పూజలు గైకొనుచున్న

ఉ. కీర్తి వసంతసేన, యది కేవలమున్ గుణరక్త దానికై
యార్తి శకారుఁ డూని యది యాత్మ వరించిన చారుదత్తునిన్
ధూర్తుఁడు తిట్టితిట్టి యల తొయ్యలిఁ జంపఁగడంగి యయ్యస
ద్వర్తనుఁ డేమి దా మిడికెఁ? దద్గతి నీకుచితంబె పుత్రకా! 159

(ప్రజల్ పరమేశ్వరుఁ గొల్వ నేర్చి యీ వెంగలి రాతిబొమ్మలను వేఁడరు)

చ. "పరుఁ డొకఁడున్నవాఁ" డనిన భాగ్యము లేదనుమీ, కుమార! య
ప్పరువికృతుల్ గుణంబు మఱి పార్థివుఁడున్ జనకుండు; నిందు నొ
క్కరు దిగఁద్రావినన్ బరునిఁ గాదని యంటరొ; వేదశాస్త్రముల్
మొఱలిడు నిట్లు; దాని నొకమోఱకు 'గా' దనినంత నేమగున్. 160

(1) బ్రహ్మముఁగొల్వ దైవవిశ్వాసము లేదు వీరికని ...మాటదవేమి)

చ. పరుఁ డన నెవ్వఁడో తెలియు భాగ్యము లేకయె పోవుఁగాక, త
త్పరుఁడయి పెద్దలం గొలుచు భవ్యుఁడు భవ్యము లందఁగల్గు; న
న్నరునకు విగ్రహమ్మనెడ, నాయనపట్టున, నమ్మ చోట, భూ
సురకడ, నొజ్జచాయఁ గనుపట్టుఁ బరాత్పరుఁ డేకరూపియై. 161

(జీసనుక్రీస్తునుం బ్రతిమ సేవను రోసెను)

మ. పరుఁ డెవ్వారికి లేఁడు? బౌద్ధులకు, నవ్వారేనియున్ దేశికా
దరమున్ వీడరు; క్రైస్తవాదులకు నిత్యధ్యేయుఁడే యొజ్జ; యె
వ్వరికిన్ దూరమె నీమతం బెచట సంపాదించి తో తండ్రి? నా
లరవే నిన్ను మరల్ప? వర్ధిలుము శీతజ్యోతిచందమ్మునన్. 162

---

శ్రీ తిరుపతి వేంకటేశ్వరుల పూజలకు లోటు వాటిల్లునా? వాటిల్లదు. "సత్యమేవజయతి నానృతం" (ఇందు విస్తరభీతిచేఁ జాలవదలితిమి) తి॥ వెం॥

ఇట్లు విన్నవించువాఁడు మహబూబు కాలేజి సహాయాంధ్రోపాధ్యాయపద
విభ్రాజి. శివానుగ్రహవిరాజి
శిష్టపురపు వీరభద్రపాత్రయాజి.
సనాతన ధర్మబోధినీ సామాజికుఁడు, సికిందరాబాదు.

(1) ఈ గుఱుతుగల వాక్యము, వేంకటేశ్వరస్వామివారికి సమన్వయించును. స్వామివారు బ్రహ్మముగొల్చువారల నెవ్వరిని దూఱిరి? ప్రమాణమేమి? ఇట్టివెన్నో కలవు. మఱియొకటి మాత్రము చూపుచున్నారము. చ. పరులను

(పేర్పడు వనవర్తియయి న్నిను సభాజనపాత్రము సేయుడు)

క. ఏవనవర్తియయు భువనభువ, నావనవర్తి యగు వేంకటాచలపతిపై
నీవలెం గాసల మూనఁడ, సేవించియెటీరుసేవ చేకూరెనొకో 163

తే. గీ. లుబ్ధకుఁడు వనవర్తి యగాలుబ్ధకు లెటు
గొల్తురో యట్లు కొలిచెడిఁ గొసరికొసరి;
ఇంతయెందుకు ? చెంచురా జెవ్వఁ, డతఁడు
గాఁడె వనవర్తి ? కూఁతునె కాన్కయొసఁగ. 164

గీ. వాని యేర్పాటుచొప్పున వాఁడు గొలిచె;
నదియు సామికిఁదగుఁగాక, యట్లు కాక
పోవుఁగాక, యవ్వానికి సేవకుండు
గాఁ డనెడి దోసమును గట్టఁబోకుఁ డు సుకృతి 165

క. "పేర్పడువనవర్తి" యటం, చేర్పాటొనరించితో కొ? యిలలగు నేనిన్
దిర్పతివెంకనకుఁ వాఁ, డర్పింపఁడు నతులు నిక్క నాడితిప్ప తాత్రి! 166

(బహుమార్గవేదులంజేయులుగాఁ దలంపకుము)

ఆ. నె యేకమార్గవేదియే వేది, బహుమార్గ, వేది యేటికేది ? వేఁడు కొలఁదు
ఏకమార్గ మన్న నే మనుకొంటివో ?, సత్యమార్గ మది ప్రశస్తిలెరుపు.

ఉ. కారొకో ? నిక్కనుల్ కడు నకార్యరతుల్ 'బహుమార్గవేదు' ల
వ్వారల మార్గముల్ తుదకుఁ బాడఁటె యో శఠ ? జయ్యులైనవా
రేరును నెక్కతోసలనె యేగుచునుంద్రు, నయ్యులోకమే
వారిని బోదు రయ్యరు సదా జయ మిచ్చు యయ్యం సంగుముల్. 168

చ. అరయఁగ నేర్తు వీవు చతురంగ మొకించుక గుర్తులే ? ...
లురిపురి నిక్కతొన నిను నొక్కట శిక్షితుఁ జేసినాఁడ, నీ
చరిత మటుండె, నియ్యెడ నజయ్యుల యెత్తికనీ దయష్ణు, త
త్తఱపడి సారె నోటుపడు తజ్జులజాల లనేకమార్గముల్. 169

---

చూని తిట్టెదవు బ్రహ్మసమాజము జిహ్మవృత్తివై' వేంకటేశ్వరస్వామివారు బ్రహ్మసమాజము నెవ్వరి నావేశించి తిట్టినారో అయాచోట్లు పనిఁడినవో దేవయ్యలకుఁ జిక్కతెచ్చెడివి యని యెఱుఁగుదురుగాక.

కల్పమ్మందును నీ వొనర్చ్చపని యేకష్టుండు గావింపఁ; డీ
శిల్పం బేగురునొద్ద నేర్చితరకే? శిష్యా, స్వయంవ్యక్తమో! 176

ఉ “వేములవాఁడు నామఱఁది వేఁదుఱు వ్రాఁతలు వ్రాసినాఁడు వాఁ
డీమరితమ్మునన్ జెడి నే నఘ మొంద” నటంచు నెంచెదే
మో? దురితంబు వాని దనఁ బోలదు నీకయి వాఁడు వ్రేలుటన్
నీదియె పాతకంబు మహనీయుల వేత్తల నడ్గి చూడుమా. 177

ఉ. గొల్లది చల్లలోఁ గలుపుఁ గొంపకుఁ గొంపకుఁగూడ నీళ్లు, లే
పల్లవపాణి యేనియును “నాబా! యిది యేమె యపాత్రురాల? యీ
చల్లకుఁ దెల్పు వచ్చె” ననఁ, జాన వృథా జల మిచ్చినట్టియా
తల్లులఁ దిట్టు “నీచెనఁటి తా నిట నీ రిడె” నం చెఱుంగుదే. 178

క. గుఱు నేల తిట్టితన, మా, గుఱువే యిటు చెప్పెనంచు గొణుఁగకుమా! యీ
దురితమ్మెల్లను మెల్ల నఁ, పరి నాశిర మెక్క మిగుల బరు విది తనయా. 179

(తత్ప్రతిమారాధనము నిరసించినచోఁ బ్రధాననిబర్హణన్యాయమునఁ
దక్షిణ విగ్రహముల పూజయు నిరస్తము)

ఉ. తిట్టఁగ లేదు నీవు మముఁ, దిర్పతివేంకటనాథునే చెడం
దిట్టితి విగ్రహార్చనవిధి న్నిరసించుట, కైనఁ గాశికా
పట్టణనేత దిట్టుటకుఁ బాల్పడ వే? మతిఁ దగ్రగణ్యుఁ డా
దట్టుని దిట్టినప్పుడ “ప్రధాననిబర్హణ” నీతి సార్థమా. 180

క. ‘కాశ్యత’ ఇతి వివరణమునఁ, గాశ్యపి చనుఁగాక కూలకలితం బగుచున్
దృశ్య మగుఁ గాశి యది “య, ద్దృశ్యం తన్నశ్య” మనువిధికి లోఁగదునూ.

(కలౌ వేంకటనాయక, అను వచనము)

క. కానఁ ‘గలౌ వేంకట’ యను, మాన మ్మొండినను గాశి మహిమ మధిక మె
న్నఁగయూ రెట్లట్లగుటఁ ‘బ్రధాననిబర్హణత’ కదియ తగుఁ జుమి పుత్రా.

క. క్షేత్రములలోనఁ గాశీ, క్షేత్ర మ్ముత్తమము దానిఁ జెఱిచినపై నీ
క్షేత్రమ్మునేనిఁ జెఱుచుట. పాత్రమ్మద్దాని విడువఁ బాడియె కుత్రా. 183

ఉ. ఎందఱు కాశి కేగుదురొ, యెందఱు తిర్పతిఁ జూడఁ బోదురో?
వి దుమకాఁడె? సర్వపృథివీస్థలి క్షేత్రములెల్లఁ గాశితో

తే. గీ. *అమ్మపుట్టిల్లు నీకింజరమ్మ, దాని
"లంజలకుఁ బంజరం'బనెదుంటెనంటి.

---

వారు చెప్పినట్టి కోకిలమ్మలైరి. తమ సదుపదేశములను వినరు సరికదా, ఏవియో సాహసప్రయుక్త రతికాదులనుగూడ రచింప సాగిరి. ఏదియో తీగఁ ద్రొక్కిన వారు దారితప్పినట్లు వీరిప్పటికిని త్రోవకురారు. కానిండు, వారికై యమర్చిన గ్రంథము వారికొక్కరికిఁ గాకున్నను లోకమున కంతటికి నుపకారకము గాక తప్పదు....

సంస్కృతమాష్టరు. శిష్టా వెంకట సుబ్బశాస్త్రి.
అప్పాపురం బాపట్లపోష్టు,

శ్లో॥ స్వచ్ఛందవిసరత్సుధారసఝరీ మాధుర్యసారస్ఫుర। ద్ధీరోదార కథా పథాన కవితాసింహాసనాధ్యాసినా। ఈషామాత్రనిబద్ధ సర్వకుకవిప్రాగల్భ్య గర్వ గ్రహా। శ్రీమత్తిర్పతివేంకటేశ్వరకవీంద్రా శిష్యకల్పద్రుమా॥ శ్లో॥ అంగీకురుతం కృపయా. చంపకమాలాం మదర్పితామేతాం, ఇత్యభివాద పురస్సర మస్య ర్థనమాతనోమి యువాం॥

చ॥ కలి కలుషోన్మదైకమదఖండనచండసరస్వతీసము, జ్జ్వలనయదాన శౌండ ముపవారితనైరివృథావితండమై, వెలసెడుగీతాగమము వీనుల విందుగ నంను నెల్లవా, రలము వఠించినారను వరాపరమూర్తులరైన మీకు శిష్యులు కలి ప్రాయుషుల్ గురుయశోఽసహనమ్మనఁ దమ్మ మిమ్మనుం, దుల నిడికోఁదలంచి సంతూఁగ భ్రమించియు మీయశంబు దొం, గిలు వనిఁబూన దానిఁ దమగీరత మల్లెడ వెల్లడించె మేకలుబిగియుంచి లాగితిరి కోయని కూయఁగ సర్వముండన, మ్మల జరిపించి మించితిరి. మూలముడుంగఁగఁజేసి మేల్మనుం, గులఁ దవిలింప నెంచితిరి, కోయిల లోర్చునె యట్టిధాటికా, జిలిబిలిమాటలు న్నగవు సేఁతలునుం దనరించు మీవిపక్షులకు జగమ్మెతాఁదెలుపఁ జొచ్చె, పికోద్ధతి చచ్చె, మిమ్మె భూ, వలయము మెచ్చె మీయశమభంగురమైకడు హెచ్చె..., వైదుషీ, బలుఁడ నుగాను వనొక్క చిన్నశిష్యుఁగాఁ, దలఁపుడు కైవశేషుఁడ... గమలా పురినుండు ముఁ గద్పమండలిలో॥

కైవశేషశాస్త్రి. కమలాపురం, కడపజిల్లా.

‡(రామకృష్ణ మహాభారతము, వింజరపర్వమునండి)
కి॥ వింజరము...వేశ్యా (లంజల) పంజరము..."

నీవు ననుఁగాని యెవ్వరి నేనిఁగాని
యెట్టితిట్లు తిట్టిన గణియింపవలెనె! 194

సీ. అలయయ్య నెఱుఁగుదే యతఁడు †పాచకమాలి తాత నీకగుఁ జుమ్మి తల్లిసంక
అలశాస్త్రి నెఱుఁగుమతఁడు వంటలవాఁడె యతఁడు బావకుజ్ఞాతియగునొ కాఁడొ
*'మేల్మి' మీయాతఁడేమి కుక్కుటంపున్ ధూమపాయి జూదరి గ్రామపాచకుండు
ఇంకనొండొక ‡చందుర్రిఁ డెల్లభూములనమ్మి యేమి చేసెనొ? నీకు నెఱుకపడదె

తే. గీ. ఇట్టియాత్మసంబంధులకెల్లఁ దవుల
నింజరమ్మును దిట్టితి, వింజరమున
కిక్కథకు నేమి సంబంధ? †మిల్లునాకు
నచటనుండినయంత నేమయ్యెఁ బుత్ర.

గీ. పాచకత, యాచకత, నీళ్ళుమోచుపనియుఁ,
గృతము మఱచి యవాచ్యముల్ గిలుకువాని
పనికిఁ దుల్యమ్ములను కోకు; పడరువారు
నరకమున వారి నేటికి నన్వాదీవు!

ఉ. ఇంజరమేమి చేసె మతిహీను నినుఁ గని పీఁతికల్మ *"నీ
కుం జనదిట్టిమన్ణయము, కూళవుకాకుము, వేంకటేశు ప
త్కింజరజంబ వీ విపుడు కాఱులు పేర్శిలినలాభమేమి" నా,
"లంజలపంజరం" బయి యలందురు నే? "కవికుంజరం" బనే? 196

---

(† సీ॥...ణీ॥...పాచకులు, యాచకులు, నీళ్ళుమోచువారుగలరు కొందఱు ఇం
జరగ్రామమందు") (రా, కృ, భా, పిం, ప, చూ.)

(* ఉ॥...వింజరమందు మేల్మిబంగారమువంటి న్యాయపథగాములు..."సీ॥...
అహిఫేన ధూమదండాదుల సేవించి యుపగతభాగ్యులైనట్టివారు..." జూదం
బాడి యప్పులపాలైన యట్టివారు,) (రా, కృ, భా, పిం, ప, చూ.)

(‡వెలయాండ్రి ననురక్తిగలయాండ్రుగా నమ్మి యర్థమ్ము గోల్పోయినట్టివారు")

(† తే॥ అట్టివింజరమునఁ జెయ్యిగట్టుదరిని, బెంకుటిలు గట్టికొని యుండె వేంకటే
శుఁడు") (రా, కృ, భా, విం, ప, చూ.)

(* క॥...కొందఱు విద్వ, ద్గణమునధిక్షేపింపన్ గణఁగుదురు")

పరా:— ఈ పద్యము నందేమి, దీనికిఁ బూర్వమునను న్న, 104,105. సంఖ్య
లుగల గీతములందేమి, వెం॥ రా॥ లెవరిని మనమందుంచుకొని, శుంఠలు, గుణహీ

సీ. కాళికాఘట్టానఁ గలవిజ్ఞుఁ డొక్కఁ డందు నిన్ను బహిర్ముఖునిం బోల్చె
నైజాము రాజ్యమ్మునఁ గలవారెందఱో నీపేరు వినుటచే యోప మనిరి
కడప కర్నూల్ ప్రక్కఁ గల ప్రాజ్ఞులెల్ల నిన్ గలిపురుషునిగాఁ దలఁచుచుండి
రల్ల నెల్లూరివై పంతకుమున్నె నిన్ బలితునిగా వ్రాసి పంపఁ దొడఁగి

గీ. తెలిసె విజయనగరము నీ హేయదశను
తెలిసికొనియె గుంటూరు నీ చులుకఁదనము;
ఇంజరంబును గూసిన యెడ్డెకూఁత
లెన్ని గ్రామమ్ములను గూసె దెలుఁగఁ జెప్పుమ. 197

శా. ఏయూరన్ దగఁ దిట్టనేమి యగు, నీ నిర్వ్యారలన్ గొట్టనే
మా; సూరార్ఘ్యము దాఁగ; దింజరము మాటల్లుంచు నీ దబ్బఱల్
నీ స్వాత్మన్ గనుపట్టవే, అది నిను 'న్నీచుండ వీ' వంచుఁ దా
రోయన్ మానెనె? దానిఁ దిట్టికొను మేరన్ రాదు నీజోలికిన్. 198

గీ. రమణ శ్రీలక్ష్మీనరసాపురమున నెన్న
రావు శ్రీచెల్లయాంబకు రాణయొసఁగ
జరిగినది షష్టిపూర్తి, యందుటికి నీవు
రావు, దావయు రాఁడు. మీ చేవ తెలిసె. 199

(1914 సం॥ నవంబరు నెల 17వ తేదీ మంగళవారం శశిలేఖనుండి)

షష్టిపూర్తి, అవధానములు.

ఈనెల 9వ తేది సోమవారంనాడు చెల్లాయమ్మారావు బహద్దరువారి షష్టిపూర్తి మహోత్సవము జరిగినది... వెంకటరామకృష్ణకవులను, తిరుపతివెంకటకవులను అవధానములకు శ్రీ చెల్లాయమ్మారావుగారు పిలిపించగా మొదట సమ్మతించిరి. అంత కార్యక్రమపత్రికలు అచ్చొత్తింపించిరి. ఏకారణముచేతనో

---

నులు, సంకరులు, లోకగునిచపనములతోఁ దిట్టమొదలిడిరో వారలెల్లఁ దిగు మాత్రము సాహిత్య సౌహిత్యములుగల్గి కవితచెప్పఁ గలవారనియు, సంపన్నగృహస్థులనియు. వీండ్రకృతఘ్నతకు రోయుటచే సకలము నెఱిగిన వారియెదుట నేమియు ననఁజాలక యిట్లుతిట్టఁబూనిరనియు, నెఱుఁగఁదగు. మఱివారినేకాక గ్రామము నెల్లఁదిట్టనారఁగొనుటచే నాగ్రామమందలి వారలెల్ల వీరికృతఘ్నతకు వేవగించుకొనువారేయని విస్పష్టముకాన వ్యాఖ్యాన మనపేక్ష్యము,)

రామకృష్ణకవులు వచ్చుటకు వీలులేనట్లు సూచన చూపింప నాకార్యక్రమపట్టికలు వదలి, తిరిగి కార్యక్రమపట్టికలు ముద్రింపించి... 6 వ తేదీ తిరుపతి వేంకటకవుల శిష్యులలో నొకరగు బ్రహ్మశ్రీ వేలూరి శివరామశాస్త్రిగారిచేతను అష్టావధానము చాల బాగుగా జరిగినది. రు116లు బహుమాన మొసర్చిరి...అవధానులకు రెండు నూటపదార్లు బహుమాన మిచ్చిరి. తిరుపతి వేంకటకవులకు వెంకటరామకృష్ణకవులకు సమావేశము కలుగుచున్నది. యెద్దియో వైచిత్ర్యముండునని అనేకయూళ్ళనుండి చాలమంది జనమువచ్చిరి... శ్రీరాజా చెల్లాయమ్మారావువారి యింటివారే పిఠాపురం ఆస్థానమునకు సంబంధించినవారు పిలపించినప్పుడు సభకురాని వెంకటరామకృష్ణకవులను, మరి యేరాజులు వీరికి తిరుపతి వెంకటకవులకును సమావేశము చూపించి సభ చేయింపగలరు. ఇంక యిట్టి వూహ యెద్దియయిన ఎవరికయిన నున్నయెడల అద్దిమానుకుందురుగాక. ఇట్లు,

తులసి విశ్వనాథము.

---

చ. 'అనవి'లటంచు మిమ్మెఱుఁగు నంతకుమున్నె జగంబు! చెల్లన
జననికి షష్టిపూర్తి, మనశాస్త్రికిఁ దిర్పతి కిష్టిపూర్తి, భూ
జనులకుఁ దుష్టిపూర్తిఁ, ధృతిచాలని బాపకు నష్టిపూర్తియుఁ
డనరుక తాన సర్వవిదితం బది యయ్యొ నిఁకేమి వ్రాసెదో! 200

చ. పిలువఁగలేదొ? మిమ్ములను, బిల్చిన 'వత్తు' మనంగలేదొ? పైఁ
డలఁ గుదయింపలేదొ? కలతత్త్వము లోకమెఱుంగలేదొ? య
న్యుల నటులుంచు, శీఘ్రకరుఁడు యోగ్యుఁడు సూర్యవిభుండు రాజబం
ధులును నిజం బెఱింగి రని తోఁపదొ? నీమదికేని యర్భకా! 201

గీ. సకలము నెఱింగియును నిన్ను సాఁకువిభుని
మోము చూచి నిక్కమియు మొగము నెదుట
నాడకుండిరిగాక, నీయనృతములకుఁ
బార మున్నదె? నీగుట్టు బయలుగాదె. 202

ఉ. ఈ వొనరించుదోషము లనేకము; లందును నింజరంపు భూ
దేవులజోలి కేగు టది తీరనిదోసము, వారి పాదముల్
కేవలభక్తి మ్రొక్కు మలిగింపకు, 'మాచెడుకూఁతలెల్ల నా
బావలిఖించినాఁ' డనుచు వారికిఁ దెల్పుము శాంతి కల్గెడిన్. 203

ఉ. చూడఁడుగాక చూచునెడ సూర్యనృపాలుఁడు గూడ వేంకటా
ద్రీడవమాన మొప్పినను దీనికి నొప్పికొనండు; గ్రామముం
దేఁడొ యొకండు నీకు సరియే యగుఁగా కది కారణమ్ముగా
గాడఁగఁ దిట్టిపోసెదవె గ్రామము నెల్ల; వివేకి సైఁచునే. 204

ఉ. ఎప్పుడుగాని సూర్యనృపుఁ డీవును బావయువ్రాయు తప్పుడుం
జెప్పులమారి పిప్పనుడిచెయ్యులు దాఁ దిలకించి యుండఁ; డె
ట్లొప్పెడిఁ జూచెనేని; యతఁ డొప్పిన నొప్పుత, మేమమాత్రి మా
రొప్పులకుప్ప రొప్పినటు లుల్లమునం దలపోయ మర్భకా. 205

ఉ. ఆయన దర్శనమ్మునకు నందనివారము మేము, కాకతా
ళీయము గాఁగ నానృపనిలింపుఁడు మాసభ కేగుదెంచుచో
ప్పాయితమయ్యెఁ గాని యది యంతటిభాగ్యము లేనిదయ్యె, లే
దా, యతఁ డిందు కేమనునొ యానుడు లిందు లిఖింపకుందుమే? 206

చ. ధనమిడి పత్రికన్నిలిపి 'తజ్జ్ఞులమెప్పును గొం' దటంచు న
య్యనఘుఁడు సెప్పఁగాని 'కవినంతన కేల నుపానహమ్ము నై
కొని మరియాద సేయఁదగు కొంటె నుడు ల్లిఖియించి పాప భా
జనమగుఁ' దంచు నానృపతిచంద్రుఁడు చెప్ప వనంగఁ జెల్లునే. 207

ఉ. తిరుపతి వేంకటేశ్వరుని దేవుని దిట్టెడినీకుఁ బ్రాఁతె ? యిం
జరము; భవద్విపక్షంబుమనుజన్ములు లే ర్దమజన్ము లుండ్రు నీ
దురితపుధోరణిన్ గడకుఁ ద్రోచుచుఁ దిర్పతివేంకటేశుఁ డిం
జరపురవాసులన్ సుఖ మొసంగి క్షమింతురు గాక వీఁకమై! 208

గద్య

ఇది శ్రీ... తిరుపతివేంకటేశ్వరవిరచితంబగు విగ్రహారాధనము

సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 1 | 1 | న్యాయేన్య | న్యాయ్యేన |
| 3 | 3 | గల్లరీఁడనవచ్చుఁ | గల్లరీఁడనవచ్చు |
| 5 | 21 | కికఁ | కిఁక |
| 7 | 6 | బాగ్రికుచుంటి | బాగ్రఁకుచుంటి |
| ,, | 11 | ముంపగ | ముందఱ |
| 13 | 3 | దేపుఁడె | దేవుఁడె |
| ,, | 12 | హౌదువేని | వౌదువేని |
| 27 | 23 | తె్లము | తెల్లము |
| 29 | 21 | యక్కటక్కటా | యక్కటకటా |
| 32 | 16 | మ్రొఱకన | మ్రొత్రఱకన |

విగ.

# గ్రంథ పరిచయము

షష్టిపూర్తి మహోత్సవమైన పిమ్మట గ్రంథముద్రణము ప్రారంభింపక పూర్వమే మా గురుపాదులగు శ్రీవేంకట శాస్త్రిలవారు రుగ్ణులగుట తటస్థించి, దాదాపు ఆఱు సంపుటములు పూర్తియగు వఱకుఁ గూడ మంచముపట్టియుండిరి. కావున గ్రంథముద్రణమున నాకప్పుడప్పుడు పొడముచువచ్చిన సందియములను వారి వలన దీర్చుకొనుటకు వలనుపడకపోవుటయే కాక అముద్రితగ్రంథము లింక నేమేమి యున్నవో కూడ దెలియవయ్యెను. ఇటీవల శ్రీశాస్త్రిలవారి కించుక యారోగ్యము చేకూరిన పిమ్మట నేను వారిని దర్శించుటకుఁ గడియము వెళ్ళినపుడు అముద్రితగ్రంథము లింక నేమేని యున్నవా? యని యడుగ, ఏదో బీరువాలో నింకను గొన్ని యున్నట్లు సెలవిచ్చినారు. తీసిచూడగా నీ 'లోకాభిరామాయణమును' 'స్త్రీవిద్య' యను నొక యసంపూర్ణ గ్రంథమును లభించినవి.

1915, 16 సంవత్సరములనాటికే అచ్చగుచున్న గ్రంథముల పట్టికలో దీనిని చేర్చి ప్రకటించుచువచ్చిరి, గాన నింతకుమున్న దీని పేరు వినినదియే. మఱియును, 'ఉ॥ ఇప్పటి కాఱువత్సరము లీ కలహమ్ము జనించియాయె' అను నిందలిపద్యమువలనగూడ నిది యీ వివాదమునకు సంబంధించిన మొదటి రిజిస్టరుత్తరము వ్రాసిననాటికి ఆఱుసంవత్సరముల ప్రాంతముల రచింపబడినట్లు తేలుచున్నది. అనగా శ్రీశాస్త్రిలవారు బందరు వదలిపెట్టక పూర్వమే దీనిని రచించిరి. రచనానంతరము అల్పకాలమునకే శ్రీశాస్త్రిలవారు స్వగ్రామమగు కడియము ప్రవేశించుటయు గ్రంథముద్రణ విషయమున అశ్రద్ధసేయుటయు తటస్థించినది. అంతలో శ్రీ వెంకటరామకృష్ణ కవులలో నొకరగు రామకృష్ణశాస్త్రిగారు దివంగతులగుటయు, పిమ్మట మూడు సంవత్సరములకు శ్రీ తిరుపతిశాస్త్రిలవారు స్వర్గతులగుటయు తటస్థించి ఆ యీ కారణములచే నిది ప్రకటితము కాలేదు.

ఈ గీరతము ముఖ్యముగా సత్యనిర్ధారణమును గూర్చి ప్రవర్తించినది. అందులో ఈ నాల్గవ భాగము మఱియు న్యాయంశము స్థిరీకరించును. వెం॥ రా॥ కవులు తమ మహాభారతములో, వెం॥ శా॥ గారు తమకు స్వప్నములో కనుపడి యేమో ప్రసంగించినట్లును, పిదప చిన వెంకటశాస్త్రిగారు ప్రత్యక్ష

మునసే తమతో నేమో పలికినట్లును, వ్రాసిరి. ఈ తుదికల్పనము చిన వెంకటశాస్త్రిగారు గతించిన రెండు సంవత్సరములకు బిమ్మట చేయబడినది. ఈయసత్య కల్పనమును గూర్చి చెప్పుటకే ఈ లోకాభిరామాయణము రచింపబడినట్లు ఇందలి పద్యములనేకములు స్ఫుటపఱచెడిని. ఇక నిందలి కల్పనమును గూర్చి మాగురువుగారొక యైతిహ్యమును చెప్పిరి. వారి యింటనొక ముసలి దాసి పనిచేయుచుండెడిదట. ఎన్నడును దొంగతన మెట్టిదో యెఱుగని యా యమాయికురాలొకనాడు కర్మము చాలక కడుస్వల్పమూల్యముగల ఇత్తడి వస్తువొకటి దొంగిలించెనట. పిమ్మట నాసంగతి నిముడ్చుకొనజాలక ఆమె తనలో తానే గొణిగికొనుచు దొంగతనము బయటబెట్టుకొన్నదట. అందుమీద, మనస్సుయొక్క స్వభావము సత్యమునందే బద్ధదీక్షమగుననియు, దానిని ఆత్మ అన్యథా త్రిప్పినపుడాతని యాజ్ఞ చొప్పున బ్రవర్తించియును బిదప దన స్వభావమును వదలుకొనక లోలో విచారించుచుండుననియు తోచి, వెంటనే ఈ గ్రంథరచనమునకు గడంగిరట.

తండ్రికి అన్నము పెట్టక ఇంటినుండి లేవగొట్టినట్లు రామకృష్ణమహాభారతమున వ్రాసిన విషయము శ్రీశాస్త్రిలవారు బందరులో నున్నప్పటి కాలమునకు సంబంధించినదగుటచే నందలి సత్యము నస్మదాదులకు నిచటివారెందఱో యెఱింగినదియే కావున విస్తరింపబనిలేదు.

ఆ యీ యసత్యకల్పనములచే శ్రీశాస్త్రిలవారి కొడలు మండినప్పటి ఆవేశమున నప్రయత్నముగా వెడలిన యీ గిరత కవితాధార శ్రీ తి॥ వెం॥ కవుల రచనముల యందు విలక్షణతాస్పదమై, ఆంధ్రభారతికి నపూర్వాలంకారము గూర్చుచున్నది. గుంటూరిసీమ కూడ నిట్టి యుత్కృష్టగ్రంథమే. తాత్కాలికములగు నా యీ వివాదములలో పాల్గొనిన ప్రధాన పాత్రలు అంతరించిన పిమ్మటకూడ భావికాలపుటాంధ్రులు చదివికొని ఆనందింపదగిన శాశ్వత రసపదార్థ మీ గ్రంథములలో ప్రతిపదమును నిండియున్నది. రసికజన హృదయంగమములగు నిట్టిరచనలు పాశ్చాత్యభాషలయందెన్నియేని గలవు.
ఇందలి 'రంతుల్ మానకు తిర్పతిద్విజుడు' లోనగు పద్యములు మరల కలగూరగంపలో చేరుట ప్రమాదము.

కాటూరి వేంకటేశ్వరరావు,
ప్రచురణకార్యదర్శి.

ఓం

శ్రీమత్పరదేవతాయైనమః

# గీరతము

4 వ భాగము

## లో కా భి రా మా య ణ ము

ఉ. శ్రీపతి వేంకటేశకవిశిష్యుఁడు వెంకటరాముఁ డొజ్జలన్
బాపము లాడి యాడి, కడుఁ బ్రల్లదుఁడై యది కారణమ్ముగా
నేపటుతాళ్మితో నొకట నింటనె యుండుచుఁ గాలయాపనం
బోపికఁ జేయుచున్ మదికి నూఱటగల్గమి నిట్లు వాక్రుడున్. 1

మ. అరరే! యేమి మహాద్భుతం బిది మనోవ్యాపార మాపంగనే
దురహంకారి వలంతి? యన్నిది "గురుద్రోహమ్ముగావించి, తె
క్కరిణిన్ దీనిఁ దరింతువో రి?" యనుచున్ గర్జించుఁ దర్జించు నేఁ
దరణోపాయము చెప్పఁగాఁగలనె యోదైవంబ! యోజింపుమా. 2

శా. నా మా టట్టులెయుంచు, మానవపశు న్నన్నేరు ప్రశ్నింతు? రీ
వేమో సర్వ మెఱుంగు నేతవని ని న్నేరేని బ్రశ్నించుచో
నేమాడ్కిన్ బ్రతిచెప్ప నెంచితివొ నా కింతేని వాక్రుచ్చ వో
స్వామీ! నీమహిమం బెదేని యొకతోవన్ జూపి కాపాడదే. 3

చ. గురువల వేంకటేశ్వరుఁడు కూరిమిబిడ్డనిగా గణించి వ్యా
కరణమొసంగెఁ, దచ్చరణకంజరజమ్ముగ నుంటి, నెన్నియో
పరమరహస్యముల్ కవితపట్టున నెట్టనఁ దెల్పెఁ, గన్నులం
దెలిచితి నక్కటా! నెటు దేవుఁడ! నీకడఁ బొంకనేరుతున్. 4

ఉ. ఆతఁడు వెట్టె దీపమిది, యన్నమునొద్దను గూరుచుంటినా,
యాతని పేరె జ్ఞప్తికి రయమ్మున వచ్చును బూటపూట; కే
మీ, తగదే? కృపాళుఁ డతఁ డిచ్చిన విద్దియ చేతఁగాదె యీ
జీతపురాళ్ళు నాకు నృపసింహులకతాన లభించు టెమ్మెయిన్. 5

చ. మఱపుఘటిల్ల వగ్గురుఁడు మన్నిచనమన్నులు, తోడివాఁడు ద
బ్బఱలకు దింపఁగా డిగితిఁ, బాపములాడితి, నాడుచుంటి, ను
ర్వర నెవఁడో యొకానొకఁ డపాత్రుఁడు 'వహ్వరె' యన్న నేమి, యె
ల్లరును 'గృతఘ్నుఁ డీతఁ' డనులాగున కగ్గముగాఁగ నేర్చితిన్. 6

ఉ. నా తెలమోము వ్రాఁతలకు, నా చెడు చేఁతలకుం బదింబదిం
జేతమునందు నొచ్చికొని "సీ" యనువారలె యెల్లవారు; నా
రోఁతల కేరు సంతసిలిరో, యలవారల "వేంకటేశ్వరా
రాతు" లటంచు నామదిఁ గరమ్ము నెఱుంగు సహేతుకమ్ముగన్. 7

ఉ. కొప్పరపుంగవీశులకుఁ గోరిరి గొప్పకుఁగాఁగ నాసనం,
'బెప్పుడు నేరు గోరఁదగ' దిట్లని ప్రాజ్ఞులు నవ్వఁ గొంద;ఱా
తప్పున కొప్పఁ డగ్గురుఁడు, దానికిఁగాఁ గలహించి యోడి యే
తప్పడుఁగూఁతలో వదరి తజ్ఞు గురు న్నిరసించి రాఘునుల్. 8

చ. గురుఁడు సహాసనం బిడఁడ కొప్రపువారికి; నేఁడు కారణాం
తరమున నెట్లు బొంకినను దారసమానెడ నేనుగూడ వి
స్తరమున కొప్పఁబోనని కటా! ప్రకటంబుగ నేరెఱుంగ? ర
క్కరములు రాని కైతలకు గౌరవ మెవ్వఁడు సేయనొప్పెడున్? 9

ఉ. సీమకుసీమ యేకమయి చేయు దురుద్యమమెల్ల వమ్ముగా
నా మెయిఁ దాను బల్కు నుడు వాగమవాక్యముగాఁగఁ బాండితీ
ధాముఁడు మద్గురూత్తముఁడు తద్దఁ బ్రశస్తికి నెక్కెనాఁ డిటన్
నామదిఁ బొంగుమోదమది నమ్మునొ లోకము, నమ్మకోకదా? 10

మ. శివరామాదిసతీర్థ్యులం గలసి యాసీమన్ గురుస్వామితోఁ
గళాశాసత్సభలన్ మెలంగఁదగు నక్కల్యాణమున్ నోఁచుకో
నేరిన్ జూడఁగలేని హేతువునఁ; బోనీ, దానికే పెట్లో త
త్సావిశం బాత్మముదంబు తెల్పఁగల పత్రిం బంపినన్ జాలదే. 11

ఉ. అంతకుఁగూడ నోఁచికొనవట్టి దురుద్యమపాతకమ్ములన్
సంతతమున్ మునింగి, పయి స్వాంతము చోరనిభాతి డాఁచి, శ్రీ
మంతు గురూత్తమున్ దెగడు మార్తురు కత్తృణమాత్రులేని 'వా
రెంతకుఁ జాలువారె' యని యేఁ బ్రకటించితి వ్యర్థవాక్కులన్. 12

ఉ. చేసితి మెన్నియో గడుసుచేఁతలు వారలు నేముఁగూడి, పైఁ
గూసితి మెన్నియో దురుసుఁగూఁతలు; సర్వము గాలిఁబోయె, "సే
బా" సన మద్గురూత్తముని బ్రహ్మరథమ్ములు పట్టఁజొచ్చి, రీ
చేసినతప్పుచేష్ట లవి సిగ్గులచేటయి మమ్ముఁ బీల్చెడిన్. 13

ఉ. వారికి దబ్బఱల్ గిలుకువారికిఁ గొపరిపువారి కెవ్వరో
ధీరవిచారుఁ డొక్కఁడయెడఁ దిక్కు దిగన్ దగుబుద్ధి చెప్ప దు
ర్గోరణి కట్టిపెట్టిరఁట! తొల్లి కదుం జెడుత్రోవఁ బోయియున్
వారలు నేఁడు నెమ్మదికి వచ్చిరి; మాగతి యిట్లె పొక్కెడిన్. 14

ఉ. తజ్ఞుఁ డొకండు తాదృశుఁడు తారసపై, ననుఁ బాపిఁజేయు దు
ష్ప్రజ్ఞుని వేదులాన్వయజు భగ్నమనోరథు దుష్ప్రగల్భతా
భిజ్ఞుఁ జివాట్లునైచి యవివేకము వాపిన, నేను దత్కృతా
ప్రాజ్ఞత గోస కొప్పరమునై ఖరి మిన్నకయుండుదుంగదా. 15

మ. అటుపై నిప్పుడు రోయు లోకులె 'సెబా' సంచు న్ననున్ మెత్తు, రం
తట మద్దేశికుఁ డాగ్రహమ్ము విడి ఛాత్రశ్రేణితోపాటు వి
స్ఫుటకారుణ్యము నాపయిన్ జిలుకు, ధీశూన్యత్వజన్యైనస
చ్ఛట నానాఁటికి లోఁగఁజేయుటకుఁ బశ్చాత్తాపమే చాలెడిన్. 16

ఉ. అట్టిగురూత్తమున్ దెగడునట్టి కృతఘ్నుఁడ, నాదుజీవితం
బెట్టిది? యేరు మెచ్చిన, "దిసీ" యని యెల్లరు రోయ నూరకే
పొట్టకుఁగాఁగఁ గృష్ణుఁ డెటుపొమ్మన నట్టులె పోవుచుంటి; న
ట్టిట్టనఁజాల, వాని కదియేమొ ఋతోక్తులు రావు నోటికిన్. 17

క. కష్టించి వాఁడు "విగ్రహ, పుష్టియు నైవేద్యనష్టి" పొంపిరివోఁగా
శిష్టులు "సీ" యను కూఁతలు, సృష్టించు న్నాకు వణఁకుఁ జే యప్పట్లన్.

మ. పరలోకమ్మొకఁడున్నదం చెలుఁగఁ దప్రాజ్ఞుండు వాఁ, డంచుచే
దురితంబన్నను వెన్కఁదీయఁ, డిట నే దుఃఖించియేమాఁ? బర

స్వరముల్ జంటగఁ గైతసెప్పుటకు నిచ్చల్ పూనియుంటల్ బర
స్వరదోషమ్ముఁ బరస్పరమ్ముఁ గుడువల్ బాధింపుచు నెట్లో యిఁకన్. 19

చ. తిరుపతివేంకటేశ్వరుల తీరునఁ బేరులు కల్పి కైతముల్
గరము రచింపఁబూనుటను గాదె యిటుల్ ఘటియించె ముప్పు, త
ద్గురుతి యనేకులల్ సుఖముగూర్చియుఁ గష్టము మా కొసంగెడిన్
బరిణతి కేమియౌనొ కద? పాతకినై యిటు నందికుందెదన్. 20

చ. అని కనుఁగొల్కులన్ దొరలు నశ్రువు లాపఁగలేక, కొంత సె
మ్మనమునఁ దన్మయత్వమున మ్రాన్పడి, వెంటనె రూక్షవీక్షణ
మ్మున ననలమ్ముగ్రక్కుచును ముందర వేదుల కృష్ణుఁ డున్నవా
డ్కని గని, పండ్లుగీటుచు నొగిం బలుకున్ నరసింహరూపుఁడై. 21

శా. ఓరీ! కష్ట! నికృష్ట! కృష్ణ! గురువైరోద్వేగచర్మహాపాతక
ప్రారంభార్ణవకర్ణధార! వితతాపత్కారినిత్యానృతా
సారాలాపకలాప! నారకమహాసంసారబీజాంకుర
కారాగార! చెడంగఁజేసితివిరా! గుర్వంఘ్రిరక్తున్ ననున్. 22

మ. కడుయోగ్యుల్ తలిదండ్రు, లెక్కుతనఁ దద్గర్భమ్మునం దీవిటుల్
పొడమన్నేర్చితివో! యనుమ్మనినఁ బస్పంజెల్లముల్ నీకు, * నీ
కడ కేతెంచిన చిన్నవెంకన 'ననుం గాంచె నాయన్న గా
ర్గదుదుర్మార్గుఁ' డటన్నమాట నిజమౌఁగా? కష్టముప్పింపచా! 23

* గీ. ఆంధ్రకవితాపరీక్షార్థియై యఱుగొఱ
కబ్బమొక్కటి గైకొని కడెమునుండి
సందియమునందుచునువచ్చె చళ్లపిళ్ల
చిన్నవెంకటశాస్త్రి మా యన్న బసకు.

శ. వచ్చి,... యెవరడుగకయే ... వేంకటేశ్వరు కుచ్చితములఁ బల్కెఁ బూస
గ్రుచ్చినరీతిన్.

ఉ. నన్ను విభీషణుండనుచు నవ్విన నవ్వుదురేమొకాని, మా
యన్నవిధంబు న్యాయమున కగ్గముగా; దతఁ డొడ్లశేరియు మేల్
గన్నులఁ జూడలేఁడు; మముఁగాంచియు నీసువహించు; నింకనే
మున్నది! నాకు నాతనికి నుల్లములన్ సరిపోదొకింతయున్.

మ. చిననాఁ డాతని తండ్రి స్వర్గతుఁడుగా, శిష్యుండుగాఁ జేర్చి, వి
ద్యనొసంగిం జెప్పి, వివాహమున్ సలిపి, తద్దన్ ముద్దుగాఁ జూచి నం
దనుఁగా మన్నిన యన్నమీఁద నటు వాతప్పుల్ ప్రసంగింపన
య్యానఘుం డీవును, నేను గాఁడుసుమి నీచాచార! వాచాటకా! 24

క. తనతండ్రి యతనితండ్రియు, మును వెపుడో విభక్తులైరి, మొగి నాతని కీ
తని కేమిజోలి యున్నది? యానఘుఁడు నాగురుఁడు పెండ్లి యతనికిఁ జేసెన్.

చ. నగలిడు సొమ్ము వెంకన ఋణమ్ముగఁ దెచ్చికొనెన్, వివాహ మొ
ప్పుగఁగతి నైదురోజులు మహావిభవం బలరారఁజేసె నా
దుగురుఁడు చేతిసొమ్ము కడుఁదోరముగా వ్యయపెట్టె; యట్టివాఁ
బగతునిగా గణించునటె! ప్రాజ్ఞుఁడు వెంకన మద్గురూత్తమున్. 26

చ. అనఘులు 'మేలు! మే!' లనఁగ నందు సదస్యమునాఁడు పాండితీ
ఘనులకుఁ దక్కువిప్రులకు ద్రవ్యము హెచ్చుగ నిచ్చఁదైపై, నో
వనితలు వచ్చి మేళము వివాహము నైదుదినమ్ములాడి, రా
వనితల కిచ్చుసొమ్ము గురునర్యుఁడె తా భరియించె సర్వమున్. 27

మ. "అనుఁగున్ వేశ్యలఁ బిల్చి పెండ్లికి ధనం బవ్వారి నిచ్చించి నా
యనగా ర్నాకు ఋణమ్ముగట్టె'నని నీయగ్రిమ్ముఁగం జెప్పి వెం
కన దుఃఖించినయట్లు గిల్కితివి; వెంకన్నన్ గడున్ యోగ్యుఁ డం
చు నెఱుంగున్ జగ మొప్పి కోదుసుమి నీచున్ జేయ నీవెంచినన్. 28

ఉ. ఇంతకుఁ జిన్నవెంకనమనీషి గతించినమీఁద నీవు దు
శ్చింత నిటుల్ లిఖించుటది చెడ్డమహాదురితంబు, చచ్చి స్వ
ర్గాంతరమందు నున్నయనఘాత్ముఁ గృతఘ్నునిగా నొనర్చి నా
యంతటివానిఁ జేసి, మకృతాత్మునిజేయుట నన్ను నీవిఁకన్? 29

---

ఉ. ఒండ్లన నేను బాల్యమున నుండుటఁజేసి తనంతఁ దాని నా
పెండ్లికిఁ బెద్దయై తనకుఁ బ్రేముడిగల్గిన సానిమేళమున్
గొండ్లికిఁ బిల్చి యప్పునొడఁగూర్చె నా; కటుమీఁద నెన్నియో
యేండ్లు శ్రమించి యాఋణము నీఁగితి దైవ మెఱుంగు నాగతిన్.

(రామకృష్ణమహాభారతము, విజయదశమీపర్వము చూ)

ఉ. ఇప్పటి కాలువత్సరము లీకలహమ్ము జనించి యాఱయె; నీ
వెప్పుడు వెంకనన్ గలిసి తీకలహమ్మున కాదియంటికా,
యిప్పటిదాఁక దాఁచి యతఁ డేగిన వత్సరయుగ్మ మిప్పుడా
చెప్పెద? వాతఁ డున్నపుడు చెప్పినఁ జెప్పనఁ గొట్టితీరఁడే? 30

మ. అతఁ డున్నప్పుడు నీవిటుల్ గిలుకుచో నాక్షేత్రరు న్నిన్ను సూ
నృతమార్గన్ జగుశిక్షసేయుననియే యిన్నాళ్లు కీమాట గ
ల్పితమున్ జేసితి; వెప్పుడే సఘుఁడు నిన్ బీడింపఁబోఁడు; సూ
నృతవైరుల్ చనఁ దోఁపఁ బోవునపుడేని న్నీకుఁ దారుణ్యమా. 31

ఉ. 'పెండిలి తద్దివమ్ముగతిఁ బెట్టుఁడు, తన్నైన మాచరింపుఁడీ
పెండిలిగా' నటంచుఁ జిన వెంకన చెప్పఁడు, చెప్పుదేబెలం
దుండఁడు; తాదృశుం డెటు "నిజోపయమమ్మున సానిమేళమున్
మిండఁడు భార్యతఁ బెట్టె"నని మిణ్యల నెకడ సుంత చెప్పుమా. 32

ఉ. వెంకన సెప్పలేద యిటు, వేఱొకఁడేనియుఁ జెప్పలేద, నే
నింక నిటుల్ లిఖించుటకు హేతు వెఱింగితి విస్మృ: మద్గురున్
వెంకటశాస్త్రి "మిండనిగ" నెల్లడిసేయుట; కంతమాత్రనే
క్రుంకెనె తద్యశఃప్రసరకోమలశీతలసాంద్రచంద్రికల్! 33

* శా. 'చెల్లారెడ్డి' యటన్నపద్దె మెటులో చేఁజిక్కె మద్దేశికుం
డుల్లమ్మున్ బనులించె దానిఁ గొని యాఱయెచ్చెమ్మ నెల్లగఁగాఁ
జెల్లున్? "పత్కవనం బదేరిపో" యనన్ జేజేలు శిక్షింతు; రే
కల్లల్ గూర్చిన లోక మెట్లో యెఱుఁగుం; గాఁపట్యముల్ దాఁగునే. 34

మ. పరకీయాగమనేచ్ఛ త, ప్పదియు సంపాదింపఁగానేర క
త్తరుణీరత్నము చేఁ జివాట్లు తిని కద్యాల్ సెప్పటో తప్పెకా
కరయన్ స్నేచ్ఛనఁ జావుకన్న నిరయంబందుంటకన్నన్ మహా
భర, మేతత్కృతి కగ్గమై గురు సదల్పన్ గొంప ముంచుం జుమీ. 35

మ. పరకాంతామణులెల్లఁ దల్లులనుచున్ భావించువాఁ డెప్పుడున్
దురితం బన్న భయమ్ము నొందు, సుజనస్తోత్రమ్ముఁ దట్టిందు నా
గురుఁ డెవ్వారికి హానిలేనిగతిఁ గోర్కుల్ మీఱ వర్తించుఁగా
కరయన్ నీవలె నావలెన్ బగ, మిహమ్మున్ బ్రవర్తించెనే. 36

---

* దీనిని గూర్చి విగ్రహారాధనము చూ.

చ. మనవలెఁ జేసినట్టిపని మాటఁగ మాటి కసత్యమాతఁ డా
డనుఁబ్రయతింపఁ డొప్పికొనుఁ డక్కిరికూఁతలు కూసి మున్ను చే
సినదురితంబు పెంపుగనఁ జేతువు నీ వదియేమికర్మమో!
యనృతముకన్నఁ బాతకములందు మఱొండు జగాన నున్నవే? 37

ఉ. మిండఁడొ, గండఁడో, యతఁడు మేటి కవిప్రకరమ్మునందు భు
క్కుండుని భాతి, 'కాదతఁడు కొంచెము నేరనివాఁడె' యన్న, భూ
మండలి దిక్కులేకగద మన్నన నాతనిఁ జేరివేఁడి దే
వుండుగఁ గొల్చి నేఁడకట! పోకిరికూఁతలు కూయఁ బోయెనే! 38

చ. "గురు"వని యొప్పికొం చతఁడు "కూళ" యనన్ ఫలమేమి? తల్లి దు
శ్చరితయటంచు వేశ్యతను జాతుఁ డెఱింగియు గౌరవింపఁడే!
హర! హర! తల్లి పూజ్యయగు నందఱకున్ గురుఁ డట్టులే, వృథా
యఱచిన నేమిలాభమగు? నాతఁ డపాత్రుఁ డటంచు సారెకున్. 39

మ. మలినుండైనను వెట్టయైన నఘనిర్మగ్నుండెయైనన్ మహా
స్ఖలదాచారుఁడెయైన నెట్టిఁడయినన్ ఛాత్రుల్ గురున్, స్వాత్మజా
తులు తండ్రిన్ విడనాడరాద; సుచరిత్రుం డౌటనే యేను సే
వలు గావించితినే మదీయపితకున్? తర్జింపనేలా గురున్? 40

మ. చెడె వక్త్రమ్మన్నతోడ్తులాడుకతనన్, జేతుల్ సెడెన్ సారెకున్
గడుగోఁతల్ లిఖియించుకారణమునన్ గట్టా! యిటేలాగు క
ట్టిఁడినై కాలము పుచ్చ నేర్తు? నెటు నా డెందంపుఁ గుందాఱు? వీ
తిఁడినైతిన్, జెడితిన్, మహోఘ మెటు నారింపంగ నేఁజాలుదున్. 41

ఉ. అన్నయు దేశికుండునయి యాదటఁ బెండిలిచేసి తన్ను సం
పన్నగృహస్థుఁ జేసిన కృపాళునిపై "దురితమ్ములాడె వెం
కన్న"యటంచుఁ గూసితివిగా యకృతాత్ముఁడ! నీదు నాలుకన్
సున్నము వెట్టియే జలజనూతి యొనర్పఁగఁ బోలు బాలిశా! 42

చ. కల రల చిన్నవెంకనకు గాదిలిచుట్టము లెందఱేని య
య్యలఘులతోడఁ జెప్పికొన కందఱకన్నను మిన్నవంచు నిన్
దలఁచి భవత్సమక్షమునఁ దజ్ఞుఁడు వెంకన యేడ్చ నేమి! నీ
మలినమనస్క! నీమనసు ద్రాపనొ? లేక శిలావికారమో. 43

ఉ. వెంకనతల్లిగా గ్గలదు వేఁదుఱువాఁడ! భవద్దురాగతా
లంకృతదుర్వచోరచనలన్ వినెనేనియు నిన్ శపించు నో
కుంకుడువేర! నీ యఱచుకూఁతలు గోఁతలు కట్టిపెట్టు, నీ
బొంకులు కాలిపోను దలపోటు జనించెడి నాఁడునాఁటికిన్. 44

ఉ. చచ్చినవానిమీఁదఁ జెలుదన్ గుఱుచ ల్లిఖియింతు, వాఁడే
సచ్చరితుండుగానియెడఁ జచ్చి పిశాచముగాఁగ వచ్చి నీ
మచ్చనుమాపకున్నె? "నిను మన్ననచేసి వచించినట్టి యా
యచ్చరముల్ వెలింబఱచి" తంచు దురాగ్రహదుర్విషోగ్రుఁడై. 45

ఉ. కాఁ డటువంటివాఁ డతఁడు, కాఁడు కృతఘ్నుఁడు, కాఁడు తుల్యయున్
గాఁ డనృతప్రలాపియును, గాఁడు గురుద్విషపాత్రబుద్ధి, యా
ప్రోడ నెఱుంగు లోక; మెటుబొంకిన బొంకుము స్వార్థమై కటా!
పాడఱు నీవచోరచన, పాడఱు వానియోగ్యతాగతుల్. 46

క. కరటకదమనకులు భవ, త్స్వరూపమని చెప్పుటది స్వభావోక్తి చతు
శ్చరణము లయ్యవి నీవో, చరణద్వితయాభిమానచతురుఁడ వరరే! 47

చ. చదువున మిఱ్ఱుపల్లములు చాతురివోల్చెడి శిల్పియున్, దుర
భ్యుదయము లవాస్తు మ్మనెడ నొండొక వాస్తవమున్ భ్రమప్రమా
స్పదులకుఁ దోఁచున ట్లొసఁగుపంగల, రించుక చర్చసేయఁగా
నది, యిదియున్ మదిం దెలియ నద్దపునందలి మోముపోలికన్. 48

మ. శిరమున్ వంచుక యింటిలోన నొకటన్ ఉపచ్ఛవప్రిక్రియన్
"దురితం బియ్యది యెట్లుపోవు" ననుచున్ దుఃఖించుచున్నాఁడ, నె
వ్వరియింటన్ శుభకార్యమైన నల వార్ప్రాణాప్తులే యైన నే
నరుగన్ బిల్చనయేనిఁ, బోయినను మ్రాన్నైయుందు నేమూలనో. 49

శా. ఎవ రేమన్న జవాబుచెప్పుటకు లేదే! సుంత యాధార; మే
కవితా పత్రికయందుఁ జూచినను నిక్కంబింత లేదయ్యో, వా
స్తవవేత్తల్ గని యూరకుండరు, సమాధానంబు శూన్యంబు, నా
యవివేకమ్మున కెంత చింతిలుదు? నీయజ్ఞాన మెట్లాఁగుదున్? 50

ఉ. నాదురవస్థ యెంతని మనమ్మున దాఁపఁగనేర్తు, దాఁచినన్
బో, దొకనాఁడు పెద్దతలి పుత్రుఁడు పుత్రిక పెండ్లిసేయఁగా

నాడెనకేగి యయోధ్యడల నందఱు బంధులు దూఱఁబట్టికోఁ
గాఁ దగునుత్తరం బెదియొఁగవ్వడ కేఁ దలవంచి క్రుగ్గితిన్. 51

ఆ. వె. ఆణివిళ్ళకులజుఁడైన రామన్న గా, రన్న నడిగినట్టి వెన్నొ ప్రశ్న
లున్న; వొక్కదాని కున్నదే యుత్తరం, బేటి వ్రాఁత వ్రాసి తోటి వ్రాఁత.

చ. చదువఁగలే డటందునో? వెసన్ గురుఁ డాతఁడు గాఁ డటందునో?
పదరిన తప్పుఁగూఁతల, నబద్ధము, నాయవి గా పటందునో?
కదనమునందు దేశికుని గట్టిగ నే నెదిరింతు నందునో?
యెదియని నెగ్గవచ్చు? నటు లెల్లరు నన్నుడికించుపట్టునన్. 53

ఉ. "చచ్చినచావు"గా బ్రిదుకుసంగతి దెచ్చితి వెన్నినాళ్ళటుల్
పుచ్చెదుఁ? బ్రాహ్మ లెల్లరును బూతిన్గఁ బాతకి వీఁ డటందుఱి, నీ
గచ్చులు కొంపఁదీసెఁ, గడుఁ గాఱులు పేర్చిలెడి నీదు చెల్మి నా
మచ్చను మాపుచున్నది పరిమాడ మిదేగతి నీఁగఁజాలుదున్? 54

చ. అన్నము లేకయున్ బ్రిదుకనా, వసనంబులు లేకయున్ గుణం
బున్నెడ నెట్టులో మనఁగనొప్పెడిఁ, గిరితిఁగోరి దుర్యశో
భ్యున్నతిలో మునింగి యనృతోక్తులు గూడుగ నెట్లు జీవనం
బు న్నడిపింపవచ్చు? నిజముం దెలియంగలవారిముందటన్. 55

చ. పురపురఁ గాగితమ్ముఁ గొని * పుత్రుఁడు తండ్రికి ద్రోహి యం చొక
ప్డటుతువు, వేఱొక "ప్డనుజుఁ డన్నకు ద్రోహి" యటంచు మిక్కొ, దీ
యాఱపులు దూరగుల్ తెలియరంచుఁ దలంతువు సంతసింతు;ద
గ్గఱఁగలవారి కన్న నెటుగప్పెదు పెప్పెపె మెమ్మెమేలతోన్? 56

చ. గురువరుఁ డస్మదీయన్రుపకుంజరునొద్దకు నొందుకారణాం
తరమున రాఁడు గాక, మన తప్పదుఁగూఁత లడంప వచ్చుచో

---

* ఆ. వె. వారి వారి మాట వచియింపఁగానేల
కలుషమనక మూఁడుకాళ్ళముసలి
యైన తండ్రిమీఁద నాగ్రహముంబూని
యిల్లువెలిచెనంట యీఘనుండు. (రా॥ మ॥ భా॥)

ష.రా:— (ఈసందర్భమున నింకను గల పదరు వ్రాఁతలకు మాపురశ్చరణము జాడఁగోరెదము.)

ధరణిపుత్రమోల నీయనృతదంభవచోరచనాపరాధ మె
క్కరణి సమర్థనీయమగుఁ గ్రక్కున నాతఁడు నోయ నొక్కుచో. 57

ఉ. ఏనును నీవు మద్గురుని యెత్తెలి కీఁగలుగూడఁ గామి ల
క్ష్మీనరసాపురంపుసభఁ జేరఁగలేక మహానసంబులో
మానసమందుఁ జింతిలుచు మ్రగ్గుటచేత నెఱింగె లోక, మిం
కేనియు "గొప్పకైన గొఱిగింపుడుఁ" గూఁతలు మాను కొప్పదే. 58

శా. "నంబీ! యేమిసహాయ" మన్న, "నెదుటన్ రాకుండె సాయం" బటం
చుం బల్కంగతిఁ 'జెల్లయాంబిక యశస్సున్నిల్పి కాపాడఁ జి
త్తంబం దెంచి సభార్థ మేగ' మనుచోఁ పక్షుండు నమ్మం, డనా
లంబం బీనుడి సిగ్గులేమి నిటు బల్కంబూనినా మిత్రజిన్. 59

చ. మనసభ శుక్రవార మని, మామకదేశికమాళిసత్సభా
దివమది మందవార మని ధీరులు వేఱొకనాఁడు గాఁగఁ బం
చినది జగం బెఱుంగు, గురుశేఖరుఁడున్ మన మేల యొక్కచో
టను గలియన్ వలెన్? వెసఁ గడంగి కచాకచి గాఁ బెనంగఁగన్. 60

శా. కోటిన్ వాతలు దూఱు టెందులకు? వారి న్నీవు వారింపఁగాఁ
బూనంగాఁ బనియేమి? యట్టిపనియే పుట్టన్ బ్రసక్తించుచో
నానిండోలగ మెట్టులొప్పికొనుఁ? జెల్లాంబామనం బెట్టు ల
ద్దానిన్ సైఁచెడి? నూఱ కేమిటి కసత్యంబుల్ గడుం బ్రేలెదో! 61

ఉ. అంబకు వెక్క నంబయయి, యాదృతి నూనిని మన్నినట్టి చె
ల్లాంబిక చేయుసత్సభను యాపెకుమారుని దూఱువాఁడు ని
క్కంబుగ నున్నచో నదియుఁ "గాదనఁ దీటువుపిట్టరాయబా
రంబులతోఁ" బనేమి? యట రాజున కెందఱు గల్ల రాశ్రితుల్. 62

శా. ఈజన్మమ్మునఁ గాని వచ్చుభవమందే కాని మద్దేశికున్
రాజత్సత్సభ నీ కెదుర్పఁగలధైర్యం బబ్బఁగాఁబోదు; నీ
సైజం బిప్పటి కే నెఱింగితిని, శ్వానం బేమి సేయున్? మహా
రాజశ్రీ కిరవైన యేన్గుగని వైరం బెంత లోనుండినన్. 63

చ. మొఱుఁగును గాక దూరముగ మోరవడన్ శునకమ్ము లేన్గు ద
గ్గఱకరుగంగఁ జాలునె, యొకానొకపట్టున నట్లొనర్చుచోఁ

గరిమదఘాతమున్ సయిపఁగాఁగలవే?, యెఱుఁగం డెవండు న
క్కఱపులు, వావదూకుల వృథార్భటులున్ మృగతృష్ణికాచ్ఛటల్? 64

ఉ. “కుక్కలు గూసినోఁ జెడునొకో? మఱి జంగము ప” ర్వటన్నయు
వ్యాక్యల కీవు వాఁగుచెడువాఁగు డుదాహరణమ్ము సుమ్ము, నీ
వెక్కడ! యొజ్జ యెక్కడ! జయించుటయెక్కడ! చాలుఁజాలు, “న
క్కక్కడ? దేవలోకమది యెక్కడ? దూరవిచార మక్కటా! 65

శా. “వేఁడంబోద” వటన్న నొప్పవు, సభన్ వేరంబు సాధింపఁగాఁ
గూడంబోద మటన్న నెక్క విఁక నీకుం దప్పదుంగూఁతలన్
గాడంగూయుట తప్ప సత్కవివరగ్రామంబు మెచ్చించు నా
జాడల్ దోఁపవు, శ్వానమ ట్లఱచుటే శౌర్యంబగున్ మానికిన్! 66

మ. తెగి విద్వత్సభలోన దేశికుని గద్దింపన్ వలెన్, దాన గె
ల్వగు, నోడేనియు సంభవించు నెటులే నాఁగాక లాభంబె యం
దగుపట్టున్ ఘృణ, మెట్లటన్న, గురుతో నాలమ్ములో నోడినన్
సొగసే, గెల్చిన వేఱచెప్పవలెనే! శూరత్వపర్యాప్తతల్. 67

ఉ. అంతియకాని “వెంకనకు నక్కఱ యొక్కటికూడ రాదు, మే
మెంతయు గొప్పవార”మని యేడ్చిన లాభములేదు, దీనిచే
గొంతుక బొంగుపోవుటయుఁ, గోవిదు లెల్లరు ‘సీ’ యటంటయున్
గాంతుమకాని గౌరవము గాంచము నిక్క మెఱింగి చెప్పితిన్. 68

చ. గురుఁడు స్వశిష్యవర్గమును గూడుక చెల్లమతల్లిగారి య
న్నరసపురమ్ము నేగునెడ నాకును నీకును భీతిగొల్పఁ జె
చ్చెర మన మల్లయార్యగృహసీమకు వచ్చినయప్పు డోజమో
మరచి తటాల్న నీరయిన యాస్థితి దైవ మెఱుంగఁడే సఖా. 69

మ. అకలంకుండు పురాణపండవరమల్లయార్యు వీధీవిత
ర్దిక శిష్యాన్వితుఁడై గురుప్రవరుఁ డర్థిన్ దంతముల్ దోమికొం
చెకసక్కెమ్ము నకో యనంగ మనపై వీక్షించుచున్ గడ్పెఁ గొం
డొక నే; పెందులకో యెఱుంగుదువె యార్యుం డట్టు లేతెంచుటల్?

ఉ. ‘ప్రేలుచునున్నవా రురక పెగ్గెలు, బొగ్గులావర్ప వేఁడిదే
వీలుదయించె, వచ్చితిని వే చనుదెందు సభాంగణమ్మునన్

గూలుటొ కూల్చుటో యగుటకుం బ్రమతింపుఁడు, మీకునై చుఁడీ
యీలలిఁ బట్టిపీల్చు జ్వర మించుక యెంచక యేగుదెంచుటల్. 71

ఉ. కూయుచునున్న వా రరక కూఁతలు రోఁతలు మూల మగ్గి నేఁ
డాయితమై పదండు సభ; కాయమ చెల్లమదేవి మిమ్మునన్
"ధీయుతు"లంచు రాఁబిలిచెఁ, దేలెడి రో జరుదెంచె, నే జ్వరం
బీయది లెక్కవెట్ట కిట కిందులకే చనుదెంచితిన్ జూఁడీ! 72

చ. అఱచుచునున్నవారు గృహమందున డాఁగి దురుక్తు; లన్నియున్
విఱిచెడిరోజు వచ్చె, నిటు వీలగునం చెదలోఁ దలంచి నే
నెఱుఁగఁజూఁడీ! ఘటించె మనయేలిక చెల్లమదేవిగారు వ
ల్వారు గల సత్సభన్ దెలియుఁబో! గురుశిష్యుల తారతమ్యముల్. 73

చ. పదరుచునున్న వా రరర కవాకుచవాకులు; నోరునొక్కఁగా
నద నుదయించె తొనిపినయంబిక చెల్లమదేవి కర్త్రి; మీ
కెద బిదు గుండదేని, యిదె యేఁ జనుదెంచుచునుంటి రండు, మీ
కిది కడుఁజక్కనైన తఱి, యే జ్వరితుండ జయింపనీలగున్. 74

చ. పదరుచునున్నవార లపవాదలు నోరికొలంది, నేఁడు మీ
వదనముకంపు సొంపు జనవల్లభునగ్రమునన్ బయల్పడున్
బదఁడు సదస్సుజేర, నిదె వచ్చితి నే జ్వరితుండనయ్యు మీ
మదమది చక్కఁజేసి మతిమంతులుగా నొనరించుపూనికతో.' 75

శా. ఈయంశమ్మను దోఁపఁజేయుటకె సుమ్మీ! దేశికుండట్లు చె
ల్లాయమ్మన్ గననేగుచున్, మన మొగాలార్తిన్ బ్రవర్తింపఁగా
డాయన్ వచ్చిన, దాఁటఁ దేమెఱుఁగుఁ గట్టా? "వీండ్రురా"రంచు,'లో
భీ యెంతుండిన, పత్తు'రం చతఁ డెదన్ బేరాసఁ జెందెంజుమీ. 76

చ. స్వయముగఁ జూచియుంటిమి విశాలతరజ్వరయుక్తుఁడయ్యుఁ జె
ల్లయజననీనిదేశమున సయ్యోడ కేగెడియొజ్జ, నట్లు చూ
చియుఁ 'జ్వరితుండుగాఁ' డనుచుఁ జెప్పఁగ నోరెటువచ్చె? వ్రాయఁగాఁ
జెయి యెటులాడె? నీకకట! శిష్టకులమ్మున నెట్లుపుట్టితో? 77

చ. 'అనృతములాడుచుట్టున ఆవంతయు వీఁడు భయంపడండు, యిం
దునకు నిమిత్తమేమియని దుర్జయు నిన్నుగుఱించి చర్చచే

పిసఁ దుద కొక్క హేతువది చేకుఱునో నయశూన్య! నీవు దే
వుని యసమర్థతన్ దెలిసి బొంకెదు వక్త్రము పూర్తిగాఁ జెడన్. 78

చ. అనృతములాడ నెల్లరు భయంపడువా, రది నీకు లేశమున్
గనుపడ, దిందుకేర్పడిన కట్టిడిజాతులు వేఱు, వారిలో
జననమునంద వీవు, వెలుచన్ మఱిసారెకు బొంకనేర్తు, దే
వునియసమర్థతాగరిమ పూర్తిగ నీమది కెంత యెక్కెనో. 79

చ. జను లనృతంబుపల్కుటను "చచ్చినచావు"గఁ గొంకుచుందు, రీ
వును మనుజుండవే యగుచుఁ బుట్టియు దబ్బఱలాడ లేశమున్
మనమున నెన్నఁడీయవు, వొకమాఱినవు రాయివి గావు నీవు, దే
వుని యసమర్థతాగరిమ పూర్తిగ నీమది కెక్కెనో గదే! 80

చ. ఘనుల గణింపనేల? కడుఁ గశ్మలజాతులయందుఁగూడ నీ
యనృతమునందుఁ గాంచెడు దురాగతుమోమును జూచినంతఁ "జీ"
యనని జనుండుగల్గఁ, డివియంతయు నీవు నెఱుంగు దైన దే
వునియసమర్థతన్ గనియె బొంకెదు వక్త్రము వక్రమై చెడన్. 81

మ. అదియే నాలుక, దేనియం దనృతవాచారంభముల్ పుట్టు; న
య్యదియే మానస, మేది దీనియెడ నిత్యద్వేషముం బూను; న
ల్లదియే జన్మము, దేని పోషణ కసత్యాలాపముల్ ప్రాపుగా;
విది నీకున్ దగి చెప్పుచుంటి నిటుపై నేమైన నాకేమిఁకన్. 82

మ. అనృతంబాడి భుజించునన్నమది తా నన్నంబుగా, దట్టు లం
దిన బల్పయ్యది బల్పుగా, దనృతవక్తృత్వమ్మునం జేయు జీ
వనమున్ జీవనమెందుఁగా, దనృతవాక్ప్రాగ్భారమున్ రోయకుం
డిన యేప్రాణియుఁ బ్రాణిగా దెలుఁగుమీ! నీ కేను వాక్రుచ్చితిన్.

సీ. అనృతకల్పనలు సారెనొనర్చు ఖలుకన్నఁ బ్రాణమేలేని శవంబు మేలు
రస నసత్యాలాపరసికుకన్నను "బఱ్ఱు"మని మోఁగు గర్దభంబైన మేలు
సత్యవాఙ్మధురసజ్జతలేని జడుకన్నఁ "గీ" యంచఱచు కీచురాయి మేలు
మానృతేతరవాగధీనువక్త్రముకన్నఁ గశ్మలంబగు తూముకాల్వ మేలు

తే. గీ. ఎప్పుడు ననృతోక్తులాడెడి కృపణుకన్న
శ్వపచుఁడే మేలు, వర్ణప్రశస్తియేల

ఇంతయెఱుఁగని నీకు నే నేమి చెప్పి
యేమిసార్థక మోయనృతామయాత్మ! 84

సీ. ఎఱిఁగి యసత్యదుర్భరితపారావారపంకమ్మునం దిగఁబడకు బావ!
తెలిసి యనృతవచఃకలుషనారకకూపపర్యంతమున నిద్రఁబడకు బావ!
అరసి తథ్యేతరవ్యాహారనీహారపటలమ్ములోఁ జొరఁబడకు బావ!
చూచి సూనృతవచశ్చ్యుతిమయామయసన్నిపాతమ్మునఁ బుఱ్ఱింగఁబడకు బావ!

తే. గీ. నీకొఱకుఁ జెప్పుచుంటి మన్నింపు బావ!
ఆత్మ వంచింపనెంచకుమయ్య బావ!
క్రిందుమీఁదులెఱింగి వర్తింపు బావ!
అనృతగతి వీడి వర్ధిల్లుమయ్య బావ! 85

శా. నీదుర్మార్గపుఁగూఁతలన్ గురుఁడు వర్ణింపక్కునం చేసెటుల్
వాదింపంజుమి, యూఁకే యనృతముల్ వాపోవు నీదుర్మద
ప్రాదుర్భావ మొకింత డింపుటకునై వాకృత్తు; నింకేని మ
ర్యాదాపద్ధతిఁ బట్టి పోయి యఘపారావారమున్ దాఁటుమా. 86

మ. మన మిక్లే తెగ గిల్కుచుంటిమి; గురు న్మన్నించువారెక్కుడై
పనిగాఁ బిల్వఁగ నంపి యుత్సవములన్ బల్మాఱుఁ గావించి య
ర్చన లవ్వారిగ సల్పుచుండిరి మహాశాపాశబంధంబు నీ
జననంబున్ వృథసేయుచున్నది; పగన్ సాధింపలే మిమ్మెయిన్. 87

శా. త్రాగుంబోతువిధానఁ బూర్వపరసందర్భమ్ములే కెట్టులో
వాఁగన్ దాన యశమ్ము గల్గునె? వృథాపాలంభముల్ నోటిచే
పేగా కన్యులగౌరవమ్మున కొకింతే నంకముం గూర్చ; వే
లాగో సత్సభలో నెదుర్చుటకునై లావింత యార్జింపుమా. 88

ఉ. 'తీతువుపిట్ట' యం చతనిఁ దిట్టితి, భావిఫలం బొకింత నీ
చేతమునం దెఱింగితివె? చెచ్చెర నోటికి వచ్చినట్లుగాఁ
గూఁతువు, కొంపఁ గూలు ననుకో, విది యొక్కఁడి కర్మ, మాతనిన్
బూతులు దిట్టెనాఁడ నని పొంగె, దెఱుంగవు వచ్చుదుర్గతుల్. 89

ఉ. చూడుము కొప్రపుంగవుల, శూరుల ప్రేరణఁ జేసి తప్పడుం
జాడలఁ బోయి పోయి పయి జాడ్యము వీడి కృతాపరాధమున్

వీడయి పావఁగా నొకట నెన్కటి తుంటుడు కెల్లఁదగ్గి మో
మోడుచు నుండి యిప్డిపు డయోగ్యుఁడు వీడఁదొడంగి రెమ్మెయిన్. 90

చ. మనల ననుగ్రహించుటకు మచ్చరపున్ దురితంపుఁ గూఁతలన్
బ్రణయముకల్మిఁ బంపుగతిఁ బంపెడివారలు లేకకాదునూ!
గొనకొని కొప్రపుంగవులు కుంగిన హేతువు, వారలిప్డు లే
చిన మన కొక్కయుత్తరము చేరదు సర్వము వారికే చనున్. 91

చ. 'తిరుపతివేంకటేశ్వరులు దేవలు, కూళలు, పోరికుల్, కవి
త్వరచనవే రెఱుంగరు వృథాయశమున్ గడించినారు వా
రిరువురు శుద్ధసుంఠ' లని యీవును నేనును మిక్కుపొక్కఁ బ
ల్వురు లిఖియించి తుంటరులు పుచ్చిరి కొప్రము వారియొద్దకున్. 92

ఉ. అన్నియు శాఖలో నిజను లాసనచక్రకు నాగ్రహించుచున్
బన్నము వారి కొనచుఁ బన్నినవే యుపి; సిద్ధవస్తుసం
పన్నత యిట్టి ముష్కరులవాఁరెల చేఁ గెడవంచు నెంచి యు
త్పన్నవివేకులై యిప్డు వాఁగరు కొప్రమువారు నీపలెన్. 93

మ. మన కాబాపతు నుత్తరమ్ము లెకదా మాన్యేతరుంగాఁగ నొ
జ్జను సాధించుట కూఁతమయ్యెఁ? దురాశ గీన్నవు గుఱ్తింప వ
జ్జవనిందోక్తులు కొప్రమున్ గెలిచె; నీచందమ్ము నల్లోఁజమీ!
యనృతాహంకృతిదుష్కృతాశ్రయుఁడవై యాత్రోపకే పోయెదే? 94

ఉ. ఎందుల కట్టియుత్తరము లీవు లిఖించిన "శృంగభంగపుం"
దందనకన్న మిన్నలె? వృథా యది మన్నయి నిన్నుఁ బూతిగాఁ
బందనుజేసి, యిర్వురడలఁ బంపిలుగూసెడి తప్పుఁగూఁతలున్
జిందులుఁ జేర్చికొన్న మతి చేకుఱునే? మన కున్నతస్థితుల్. 95

ఉ. కాఁకరపల్లె మద్గురుఁడు కార్యవశమ్మున వచ్చినప్డు నే
వాకరుణార్ద్రితోఁ గలిసి యంఘ్రుల వ్రాలిన నప్డె తీఱుఁబో
యీకలహంబు; నే నచట నేయపు డుండిన నిన్నుఁబోలెఁ బ
ల్పోకలు పోయి యిక్కరణి మూలముడుంగు నవస్థ దెత్తునే. 96

చ. ఎదుటికి నేగవైతివి, మఱేమియు నేరని మామతమ్మునిన్
గదనము సేయ నంపితివి, కాఱు లతండటు చెన్ గ్రిమమ్ముగా

ముదిరెను గయ్యా మాపయిని ముష్కరతాస్పదులైన శిష్యులన్
గుదులుగుదుల్గ నంపితివి కోఁతులదండు బలెన్ జయాశమై. 97

ఉ. అంతియకాని యప్పుడును నాతని యగ్రమునందు నిల్పి 'నీ
పెంపె? త్వమేయుపొందితి యదెంత? భవత్కవనం బదెంత? నా
పొంత' నటంచుఁ బల్కుటకుఁ బోవఁగ జంకితి, వూరకే యశః
కాంతను దేవులాడెదవు కంపము నెమ్మది నిండియుండియున్. 98

ఉ. 'వేంకటరాముకన్నను వివేకిని నేను జయింతు సత్సభన్
వేంకటశాస్త్రి' నంచు నవివేకపుఁగూఁతలు గూతువేఁగదా
జంకఁగనేల నీకడకుఁ జయ్యన నాతఁడు వచ్చినప్పుడే
బొంకులొ వ్రాసి కయ్యమును బూర్తిగఁ బెంచఁగనేల యోలిమై. 99

ఉ. ఆతఁడు నీదు దండునకు నాత్మను బూర్తిగ జంకినప్పుడే
నీ తగుకీతి నీ వెదుటి కేగిన నిన్నతఁ డేమిసేయు? నిం
కాతరుణమ్ము రాదుగద? యంత భయమ్మున మున్గ నీ వొగిన్
గోతువు కోఁత లూరకయ, కోసినకోఁతగఁ గైత నిండఁగన్. 100

చ. మనవిధ మెల్ల బైలఁబడె, మన్చి నృపాలకు మోమెకాక యే
యనఘునిఁగూడఁ జూచుటకు నర్హత లేమి దటస్థమయ్యె; నో
క్కనిముసమైన నెమ్మది సుఖమ్ముగ నుండఁగ నేరదయ్యె నిం
కనయినఁ దప్పుఁగల్పనలు గట్టిన లగ్గగు నెంచిచూడుమా. 101

శా. నీతప్పుం జెడుఁగూఁతలన్ గొని నినున్ నిర్నిద్రకీర్తిప్రథా
స్ఫీతుం జేయఁగ నెంచి దేశికుఁడు సుశ్రీనించి కల్పించు వి
ఖ్యాతగ్రంథము లెల్లఁ గామగవులై కవ్యగ్రణీనిత్యసం
ధ్యాతంత్రోచితమంత్రరాజములునై వ్యాపించె వీక్షించితే. 102

శా. ఎన్నాళ్ళీగతి మిణ్కనేముగు? వృథా యీ వేనునుంగూడి; యా
పన్నెల్ చిన్నెలు నీకు నాకు నెటు రావచ్చున్? యతిప్రాససం
పన్నంబయ్యు బుజార్తిదూరమగు కావ్యం బెన్న సాక్షాచ్ఛవం
బున్నట్లుండి క్రిమమ్ముగా సురుఁగు మాయోపాయముల్ వాయఁగన్.

చ. అకట! శతఘ్నియంచు నొకఁడల్లితి, వయ్యది పొల్లువోయెఁ ద
త్ప్రకటన నీకు నాకుఁ బరిభావము గూర్చెటెకాక పాయమై

న కతన వ్యాసముఖ్యుల మనంబులఁ గొండొకసిగ్గు గూర్చెఁ; నీ
వొకటియునేని నిల్పఁగల దున్నదె యందలి వెక్కిరింపులన్ ? 104

చ. ఆగలః బరాస్తపాశుపతమంచు లిఖించితి సిగ్గుమాలి పై
డిపుడలపైఁ "బురశ్చరణ" తాడన మక్కతనన్ ఘటిల్లె, నా
యపమతికూడఁ జాల కిపు డాయనతమ్ముని జిన్నవెంకనన్
బ్రివిమలచిత్తు దింపితివి పాదుకృతఘ్నగణమ్ములోనికిన్. 105

మ. జనకద్రోహియటంచుఁ జేరిలితివి వాచాలత్వమేపార వెం
టనె యాతండనృతమ్మునఁ గూడ* దది సంధానించు దౌర్గత్యమం
చని చెం బద్దెము; లంతతో భయముమై వాస్యమ్ము మూగయ్యె, నెం
దునకో తప్పదుఁ గూఁతలన్ గిలికి దీత్రోవల్ ముదంబిచ్చునే. 106

---

ఉ. *కట్టుచునున్నవారు గృహకాండము నారకమందు; నన్నమున్
బెట్టకతండ్రి నిల్ వెడలనెట్టినవాండ్రికునై, గురున్ దగన్
దిట్టినవాండ్రికై; యొకటనే మన ముండవలెన్ దురాగతం
బుట్టిపడంగఁ గూయఁ భవదుక్తులు సత్యములేని యర్భకా. 1

ఉ. తీసిరె యుంచినారలఁట! తీఱని గోతులు తండ్రి నాత్మయా
వాసమునుండి గెంటువలవాండ్రకునై; గురుఁ దప్పగూఁతలన్
గూసెడివాండ్రికై; యొకటఁ గూలవలెన్ మన మీవు వ్రాయునా
దోసమునిక్కమేని; యొటు ద్రోహము లూరక పోవు నర్భకా. 2

ఉ. చెక్కియయుంచినారలఁట! చిక్కని మేకులు; నీకు నాకుఁ బె
న్మక్కువ నంటఁగొట్టుటకు; మానరు మానుఁడటన్నఁ దండ్రికిం
దొక్కఁడు ద్రోహి, వేఱొకరుఁడో గురుపట్టున ద్రోహియౌఁగదా!
నిక్కము వారికిం దెలియునే నవి నన్ను స్పృశింప నర్భకా. 3

ఉ. నూతిరొ యుంచినారలఁట! నున్ననికత్తులు ముక్కముక్కలౌ
తీరునఁ గోతురంట! వెనుదీయక సత్యములాడువాండ్రియా
దూరసనన్ నిజం బపుడు తోఁపక మానదు, తండ్రి నింటికిన్
జేరఁగనీమియున్ గురునిఁ జెట్టులుగూయుటయున్ బయల్ పడున్. 4

చ. తెఱచిరొ పెట్టినారలఁట! తీవ్రదవానలభీకరమ్ములౌ
నరకములెల్లఁ దండ్రి భవనమ్మున నుండఁగ నీక త్రోయు సం

శా. శ్రీ సూర్యప్రభుఁడిచ్చు బత్తెములతో సిగ్గేది జీవింపఁగా
వ్రాసెం దేవుఁడు నీకు నాకు నొసటన్, బ్రారబ్ధ మిట్లుండె నా
యీ సాన్నిధ్యము వీడినన్, మనకు నేయే పాచితంబేని యే
మోసంబేని స్వయంకృతాఘములచే మూఁడున్ మఱెందేగినన్. 107

చ. నరకమటన్న నారయద వణం కుదయించెడి, నందుఁ "గ్రొత్త వే
ర్పఱచుచున్నవా" రనుచు వ్రాసె గురుం డనృతప్రలాపికిన్

---

కరుణను, దేశికుల్ దెగడుకట్టిఁడులన్ బడఁద్రోతురంట! యె
వ్వర మట కేగమో తెలియఁడు వాఁడు పరాత్పరుఁ డొక్కఁడర్భకా. 5

చ. నిలిపియ యుంచినారలఁట! నిస్తులశస్త్రపరంపరల్ దురా
త్ములకయి; తండ్రి నిర్వాడలఁద్రొబ్బుట, దేశిక బూతుఁగూఁతల
బలుకుట, నేర్చికొన్న కవిపండితులయ్యెడ ముఖ్యులంట! త
త్ఫల మనుభూతమానెడలఁ దథ్యము తేలఁగవచ్చునర్భకా. 6

చ. కలిపియ యుంచినారలఁట! కల్పెడివస్తువు దానితోడ, నే
యలఁతి పితన్ గృహాంగణమునావలికిన్ బడద్రొబ్బు, నింక నే
యలఁతి గురూత్తమున్ దెగడు నాయిరువాగునకై; తపంబువుల్
తలఁ బడునట్టి వేళఁగద! తథ్యము కానఁగవచ్చు నర్భకా. 7

చ. ఇహమున నెందఱేనిఁగల రిద్దఱదోస మెఱుంగు సాకిరుల్
నహి పరమం; దెవండు చని నారకముం గని వచ్చి చెప్పు ధీ
మహితుల; కిక్కతాన మనమంచియుఁ జెడ్డయు నిండె తేలుటల్
బహుజనసమ్మతం బగు సభాస్థలమందుకుఁ జాలునర్భకా. 8

ఉ. సూనృత ముజ్జగించి పెళుచుందవమున్ గడియించి పేర్చుదు
ర్మానమునన్ దురాగతపువ్రాఁతలు వ్రాసినయంత నేమగున్?
ధీనిధు లెందు లేరె! గుణిలింపరె నిక్కము! నోరు నొక్కరే!
పైననరే యపాత్రులని! వర్ధనముల్ వదరంగఁ బోయెనే. 9

శా. బహ్వాలాపములేల? కల్లనిజముల్ పాలించువాఁ డున్నచో
నాహ్వానించి స్వకీయలోకమున నీయాచర్చ గావింపఁడే?
కహ్వాచారులు డాఁగనేర్తురె? యటన్ గాపట్యముల్ నిల్చునే?
జిహ్వాచ్ఛేదము సిద్ధమా యెఱిఁగి భాషింపన్ బ్రియత్నింపుమా 10

దురితము నిక్కమేని యెటు దుర్దశ నీకును నాకుఁ దప్పునో
మొఱక! వృథాగ నేమిటికి మా మఱుగన్ దెగఁ జేసి లెదో గదా? 108

మ. ఎపుడో నాగక మేగుదెంచు నని నే నేద్వంగఁ బో, నద్ది నా
కిపుడే సిద్ధ మదెట్లటన్న, విను మాయీ దేశిక ద్రోహపున్
విపరీతస్థితిఁ జేసి నాయెడఁద కావేగంబు పెల్లయ్యె నె
ల్లపుడున్ వేసెడి మత్కృతఘ్నత మదాస్యం బంటి పీడించుచున్. 109

మ. గురుతన్ ద్రోయఁగఁ జాలినాఁడవె యవాకుల్ బల్చవాకుల్ శతం
బఱపన్ జాలితి గాని, యట్లైనుమి దాపై పైపయిన్ వచ్చు నా
నరకం బాఁగుటకూడ, నిప్పుడయినన్ నన్నా మహాభాగు పా
దరజమ్ముల్ దలఁదాల్పఁజేసి యెటులో ధన్యత్వముం గూర్పుమా. 110

చ. విటుఁ, డవివేకి, కాకవి, యవిజ్ఞుఁ, డనార్యుఁ, డనర్హుఁ డల్లవెం
కటకవి వానిఁ బూజ్యునిగఁ గైకొనకుండని నీవు సర్వదా
రటన మొనర్చుచుంటివి కఠింబు శ్రమంపడుచుంటి వక్కట
క్కట! యతఁ డట్టిడైన నగుఁగాక జగం బతనిన్ భజించెడిన్. 111

ఉ. "దీనిఁ బఠింపు" డం చొకఁడు, "దీనిఁ బఠింపకుఁ" డంచు నొక్కఁడున్
మానుగ శీర్షికల్ నిలిపి మందులపట్టిక లంపుచుందు; రె
ద్దానినిఁ జూడవద్దనిన దానినె చూచుట లోకధర్మమౌఁ
గాన నిషిద్ధవస్తువునె కాంతు రెఱుంగుదువో, యెఱుంగవో? 112

మ. ఉపకారార్థము పెండ్లిచేసె గురుఁ డోహో! వాఁగ వెంకన్న, కీ
వపకారమ్ముగ దానిఁ బొల్చెదవు ధైర్యం బెంత నీకున్నదో!
కపటస్వాంతుఁడ! "పెత్తనమ్మను మిషన్ గాఁ జేసె ద్రవ్యం" బటం
చపలాపించితి నీదు నాల్కకు నరం బావంతయున్ లేదొకో! 113

చ అతఁడు మహోపకర్తయగు నన్నపయిన్ దురితమ్ములాడె నం
చతికిన నీదురాగతికి నంతును బొంతును గల్గఁబోదు, నీ
బ్రతుకి కిటు తప్పఁగల్పనలు పన్నుట కేర్పడెఁబోలు; నీకు దు
ర్గతియెడ భీతిలేదు బహుకష్టము నిన్నిఁక విశ్వసించుటల్. 114

చ. "అనృతము కష్ట మిచ్చు, ఋత మన్నిట సౌఖ్యమునిచ్చు, దేవుఁడం
చు నొకరుఁ డుండె సర్వమును జూడఁగలాఁ డతఁ" డంచు నమ్మనా

జనుఁ జను విశ్వసింప, నిఁక 'సర్వము కల్ల' యటంచు స్వార్థముం
బనిఁగొని సంగ్రహించు నలపాతకి నమ్మినవాఁడు పాడగున్. 115

(అ ఱ వ మే కు)

చ. భయము జనించె నాయెద భవత్సహవాసమునందు; ధైర్యమే
మియుఁ గనుపట్టద "య్యఱవమేకు" స్మృతింబడె, నట్టు నన్ను ని
శ్చయముగ నీవు చేయునెడ శక్యమె దాఁటికొనంగ, నో దురా
శయ! విను మక్కథావిధము సర్వము దెల్పెద నీకు బుద్ధికై. 118

చ. అఱవయు నొండు విప్రుఁడు ధనార్జనకై చనిరంట! దేశముం
దిరిగి ధనమ్ము మిక్కిలిగఁ దెచ్చినవారఁట! మార్గమధ్యమం
దఱవకు జబ్బుచేసి తుద కాశ వదల్కొనునంతదన్కరా
నెఱిఁగి యతండు లోన నిటు లెంతయుఁ జింతిలసాగె నంటొగిన్. 117

మ. 'ధనమార్జించితి మెంతొ కష్టపడి యీద్రవ్యంబు దారాసుతుల్
దినుయోగం బది లేకపోయె నిది యీ దీనుండె సర్వమ్ము కై
కొను నావారలతోడఁ జెప్పఁ డెటులొక్కొ? వీని వంచించి నా
ధనమున్ వీనిధనమ్మునుం గలిపి మద్ధామంబునం జేర్చుటల్.' 118

చ. అని మదినెంచి యంతకభటావళి సన్నిధి కింకఁ గొంతసే
పున కరుదెంచునన్ సమయముం గనిపెట్టి స్వసన్నిధిన్ గనుం
గొనలను నీరు జాఱఁ దనకున్ వగఁజెందెడి మిత్రుఁ జూచి "నో
యనఘ! యిటేల చింతిలెద వాయువు శాశ్వతమానె యేరికిన్. 119

ఉ. ఎప్పటికేని దప్పనిదియేసుమి మృత్యువు దీని దాఁటువా
రెప్పుడుఁ బుట్టలేదు, మఱి యీపయిఁ బుట్టరు, పుట్టుజంతువుల్
తప్పక చచ్చుఁ, జచ్చినవి తప్పక పుట్టు, విచారమేల యీ
తిప్పలు బ్రహ్మముఖ్యులగు దేవతలేనియు దాఁటలేరుగా. 120

ఉ. కావున నన్ను గూర్చి యిటుగా విలపింపఁగనేల? నేనిదే
పోవుచునుంటి నాకునయి పుష్పకవల్లదె వచ్చుచుండె, నా
పై విడు మింకఁ బ్రేమ, ఋణబంధ మిదే తెగుచున్న దెంతయో
నావిషయమ్మునన్ శ్రమమువన్ బనిచేసితి వీవు కూరిమిన్. 121

ఉ. పారెను వైద్యునిం బిలిచి చక్కనిమందుల నీయఁజేసి, తిం
పారఁగఁ బథ్యమైనగతి నన్నముఁ గూరలు వండిపెట్టి, తె
వ్వారొనరింతు రింత సదుపాయము? నేను నిజమ్ముగా జపీం
దారుఁడ, రోగిఁ గాను, గుణధాముని నిన్నొకనిన్ గడించుటన్. 122

శా. దారాపుత్రులు దవ్యమున్ దినుటకే, దారిద్ర్యమో, రోగమో,
ప్రారంభించినయప్డు చూడరు సుమీ! ప్రాణ్ణుండ వీ వన్నియు
న్నేరంబోలుదు, నీకతాన సుఖినై నేఁ బోవుచున్నాఁడ, సం
సారభ్రాంతుఁడఁగామి నిష్ఠాకటి ప్రస్తావింతు నాలింపుమా. 123

ఉ. నా కుపచారమున్ సలిపినాఁడవు మిత్రుఁడ వంతెకాక స
ద్ధీకుఁడ విట్టి నీ ఋణము దీర్పకపోతినయేని నాకు నా
నాకమునందు రాఁగల మహాపదవుల్ ప్రణ్ఘంగురంబులౌఁ
గాక తిరమ్ము లెట్టులగుఁ? గద్దము చెప్పెద నట్లొనర్పుమా. 124

చ. ధన మొకకొంత యిప్పుడము దాఁచిన దున్నది యందులో సగ
మ్మున కధినేత నేను, జనిపోవుచునుండిన నాకు భాగమెం
దున? కది నీవ కైకొనుము, దుఃఖము నొందకు, మిందు లేశమున్
బనుపకుమీ మదీయులకు; భార్యయు బిడ్డలు నీకు నెక్కుడే! 125

ఉ. ఇంతుల కొప్పవేనిఁ బయి నెన్ని భవమ్ములో యుక్తికాని సం
కర్పించనలోక మేను జనఁగా ఘటియింపను; వచ్చు పుష్పకం
బుం దుదముట్ట రామి కిది ముఖ్యనిమిత్తము; మాఱు చెప్ప కా
కర్ణిందన మాఁగి యింక నొకకామము నాయది తీర్పఁగావలెన్. 126

చ. అది యేది యందువే, నిది రహస్యము వెల్లఁగ విన్ము: హంస లు
న్నదియును లేనిదిం దెలిసి యావిషయంబు వినిశ్చితమ్ముగా
నెదఁ గదియించి మేకొకటి యింతకుఁ బూర్వమె తెచ్చియుంచి నా
కది దిగవేయు మానసమునందు మతెవ్వరు చూడకుండఁగన్. 127

చ. అఖిల కర్మ మియ్యది, కులాచరణం బగు, మానరాదు నీ
వె... గ విఁకెన్నియో కలవ యిట్టివి దావిడులందుఁ జిత్రిముల్
గ... లు సమ్మతించినపరికారము మానఁగనేల? యెందుకే
ర్ప...చిరో వారు, నీ విటుకృపన్ సలుపన్వలె మానకెమ్మెయిన్ 128

ఉ. తప్పునకొక్కు మిప్పని, పదంపడి నాకిది కారణమ్ముగా
చెప్పటియట్లు జన్మమొక చేర్పడునో మఱియేమొ! యూరకే
చెప్పరు పెద్దలెయ్యవియు, శేముషి చాలక వారివాక్యముల్
తప్పదు రొక్కకొందఱ, అది ధర్మము కాదని నీవెఱుంగవే? 129

ఉ. కావున నామనోరథము కాదన కాదృతి సంగ్రహింపు మిం
కీవు పౌనర్భవుండగిన దింతకు మించి మఱొండు గల్గ, దీ
సేవను బూర్తిఁ జావెఱిఁగి చేయవలెంజుమి, యట్లు కానిచోఁ
జావునకా నిమిత్త మిది, సద్గతి కావయి నంతరాయమా." 130

చ. అని కడు మిత్రభావమది యంతయు నట్టిపడంగ నా కుక
ల్పనకుఁడు బోధసేయఁగ స్వభావవినమ్రుఁ డమాయకుండు నా
ననఘుఁడు లోఁడివిప్రుఁ డది యట్టిదకాఁ దలపోసి చేసెఁ జె
ప్పినను కి తప్పకుండఁ దన ప్రేముడికాని ముదమ్ము దీర్పఁగన్. 131

ఉ. పిమ్మటఁ గొంతసేపునకుఁ జేరితనివాసపుభూమి కాశవం
బిమ్ముగఁ దీసికొం చరిగి, రీతఁడు నింకొక కొండ అంతఁ గా
ష్ఠమ్మునఁ బెట్టునప్పుడు తటాలున మే కొకయుండు చూచెఁ బ్ర
ష్ఠమ్మన; వెంటనే ప్రకృతసంస్కరణం బది యాపి కోపియై. 132

ఉ. దగ్గఱనున్నవారలపుఁ దద్గతశంకువు చూపు నందఱున్
బగ్గున మండి 'యో చెవటి! పాతకి!' యం చొకపెట్టు లేచి 'యీ
యొగ్గితఁడే యొనర్చె' నని యేపడఁగం దెగఁగొట్టి న్యాయపుం
బ్రగ్గడతోడఁ జెప్పి రల పాఱులు వారని కాలు లూఁదఁగన్. 133

చ. అతఁ డెటు సేయఁగావలయు నంతయు సల్లొనరించి 'యోరి దు
ర్మతి! యిటు లేలచేసితివి మర్మము మాని వచింపు' మన్న, నా
హతవిధి! యున్న దున్నయటు లంతయుఁ జెప్పెను బూసగ్రుచ్చిన,
'ట్లితుకవు నీ కుకల్పనము' లం చధికారి తిరస్కరింపఁగన్. 134

ఉ. కాఁడు కుకల్పకుం డతఁడు, కాఁ డపకారియుఁ, గాఁడు లోభియున్
గాఁడు దురాశయుండు, కొఱగాని దురాగతు మాయమాటలన్
గాడఁగ నమ్మి యకారణిఁ గస్తికి నగ్గము గాఁగనై యసుల్
పీడె సమస్తయోగ్యులును 'వీని వధించుట యుక్తమే' యనన్. 135

ఉ. కానఁ గుకల్పనాపటిమ గల్గిన నీయెడ విశ్వసించుచో
హానికి నగ్గమౌదు నని యాత్మ వణంకు పుదయించుచున్న, దే
మైనను మంచిదే విడుతు నాదృతి నీపయి నింకఁ; బాముతో
నేనయఁ డేని స్నేహమున కీకొని మోసము నందకుండునే. 136

ఉ. తప్పఁ గుకల్పనల్ సలుపుదారియె తోరఁగ రాదు కాని యం
దెప్పుడు నిల్చునో, 'హితుఁడు నింకొకఁ' డన్న వివేక మేమి? యొ
క్కప్పుడు స్నేహమున్న యతఁడౌ, మఱియొక్కొకచో నరాతి; నీ
వప్పుడు నన్ను మాత్రము దురాశయ! యొప్పరికింప నేర్తువే. 137

చ. 'ఎఱుఁగమె కాలనేమి, నతఁ డెన్ని కుకల్పనలం బొనర్చి పా
డఱె! నటులే యడంగు వని యందఱు కల్పన లెన్నరాద; యీ
యఱప దురాశయుండయి, దురాశ హితుణ్ మృతుఁజేసి ద్రవ్యపుం
బరణి సమస్తముణ్ దనదు భార్యకుఁ జేర్పఁగఁజూచె నేకదా. 138

ఉ. మృతి వృథగా నతం 'డఱవమేకు' కతమ్మునఁ గాంచెఁ గాన సా
మెత యిది లోకమం 'దఱవమే' కని యెల్లరుఁ జెప్పికొందు, రా
కత నఱ వొక్కఁడే, యిచటఁగా దిటు, లిర్వుర మర్వవారమే
కృతి కొనసాఁగనీయఁజుమి! కృతిప్రమథక్కని నీవు పొక్కినణ్. 139

చ. అఱవ యొవర్పు హేసువున నట్లిపకీర్తికి జాతి సర్వముణ్
గుఱియగుటయ్యెఁ గాని యిటు కొండొకశాఖయుఁ జేయవచ్చు; ము
ష్కరుఁ డల కాలనేమియుఁ గుకల్పకుఁ డేకద! వాఁడుఁ గూడఁ దా
నఱవ యనంగ వీలగునె? యందఱయందును నుండుఁ దుష్కృతుల్. 140

ఉ. కానఁ గుకల్పనాపటిమ గల్గినవానిని జేరరాద, య
వ్వానిని జేర్పరాద యని వాక్కొను టేయనుచితంబు; నీవలె
న్నేనొక యర్వనయ్యు జననింద్యపుఁ దోవలు త్రొక్కనేర; నీ
చే నెటువంటి తప్పయినఁ 'జీ' యనకే రచియింపఁగాఁబడున్. 141

శా. ఎన్నో కూసితి తప్పఁగూఁతల, గురుం డెన్నేని సైరించు; నా
వన్నెల్ నోరికి లందు లాడుటయు సంపన్నుల్ మదింబెట్టమిన్
ముస్నేఁదుం గలఁ బట్టిదే, యాఘు మొగిన్ బూర్ణంబు గావచ్చె, నే
బన్నం బున్నదొ? యిప్పుడేని గురునిం బ్రార్థింపఁగాఁ జెల్లదే. 142

తే. గీ. "విష్ణుదేవునిఁ దిట్టిన వెంకటేశుఁ
దిట్టినట్లగు" నని సుంత తెలియు నీకు
వేంకటేశునిఁ దిట్టిన విష్ణుదేవుఁ
దిట్టినట్లగునని కూడఁ దెలియవలదె? 143

మ. అటు లొక్కించుక నీవెఱుంగుదువు దుర్వ్యాహారముల్ తొల్లి వెం
కటనేతన్ గుఱిసేసి ప్రేలఁ, దది యజ్ఞానప్రయుక్తంబ; యం
తట వస్త్వైక్యము దేశికుండు తెలిపెన్ దానన్ గనుల్ విప్పి చె
ప్పుట కొం డుత్తర మబ్బుమిన్ వృథగ వాపోవన్ ఫలంబున్నదే. 144

శా. విష్ణుం డెవ్వఁడొ వేంకటేశుఁ డతఁడే, వేయేల? రాముండునున్
గృష్ణుండున్ మఱి వానిలేశములె, నీ కీజ్ఞానమే యున్నచో
జిష్ణున్ వెంకటనేతఁ దిట్టెదవె, సీ! సీ! పండితమ్మన్యా! నీ
తృష్ణాతంతువు పూర్తిగాఁ దునుటకు కాలిట్టే నిమిత్తమ్ము రా. 145

ఉ. వెంకటనేతపై నకట! వేదము నీవువహించి తిట్టు నా
పంకము చూచి నాయెడలు బస్సున మండెదె, దేనుగూడ నా
వెంకటనామధారి నని వీడెడినై తలపోయనైతి నీ
బొంకులు సర్వమున్ జెఱచెఁబో! గురుఁ, డెంకటు నోరు విప్పెనో? 146

తే. గీ. విగ్రహారాధనమునందు వెలయుపస్య
మొక్కఁడేనియుఁ ద్రిప్పలే కుఱక "వాజ
కూఁత" లని నీవు మిణికినఁ గూఁతలగునె,
"గీతి" లని వాని నైదుష్టనేత లనరె! 147

ఉ. నీవల వెంకటేశు నెటు నేరక తిట్టితి వట్లు కృష్ణునిన్
వావిడువందు దేశికుఁ, డుపాస్తనయు న్నను మేలుకొల్పఁగాఁ
గ్రొవ్విన యొకింత చూపి "యిటు దూఱిన దూఱఁగవచ్చు" నందుఁ గా
దే వెఱవున్ గనంబఱచెఁ దేఁకువ నీవలె నొజ్జ పీడునే? 148

ఉ. అతని తేఁకు వేమి, మతి యయ్యవఘాత్మ నుపాయమేమి, వా
క్చాతురియేమి, నామనము సర్వ మెఱుంగు నెఱుంగ వీవు, నీ
చేతము మాత్ర మాతఁడు గ్రసించుట గంత మటంచు సారెకున్
భీతినిగొల్పు నక్కఁ తనఁ బ్రేలెదు దూరమునందు డాఁగుచున్. 143

శా. ఎన్నో కొన్నిదినాల శిష్యుఁడవు నీ కట్టుల్ గురుస్వామి యం
ద్యన్నై పుణ్యము వోల్చు వాగ్గరిమ చిత్త మ్మెక్కు? నా కప్పుడున్
దన్నై పుణ్యమె జ్ఞప్తిలో మెలఁగు, సంతర్వాణిమాన్యంబు కా
కున్నన్ లోకము మెచ్చునే యరక నీ "హూహూ" లతోఁ బోయెనే!

మ. ఎవనిన్ దేవుని దిట్టఁగాఁ బగదటంచే బోధగాపించె నో
యవివేకీ! యల "విగ్రహార్చనమునం"; బంధత్వము న్వీడు, మ
య్యవి పద్దెమ్మలో? లేకరత్నములో ? నీవజ్ఞుండవై పోక త
త్కావనమ్ముం గని బుద్ధిగల్గి మనుమీ గర్వంబు చాలింపుమీ. 151

శా. నీ తండ్రిన్ మదినెంచు మమ్మహితుఁ డీనిన్నెట్లు సైరించుఁ ద
చ్చేత మ్మెవ్వడు దేవతార్చనపయిం జెన్నారు, నపూజలే
కే తా నెన్నఁడు భక్తిగై కొనఁడు "నీ వీలాటిదుర్మానివై
పో" తంచున్ మదినెంతగాఁ బొగులు నా భూదేవవర్యుం డకే ! 152

ఉ. నీ తలిదండ్రులే మదిని నీదు దురాగతి రోయుచున్నచో
లాఁతులు నిన్ను మెత్తురె? తలంపు మెదన్; జలమున్ గుదింప, మ
య్యో ! తగుమానిసింబలెనె యూరక "భారత" మంచు వ్రాఁతు; నీ
కూఁతలు రోఁతలై బుధులకున్ వెగటయ్యెడి నేమి సేయుదుర్ ? 153

శా. స్నానంబున్ బచరింప వెన్నఁడును సంధ్యన్ వార్ప వేనాఁడునున్
ధ్యానుంజూడక దంతముల్ గడుగ వహోజ్ఞత్వపర్యాప్తదు
ర్మానిన్ గాఁకరపత్రిలోన నిను సమ్మానించువాఁ డొక్కరుం
డేనిన్ గల్గిన వాని పేరు సెపుమా? యేనేగి ప్రశ్నించెదన్. 154

ఉ. అక్కట! వేదులాన్వయమునం దుదయించిన నీవు పొద్దు జా
మెక్కనమీఁద 'బ్రి' ష్షాకటి యెంగిలిచే కరమందు నూని మి
న్నెక్క పొగంబుఁ గద్దుటకు నేవగుపొందినవార లెందఱో
యక్కటికమ్మమై నుడివినట్టినుడుల్ విని యేడ్తు నీకునై. 155

శా. నీదుశ్చేష్టల నాఁగనేరక భవన్నిశ్శ్రేయసాకాంక్షి దా
యాదపేర్మిని నీదుతండ్రి మదుపాధ్యాయున్ సదా కోరు 'మీ
కీదుశ్శీలు క్షమింపఁగావలయు న న్నీక్షించి' యం చీవు నీ
వాదార్థంబు సుమేరుశాస్త్రి నడుగన్ వ్రాతుచ్చుఁ దల్లమ్ముగన్. 156

శా. లేదా, తండ్రినె పోయి యడ్గు మఱి డేలీలన్ బ్రసంగించునో?
చే దెవ్వారికిఁ గాఁడు పుత్రకుఁడు తచ్ఛ్రేయోర్థులై వార లే
యేదైన్యమ్మున కేని పాల్పడుటలేదే? చూడమే? యట్టిచో
నీదౌర్గత్యము వాప నీపిత ప్రయత్నించవన్ బోసంగుండు నే. 157

ఉ. పొట్టకుఁగా నపాత్రమతముం గొని దేవుని దిట్టు పాపపుం
గుట్టవు నీవు గావుటకుఁ గోవిదుఁడౌ జనకుండు మోద మె
ప్పట్టునఁ బొందు? "వీఁడు కులపద్ధతిఁ గర్మమొనర్చునంచుఁ దా
నెట్టులు నమ్మె నౌర! భవదేకతనూజు నిటుల్ పొనర్తువే. 158

మ. పరమాపాత్రుఁడవైతి నీకతన నాప్రారబ్ధ మిట్లుండె, భూ
వరుఁడేని న్నిను మంపలించునన నీవార్తల్ గనం డాతఁ డ
గ్గురువర్యుం డొనరించు గీరతములోఁ గొంతేనియుం జూడ నీ
దురితమ్ము స్పృపుఁ డాఁగుఁగాని యదియున్ దూరంబ యాతనికిన్.

ఉ. "వేంకటరామకృష్ణు" లను పేర్వినవచ్చినమాత్రనే కృత
ఘ్నాంకము జ్ఞప్తిలోఁ దవిలి యందఱు నీ యనిగోయుచుండి కి
పంకము నీఁగఁగావగు నుపాయము శ్రీగురుపాదసేవ గా
కింక మఱొండు లేదునుమి యెన్నివిధమ్ముల నెంచిచూచినన్. 160

చ. గురు నలవారు "తిట్టి" రని "కొట్టిరి" యంచని యేవో కొన్ని తుం
టరు లెదో కారణాంతరమునన్ సృజియించిన తప్పుఁగూఁతలన్
దురిమిన పత్రిక న్నడిపి ద్రోహము నీఁగఁగఁజాల; మంత నే
గురుత దొలంగునే? యఘము గుప్పి జెగడ్పడఁజేయకుండు నే? 161

శా. సిగ్గొక్కించుక నీకు లేదుగద? "సీ! సీ!" యంచు లోకుల్ సదా
యొగ్గుల్ వల్కిన లక్ష్యపెట్ట వరరే! యేనీచులో యీసుమై
దగ్గుల్ దగ్గిన వాని నూఁతగొని యీఁదన్ బోదు సంద్రింబు, నా
కగ్గిన్ మ్రగ్గినయట్లు, గొందఁబడినట్లై డెంద మల్లాడెడిన్. 162

మ. ఎవరో కొందఱు నిన్ను మెచ్చి గురు నెంతే దూఱిరం చేవియో
యవివేకోక్తులు చూపె, దేశకుఁడో యట్లన్నమాత్రన్ బహు
స్తవనీయంబయి చెల్లెనే కురుకులాధఃపాతమూలమ్ము దు
ర్వ్యసనాయమ్ము దురోదరమ్ము బహుళాపత్కారి కాదయ్యెనే. 163

మ. జగదేకస్తవనీయు నండతనయున్ శస్త్రాస్త్రవిద్యాబ్ధిపా
రగు గాంగేయు, దురాగ్రహమ్మునఁ దృణప్రాయమ్ముగాఁ జూచి బల్
పొగరుం గూఁతలు గూయలేదె శిశుపాలుం; డందు కే తోఁడులో
"తగు" నం చాడరె? వాని శీర్ష మటుపైఁ దక్కించి యీఁగల్గిరే? 164

ఉ. బండతనమ్మునన్ మన [illegible]డవాకులుఁ గూసి దాన "బ్ర
హ్మాండము మున్గిపోవు" నని యార్చుచుఁ బేర్చుచు "వంటయింటిలోఁ
గుండలలోన గజ్జములఁ గొట్టిన" మీసమె కాదు, వారివే
లొండునుగూడ నూడ దయయో! మఱిమాలు ప్రసంగ మేటికిన్. 165

చ. కొలఁది యెఱుంగకే "మురికిగుంట" గలంచిన వారు వార, ల
వ్వల నది చిమ్మ క్రిమ్మికొనె వాసన "లోసరిలుం" డటంచు, నీ
తెలివికి నెంతయేడ్తు నది తెచ్చుక నెత్తిని రుద్దికొందు, వి
ప్పలు కలవారు వల్కిన "సెబా" సను లోకము, నిన్ను 'సీ' యనున్ 166

చ. మొదట "రిజిస్ట" రుత్తర మమోఘము నంపిన వారెవా? రదే
కదపుటయౌనుగా కిఁక నొకం డెటులా? నదిగాక వారలన్
గదపుట కున్నదే మన కొకానొకబీజము? వారికుండెఁ గా
కిది పసిబాలుఁ డే నెఱుఁగు నేటికి సామెత నెత్తిలోకదా. 167

ఉ. కాలను బోవుదాని నెసకమ్మున నెత్తిని రుద్దికొంటకే
గోలతనాన నమ్మురికిగుంటను ద్రుంగిరి, విట్టి నీ వచో
జాలికతావిలాస మది భావిగతిన్ దలపించెదున్, జెడుం
గూళల కెందునున్ "మురికిగుంటలె" కా పరమందు గమ్యముల్. 168

చ. కడపిరి వారలే మనలఁ గశ్మలచిత్తుల దుష్ప్రమత్తులన్
బదపడి "కెందునున్ విడిచి" వారికి నుత్తర మిచ్చి యుంటి, మా
మద మది రోసి వెంబడిసె మద్గురుమూర్తులు పూర్తిగా వృథా
వదరు లడంపఁగా "సభకు వత్సలు రండు" ని పిల్చి రెడ్తిలన్. 169

ఉ. అందుకుఁ జాలలేమి జగమంత యెఱింగె, భవద్హృదంతరం
బందును నాహృదంతరమునందును గల్గిన భీతి తోఁ డెఱుం
గుం, దన పిన్నతల్లి మనకుం గబురంపిన నొజ్జ వచ్చునం
చుం దలఁకొందిగాదె యొకచో మన మిర్వుర మప్డు ద్రుగ్గుటల్? 170

ఉ. ఎప్పుడు దేశికుం డచటి కేగఁనుడుల్ వినవచ్చె నప్పుడే
తప్పె మొగమ్ములన్ దలిపి తల్పులు మూసుక లోనఁబ్రుంగుటల్
చొప్పడె, దీనికై మదిని శోకమునంతగఁ బొంద నేను; నీ
విప్పుడుగూడ వారలకు "నీశ్వరవేర్లమె" యంట కేడ్చెదన్. 171

ఉ. ఎవ్వరో యేల నీకొమరుఁడే యనుకొ 'మ్మటకెందు కేగలే
దవ్వ కృపాఖ్య చెల్లమ సభార్థము పెట్టెఁగదా' యటన్నచో
గవ్వల మేనుడి నొన్నడు వఁగాఁగలవో? వచియింపు మూరకే
చివ్వను బెంపఁగా నుడుకుఁ జెన్నఁటి కూఁతలు గూయఁ బోయనే. 172

శా. "ఆరామద్రివిడాన్వవాయవనదావాగ్నిస్ఫులింగ" మ్మటం
చా రాజార్పితుఁ దిట్టఁబూనితివి నీయజ్ఞాన మేమందు? నా
ధీరుం డక్కటతనన్ జెడందలసుమి, యా తిట్టేర్చు నిన్ను న్ననున్
నో రెట్లో తెగజార్చె దారయవు క్రిందున్మీదు నుంతేనియున్. 173

మ. పరమప్రీతిగ నొప్పునట్టి యల శ్రీపాదాన్వయాంభోధిశీ
తరుచిన్ గృష్ణకవీంద్రు వెంకటకవీంద్రద్వేషిగా నెట్టులో
యటపన్ బూనితి పంతమాత్రముననే యాయిద్దరున్ లోఁ బర
స్పర శత్రుత్వము దాల్తురేమి యవురా! చాతుర్యపర్యాప్తతల్. 174

ఉ. ఎంతటి పేర్మియున్ మఱియు నెంతటి గౌరవముండకున్న ధీ
మంతుని మద్గురూత్తముని మన్ననమైఁ గని "శిష్యుఁ" డంచు స
త్స్వాంతుఁడు కృష్ణమూర్తికవి భారత మాత్మకృతంబు నంపి "నీ
స్వాంతము వ్రాయుమీ" యనునె? శత్రుత యేగతి నిర్వచించెనో.

మ. మనకర్మ మ్మిటుకాలి దేశికునిపై మాన్యేతరాలాపముల్
పనిగా నేర్పడెఁగాక లోకమున నేపాపాత్ముఁడున్ జేయఁడీ
పని, దుర్మార్గతకున్ గడంగితి మపభ్రంశమ్ములంగిల్కి వా
రని దుర్వారకఘోరకూపమును జేరంబోవుచున్నా మహో. 176

చ. "అల భుజగేంద్రుతోఁ జెలిమి యాతనికిన్ జెడె" నంచుగిల్కి, త
ద్యలఘునకున్ గురూత్తమున కర్మిలి మెండుగ నున్నవార్త వ్యా
నులఁ గనుఁగొమ్మ తెల్పెదరు చూచినవారట వారు సర్వ; మెం
దులకు వృథాయసత్యములు నోటికివచ్చినయట్లు పేర్చెదో! 177

చ. అల భుజగేంద్రుసన్నిధికి వ్యాసమనీషియు మద్గురూత్తముం
డెలమిని బిల్వనంపఁబడి యేగిరి యప్పురి నొక్కనాఁడు ప్రా
జ్ఞులుగల సత్సభాస్థలిని సూరులు మెచ్చ నుపన్యసించి ర
వ్వల నదిపత్రికన్ గని యపారసుదమ్మును గంటి నే నొగిన్. 178

శా. ఈ వెవ్వారికిఁ గొమ్మ లున్నవని యిం కేనాఁటికిన్ లేవటం
చేవో తప్పుడుఁగూఁత లార్చితివొ యీ యాగజ్ఞు లాపత్రికా
భావం బూఁడ్చెడి, నోఁనొక్కెడి, కృతఘ్నప్రాగల్భ్యముల్ చచ్చు వి
ద్యావైశద్యము హెచ్చుఁ, గస్తురి తుల్ దాఁపంగ గూఁపెట్టెవో. 178

ఉ. పగ సాధించుమగాక దేశికుఁడు విద్వత్త్వాపరిసంగమ్మెటో
దిగఁద్రోయన్ గమకించి యేవిషయమో తేఁ; దీపో యేతప్పుడుం
బోగరుంగూఁతలో కూఁతు వయ్యఁపి కృతఘ్నపో మ్మెయి న్మాలమా
దిగలున్ రోయు కృతఘ్నతాగ్నమున నన్ దేలించి సాలించెడిన్. 179

చ. మన గురుతో నెదుర్కొనుట మాన్యతగాంచెను గొప్పరమ్ము శా
ఖను గలవారిచేనయినఁ; గర్మము కాలుటతప్ప లేకపో
యెను మన కెందు గౌరవ; మహీనుఁడు ఁడుకత మెట్టులో
తిని భరణమ్ము గొన్ సుదతి తీరున నుండఁగ ధాత వ్రాయుటన్. 180

మ. గురుఁ డూరేగిన నేగి రొండొకయెడన్ గొప్పింపువాఁ; డొజ్జ బ్రి
హ్మరథస్థుండుగ నెందొ బ్రిహ్మముం దవ్వారు నూరేగి; రె
వ్వరికిం గాని యఘమ్ము నంబడి వ్యధా వాపోవుచున్ బొట్టకే
భరణమ్మో గొను కొండుదక్కనొక సౌభాగ్యమ్ము నీకబ్బెనే? 181

మ. నృపుఁడేని న్మన కట్టియుత్సవములన్ జేయింపఁ, డేమన్న, దు
ష్కపటంపు న్మనవర్తనం బఖిలముం గాకున్నఁ గొంతేని భూ
మిపుచిత్తమ్ము స్పృశించియుండెడి నెటో మేపించుఁ గా కిట్టిపా
పపురుశ్శీలుర కేమటం చితరసౌభాగ్యమ్ములన్ గూర్చెడిన్ ? 182

మ. మన కేలాభము లేకయున్నను జగన్మాన్యంబు శ్రీదేశికా
గ్రణివాగ్ధోరణి వెంటనంటి మనవక్రింపున్నడుల్ గోవుపా
లను గల్పంబడు గేదెపాలగతి వాలాయమ్ము గ్రాహ్యంబులై
చనుఁ, గీలాభమ చాలుఁ బ్రాజ్ఞు లిటులే శంకింతు రస్మద్గురున్. 183

## సింహము, ఎలుక.

చ. అఱచెద వూరకే గుహనియంతరమున్ గనలేక, యెట్లు నీ
యఱపు లతం డడంపఁగలఁ? డాతని కంకవు మూల డాఁగ, దం
దఱు "భగ" యన్నను విన వు, దంభవచోరచనావిశేషముల్
గురిసిన నెవ్వఁడేమి; యనుఁగున్ గుహఁ జేమియొనర్ప నేర్చెడిన్. 184

తే. గీ. క్షుద్రుఁడగు శత్రు వొక పెద్దశూరునకుఁ ద
టస్థముగు నేని యది దురవస్థ వాని
కప్ప దుపాయమ్ము క్షుద్రున కట్టిక్షుద్రు
నప్పగించుటె యని పెద్ద లనఁగ వినమె. 185

చ. కలదొక సింగ, మయ్యడవి యొకానొక యద్రిగుహన్ వసించు, నం
దలి యొక లాఁగఁ జేరి సతతంబును సింగపుజూలు మెల్లఁగా
నెలుక యొకండు పీఁకికొని యీమృగరాజున కొంకకుండ న
క్కొలనఁగలట్టి లాఁగకు నొసఁగెన్ జనుఁ జిక్కఁ దదన్నిశాంగులన్. 186

శా. హర్యక్షమ్ములవానిఁ బట్టుటకు నిత్యమ్మున్ బ్రయత్నించుఁ ద
ద్ధైర్యస్థైర్యములున్ బ్రతాపమును గర్తస్థాయి యాయెల్కపైఁ
గార్యం బింతయుఁ జేయవయ్యె; నలసింగం బింతకన్నామయ న
శ్చర్యల్ సల్పఁగఁడంగు నాయెలుక నిచ్చల్ బొంచొచ్చెగిన్ బీఁకుచున్.

ఉ. ఎంతయు జాగరూకతనె యయిన్ మృగరాజలపాడునెల్కకై
పంతముఁబట్టి మేలుకొని పట్టుదమంచుఁ దలంచి పొంచుఁ; ద
త్స్వాంతము గుర్తెఱింగి యది యల్లన గన్నమునంద యుండు, నొ
క్కింత కనుల్ మొగుడ్ప నలయెల్క వెసన్ గృతకృత్యమై చనున్. 188

ఉ. పిమ్మట నొక్కనాఁడు గుహ వీడి మృగాధిపుఁ డొక్కవృక్షమూ
లమ్మునఁ గూరుచుండి తనలావు సమస్తము చింతఁజేసి "నా
గమ్ములఁ గూల్చుకన్నఁ, దురగమ్ములఁ జీల్చుటకన్న, నక్కరం
గమ్ములఁ జీల్చుకన్న, నెలుకం గని పట్టుట చాలఁగష్టమా." 189

చ. అని "యిది యేటిమాట, తనయంఘ్రితలమ్మున ముల్లు గ్రుచ్చుకో
గునపము పెట్టి తీయుటొనఁగూడునె, నూదినె కాక, నీచ శ

తుఱిన కొకనిచు నేర్పఱచి తుఱిల్లడఁగించుట యుక్త" మంచు గ్రి
క్కునఁ దలివొంది యెల్కకయి కొండొకపిల్లిని దేఁదలంచుచున్. 190

చ. అది యొచటన్ లభించుననువంతఁ గనంబడె వృక్షకోటరా
స్పదమగు పిల్లియొక్కటి, కృపన్ మృగరాజము దానిఁ గాంచి "నీ
వద ననుఁ జూచి భీతిగొననేటికి? వృక్షము డిగ్గి రమ్ము నే
మదగజభక్షకుండ నవమానమెఱుంగనె? నిన్నుఁ జెందునే! 191

శా. నీతో నొండొకకార్య మున్నయది యంతేవాసివై మద్గుహన్
జేతోమోదముమై వసింపుము భవచ్చిత్తానుసారమ్ముగా
నాతో నుండఁగవచ్చు భుక్తి సతము న్నాపంక్తి భోనేతుగా
కీతంటా లేక నీకు నెందుంకు సర్వైశ్వర్యమ్ము నీ కిచ్చుటన్. 192

చ. పని యది యెట్టిదన్న విను పర్వతపుర్గుహ నానివాస, మం
దున నొక కన్నమందు నొక దుందగపుర్ జెడునెల్క వాసమున్
గొని వడిరేయి నే నిదురఁగూరిన యప్పుడు మెల్ల వచ్చి గ్రి
క్కున మెడబొచ్చు నోటనిఁ గొఱంచుఁ జనున్ దన లాఁగలోనికిన్. 193

ఉ. పట్టుదమంచు యత్నము నపారము గా నొనరించినాఁడఁ, గ
న్పట్టదు, లాఁగలోన నొకపట్టున నెట్టన డాఁగియుండుఁ బై
తట్టున కేగుదెంచియును దబ్బున లాఁగకుఁ బోవు; నంతలోఁ
బట్టుట కీవు నేర్పరి వుపాయము నీయది నే నెఱుంగుదున్". 194

చ. ఇటు నుతియించి పిల్లి నెటులేఁ దనచెంకగ సంగ్రహించి య
క్కటికము మీఱఁ బెంచు చలకన్నము దాపునఁ గాపు వెట్టి వె
వ్వటివలెఁ గాక సౌఖ్యముగఁ గన్నులనిండను నిద్రగొంచు న
య్యటవిచరాధిపప్రవర మా గుహఁ గాలము పుచ్చునంతటన్. 195

మ. తనదుర్దర్పమడంచు పిల్లి యచటన్ దానుంట గుర్తించియున్
దివ నాహారముఁ దాగ్రివ నీ రొదనమిన్ దేహమ్ముఁశుష్కించి నె
ట్టన నెట్లో చననెంచి యాయెలుక బైటన్ రా వెసన్ బిల్లి చ
ట్టనఁ బట్టెన్ దిగమ్రింగె; సింగమది వేడ్కన్ గాంచి యగ్గించఁగన్. 196

ఉ. కావున నీచశత్రునకుఁ గావలె నీమఁ డొకండు, సింగపుర్
లావది యేమిచేసె నలలాఁగవసించెడి యెల్కమీఁద? న

ల్లే విను నీవయిన గురునియేడ్తెంబయిన బనిసేయలేద, నీ
వేవియు తప్పంగూడత లోకటేగతిం బ్రేలెదు నెగ్గెలుంగమిన్. 197

శా. "రంతుల్ మాను" మటంచు మిక్కొదవు నీరంధ్రవివేకాన్విత
స్వాంతు న్నిన్ను నన్ను సత్సభకు సిద్ధ్వన్ జేసి యస్మత్కృవా
గ్వాంతుల్ మాన్చి విరోధభావ ముడిపి పై వాత్సల్యమున్ జూపి ధీ
మంతుల్ మెచ్చ ననుగ్రహింపుమనుట ! యీమర్యాద లాలించితే. 198

శా. రంతుల్ మానఁడు తిర్పతిప్వెంకఁడు నీరంధ్రవివేకాన్విత
స్వాంతభ్రాంతనిరంతరావృతవచఃపరిక్రాంతదుష్కల్పనా
ధ్వాంతక్రాంతకుకావ్యనశ్వరవిదీవ్యద్భవ్యతేజోంచితా
హంతాదంతురవాక్ప్రకాళికల నీహామ్మార్ప కేనాఁటికిన్. 199

శా. రంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు ధీరమ్మన్యతాసిద్ధత
స్వాంతాత్యంతదురాగతప్రణవచాచారవాచాటకా
చాంతానంతకృతిప్ర తాభరసురాసర్వస్వనిర్వాపణ
ధ్వాంతుల్ కొండొక వృద్ధిచేసి మొగముల్ వాడింప కేనాఁటికిన్. 200

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు వికాంతాఖిలాశాంతరై
రంతర్వ్యాప్తిప్రభాసమగ్రకవితారాజ్యంబు పాలించు ధీ
మంతున్ దేశికు మాఱునాడిన ప్రపన్నంపుస్థితుల్ వోవఁ ద
త్క్రాంతాంఘ్రిద్వయి మీశిరంబు లిరవొందన్ జేయ కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సారగ్రాహివిద్వన్మన
శ్చింతాధాయితధాకృతాసుకృతరాశీభూతవాగ్జాతస
ద్ధాంతాలంకరణైకతానకవితాధార్ష్యంబుసంజేసి గు
ర్వంతస్తాప మొనర్చు నీచరిత మేపన్ జేయ కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనర్ఘగ్రావభూమీనట
త్క్రాంతుద్వేషిశిరస్సమానరసికల్లోలలోలార్భ
సంతానోపమచాయధారకవితాసంతోషితాశేషభూ
కాంతాస్థానచరున్ గురున్ జెనఁకుపాపం బాప కేనాఁటికిన్.

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు రారాజద్వశఃకన్యకా
సంతానాయితభూమిపాలకసదాస్థానంబునం దుండియున్

జింతాకంతయుఁ లేక పౌరుషముతోఁ సిగ్గుఁ బిసర్జించి యా
త్యంతాసభ్యములాడు కాకవుల కార్యం బార్ప కేనాఁటికిన్. 204

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సర్వజ్ఞత్వభృదాస్థానశు
ద్ధాంతస్థానచిరప్రసాదితయశ స్సన్వీసదోవాసనా
క్రాంతక్రాంతయశః ప్రభూతకవితాసామ్రాజ్యసింహాసనా
క్రాంతుఁ దేశికు దూఱు మోఱకుల పొంకం బార్ప కేనాఁటికిన్ 205

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పర్యాయాదృతానేకసా
ధ్వంతేవాసికృతావధానసమయవ్యాఖ్యానవిఖ్యాపితా
శాంతస్థాయియశః ప్రసూనకవితాసౌందర్యరాజద్గళో
పాంతుఁ దేశికుఁ దిట్టు కట్టిఁడుల గర్వం బార్ప కేనాఁటికిన్. 206

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నిర్యన్మాత్రధురీహూత స
ర్వాంతర్వాణివరేణ్యపూతరసనాధారాదరోదాహృతా
వంతశ్లోకరసోరుపద్యరసపానాప్లాయిసాధుస్తుతో
దంతుఁ దేశికుఁ గూర్చి వ్రాసిన యసత్యాల్ మాన్ప కేనాఁటికిన్. 207

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు పారంపర్యసంప్రాపితా
చాంతామేయరసప్రసిద్ధకవితాసౌకర్యసాఫల్యకృ
ద్వాంతాసంఖ్యనవప్రబంధపఠనవ్యాప్తత్రిలింగాభిధా
నంతుఁ దేశికు నొంచువంచకుల పొం గార్పింప కేనాఁటికిన్. 208

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు నిర్లజ్జావలేపుల్ వృథా
హంతాదంతురితాంతరాత్మకు లసత్యాలాపమూలాత్కురుల్
భ్రాంతుల్ దుష్కవితారసజ్ఞులగు మూర్ఖశ్రేణి ప్రత్యర్థులై
గంతుల్ వైవఁగ వారిగంతు లణఁగాఁగం జేయ కేనాఁటికిన్. 209

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మార్జారాభియానాదృత
స్వాంతంబౌ గజమట్లు కత్తృణము గాల్పం బూను కాలాగ్నియ
ట్లంతేవాసికృతాపరాధజనితాహంకారుఁడైపోరు ది
గ్దంతిన్ దేశికు వేఁడఁబోని ఖలకృత్యం బార్ప కేనాఁటికిన్. 210

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు ప్రారబ్ధాతిరేకమ్మునన్
గొంతేరమ్ములు ముందు కయ్యమునకున్ గూకట్లు జాడించి శా
సంతైసం దర్పబలేక పాఱుదురుగా కవ్వారిఁ బాకాలయా
శ్యాంతస్థాయుల బైట కీడ్చి పదరుల్ మాయింప కేనాఁటికిన్. 211

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు దుర్గర్వప్రకోపమ్మునన్
క్షంతవ్యమ్ములు గాని నేరములు లక్షల్ సేసి యాపిమ్మటన్
గంతవ్యంబు నెఱుంగలేక మనమున్ గంపంబు వేధింపఁగా
గ్రింతల్ దూఱియుఁ జేరులువాంఛ వస గంగంగల్వ కేనాఁటికిన్. 212

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁ డనిర్వాచ్యప్రభావోల్బణా
క్రాంతానేకశతావధానకవనప్రారంభవేళాకృతా
త్యంతస్తోత్రసముత్సముత్కహిమపత్యన్యాపయోగణ్యకృ
త్యాంతున్ దేశికు నల్వఁ గొల్వని యకృత్యంబాగ్ర కేనాఁటికిన్. 213

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సారస్వజ్ఞుచే గ్రంథమున్
సాంతంబున్ జదివించి యందలి యసత్యాలాపముల్ చించి మీ
చెంతన్ మీకృతులందు గోమయపయస్సేకంబు చేయించి భూ
కాంతాస్థానములందుఁ దద్యశముఁ బ్రాకంజేయ కేనాఁటికిన్. 214

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు స్వారాజేవియుం బౌరుషా
క్రాంతంబైన మనమ్ముతో సతతముం గాల్ద్రవ్వ మాతోడ స్వ
పాంతంబందో మఱెందో యొక్కసభఁ జేయంజేయ మీ మా కవి
త్వాంతర్యమ్ములుచూపి మీపొగరు మాయన్ జేయ కేనాఁటికిన్. 215

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు సంరంభమ్ముతోఁ ర్ధితా
హంతావేగముతో వధానభృతవిద్యాచాతురీధాటితోఁ
బంతంబొప్పఁగ వచ్చి పండితకవీట్ప్రాంతమ్మునం బాండితీ
కుంతాగ్రమ్మున గొంతునొక్కి చపలోక్తుల్ మాప కేనాఁటికిన్. 216

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు మర్యాదావిదున్ భూపతిన్
దాంతున్ దాతృశిరోవతంసు నయవిద్యాజన్యసౌజన్యసి
ద్ధాంతుం గొల్చియు నెంతయేని యభిమానాహంయువుల్ గాక వి
క్రాంతాలాపము లాడువాండ్ర తలభారం బూడ్ప కేనాఁటికిన్. 217

శా. అంతుల్ మానఁడు తిర్పతిద్విజుఁడు వైరంబున్నచోఁ బౌరుషం
బెంతేఁ జూపెడి వెల్మరాజ్యమున "మేమే" యంచుఁ గైతమ్మునన్
గంతుల్ వేయుచు వ్రాఁతవ్రాయుచుఁ గ్రియాకాలమ్మునన్ భీతి నా
పాంతం బోవని మోసగాండ్ర కలరూపుం దేల్ప కేనాఁటికిన్. 218

శా. "అలఁతన్ జెందకు" మంచు మిశ్కాదవు నిన్నుం దేవసద్ధర్మసం
చలితున్ దుర్గలితున్ దురాగతు దురాచారప్రచారున్ సభా
స్థలి కెక్కించి స్థలద్వచస్కు, గళదుద్యత్స్వాను గావించి లో
కులకున్ జూపి శిరోనగుల్ గొని కృపాంకూరచ్ఛటల్ నించి ని
చ్చలు రక్షించి యనుగ్రహించునఁట! తచ్చాతుర్యమున్ గంటివే? 219

మ. "అలఁతన్ జెందఁడు వేంకటాచల"మపాత్రాంతేవసద్దుర్మదా
విలనిర్భీకకృతఘ్నతాజ్వరభరోద్వేగప్రభావప్రభా
స్థలదాచారవచఃప్రచారవిలయాఖండౌషధప్రాయని
ర్మలనీహారమనోహరాత్మకృతిఁ బర్వంజేయ కేనాఁటికిన్. 220

శా. 'రాపుల్ పీడు' మటంచు మిశ్కాదవు ధీరమ్మన్యుని న్నిమ్న దు
ర్వ్యాపారున్ సభలోని కీడ్చి భవదారబ్ధాపవాదానృతా
లాపంబు ల్మొదలంటఁ గాల్చి పయి వాలాయంబు శిక్షించి నీ
పాపంబూడ్చి నతుల్ గ్రహించునఁట! తత్ప్రాగల్భ్య మూహించితే! 221

శా. 'రాపుల్ పీడఁడు వేంకటాచల' మసారస్ఫారఘోరానృతా
లాపాంతేవసదాస్యకర్కటవిశాలవ్యాధిదుర్వారచ్ఛహిః
ప్రాపత్తారతరావిలాంబుపృషదాపత్ప్రాపకాత్మీయవా
గ్రూపాసారపరంపరావిభవముల్ గుప్పింప కేనాఁటికిన్. 222

శా. 'డంబాల్ మాను' మటంచు మిశ్కాదవు ప్రౌఢమ్మన్యతాదోషమూ
ఢంబైనట్టి భవన్మనంబునకు వ్రీడన్ బుట్టఁగాఁజేయ ని
న్నుం బాండిత్యనిధాను లుండు సభయందున్ బట్టి రెట్టించి గ
ర్వంబు న్మాన్చి యనుగ్రహించునఁట! తద్వాత్సల్యమూహించితే? 223

శా. 'డంబాల్ మానఁడు తిర్పతిద్విజుఁడు' వ్రీడాశూన్యధన్యేతరా
లంబాలంబితగర్వధూర్వహదురాలాపానలాపస్వన
చ్ఛంబూకాయితనష్టధీకకృతచ్ఛాత్రప్రచారస్వరూ
పంబున్ బూర్తిగ రూపుమాపి దెసలం బ్రాఁకింప కేనాఁటికిన్. 224

ఉ. దవ్వులనుండి ప్రేలుటగు త, ప్పెదిరించి వచింత మీఁదులో
నవ్వులొ పువ్వులో? జగమునన్ మనకబ్బెడి, నందుకై మది
న్నెవ్వగ గూరనేని విను నీచతకున్ గుదురౌ ప్రసంగముం
దప్పుడు శిక్ష మిప్పటికి తద్దయు బొప్పెలుగట్టెఁజూచితే. 225

మ. అవమానంబున వేఁగుచున్నదిరొ! కట్టా? చాలుమూలమ్ములన్
దవులంబోని యవాచ్యవాచకములన్ దద్దన్ బ్రసంగించుచున్
భువి నెందుం దలపంపుగల్గు నరణిన్ బోనెంచుకన్నన్ హరీ!,
శివ! రామా! కరుణించి నాసఖు నెటో చీవాట్లు వైవంగదే. 226

మ. భగవంతుండవు నీవు, నీకొఱలు చెప్పంగాఁ బనేమయ్యా? నే
నగుదున్ శిష్యుఁడ వేంకటేశ్వరున కీయన్నంబు తచ్ఛిష్యతా
ధిగతంబే; యటులయ్యు నగ్గురువరున్ దిట్టంగనుంకించు నా
తెగువ న్నీ వఖిలమ్ము మున్ సయిచి వర్ధిల్లంగఁ జేయంగదే! 227

మ. చెలి యొక్కండు పురాకృతంబు కతిమిన్ సిద్ధించె; నవ్వాఁడు రోఁ
తలకున్ దింపె నధోగతింబడితి డెందంబూఱటం గాంచ ని
క్కలి యేరీతిఁ బోకాలు నీకరుణచేఁ గాకో మహాభాగ! యీ
తులువన్ దప్పులు సర్వమున్ సయిచి నిర్దుష్టాత్ముఁగాఁ జేయవే. 228

మ. పగఁ జూపం డిపుడేని దేశికుఁడు; తత్పాపద్వయిన్ జూడఁబో
వఁగఁ బ్రీతింగని ప్రోచుఁగాని, నొటులో వాపోయి వాపోయి యే
మొగమున్ బెట్టుక దేశికోత్తముపదమ్ముల్ చూడఁగాఁబోదు నో
భగవంతుండ! యుపాయమున్న నెఱిఁగింప న్నిన్నుఁ బ్రార్థించెదన్. 229

శా. అన్నం బేది భుజింపరే! యమృతవాగాలంబనప్రాప్తహా
సన్నం బన్నమె, సున్నమే మెఱుఁగుగాదా, దానికన్నన్ శివా!
బన్నంబందు మునింగితిన్ జెడితి నాపన్నున్ గురుద్వేషసం
పన్ను న్నన్నెటులో కృపాంబునిధనై మన్నించి రక్షింపవే. 230

శా. నాకన్నన్ గలుషాత్ము లెందఱో నినున్ ధ్యానించి పాపమ్ములన్
వీకన్ ద్రుంచి యధోగతుల్ గొనక నీవిఖ్యాతికిన్ సాక్షులై
శ్రీకిం దక్కక యీయిలన్ మెలఁగి పైకెక్కొందు లోకమ్ములన్
బ్రాఁకన్ గల్గి రటంచు వింటి; నటు నన్ బ్రార్థింతుఁ గాపాడవే. 231

మ. ఎఱుఁగన్నేరక తప్పుత్రోవలకు న న్నవ్వాఁడు పోఁద్రోచె న
మ్మెఱుఁగుంగూడ సహించి యిప్పుడయినన్ ముందైన సద్బుద్ధికిన్
దెరువుంగా నొనరించి దుర్గతుల వందింపన్ బ్రియుల్నింప కే
త్తెల రక్షింపఁగదయ్య నీకరుణ క్రమ్మందించుచున్ సమస్తాఘముల్. 232

శా. ఐదారేఁడులు వోవు దంచెఁ గలహం బారబ్ధమై; కృష్ణుఁ డే
సోదో గిల్కునెకాని శాంతికొఱకై చూడందు; నే నింట నా
మోద మ్మించుక లేని మోమున నఘమ్ముల్ వ్రేల నిట్లుంటి, నా
కే దేవీతని గోడు పాపఁగ లోకేశా! కృపాశాలివై. 239

మ. అని యెంతేనియుఁ వేఁడి వేఁడి మది కాంతారమ్మురా నిద్రగై
కొని స్వప్నమ్మున శిష్యుఁ డొకరు "నీకున్ దేశికాంఘ్రిద్వయా
ర్చనచేఁ దక్కఁ గమంబు నొల్లదుని కాళాపాశబంధమ్ముచే
వనిశంబున్ శివుఁ వేఁడి యేమి ఫల? మయ్యాచార్యు సేవింపుమా! 240

మ. ఎవరిన్ ధిక్కృతి చేసి నీ వఘముచే నిక్కైతివో, వారిచే
యవివేకం బఱఁజేసి వేఁడికొను మల్లంతన్ సుఖంబబ్బు నో
ము వికాసమ్మునఁ గొల్చుఁ జాతకశతమ్మం బోవు లోకమ్ములో
నెవరు న్నిగ్గని దూఱఁబోవకు మనోభీష్టంబు సిద్ధించెడిన్. 241

మ. "ఒకచో నొప్పియు నొంట రక్షయు" నెటుల్ యోగించు? నీ చేయు పా
తకమెల్లన్ గురుదూషణాత్మకము కాదా? దానికిన్ దేశిక
ప్రకటాంఘ్రిద్వయసేవ మారకమగున్, ప్రాల్మాలఁ గాఁబోకు నీ
కకలంకత్వమె కామ్యమైనయెడ నాయాలోచనం బట్టుమా. 242

మ. "గురువీడన్ జనుఁ గాక యోగ్యుఁడయినన్ గూటించి తిట్టంబనే
మిర? యోరీ! యనృతాత్మ!" యంచు నిను నమ్మ న్రత్యుంజయుండన్న ను
త్తర మొందున్నదె? యేల యిట్లు నిలమున్ ద్రస్యన్, శివున్ వేఁడఁగాఁ
గరుణింపం డతఁ; డేల వేఁడుము గురున్ గారుణ్యమున్ జూపెడిన్. 243

మ. హరుకోపమ్ము గురుండు దీర్చు, గురుకోపాటోపమున్ దీర్చ శం
కరుఁ డేమాత్రముఁ జాలఁ డీనుడి నెఱుంగన్ జెప్ప నీ దేశికుం
డర రే! యూహింతువెల్లఁ బోవిడిచి "దేవా! నన్నుఁ బ్రోవంగదే!
పరమాత్మా!" యనినంతనే శివుఁడు నిన్ బాలింప నేతెంచునే. 244

మ. శివుఁడేమీ! యవివేకియే, యతనికిన్ "నా" న్సింతయున్ లేద? "మె
చ్చి వరంబాతఁడు కూళరక్కసుల కిచ్చె న్నన్ను రక్షింపఁడే?
యవివేకాత్మ" యటంచు నెంచితివొ? గుర్వాక్షేపకుం డెవ్వఁ డా
శివుచేఁ బ్రోవఁబడెన్? వచింపు మొకనిన్ జేయెత్తి యున్మత్తుఁడా. 245

శా. 'కాకం' బేమిటి? 'తీతు' వేమిటి? వృథాకాలంబుల్ ప్రలాపించి యీ
శోకం బేటికి నేఁడు? పేర్లిడితి వెదో శోకించి యుద్దేమగున్?
వాకుల్ జాతిరి వేడ్కైటిన్ దుదకు "దేవా! ప్రోవు" మన్నన్ శివుం
డూఁకొట్టన్ వెతివాఁడె? యింత యవివేకోద్రేకముల్ సైఁచునే. 246

మ. గురుఁడే తండ్రి, గురుండె దాత, గురుఁడే కర్త్రాత్మ సంహర్త, దే
వరయున్ శ్రీగురుఁడే, గురున్ దెగడి దేవళ్ల న్నుతింపన్ వృథా
యుఱుపుల్ వారు గణింపఁబోరు; చను మయ్యాచార్య సేవింపు మూ
ర్ఖర పత్రింపుము శీర్షమెత్తికొని పాపంబెల్ల పోఁబెట్టఁగన్. 247

శా. ఈలీలన్ జనటొవ్వ లేనియెడ ముక్కట్టులే దబ్బులన్
వాలాయమ్ముగ నిల్కుమన్ కెర మహాభాగమ్ము వాంఛింపఁగాఁ
నోలిన్ గాలము సర్వముం గడపి శాస్త్రోక్తప్రకారమ్ముగాఁ
బాలింపన్ జనుమీ! యశంబో? సుకృతప్రాగ్భారమో? యన్యమో? 248

శా. నాకుం దోఁచినరీతి శాస్త్రగతికిన్ భంగమ్ము లేకుండ, ధ
ర్మైకాయత్తులు మెచ్చురీతి భవదీయాంతర్గతిన్ బట్టి నీ
శోకం బాఁగు నుపాయము న్నుడివితిన్ శోధించి; నీ పుత్రు ను
ద్ధీకున్ బట్టక వేగ బాగుపడుమీ? దేబయ్యవై పోకుమీ!" 249

మ. ఇటు బోధించినయట్టులై నిదురమత్తెంతోఁ జనన్ మీఁద ప్ర
స్ఫుటముల్ విచ్చి దిసల్ గనుంగొని తనున్ బోధించు సత్పూరుషుం
డట లేండున్ గనరామి "స్వప్న" మని తానద్దాని భావించి య
ప్పటి కాయోజనతోడ నుండె గురుదేవద్వేషదోషార్తుఁడై. 250

శా. లోఁ "దప్పం"చు నెఱింగి, పై కఘపుజల్లుల్ వీఁక వర్షించున
న్మాదిన్ శిష్యునెఱుంగుఁగాక జగ, మంతస్తాపముం బట్టియే
పోఁదోలియన్ బ్రియతింతుఁగా కఘము శంభుండాదియౌ దేవతల్
వాదంబిద్యది శిష్యశాసకముగా వర్ధిల్లుఁగా కల్లెడన్. 251

ఇది శ్రీ కింకవీంద్ర.........
తిరుపతివేంకటేశ్వర కవి ప్రణీతమ్మగు
గీరతమ్మన లోకాభిరామాయణము
సంపూర్ణము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 3 | 25 | పోంపిరివోఁగా | పొంపిరివోఁగా |
| 4 | 9 | ముంచిర | ముందఱ |
| 13 | 4 | కట్టిడి | కట్టిఁడి |
| 18 | 10 | బూతుఁగూఁతల | బూతుఁగూఁతలం |
| 22 | 20 | ప్రగ్గడ | ప్రెగ్గడ |
| ,, | ,, | పాఱులు | విప్రులు |
| 26 | 27 | కురుకూలా | కురుకులా |
| 29 | 11 | కూఁతు | కూతు |
| 36 | 22 | వీకణ | వీఁకణ |
| 37 | 10 | సైపకే | సైఁపకే |

మఱియు 35 వ పుటలో మొదటి పద్యమున మూఁడవ పంక్తి చివరనున్న ‘లో’ యను నక్షరమును ‘ని’ గాఁ బఠించి నాల్గవ పంక్తి వదలివేయఁ గోరెదము.

లోకా.

# ఉపోద్ఘాతము

(ప్రథమ ముద్రణము)

---

"పుణ్యం కర్తుం గతవతి జనే పాప మభ్యాయతీతి"

'కాళీసహస్రము'

చదువరులారా !

"పుణ్యానకుఁ బోయినఁ బాపమెదురయ్యె" ననుసామెత నెఱుఁగనివారే లేరు కదా! ప్రకృత మీ గుంటూరుసీమలోని చరిత్ర మంతయు నీసామెత కుదాహరణమే యగు నని తుట్టతుదకు మీరే నిర్ణయింతురని మానమ్మకము. శ్రీకొప్పరపు సోదరులు గంట కిన్ని వందలు చెప్పిరి, అన్ని వందలు చెప్పిరి, కడుఁ జురుకుగాఁ జెప్పెదరు, లోకగురుసంశయములను బత్రికాముఖమునను, ఆప్తులద్వారమునను విని ప్రథమమున వారిధారావిషయమున నా కొక విధమైన యక్కజమును, అవిశ్వాసమును జనించి యొక్కపరి ప్రత్యక్షములోఁ జూడ వేడుక పుట్టినది. ఈ వేడుకకుఁ గారణము, నేము గూడ నాశుకవుల మగుటయు, ఐనను వీరిని గూర్చి వ్రాసెడి వార్తలలోఁ గన్పట్టు నన్నివందలు చెప్పియుండకపోవుటయు, నిజముగా సోదరు లట్లు చెప్పుదురా? చెప్పుదురు గాక, అవి కవన మను పదమునకుఁ దగియుండునా? అను సంశయము గలుగుటయునని యెఱుఁగునది. 'సంశయ మున్నప్పుడు మిన్నకుండక బందరుకు రప్పించి వారిని బ్రత్యక్షములోఁ జూడనెంచనేల' యని మీరు శంకింపవచ్చును. మీశంక యుక్తమైనదియే కాని ఈయంశమును మాకు వ్రాసినవారిలో నొకరద్ద ఱట్టివారుగా నున్నారు. పత్రికలలో నాయా యీ పెద్దమనుష్యులు నటించి చెప్పిన పద్యములు 'పరగుణ పరమాణూన్ పర్వతీకృత్య' అను భర్తృహరి వచనమున కుదాహరణములు కావచ్చు ననుకొన్నను బరిమాపుణులగువారు మాకు వ్రాయు నుత్తరము లట్టివని కొనుటకు మన మొప్పుకొన్నదికాదు. ఆ వ్రాసినవారిలో నొకరు బందరునివాసులును సంస్కృతాంధ్రహిందూణభాషావిశేషజ్ఞులును నగు, మ॥ రా॥ రా॥ శ్రీ కొలను త్రివిక్రమరామారావుగారు. వీరు బి. యే. పరీక్ష ప్యాసుచేసి బందరు

నోబిల్ కాలేజిలోఁ గొన్ని వత్సరము లుపాధ్యాయపదవిలో నుండి పదపడి బి. యల్. చదువుకొనుటకు గాఁ జెన్నపురికి వెళ్ళియున్నకాలమున శ్రీకొప్పరపు సోదరు లక్కడకు దయచేసియుండిరి. వీరి యాశుధారను వారు ప్రత్యక్షముగా జూచి యుత్తరమును వ్రాసిరి. వేదూరి ప్రభాకరశాస్త్రి గారికన్న ముందె శ్రీకొప్పరపుఁగవులనుగూర్చి నుతింపుము...

"మున్ను నా, తిరుపతి వెంకటేశ్వరులఁ జెప్పెదఁ దిమ్మట నిమ్ముఁ జెప్పెదన్"

అని వాక్రుచ్చిన సంగతిని శశిలేఖలోఁ జదివియుంటిని. దానిచేఁ గొంత విశ్వసించుటచేతనే 5 వ పుటలో నుదాహరించిన పద్యమును జెప్పితిమనియు వారిని సగౌరవముగ నాహ్వానించితి మనియుఁ బాఠకులెల్ల నెఱుఁగుదురు గాక. ఈయాహ్వానానంతరము శ్రీరామారావుగారి యుత్తరము వచ్చినది. ఆయుత్తరమును మేము కృష్ణాపత్రికకిచ్చి ప్రకటింపఁ జేసితిమి. ప్రకటించునప్పుడు పత్రికవారు తుట్టతుద నున్న కొన్ని పంక్తులను దీసివేసిరి. ఆపంక్తులలోని యర్థము మాత్రమే మాకు జ్ఞప్తియం దున్నది గాని సరిగా నక్షరములు జ్ఞప్తియందు లేవు. శ్రీరామారావుగారు శ్రీసోదరులనుగూర్చి వ్రాసి వ్రాసి చివరకు గాని 'హనుమంతునిముందఱ కుప్పిగంతులు' అను సామెత నుదాహరించి 'ఈవిషయము తమ కొక లెక్కలోనిది కాదు. ఐనను మాయానందమును జిన్నదిగా దినందున కన్నా తలంపకుందురుగాక' అనునర్థ మిచ్చునట్లు వ్రాసి యున్నారు. ఆయుత్తరముగూడ నిందుదాహరింపవలసినభాగము లేనిదిగా నున్నను ఇక్కడిదిగ్రంథ విస్తరమగుటచేఁ బ్రకటింప లేకపోతిమి. కావున వలయువారు 1910, 1911 సం॥ కృష్ణాపత్రికలు చూడఁగోరెదము. ఇటీవల రామారావుగా రొకపరి చెన్నపురం నుండి వచ్చినప్పుడు కార్యవశమున మేమును వారును కృష్ణాకార్యస్థానమున కేగితిమి. అప్పు డాయన తమ యుత్తరములోని కొంతయంశమును దీసివేయుటను గూర్చి చాల నిష్కర్షగాఁ బ్రసంగించిరి. అది యంత యావశ్యక మని మేము భావింపలేదు. ఏమంటిరా? ఆయుత్తరము శ్రీసోదరుల మాహాత్మ్యమును దెల్పుట కేర్పడినది. వారియందలి దయయో అభిమానమో యేమో యాయుత్తరమును మాచేఁ బత్రిక కెక్కించినది, అందులో మాయౌన్నత్యము కూడ నేల ప్రకటింపఁబడవలెను, తీసివేసినవారే సదాశయముతో దీసివేసినను మాకదిసమ్మతమే యయ్యెను. ఆమాటలున్నచో సోదరులు చాల గొప్పవారనియు, తి॥ వెం॥ కవు

లంతకన్నను గొప్పవారనియు లోకులకుఁ దోఁచు నని యే కదా! మేమభిలషింప వలసినది. ఆయభిలాష మాకప్పుడే కాదు, ఇప్పుడును లేదు, దాని నటుండనిచ్చి శ్రీ మా కొప్పరపు సోదరులకును మాకును గల యనురాగసంపత్తిని గూర్చియే కొంత ముచ్చటింతము. శ్రీ సోదరులను మేము ప్రీతిపూర్వకముగా నాహ్వానించిన పిమ్మటఁ గొంతకాలమునకుఁ బత్రికాముఖముగా మమ్మును గొంత భూషించుచు నదిగా నిప్పు డెంత తీవ్రముగా దూషించుచున్నారో అంతకు మున్ముందుఁ గథకముగా భూషించుచుఁ బెద్ద సమాసములను బెట్టిన పద్యములను వ్రాసి తుట్టతుదకు వచ్చుటను సూచించిరి. వచ్చినప్పుడు వారికి గాఁదగిన సమ్మానాదికమును గూర్చి బ్ర॥ శ్రీ॥ రావుబహద్దరు పురాణం వెంకటప్పయ్య పంతులు గారు, శ్రీ గౌరీనాథశాస్త్రులవారు, లోనగు పెద్దలును హిందూ హైస్కూలు విద్యార్థులను పిల్లలును సాక్షులే. కాన విస్తరింపఁ బని లేదు. ఒక మనవి; జరుగని విషయము నింతమాత్రము వ్రాయుటయు నిష్ప్రయోజనమే యని మీకుఁ దోఁచవచ్చును. అట్లు తోఁచుట యుక్తమే కాని యీసమ్మానము సోదరులు నిక్కముగా దయచేసినచో నిప్పుడేని జరుగఁగలదు ఎఱిఁగియో, యేలుఁగవారు మొదటి యాహ్వానములో వారికి శతావధానమందుఁ గూడ సమర్థులని మేము వ్రాసియుంటిమి నిజ మిట్టేవలఁ దెలిసినది. దానిం గూర్చి యీ క్రింది పద్యములు విస్పష్టముగాఁ జెప్పఁగలవు.

( 1912 సం॥ మార్చి యేప్రిల్ 3-4 సంచికల అభినవసరస్వతి నుండి. )

బ్ర॥ శ్రీ॥ జానపాటి పట్టాభిరామశాస్త్రులవారికి — తిరుపతి వేంకటేశ్వరులు నమస్కారపూర్వకముగా వ్రాసికొను విజ్ఞాపనము.

1912 ఫిబ్రవరి సంచిక యగు మీ అభినవసరస్వతిలో మ॥ రా॥ రా॥ కొప్పరపు సోదరకవులు మీ పేర వ్రాసిన యుత్తరమును బ్రకటించి యున్నారు. అందు నుంతయేని మా ప్రసక్తితో నవసరము లేకున్నను పి. "తిరుపతి వేంకటేశ్వరు లట్లు మముఁ దిట్టి" అని యొక తుట్ట మాపై మోపియున్నారు అందు మీఁద నీ క్రింది పద్యములు వారినిగూర్చి వ్రాయవలసి వచ్చినవి. వీనిని మీ పత్రికయందుఁ బ్రకటింప వేఁడెదను.

ది 5-4-12 తిరుపతి వేంకటేశ్వరులు.

# హితోపదేశము

---

మ. అకటా! 'మమ్మును దిట్టి దెప్ప'రని నేఁ డాత్మన్ విచారించు మీ
వికలత్వం బది మా మనంబు మిగులన్ వేధించెడి; న్నాఁడు తీ
రికదా! చక్కఁగ నుండలేక యొకరో వ్రేసేప మీయంత మీ
రెకసక్కెమ్ములకుం గడంగితిరి; మేలే కొప్పరంపుం గవుల్! 1

శా. పశ్చాత్తాపముఁ జెల్సినంగులకు మీ భావంబు మెచ్చంగనా;
దుశ్చిత్తుల్ క్రమముఁ దోఁసి, దప్పు డెడయున్ దోఁపంగఁబోదర్యా; నం
తశ్చాంచల్యము బైట వేసితిరి చింత ల్సేయ నేమియ్యెడన్?
నిశ్చింతంబుగ నుండ కిప్పు డిది చన్నే కొప్పరంపుం గవుల్! 2

మ. కలదేమో కలపించుఁ దృష్టిపడ కెక్కాలమ్మునన్ లేని క్రొ
త్తలకున్ యత్న మొనర్చి యిప్పు డిటు చింతామగ్నులై సాటి పు
మ్మల దూషించిన నేమి లాభ? మెటు తప్పున్ బమ్మ వారి? లేరు మి
మ్ములఁ బ్రేరేపిరొ వారినే యడుగు టొప్పుం గొప్పరంపుం గవుల్! 3

శా. మాకుం గావలెనేమి మీ గొడవయున్ మాన్యంబు మీ కైతయున్?
లోకుల్ ల్యాకులు, సత్య మెట్లో యయబుకున్ లోలోన నేవారలే
వాకు ల్గోకిన లేని శక్తి గను నెవ్వాఁ? డెందు నిర్వాతు వీ
చీకున్ జింతయుఁ దెచ్చుకొంటి రిటు లేసీ! కొప్పరంపుం గవుల్! 4

మ. మొగమేనిన్ గనకుండఁ బత్రికను ము న్మన్నేము పిరకంపి ఫే
ర్మి గనన్ జేసితి మంతలో నిముడ కేలేఁ బ్రేరణం జేయ నే
తగవో యెల్ల రసీ యనందగిన దంతం దెచ్చికొన్నారు పూ
ర్తిగ హితోపమె మీకు నష్టి నొడఁగూర్చెం గొప్పరంపుంగవుల్!

శా. మీవారందఱుఁ మమ్ముఁ దిట్టినను నెమ్మి న్మిమ్ము భూషించినన్
మావారందఱుఁ మిమ్ముఁ దిట్టినను గ్రిన్నన్ మమ్ము భూషించినన్ 6
జేవ ల్లేనివి వచ్చునే యకట! నుల్కీ మించు సామర్థ్య మే
మీ, వాసిన్ జెడు టేమి? వేకొకరి బల్మిన్ గొప్పరంపుంగవుల్!

మ. దిగుమంచున్ బలువంది జెప్పుదురు 'జిద్దీ' యంచుఁ దాళమ్ములన్
దగ వాయింతురు, లాభమేమి? చెడువా ర్దారేరునుంగాను మీ

రిఁగనేని న్నిజమెప్పికొందు మముఁగాదే శిష్యుఁగాదే కవి
త్వగతిన్ బోలెద రేరినో తెలుపుఁ డప్పా! కొప్పరంపుఁగవుల్!

మ. బిరుదుల్ మున్నపటికన్న హెచ్చె నచటం బెంపార నూఱింటికిన్
దెఱఁ గొప్పంగ వధానముల్ సలుపలే దింద్రింపఁగాఁ బూను టె
ప్పరు విన్నన్ నగరే? మదిన్ గనుఁడహో! 'పంచాశదు' ల్పేరులే
కలవా? పెట్టికొనండు వ్రాసికొనుఁ డింకన్ గొప్పరంపుంగవుల్! 8

శా. "పర్బారం" చొకపత్రిక న్లిఖిపి సత్యమ్ముల్ మముల్ దిట్టుచుం
"బార్బారు" ల్ప్రకటించు సోదరులు మీమాంసల్లఘుప్పెంతు రం
తర్బాధల్ దొలఁగింతు రూర కిటు చింతల్ సేయఁగానేల? మీ
"గ్దర్బారుఁ" గవు లైతి రాఁగుఁడిఁకఁ జింతల్ గొప్పరంపుంగవుల్!

శా. ఏమేన్ వ్రాయుఁడు మీరు మీయనుఁగు, లింకేనిన్ స్వశక్తిప్రభా
భూమత్వంబు లెఱింగి వర్తిలుఁడు తప్పుం గోనలన్ బట్టి తా
రే మాన్యుల్ మిముఁబట్టి మమ్ములను నెంతే దూఱుచున్నారో మీ
రామాన్యాత్మల మదలింపుఁడు యశంబొఁ గొప్పరంపుంగవుల్!

మ. మము వాగ్దూషణ చేసినంతట నె యేమాన్యుండు మాకన్న మీ
రు మహాభాగు లటంచు నొప్పికొనఁ డేరో మీ స్వశాఖాప్రజల్
గుములై పైకనుచుంద్రు లోన నలవా గ్రాహ్యన్నిజం బెంతు ర
క్రిముమున్ మానస మొప్పికో దెఱుఁగుఁడింకన్ గొప్పరంపుంగవుల్!

శా. ఏవో దుర్జనహేతుకం బగుచు మా కీమధ్య నేర్పడ్డ దే
వాదో, యంపట నేమి సత్పథము దప్పం బోఁడు; మీమాకలా
ప్రాదుర్భూతిని రామరాట్సుకవి తత్త్వజ్ఞుం డతం; డాతనిన్
బ్రోదిన్ జెప్పు మనుండు సర్వమును జెప్పుం గొప్పరంపుంగవుల్! 12

శా. వారున్ వీరును జెప్పనేల? "యకటా! వంచించి మమ్మిందు నే
వారోదింపి" రటంచు మీ రనిన యవ్వాక్కుల్ ప్రవిం బట్టనా
రేరో చెప్పిరి వారు మీగురులె, పేరిందేల వాక్పుప్రివ్వ; మీ
సారం బొండొరులేల చెప్పవలె నిచ్చ ల్కొప్పరంపుంగవుల్! 13

మ. సరియౌ కీర్తిని గోరువాఁడు గురు నిచ్చ ల్గొల్చి తత్పాద ను
స్థిర తాత్పర్యము మైఁ గళాగ్రహణ మెంతేఁ జేయుటొప్పన్ పృథా

చు, వ్వానాఁటికి బుద్ధి గల్గెడి నటంచున్ మేము భావింప నే
మన్నన్ లే దభివృద్ధి చెంద దకటా ! మాంద్యంబు సాంద్రంబుగన్.

శా. మేమే కా దిటు లెంతమందియొ, సదా మిన్నంది దూషింప ను
ద్దాముల్ వీరిని మందలించి రెవరిన్ దా మింత లెక్కింప కే
మేమో తిట్టుచు వ్రాయుచుందు రకటా ! యీ వేని యవ్వారికిన్
ధీమత్వంబు నొసంగు మంబ ! యటుపై ధీజాడ్యముల్ వోయెడిన్. 318

శా. చల్లా పిచ్చయశాస్త్రి నీతి గఱఁపెన్ జాజ్జ్వల్యమానప్రభా
కల్లోలాకులమైన పద్యతతితో గాఢాగ్రహోదగ్రుఁడై

---

ఉ॥ రాజును బట్టుకొన్న పయిరాష్ట్రజనుల్ చెలరేఁగితిట్టు నా
యోజను మీరియొనర్చు పనులున్నవి శాఖకుఁ గీర్తిదెచ్చు నే
యీజతనంబులం గలుగునే ! పయి పెచ్చుపకీర్తిఁ దక్క నా
హా ! జగమెల్ల గుడ్డిదనియా ? సకలమ్మునకుం దెగించుటల్.

(విస్తరము "పశ్యాం పుశ్యాం" లో చూడుడు)

తిరుపతి వేంకటేశ్వర స్తవము

(1912 వ సం॥ సెప్టెంబరు 9వ సంచిక అభినవసరస్వతినుండి.)

శా॥ "వెంకన్నా !" యనునంత లోటగునె నీవిఖ్యాతి విద్వచ్ఛమూ
సంకాశస్ఫుటవైదుషీభరితవాచాచాతురీశ్రీచిరా
తంకప్రోత్థమహాశుసంఘటితపద్యజ్వాలసద్ఘంటికా
టంకారమ్ముల నాలకించి చనుబండల్ వేంకటేశప్రభూ!

మ॥ తలవ్వాంచి కరమ్ముల న్మోగిచి పాదద్వంద్వముం బట్టి త
ప్పుల సైరింపుఁడు మీకు దాసులముగామో యంచుఁ గాఁ జెప్ప ద
బ్బలకాసించెడి వారిఁ జూడకయె గప్పాల్గొట్టి ని "న్నేడుకొం
డలవాఁడా !" యన నీ యశోరమకు లోటా ? వేంకటేశప్రభూ !

శా॥ అంకెల్వేసిన లాభమా ? మిగుల బారల్సాచినన్ లాభమా
బింకాల్గొట్టిన లాభమా ? వెడనుడుల్ ప్రేలంగనే లాభమా ?
జంకున్వీడి ముఖాముఖిన్ గనవలెన్ సామర్థ్య మామీఁదటం
జంకల్గొట్టవలెన్ 'బలీ !' యన బుధేశా ! వేంకటేశప్రభూ !

శా. జంకుల్గల్గఁగ నొక్కవే, కడలినిచ్చల్ దాఁటుచో రెండువే
ల్లంకం జేర్చిన మూఁడువేలని కపుల్లాంగూలముల్ ల్సాచి ని

పిల్లుల్ వోలెఁ దదీయధాటి కొకటన్ బెంపేది వాచాటకుల్
చల్లంగా నొదుగంగఁ జొచ్చిరి వదసార్సంబు దూరంబుగన్.

---

శ్వంకట్రొక్కిడి యాఁబువేలయిన నీసౌమ్యత్వముంజూపి వే
ఱెంకాయల ల్బలివెట్టువారలఁట వింటే! వేంకటేశప్రభూ!

శా॥ అంకమ్మన్భజియింతురో, యటులుగా కొండమంగొల్తురో
కంకాళిం గనఁబోదురో, మఱియు మేఁక ల్క్రొంగు దేవర్లకుం
గైంకర్యమ్ములఁ జేతురో! హరిహరీ! కాకున్న లోకత్రయిం
బంకాఁజేసిన నీకెటుల్ శిపములప్పా! వేంకటేశప్రభూ!

మ॥ ఎటనో మూలనుగూరుచుండి తనపే శేమూలనో దోపి ప
ట్పుటఁ బండ్లూరక పిండిఁజేసికొని కంఠస్థాభిమానమ్ముతో
గుటక ల్మ్రింగుచుఁ దొంటి వాగ్రితలకు సంకోచింపకే లేచి చ
ప్పటులంగొట్టఁగ నీకు లోటగునె యప్పా! వేంకటేశప్రభూ!

ఉ॥ ఏడనో కొండనుంటివని యెంతురుగాదె కపీంద్రులెల్ల న
ట్లాడెదు కొండలన్ని తునియల్పొనరించు టెఱుంగరైరి మో
మోడి భజించువారలను బ్రోతువటందురు కాని నెత్తిబొ
చ్చ్యాడఁగఁ గొట్టుచుందు వని యూహ యొనర్పరు వేంకటేశ్వరా!

చ. తెలియఁగలారె యెల్లరును దిర్పతితో వసియించియున్ జగం
బులఁ గలజీవరాసులనుబొంది జగానిగలీను కీలుబొ
మ్మలవలె నాడఁజేతువని మాటికిమాటికి నోటితీటచే
గలబిలసేయుచున్ శివముగాఁ దలపోతురు వేంకటేశ్వరా!

మ. పెసలే చాకగనున్నవో! యకట యాబెల్లంబె బల్పాకయో
నెసఁ దమ్ముం గడతేర్చి యెల్లపుడు దోర్వీర్యంబు సంధించుచోఁ
బొసఁగం జాలివయంత నీకు వడపప్పన్ పానకాల్సేతురం
ట! సెబా సెంతటిమాట వింటిమయ కట్టా! వేంకటేశప్రభూ!

మ. కరముల్దొప్పలు సేతురంట! మదిలో గర్వంబు లేదంట! గు
ర్గురలేమూలను లేనెలేవఁట! పరాకుల్ తెల్పువారంట! త్వ
చ్చరణాంభోరుహచంచరీకులఁట! మీసాత్త్వికులేరంట! యా
వరముల్ కావలెనంట యేమనెదు? దేవా! వేంకటేశప్రభూ!

ఇట్లు, చల్లా పిచ్చయ్యశాస్త్రి.

క. * సుమనోఽవతంసకృతికర్త మహాభాగుండు సుగుణరాశి యితఁడు స
ర్వము నెఱిఁగి మందలించిన, క్రమ మంబరొ! సర్వసుజనగణ్యమకాదే.

ఉ. వంగిపురాన్వవాయు పటువంటి మహాత్ముని గూడ సుంత పే
ర్మిం గన రీప్రబుద్ధులు సమిద్ధపరాక్రము లంబరంపువీ
థిం గడు దూఁకులాడుదురు తేఁకువ కొండొకయున్నఁ గాద చె
ప్పం గలవారు చెప్పుటయు వారక వింటయు నోమహేశ్వరీ! 231

(* శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు. బి. యే. యల్. టి. గుంటూరు కాలేజీసహోపాధ్యాయ విరచిత "సుమనోఽవతంసము" నుండి.)

క. శ్రీనాథుం డిల సత్యము, నేనాఁడును బ్రోచుచుండ నింపుదలిర్పన్, ధీనిధి సత్యవిమర్శన, చే నెగడుచు నుండుఁగాత శిక్షితమతియై॥......చ॥......గుం, టురిపుర వాసులార! వెగటుం బడ కీసు వినుండు సాధు స, చ్చరణసరోజ సేవనల సత్సుమనస్సులు కింకవీంద్రది సం, ధురపృథుదేహనిస్సరదనూనమదాపహృతి ప్రభూత సు, స్థిరనిరవద్యదిశ్వలతిదివ్యవిభూషణనవ్యశస్స్ఫుర, త్తిరుపతి వేంకటేశ కవిధీరమృగేంద్రుల చెంతఁ జేరి సా, దరమతి విద్యనొంది కవితాపరికల్పనచాతురీ ధురం, ధరుఁడయి...వే, లురి శివరామశాస్త్రి బుధలోలుపమానసపద్మఁ డప్పె గుం, టురిపురికాలెజీ కవివినోదనపూరుషసంఘమందు దు, ష్కరనిజధీవిలాసకృతిచందములెల్లను జూసి శారదా, పరమపవిత్ర విగ్రహవిభాసితకాంచనముద్రి నందుడున్, సరితతి మోదవర్ధననినాదసముచ్ఛయపూర్వకంబుగా, వరశకటాంతరంబున విభాసిలఁ గూరిమినుంచి యాబుధున్ బురి రమణీయవీథులను బొల్పుగ నుత్సవమొప్పఁ గాలెజి, సరసకవార్థులెల్లను ప్రసన్నముఖుల్ విహరింపఁజేసి చే, కరి నిజమండరాళి 'భళిరే' యని పెద్దలు మెచ్చుచుండ; న, ద్దిర! మఱునాఁటి రాతిరి హృదిం బురికొల్పు కుతూహలంబుమై, సరగునఁ బాకశాస్త్రవిదు సౌమ్యముఖాశ్వవరాఘరూఢు సుం, దరముగ నూరఁద్రిప్పిరి వృథా వ్యయమెంతయొ చేసి కొంద ఱెం, వ్వరొ; సుమనశ్శ్రవఃకుహరపాటనమౌఁ గద దీని విన్న; న, వ్వరొ బుధసంతతుల్, శ్రుతికిఁ బర్వమెకా యని మెత్తురొక్కొ! చే, సిరొ లఘుతాలఘుత్వ పరిశీలన సన్మతు లెట్టులెప్పుడేన్? సరసతఁ బాకముల్ నవరసంబుల నొప్పఁ గవీంద్రపాచకుల్ పరఁగఁ గృతుల్ రచింతు రని వారల సామ్యము చాటియుండ్రొ! యే కరణి నలంకృతుల్ గుణనికాయము శ్రావ్యమనోహరధ్వనుల్, విరివిగఁ గల్గియుండి కవిబృందమనోహరమై చెలంగు నా, వరకవితాతనూజఁ గను భాగ్యము పాచ

శా. కార్యాకార్యవిదుండు సూనృతవచఃకైవల్యపాథోధిసం
సార్యగ్రేసరుఁ డాంధ్రహూణముఖభాషాశేషుఁ డీకృష్ణమా
చార్యుం డూరక పాత్ర మొందు విరచించన్ దీరి కూర్చుండెనే
ఆర్యుం డెన్నఁటికిన్ సహింపఁడుకదా! అన్యాయధన్యాత్ములన్.

---

కుఁ డంద సేర్చు? ని, ట్లరయక లోకగర్హ్యాకృతి హర్షముతోఁ దిలకింప
న్యాయమా?, అరుదగు శేముషీమహిమ కక్కజమందుచు విద్వదర్హ స, త్కార
ణము సేయ దోషమె? బుధప్రవరాళి నికారసక్తులన్, విరసమనస్కులన్ గురు
వివేకరమాధ్యులు "కూడ పిట్టి తుం, టరిపను లంచు గొబ్బున జనంబులు మెచ్చ
నివారణంబు సా, కిరులయి చేయకుండ రది కేళి విలాసముగాఁ దలంచి......
విమర్శ సేయుచో నొరులని యస్మదీయులని యొప్పనిభేదము లెన్న బుద్ధి స,
త్వరమయి న్యాయపృక్పటిమ వాయుచు స్వీయజనాళికృత్య మం, దరసియుఁ
గాన దొక్కెడ నెరమైనను; జూచిన నర్మ మంచనున్, బఁకృతియం దనేక
గుణవారము దోషవితాన మంచొగిన్, మురుసుఁదనంబుతోఁ బశికి నొసపు
శేశము గొప్పఁజేయు; నీ, పురి విపరీతవార్త వినఁబోలును; దాన నెజేంగి
ముప్పద, స్సరసత సద్విమర్శనము సల్పుము మిత్రమ! అద్ది యేది యం, చరయ
నియోగివైదికుల కక్కట! పోరు సముద్భవిల్ల నొండొరులు ప్రభిన్నమార్గు
లయి యొప్పగఁగూడరు వైదికక్రియా, చరణము నందు; వాక్కలహచండత
ద్వేషము పెద్దసేయ నా, గిరఁట; నియోగి యాశుకవికిం దిగు కారణ మేమి
లేకయే, పరు లవధానులిద్దఱు సభన్ దమ నైపుణి చూపుచుండ, నా, సరసని
పీఠముంచి రది 'సత్సభ గూడను గూడ' దంచు ను, ద్ధుర కలహంబు హెచ్చు
డు "ఘనావరులెక్కఁగఁ బల్లకీని నె, వ్వరితరు లెక్కఁగోర" రనివల్కెడి
నిద్దఱిలోన నొక్కఁ డం, దఱు వినుచుండ; నైనను వృథాగఁ దదాసనచర్చ
మానకుం, డిరి; మది నొవ్వఁగా నతఁ డనెన్ "ఘన చెంగటఁ బీఠమందు నె,
వ్వరును నఁ గూరుచుండఁ దగు పండితుఁ డయ్యెడి నీతఁ"డంచుఁ దీ, వరపడి;
యంతనంత శుశ్రితి పాటనకారివచోహతాత్మలై, య
తిగిరనంగఁ గొందఱు రయంబున నాశుకవీంద్రి
తోడఁ జే, రిరి గృహముల్; నిజాతిశయరీతుల నాశుకవీంద్రుఁ డంత రా,
తిరి ప్రకటించెఁ బత్రికలఁ దేఁకువ నాడెఁ దెలుంగుమీస మి, ర్వరు నిలుపుం
డటంచు, నెగఁబోసిరి లేఖలపైని లేఖలన్; బురజను లెల్ల రుండఁగ నమోఘు

ఉ. ఈయనఘున్ వచించుటయి నింకొకనిన్ వచియింతు రప్పురిన్
ధీయుత యోగ్యతాగరిమఁ దేఁకువ లోఁకువగాని శక్తి; గాం
గేయునికేని లోపము లగింపఁగఁ గొండొక వచ్చు, నీయుపా
ధ్యాయునికిన్ బి. యే. ఎల్‌టి. కంబరొ! లేదు కళంక మెయ్యెడన్.

---

విదగ్ధవచశ్శరార్భులన్, మరలఁగఁజేయువానివలె మాటలుచెప్పి యథార్థవాది మ, త్సరమును బెంచె;నిట్టి కవిసంగర మాఁపఁగ నెంతవారికేన్, దరమ! వివేకవం తులు వితాకువడం గడు వృద్ధియయ్యె...స్థిరగురుపక్షపాతమె విశేషవిరోధమె కల్గియున్న హా, త్సరసిజ మెట్లు కల్మషదశం గనఁగల్గు నిజానిజంబులన్...సర సతమీఱు కృష్ణఘనుసన్నిధినిం గవిహంసలొప్పి సు, స్థిరయశ మందుచుం బద గతిన్ భళి చూపిరి" యంచుఁ గొంద అం, దురు; "నిజ మిట్టు లుండునె? వినోదపదం బని హంసలెన్నఁడేన్, సరసతి మీఱు కృష్ణఘనుసన్నిధి సంస్కృత పాదనృత్యచా, తురి నెటు చూపు? ...... పూర్వమందె త, ద్విరచితమైన వర్ణన లతిత్వరఁ బాడి" రటంచుఁ గొంద అం, దురు; 'నలుదిక్కులన్ వెలయు దొడ్డయశస్సు గణించు ధీప్రభన్, వఱలు శతావధానులఁట బాపురె యంచు జగంబు మెచ్చఁ జా, పిరి తమనేర్పు వీనులకు విందుగ' నన్న యథార్థవాది బా, గరయక దోషతండమునె యల్లనఁ జూపును, సత్యవాది మా, యురె! గుణ మెంచ కెంతయు మహోగ్రతతో శివరామపండితున్, ద్వరపడి దూఱి సాహ సము తద్దయుఁ జేకొని మాటకారియై, "గురులు సహాయులౌచుఁ దన కొంకును మాన్పెడి భారమూన దు, స్తర మగు ప్రశ్నలన్నియు నెసన్ సభపెద్ద నిరాక రింపఁ డెం, పరియయి సల్పెఁ జక్కఁగ నవారణలీల శతావధాన" మం, చొరు లు నగంగ జాటెడి నయోగ్యపు దబ్బఱ లెన్నొ! ...................శతావ ధానిధీపరకృతి వర్ణనీయ మని పండితు లిట్లన సత్యవాది, సాకిరియయి కాదటంచు బుధఖేదము వర్ధిలఁ జేసె...... అరయుచు దీని దుష్ఫలములాఁపఁగఁ గొందఱు సంధిసేయఁగోరిరి యెటులైనఁ బండితవరేణ్యుల మాటలఁ ద్రిప్పలేమి వా, రెటఁగి కృతార్థతం గనక యిమ్ముల నుండిరి......రసములొల్కఁ జిల్కయు ననంతర మిట్లని పాడె; "నక్కటా!, వెఱ పొకయింత లేకకడుఁ బిన్నతనంబునఁ గొంద ఱర్భకుల్, పఱచిన పాదకోత్సప మపారముదావహమంచు, మన్మనో, హరగుణ శాలులై నిరత మార్య విధేయత నొప్పుబాలు రుం, డిరి యని విన్న మద్హృదయ నీరజ మట్టె విచారమగ్నమై, విరిసెను. సాధుమార్గమును వీడిన వీరలతోఁ బ్రసం గ, మెత్తెఱఁగునఁ జేయఁ దన్మతులు బిన్నని పద్ధతి నుండునో కదా!......ఎఱుక

ఉ. బోలెఁడు ఖర్చు పెట్టి యిటు పాత్రము వ్రాయుట కేమి హేతు? వీ
కాలమునందునుం గలరుగా! గుణగణ్యులు, వారి మెచ్చి దు
శ్శీలురతోఁ బ్రసంగములు చేసి గణించినపాతకంబు ని
ర్మూలము చేసి మోదమున మన్గుటకే యనుకొమ్ము శాంకరీ! ౩౩౮

తే. గీ ఇట్లు మా పేరులను బెట్టి యేరిదెంత
తప్పు వ్రాసిరి కొందఱు తజ్ఞు లంబ!
మఱియుఁ గొందఱు మహితులో, మమ్ముఁ బేరు
పెట్ట కేదియొ వ్రాసి రెట్టెట్టొ ఓట్టు.

---

జనింప బాలురకు నెట్టులనైన హితంబు సెప్పఁగా, గురులకు ధర్మ మంచు బలు కూరిమితో వచియింతు రిట్లు......యే, మరయఁడు వంటవానిఁ బరిహాసకృతి ప్రవణాత్మ సంగతిన్, బురి వలుపీధులం దమితమోదముతోఁ గడుఁద్రిప్పి సూరి సత్కారణము గేలిచేసితిరి, తప్పని మీమదిఁ దోఁచకున్నె? మా, యురె! బుధ మాన్యపూరుషమహోత్సవపర్వన మేపగింతురో?........వైదికార్భకులు, కట్టు! నియోగిగృహాళిచెంత న, ల్లరి గడుసేసి రంచు నడులన్ వినవయ్యెడి నెల్లవీధు లన్!, హరి! శివరామునుత్సవమునందున నాబుధకీర్తనంబు న, ల్లరియొకొ! యేమి చెప్ప! కనులం గన కల్ల పురాభిమాని ది, ట్టరితిన యొప్పఁ జాలెఁ గట...... విబుధమనీషమహిమనిష్ఠ మెయిన్ మన సంస్కృతాంధ్రవా, గ్గరిమను బెంచు నార్యుల నికారము న్యాయ్యమె? చక్కఁజూడుఁడీ, అరసి మహాద్భుతోరుగుణ మార్యులు మెత్తురు గాన, మీమతుల్ నిరసనసేయ కెప్పుడు గుణి ప్రణుతిం జెలు వొందవిందు ఛీ, తిరహితమార్గులౌచుఁ గుమతివ్యతిషంగము సల్పకుండుఁడీ; పుర బుధ వాగ్వివాదముల పొంతకుఁ జేరుట మానుఁడింక!, స, ద్వరమతి దూయమాన యగుఁ దప్పడు చేష్టలు మీ రొనర్ప......భాస్కరుఁ గని మిత్రుఁ డంచు నల కంజము హాసముసేయు, వానిసే, యరియని కల్వపూ వెదను హత్తినభీతిఁ గనంగ లేక లో, నెరియుచు వాడుచుండు......మధురగీరతు లీకథ సత్కరింతు రం, చెఱుగుచు సత్కవీంద్రులకు, నింతటితో విరమింతుఁగాక యీ, వర "సుమనోవతంస" సుఖవాసనపూతదిగంత కాఁగ, ని, ద్ధరఁ గుజనుల్ హసింతు రది తప్పదు పద్మజసృష్టిలోనఁ; గొ, ప్పరపుఁ గవీంద్రు లుర్వి శ్రుతిపర్వద వాఙ్మధురాను ధారలన్, విరివిగఁ జల్లి యర్థమధుభృత్కృతికల్పన ఖ్యాతిగాంతురి; వే, లురి శివరామశాస్త్రి భువిలోపల మేటి శతావధానియై, సురుచిర మానసోద్గతవిశుద్ధ రసాశ్రయకల్పనా సుమో, త్కరకృతకావ్యమాలిక, లఖండముగా రచియించి మించి సు, స్థిరయశమంది లోకవినుతిం గని భాసిలుచుండుఁగాక; ఆతిరుపతి

ఉ. (1) ఆశువుపేరుపెట్టి యొక రట్టురె బిట్టుగ సుట్టులోడ (2) న
ష్టాశువు పేరుపెట్టి యొక, రమ్య లోకానోకరో (3) శతావధా
నాశువు పేరుపెట్టియును నాత్మకుఁ దోఁచిన రీతి వ్రాసి రో
యీశకుటింబినీ! కలహ మేర్పడు హేతువుచేత స్వేచ్ఛగన్.

---

వేంకటేశకవిద్విమణిసత్కృతుల న్వాలింగిక, వ్వగపుఁ జవుల్ చెలంగమనుపుణ బలె మోదము వృద్ధిఁ జేయుఁ; దత్తిరుపతివేంకటేశవినుతిం జెలువారుచు నెల్ల వేళ, త్మాత్రం, తరగతస్పృష్టవస్త్వచిరతాకరణప్రవణోరుకాలధీ, కరపరిపంథి దుష్కృతినికర్తనదక్షము కావ్యసద్యశ, స్సురుపృథివీతలంబున జనోపకృతిన్ జెలుగొంది మించుతన్.

( 1912 సం॥ ఆగస్టు మానవసేవ పత్రికనుండి )

(1)...ఉ. ఆశుకవిత్వ మన్న నిపు డందఱకుం బరిహాసపాత్రమై, పేశలభావశూన్యమయి వృత్తుల కామడదూరమై గ్రహా, వేశము రీతిఁ బట్టి పలవింపఁగఁ జేయుచుఁ గొందఱన్ వృథా దేశము నెల్లఁ ద్రిప్పెడు క్షితిన్ నిరపత్రపవృత్తి నక్కటా!॥ గీ॥ యతులు గనిపెట్టిచూడ దుర్గతుల నొందెఁ, బ్రాసములు చూడఁ జూడ సన్యాసులయ్యె, ధర్మ ధర్మివిభేదంబు దగ్ధ మయ్యె, నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార!॥ గీ॥ పదపటుత్వమ్ము నీకడఁ బనికిరాదు, సరసవాక్యమ్ము నానీకు విరసమగును, రస మనెడిపల్కు విన్న నీరసము గల్గు, నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార!॥ గీ॥ పద్యమని చెప్పుటకు నిన్ను వలను పడదు, గద్య మని చెప్పుటకుఁగూడఁ గానరాదు, చరణములు లేమి సరసమా సరణి లేమి, నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార॥ గీ॥ ఫుల్లియాకులు గాని చీపురులు గాని, చెప్పరా నట్టి యది గాని, ఛీ! యి దేమి, కాలమహిమమ్మొ! నీకు లక్ష్యమ్ములయ్యె! నార! నీ కెట్టి గతి పట్టె నాశుధార!॥...ఉ॥ ఎవ్వనిఁ బల్కరించిన "ని దేమి కవిత్వము? మూల నుండు మా యవ్వ వచింపలేదె? రసమా? పద సౌష్ఠవమా? మృదుత్వమా?, నవ్వనివార లుందురె వినంగనె దీని? నిఁ కిట్టి యాశువున్, బ్రువ్వ వచించి పామరులమోసల గడించుఁడు ద్రవ్య" మం చనున్॥ గీ॥ రసము పాండితియుఁ బదమార్దవము భావ, హావహేలలు భాసిలునట్టి కవితఁ, జెప్పు సత్కవు లిట్టినిం జేర నీరు, హా! యిఁ కేఁటికి నీ బ్రదు కాశుధార!॥ మ॥ అవధానమ్ముల ధారణాపటిమ యత్యాశ్చర్య సంధాయకం, బవురీతిన్ బ్రకటించి పండితులు వహ్వా! యంచు శ్లోకింప నుం, డవలెన్ లేనియెడన్ రసమ్ములుక గ్రంథమ్ముల్ రచింపన్ వలెన్, గవులౌ వారికి రెండు పద్ధతుల యుక్కాలమ్మున సందర్శముల్. —శతావధాని, పిసుపాటి చిదంబరశాస్త్రి.

తే॥గీ॥ ఎంతకాలమ్ము నుండియో యిందు సరిగఁ
బనియొనర్చి మెప్పునుగన్న వారలుండ
వృథగ వస్మాదృశులఁ బట్టి విద్య నింద్య
మనెడివారల నేమన నగు మదంబ!

ఉ. కావున వారి వ్రాఁతలను గాదను వారమె కాని వారితో
నీవిషయమ్ము నంగలియ; మెంతటి సత్కవులేని వారు స
ద్భావముగల్గి వ్యాజము లవమ్మను గల్పక విద్యదీద్యమా
త్రోవను బోవుచో నెదియుఁ ద్రోయక కైకొనువార మే మొగిన్.

---

( సర్వశూన్య శతకము నుండి )

(2)సీ. అష్టభాషలకు వాగనుశాసనుండైన నన్నయ్యకవి పెంచినాఁడు మున్ను
ప్రేమానుబంధంబుతో ముద్దుముచ్చటల్ తిక్కన్నకవి మున్ను దీర్చినాఁడు
పరువుగాఁ బల్లకీపై సర్వదేశముల్ శ్రీనాథకవి మున్ను ద్రిప్పినాఁడు
లలితశయ్యారసాలంకారవస్తువుల్ పెద్దన్న మున్ను పంపించినాఁడు

గీ. నేమములు దాఁటనీకుండ నిలిపి నారు
సూరనాదులు తక్కిన ధీరులెల్ల
నేఁటి కేతెంచెఁ గవితకు మేటికీడు
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య॥

సీ. అబల సుగాత్రి విద్యావతి గడు సౌకుమార్యంబుగల చాన మందగమన
బల్మిమై బరిబరిఁ బడలాగుచున్నారు వేగంబు ముఖ్యంబుగాఁగఁ గొంద
అత్యాశుకవు లక్కటా! దాన నెమ్మేని యంగకంబులు డస్సె నవసె మనము
సంధులు విఱిగె విశ్రామంబు గఱవయ్యెఁ బదసౌష్ఠవంబెల్ల భగ్నమయ్యె

గీ. నీరసం బెక్కువయ్యెఁ గన్నీటఁ దడియఁ
బైఁటకొంగునఁ బెనుధూళి పడఁదొడంగె
సుకవితాకన్య యాపద చూడుమయ్య
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. అధమాశుకవన ముపాధిగాఁ గల్పించి కవుల జంగాలలోఁ గలిపినావు
పద్యాలు పాటగాఁ బాడించి కవుల బొబ్బిలిపాటగాండ్రఁ గావించినావు
పరువైన యత్యాశు పదమున కర్థంబుఁ జెఱచి చెండాలంబుఁ జేసినావు
కవులను పేరఁ దత్కార్యంబు గావించి తోలుబొమ్మలఁ బోలఁదోలినావు

తే. గీ. కవులనే కాని వారల కవితఁ గాని
తప్పులెన్నక యవ్వారిఁ దనుపు కల్ప
వృక్షములఁ గాని నిరసించు వెట్టివారి
నేము సుంతయు మెచ్చమం చెఱుఁగు మంబ!

ఉ. నన్నయ నాఁటనుండియు ఘనప్రతిభుల్ కడు గొప్పఁజేయఁ బే
రున్నతికెక్కె నేఁటికెవరో మముబోఁటులు తత్త్వశూన్యతన్
జిన్నతనంబు దేఁగ నది శ్రీ తొలగించునె సత్కవిత్వపుం
గన్నియ? కేటి కిట్టిగతి గా లిఖియింతురు కొంద అంబికా!

---

గీ. పండితులు మెచ్చు కవితానుభావమెల్ల
పామరుల మెచ్చులకుఁ బాలుపఱచినాఁడ
వీవు దలఁచిన నేమి చేయింపలేవు
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. కవితారసంబు చాకలిచేతఁగూడ మెప్పించు కాలంబుఁ జెప్పించినావు
ఆశుకవిత్వార్థ మంబష్ఠుచేతఁ జెప్పించు కాలంబుఁ దెప్పించినావు
కవిసింహాభిమానంబు కర్షకులకును సర్పించు కాలంబుఁ గల్పించినావు
చిరతరంబగు కీర్తి సిగ్గుశేమికి సమర్పించు కాలము నిరూపించినావు
గీ. నీళ్ళలో దూదెబుంగ ముగ్గింపఁగలవు
రాళ్లు దేలింపఁగలవు నీరంబులోన
నఘటనాఘటనాపటీయః ప్రభావ
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. బొబ్బిలికథ చెప్పి పొట్టలు పోషించుకొనెడు జంగాలతో సెనయు వేష
ములఁ దాల్చి చెవులకు ములుగంపులంబోలెఁ జీడఁగొల్పెడునట్టి పాడుధార
మాఁతగాఁగొని తప్పులో యొప్పులో చెప్పి సిగ్గుసమూలంబు మ్రింగఁజేసి
దగ్గో, కవిత్వమో, తాత్కాలికంబగు సన్నిపాతంపుఁ బ్రసారమొకొ
గీ. యనఁగఁ జూపట్టు కుకవిత నాత్మఁ రోసి,
పైకి మన్నించునట్టి సుధీకులను సృ
జించితివి నీవకావె ప్రసిద్ధతేజ
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. చెన్నంగిసుద్దులు చెప్పరేరను నపవాదఁ బాపితి కవీశ్వరులకిప్డు
గొల్లసుద్దులు చెప్పుకో జాలరను దుర్యశంబుఁ బాపితి కవీశ్వరులకిప్డు

ఉ. వీరల తోడనే యొకరి పేరిడి వ్రాసిన వారు గారు భా
పారుచిరాంగి కబ్బెడి దోసంగునకై వగఁజెందునట్టి సం
సారులు, పేరుపెట్టి మము సాకెడు వాఁడిఁ జేయ వ్రాయు ని
స్సారుల దుష్కవిత్వపుఁ బసందున కేమనుదాన వంబికా!
గీ. సారె దర్బారులోన వాచాటకులు దు
రీహతో వ్రాయువ్రాఁత లెన్నేని మున్ను
సంగ్రహంబుగ నింపుఁ బ్రసంగవశతఁ
దెల్పితిమి వాని సారంబు దెలియు మింక.

---

తందనాల్పదముల యందంబు కవులకే దను నప్రతిష్ఠను నణఁచితిప్డు
అలగాపరులట్లు వార్తరే కవులను గొప్ప కొఱంతఁ బోఁగొట్టితిపుడు
గీ. పచ్చికయితంబునకునైనఁ బతకములను
నూటపదియాఱు లిప్పించు మేటికాల
మేగుదేఁజేసితివి దయాసాగరాత్మ
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

సీ. బూతుకైతకు మహాదాతయౌనరపతి వేనూటపదియార్లు దాన మొసఁగు
టరయఁగా నదిదాతయద్భుతౌదార్యంబుఁ జాటును-గాని యాచచ్చుకైత
గౌరవంబును జాటదారయ మేఘుండు పుల్లాకుగుంటలు పూర్తిఁజేయ
జెలువులకున్న యౌచిత్యంబు దానికి గల్గునే? సజ్జనగణ్యమగునె?
గీ. సహజపాండిత్యగౌరవస్ఫారదశకు
బహుమతులు లేక పోయినఁ బటిమ చెడునె
పతకములచేతఁ గెందునే పటిమ కుకవి
సకలగీర్వాణజనమాన్య సర్వశూన్య.

## (3) అ వ ధా న ము లు

(కప్పగంతు శ్రీరామశాస్త్రిగారి వ్యాసమునుండి)

......ఇంతలో నీభూరుహముల కొక యీతి బాధసంప్రాప్తమయ్యె, అయ్యది శతావధానాష్టావధానముల నహమహమికచే నొనరించుటయ. ఈయీతిబాధ యే దేశతాపాపనోదార్థ ముదయించిన వృక్షముల కాటంకము కాఁగలదని చెప్పవచ్చును,... ఓశతావధాన నిపుణులారా! ఆశుకవిసింహులారా! మీ ప్రబల ప్రయత్నము నంతయు దేశహితాచరణమునం దుపయోగింపుడు;... ధనవంతులగు భారతీయులారా! మీరును వృథాగా మీద్రవ్యమును వెచ్చఁ బెట్టక...ప్రతిష్ఠాపనల నభివృద్ధి పఱతురుగాక! (21 జూన్ 1912 సం॥ కృష్ణ)

ఉ. లోపల నీవు మాయెడల లోకముపాటిగఁ బ్రేమచూపు వా
రే పరమేశ్వరీ! * అదియు నించుక వీరలు తిట్టుపద్దెపున్
శాపము లందుఁ గన్పడెను శాఖకుఁ గీర్తి ఘటింప నెంచి యే
పాపపువ్రాఁత వ్రాసినను భక్తిబయల్పడ కెట్లు దాఁగెడిన్.

ఉ. దాఁగదు మానసం బెటులు దాఁచినఁ బైకది వచ్చుచుండుఁ దా
లోఁగదు లోఁగఁజేసినను లోఁగఁగఁ జేయ యతించుమానవుం
డోగొనరించుపట్ల; నది యొండొక లోఁగినయట్లె యుండి పై
కేగుఁ గనంగలేఁడ జనుఁ డిట్టి దురాగత మోమహేశ్వరీ!

చ. ఒగిఁ జదరంగపున్నడక లొక్క త్రుటిన్ గ్రహియింపవచ్చు న
ప్పగిదిఁ దెలుంగునన్ యతియుఁ బ్రాసయుఁ గూర్చెడి నేర్పుగూడ రా
నగుఁ ద్రుటిలోన; మీఁద నుభయంబును గష్టమె; కొంద ఱంతద
న్క గనక యాట యాడుదురు కైతయుఁ జెప్పుదు రిచ్చ కచ్చుగన్.

ఉ. ఈగతివారలే యిపు డనేకులు పద్దెము లల్లి మమ్ముఁ దా
మోగును బాగునుం గనక యూరక శాఖకుఁ గాఁగఁ దిట్టు న
ద్యోగులు; చెట్టుగొట్టికొని యూరక నెత్తిని వైచుకోఁగ నే
యాగడమో పొనర్చు సుగుణాఢ్యులఁ బ్రోవఁగదమ్మ యీశ్వరీ!

---

(*దర్బారులోని విశ్వేశ్వరప్రశంసనుండి)

......చ॥ తిరుపతి వేంకటేశ్వరు లుదీర్ణగుణాఢ్యులు సత్కవీశ్వరుల్। వరమతు లార్యసంస్తుతు లవారితకావ్యకళావిలాసు, లే మెఱుగమె! వారి వారికళలెల్లను మొన్నటి దన్క నీపురిం, దఱుచుగఁ దాము నక్కటకటా! పలు మాఱును నెన్న నేటికిన్.

(దర్బారులోని బుధవిధేయుని పద్యములనుండి)

......సీ॥ ప్రబలగద్వాలభూపాల ధర్మధరాధరమ్మున భూరివజ్రమ్ముగొనుటఁ, ఆత్మకూర్ప్రాజ్యరాజ్యమదేభముల నెక్కి వీథులలో విఱ్ఱూఁగిచనుట, గజపతి క్ష్మాపాలనిజకరార్పితకాంచనాదులఁగొని చింతలేదిచనుట, పోలవర క్షమాలోలాభ్యుదయకీర్తికాంత మన్ననలనే గాంచిమనుట గీ॥ సరసముకవిత్వసంధాన చాతురీణ, ధీవిశేషపాణింధమ శ్రీవిలాస, గరిమ నని యెంచుచుంటి మక్కట! పురాణ, వాక్కులనఁగాని యన్యమ్ముపలనఁగాదు...

ఉ. వీరికి మున్ముఁ దిట్టెడి కవిత్వపుఁ వ్రాఁతయె విఘ్నవాఘ పూ
జారచనంబు; మున్నెదియు శాంకరి ! పద్దెము వ్రాసి యుండ రీ
కూరులు; వీరిహేతువున సొంపు వహించెదుఁగాక శాఖ; నీ
కారుణికత్వముం గని సుఖంబు యశంబును వీరు గాంచుతన్.

ఉ. తిట్టికటంబుఁ గొందఱు మదిన్ దురపిల్లుదు రేము సంతసం
బుట్టిపడంగఁ బొంగితిమి యొండొక హేతువులేక యూరకే
తిట్టుట స్తోత్రమే యగు నుతించునదుల్ వినుకన్నఁ బ్రాజ్ఞు లీ
తిట్టులె హాయిగా విని మదిన్ సుఖమందెద రో మహేశ్వరీ!

ఉ. బండతనం బటంచు నిది పండితు లాడెద రేమొ! "బండకున్
బండకుఁ జెల్లు వాద" మని బండతనంబునుగూడ నేర్చి యె
వ్వండెటు తిట్టినన్ మరల వానిని దిట్టక వానితిట్లయం
దుండిన మంచినే గొనెద మో జగదంబ! ద్విరేఫముల్ బలెన్.

ఉ. అట్టి ద్విరేఫతాగరిమ యాత్మకు నీకృపఁజేసి పేరునం
బట్టియు దానికిం బలెనె వచ్చెను దిగ్వలి వేంకటేశ్వరుల్
తిట్టులు లెక్క సేయరు సుధీమణు లీవును నుండ నూరకే
కట్టెఁడు లెంత వాగినను గాలికిఁ బోయెడిఁగా! మహేశ్వరీ!

క. ఎఱుఁగని మొఱకులతిట్లును
నెఱుఁగని యాశుకసనములు నెక్కటిగా రూ
పఱు గాలికిఁ బోయెడి [illegible]ల.
గొఱగాని పరాగ మట్ల గోవిదజననీ! 850

ఉ. గొప్పరపుంగవీశులు రగుల్కొను కోపము కల్మి ముమ్మ్ర నె
ల్లప్పుడుఁ దిట్టుచుండుటకు నంతగ నక్కజమందఁబోము * ఘు
మ్మెప్పుడొ యెవ్వరో కసఁగి యేమొ పరాభవ మాచరింప వీ
రప్పుడు కాచిపుచ్చిరట! అందుల కంబరొ! యక్కజంబగున్.

శా. కాఱుల్ వ్రాయుచు సోదరుల్ గడఁగి "వాల్కా తాటిపట్టా" యటం
చారంగా మును పాడిరేఁగద! యవే యస్మాదృశుల్ పల్కఁ జో
ధీరుల్ మెచ్చరు దేవి! వీరెపుడు వర్ధిష్ణుల్ మమున్ గాచి? రే
కారామార్యుఁడు చెప్పఁగావలయు, లోకంబెల్ల మెచ్చన్ వలెన్.

* (ఈ విషయమునకు 95 వ పుటలోని 23-24 పంక్తులు చూడుడు.)

క. ఏకా రామయ గా రది
సాకల్యముగా నెఱుఁగుసాక్షు లగుదురో
లేక మఱొక్కరు వలయునొ
శ్రీకరు లలసోదరులు వచింపఁగ వలయున్.

ఆ. వె. 'ఏమిసాయ'మన్న 'నెదురుగా రాకుండె
సాయ' మన్ననుడి పరిసక్తమయ్యె
కొంకు జంకు లేక కోఁతలు కోసెడి
ఘనులధాటి కడ్డు గలదె జనని !

క. వీరల కాశుకవిత్వపు
ధోరణితోపా టసత్యధోరణి దొరలున్
సార మసారమనక 'ద
ర్బా' రదిప్రకటించు ముందు పరికింప దహో!

మ. తన జన్మించిన దిందుకోసమని యేతప్పైన 'దర్బారు' కై
కొను నామాత్రిన లాభమే? కనినలోకుల్ మెత్తురో లేదొ లోఁ
గనఁగావల్వదె? యేమి భాగ్యము వృథాగాఁ దప్పులన్ గుప్పు నం
తన, నానాఁటికిఁ బ్రాజ్ఞ లోకమునకున్ దత్త్వంబు గన్పట్టదే.

మ. మఱి దర్బారది పుట్టకుండగనె తన్మార్గమ్ములున్ దాని సం
బరమున్ దాని జనించు హేతువును దత్త్వజ్ఞుల్ ‡ విచారించి పం
పిరి కైకొంటిమి దానివ్రాఁత లవి యొడ్డే సన్మదుద్యద్యశ
స్ఫురణన్ హెచ్చొనరించు నిక్కమని నమ్మన్ మామనం బంబికా !

గీ. కుకవుల హాళాహళులు లేక సుకవియశము
మిగులఁ జెలువార దనికదా మేటిసుకవు

---

( ‡ ఈ క్రింది పద్యము లొకానొకరు పంపిరి )

శా. దర్బార్ ... తెగి... గాదే! భవ, న్నిర్బాధప్రథితావధాన కవితా నిమ్నస్వభావాపగా, హిర్బుధ్న్యప్రథ సత్కవిప్రభుమనోహేలాలవాలోర్మికా వార్బిందూత్కరకర్బురద్యుతుల, వహ్వా! క్రిందుమీదెంచదే॥౧॥ క॥ ఉప్పాడ... కొప్పరపుం......చెప్పిన యొప్పని టప్పా, లొప్పం దర్బారునందు మాహింతు లౌకో॥౨॥

* లందు రది నిక్కమగునేని యంబ ! మాకుఁ
గరము నుపకారి 'దర్బారు' గాకపోదు.

క. తనవలెఁ దప్పదు వ్రాఁతల
కనుమోదింపదని "కవిత" యభినవపదపూ
ర్వ నకట ! సరస్వతిని గై
కొన, దీ దర్బారు నెత్తికొని ముద్దాడున్. • 360

గీ. ఎఱుఁగునో లేదొ పాప! మిద్దె ఱుఁగుఁ గాక
తనకు దర్బారె కాదు బాంధవ మొనర్ప
నల మనోరంజని యొకండు గలదు త్రితయ
†మెక్కటిగఁ జూచుచున్నారు యోగ్యతములు.

చ. వెనుకయు ముందునుం గనక వేఁడుటు వ్రాఁతలు వ్రాసినంతనే
చనవు సుకీర్తు, లంతనె యశంబు గణింపరు మాయికుల్; నిజం
బును గనిపెట్టు నేర్పుగల బుద్ధిమదగ్రణు లక్కడక్కడం
దును గలరెంచు లోనెఱిఁగి ద్రోహులు వర్తిలు నొప్పు నీపయిన్.

తే. గీ. అభినవసరస్వతీమణి యనృత మాడి
మమ్ము వినుతించు నఁట! యిట్టి మాట లకట!
మా కృతజ్ఞులు వ్రాసిరి. మఱియు మమ్ము
దూఱినంతన యశమది దొరకు నొక్కొ!

---

* సీ. 'ఏమహాత్ములు గల్గ భూమీశసభలలోఁ గవులకు బహుళవిఖ్యాతి గల్గె,
(భట్టుమూర్తి)

† ...ఆర్యా ! సందర్భాసందర్భములను సమయాసమయములను తెలియక విందయే ప్రధానముగా నెంచి వాపోవు దర్బారు, కవిత, మనోరంజనీ, పత్రికలు మాడ మామనంబులకు నత్యంతకష్టముగానున్నది......మీరు ఇట్టి తరుణములో అశ్రద్ధ చేసినయెడల......కొప్పర్తి రామకృష్ణకవీశ్వరజయ మను నామముతో గాని లేక యింకొక నామముతో గాని గ్రంథ మొకటి మీతదనంతరము బయలు వెడలగలదు గాన తగుకీర్తిని పుట్టినవాదును పుట్టినట్లుగా చంపుటకు తగుపత్రికాముఖములలో యుండవలెను. ... ...

బెజవాడ — చిత్తగించవలెను

24-11-12 — వేలమూరి గోపాలకృష్ణయ్య.

క. తమగుట్టు గీరతము స
క్రమముగఁ బైటఁ బడవేసెఁ గా! యీపాత్రం
బమలము "దర్బార్" వ్రాఁతల
శ్రమ మెల్లను బయటఁబెట్టి సంరక్షించున్.

తే. గీ. అభినవసరస్వతి * వచించునట్టి పలుకు
లే నిజంబులో! సారెకు నెపుడు వస్మృత
మాడు దర్బారుకవితల యంటపులే ని
జంబులో! యెఱుంగు నిటుపైనిజగము జనని!

తే. గీ. తగుదు నంచును 'కవిత' యే తలకుఁ బాయు
♦ దబ్బఱలనో లిఖించెడిఁ దగ్గ దకట!
మందలించిరి యొండలో మహితు, లైన
నేమి, దానికి జనియింప దింకబుద్ధి.

---

*(1912 సం॥ మార్చి యేప్రిలు అభినవసరస్వతిలోని మిత్రవిజ్ఞప్తి నుండి.)

......మిత్రులారా! మీవ్యాసములెన్ని చూచినను దిరుపతివెంకట కవులనిందతో నిండియున్నయవి......మన బోటులు మహాకవుల కవిత్వమును విమర్శించుట కడు శోచనీయము. మనకు వారిపాదధూళి శిరమున ధరింపఁదగు యోగ్యతయేని లేదు......తిరుపతి వేంకటేశ్వరులకీర్తి దిగంతవ్యాప్తమైనది. మన దేశమందుఁ బ్రతి ప్రాజ్ఞునకును వారియందు గౌరవము విశేషించి కలదనుటకు వారికి జరిగిన సపర్యయే సాక్ష్యమిచ్చును......శాస్త్రేతరవిషయమును మీరేమి వ్రాసినను దిరుపతివేంకటేశ్వరులు వ్రాయరు. ఈయంశము మీవ్యాసములు వారి వ్యాసములు చూచిన వారె యెఱుఁగుదురు......ఈ సీమవారైనచోఁ దిరుపతి వేంకటేశ్వరులు మనకు జంకుదురేమోకాని యితర సీమవాసులు వారిని శాస్త్రవాదముచే జయింపవలసినదే కాని దూషించియు నేమో చేసియు మనము జయింపఁ గలమా?......

♦(1912 సం॥ సెప్టెంబరు కవితలోని అట్టహాసము నుండి.)

...... అభినవసరస్వతి—(తొట్రుపాటుతో) తిరుపతివేంకటకవులే మాగొప్పవారు. (30-6-1912)దర్బారు—(చిఱునగవుతో) అవధానులెవ్వరును లేనితరుణమున శతావధానులమని నటించుటవలననో...యెట్లయిననేమి, తి॥వెం॥ లకు గతకాలమునఁ గొంతవఱకు గౌరవ మున్నమాట సత్యమే. అభిన—(నివ్వెఱతో) నే నేమెఱుఁగుదును ?మాపట్టాభిరామశాస్త్రిగా రటు చెప్పినారు.

తే. గీ. తనదు పబ్బపుఁబ్రాఁతలు ఘనులు పూర్తి
గా నెఱింగిరి కావునఁ గష్టపడక
"కవిత" యిఁక నేని యనృతముల్ గట్టిపెట్టి
ద్రవ్యదాతకుఁ జేస్గూర్పఁ దలఁచుఁగాత.

ఉ. పాఱిరి యోడిరంచు "దరబారున" సారెకు వ్రాయనంతనే
చేరదు మీకుఁ గీర్తి, యల "శృంగపుభంగము" రామకృష్ణులన్
ధీరులఁ జేయఁగాఁ గలిగెనే! నిజముం గనిపెట్టు ధీరులు
న్నారుచుఁడీ! వృథాగఁ గవనం బనృతంబున నింపఁబోకుఁడీ!

తే. గీ. 'కవిత'వారి తోఁపను బోవు కారణమునఁ
దాదృశంబగు ఘనతయే తవులు మీకు

---

దర్బారు—ఔను. ఆయనతఱచు 'వింతవార్త'యనియు 'మిత్రవిజ్ఞప్తి'యనియుఁ జేర్లతోఁ ది॥ వేం॥ కవులను బురస్కరించుకొని వ్రాయుచుండును. అభినవ—(రోషముతో) వారి విషయమై యిట్టిమాటలు నీవనవలయుంగాని మఱెవ్వరు ననరు. దర్బారు—పోనీ! వారియందుఁ బ్రజకెట్టి యభిప్రాయమున్నదో దేశ మాత నడుగుదము. దేశ—ఎందుల కూరక కలహించెదరు. ఆవిషయమై కవియు రాజునగు మంత్రిప్రగడ భుజంగరావు బహద్దరువారి నిష్కృష్టాభిప్రాయ మొకటి చాలును, వినుడు. కృష్ణ—దర్బారీ! అభినవసరస్వతి మాటలకేమిలే, దాని కేదియైన వ్రాసియిత్తురని వారి నట్లూరక పొగడుచుండును......

పరా:— ఈ 'కవిత' మాయశమును తగ్గించునూహతో నేయే వ్రాఁతలను బ్రమాణముగాఁ దన 'అట్టహాసములో' లిఖించెనో అందన్నియు మృతప్రాయములను సంశము 45 వ పుటలోని ఇంగ్లీషుత్తరము మొదలు 48వ పుట తుట్టతుద వఱకును గల దిద్దుబాటు లోనగు భాగముచే విస్పష్టమగును. శ్రీ శ్రీ భుజంగరావు బహద్దరు వారి శాఖాభిమానపుఁ బ్రసంగము 58వ పుట మొదలు 68వ పుట వఱకును జదివికొన్నచోఁ బూర్తిగా ఖండితమనియు, దానిపై వారు ప్రత్యుత్తరము నొసంగకుంటచే వారి యభిప్రాయము నిందెత్తికొనుట మఱియు ననవసరమనియు అభినవసరస్వతిని కృష్ణపక్షపాతినిగాఁ బలికినట్లు వ్రాసినవ్రాఁత బొత్తిగాఁ బనికిరాదనియు నందులకుఁ గవితలోని యీ బొంకు ప్రసంగమును జూచి యసహ్యమును విస్పష్టముగా వెలువరించిన శ్రీ కృష్ణాపత్రికా సంపాదకులే పరమ ప్రమాణమనియు నెఱుఁగఁదగు వలసినచో నిందునుగూర్చి బ్రి॥ శ్రీ॥ ముట్నూరి కృష్ణారావు, కృష్ణాప్రెస్ వారికి వ్రాసి తన సంశయమును గవిత తీర్చికొనఁదగు.

కొప్పరంపు సోదరులార ! తప్పుత్రోవ
లింక నేని మానుఁడు లిఖియింపకుండు.

తే. గీ ఆసనం బీయకున్నంత నంత శత్రు
భావమేటికి ? మము * గర్దభములు గాఁగ
వ్రాయు మీబంధుగుల వ్రాఁతనైఖరులను
గనియు మా సహాసనమునఁ గాంక్షచనునె.

చ. శివ ! శివ ! ♦ "పండితబ్రువుల" చెంతను "గాడ్దల" చెంత మీకు గౌ
రవ మిడునే సహాసనము ! ప్రాజ్ఞులు సర్వ మెఱింగి నాఁడు బాం
ధవు లెటు పట్టుపట్టిరొ కదా యది యబ్బకపోవు టేసుఁడీ
శివకర మయ్యె మీఁకు గవిసింహులు ! సంతసమందుఁ డీపయిన్.

క. విద్యావివాద మనునది
హృద్యం బనపద్య,మందు నెవ్వరు మును పే
సద్యః ఫలముల నన్నృతపు
గద్యమ్ముల నాడ, రడుగఁ గాఁడగు బుధులన్.

క. తిట్టితిమి బాగుగా నని
యట్టె ముదంపడకుఁ డయ్య! ఆతిట్టులె మీ
కట్టిరొ తెలుపును జూఁడి యి
ట్టట్టనకుం డన్నృతములకు నలవడకుఁ డిఁకన్.

క. ఉత్తరరంగమ్మున మీ
యుత్తరముల తత్తఱములు నొగి రాజకై

---

* (పండిత బ్రువలక్షణమును బండతిట్లు పొత్తమునుండి.)

చ......నా, సరసకు నీవు రాఁదగవు చాలును బొమ్మని కూయు వంతలో వరుగునె తాను గాడిద నటంచు నెరింగినయె కూసెఁ గాని......గాడిద చెంత నిల్వ గేసర కది పోలునే......

♦ (పాటిబండ సూర్యనారాయణరావుగారి పండితలక్షణమునుండి.)

చ...నా, సరస నిలంగ నేరికిని శక్యము గా దనుచుం బ్రగల్భ వా, క్సరణి వచించుచుండుట ప్రశస్తతరం బనిపించఁ జాలునే...మూర్ఖశేఖరుడు ... దాంభిక పండితబ్రువుల్ (1911 సం॥ అక్టోబరు 13 వ తేదీ కృష్ణాపత్రికనుండి)

యొత్తిన యొత్తులు యుష్మ
త్సత్తాసంపత్తియును బ్రసంగింపఁబడుఁన్.

ఉ. వ్రాసినయింతలో నన్నృతవాక్కులు గల్గినఁ జూపుఁడీ! వృథా
యాసము తిట్టఁబోకుఁ, డిఁక నందఱకు న్నిజ మిద్ది తెల్పు మా
మీసము, మీదురోసమును మేలు గనుఁన్, యశ మంద విద్దెల
భ్యాసము సేయుఁ, డీనుడిని భావనసేయుకుఁ డన్యథా మదిన్.

శా. అంబా! యార్యుల లేఖులున్ మఱి యనార్య వ్రాతముల్ వ్రాయు నం
శంబుల్ గొన్ని యిటన్ లిఖించితిమి, సత్సంఘంబు నీవున్ యథా
ర్థంబుంగూర్చి విచారణల్ సలుప నాధారంబుగా; నింకఁ బ
త్రింబుం దెచ్చి యొసంగువారల వికారంబుల్ వినంగాఁ దగున్.

ఉ. తెచ్చిరి పత్ర మట్టులు విశేషుల పోల్కి నటించుచున్; జనం
బచ్చట నెందఱో గలర యప్పుడు మా 'విజయంపు' నాటకం
బెచ్చుగ నాదనుండె, నట నెట్టులో పత్రము విచ్చి మాకు వీ
రిచ్చుటకున్ గడంగి రది యేగతి సాగనిదయ్యె నయ్యెడన్.

క. మొదటన్ మాకొసఁగిరి, యా
పదపడి యది వినికిసేయుపలయు నటించున్
బదిఁబది నడిగిరి, తిర్పతి
యుదలింపఁగ యుక్తి లేక యరిగి రనదలై.

ఉ. కూసెను కుక్కుటంబు లొగిఁ గొక్కురుకోయని, కాకవుల్ రొదల్
సేసె దివాకరుండు దయచేసెడిఁగా! యని, ఘూకవుల్ మదిన్
ద్రాసముతోడఁ గొండగుహ దాఁగఁ దొడంగెను, నాటకంబు ము
న్నే సరిగా ముగింపఁబడె, నిండ్లకు నేగితి మంత నంబికా!

## గద్య

ఇది శ్రీ...తిరుపతి వెంకటేశ్వర రాశీకృతంబగు
'గుంటూరుసీమ' యందుఁ బత్రికా
కషాయాపర నామకమ్మును,
ఉపోద్ఘాతప్రాయమ్మును
నగు పూర్వరంగము.

# తప్పొప్పుల పట్టిక.

| పుట. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 13 | 7 | దన్వ | దప్వ |
| 22 | 28 | మఆ | ఆ |
| 25 | 1 | రస్కృ | రసత్కృ |
| ,, | 12 | యేమె | యేమొ |
| 28 | 6 | చోండు | చోండో |
| 40 | 14 | లోఁతగి | లోఁతగ |
| 45 | 14 | ఫీ | చీ |
| 50 | 18 | యటా | టాయ |
| 70 | 9 | యిదా | యినదా |
| 76 | 16 | మాచర్ల | మోచర్ల |
| 78 | 27 | రంక | రంజ |
| 88 | 24 | శాగా | శాస్త్రిగా |
| 113 | 21 | దుకొ్కృ | దుగొ్కృ |

గుం. పూ.

# ఉపోద్ఘాతము

చదువరులారా!

విపులమగు పూర్వరంగపీఠికయు, వేమవరాగ్రహారశతావధానపీఠికయుఁ జదివియున్న మీకుఁ బ్రకృతవివాదమునకు సంబంధించిన సోదరులయుఁ బదభిమానులయుఁ గుకల్పనలు చాలవఱకు బోధించి యుండును. ౫ పుటలోని శ్రీసోదరుల తప్పుడు రిజిష్టరుత్తరముకూడఁ బైవిషయమును బలపఱచునట్టిదియే, అది యటులుండె, ఈ క్రిందియుత్తరము దిలకింపుఁడు.

నెకరికల్లుపోష్టు, నర్సారావుపేటతాలూకా 8-12-13 కుంకులగుంట.

...నేను ఏతగుపాటియో కావ్యపరిచితిగలవాడను సుకవిపాదపద్మవిధేయ ప్రమాణువును... నన్ను నేమహాలాభము నభిలషించియో యేయోగ్యతలేని యోగ్యులలో తమరాశిలోఁ జేర్చికొనుటకు అక్టోబరునెలలోఁ బ్రచురించిన సువర్ణలేఖలో తమ్మును దమ, యవధానసిందను గూర్చి వ్రాసిన యవాచ్యోపన్యాసములో నన్ను దస్కతుదారునిగా జేర్చి "ఫోర్జరీ" యనియేని వెలువక ప్రకటించియున్నారు ఆసాహసచాకచక్యములు వారికేతగును. నిజమునకు నేనింతవరకు తమ పుస్తకములలోని ఫోటోలనుజూచిన భాగ్యవంతుడనే కాని తమ సాక్షాద్దర్శనము చేసిన ధన్యుడనుకాను. ఇట్టిస్థితిలో అవధాన మెపుడు చూచితినో యీ యసత్యవాది యుపన్యాస మెపుడు వ్రాసితినో పరమాత్మునకెఱుక యగు, ఈ జాల్మప్రజ్ఞలు తాము యెరింగియేయున్నను కాలౌచిత్యమునుబట్టి తమకు నేనిట్లనపరాధినని విశదపరచికొనుటయుక్తమని వ్రాసికొంటిని, తమ యనుగ్రహపూర్వకప్రజాబు వచ్చువరకు నిరీక్షించుచుందును.

శ. టక్కరులల్లెడి టక్కులు, టక్కున గ్రహియించు నాకడంకయుఁ దమకే
చిక్కును వెంకటకవివర!. యిక్కలికాలంబున దాపకవిధాలక్.

చిత్తగింపుడు.

[illegible]

ఇట్టి తప్పుడు సృష్టిచేయఁగల మహానుభావులు చేతులోఁ గల సోదరులకు నెవరు దీటుగాఁగలరు? పైయుత్తరమువలన వారిపక్షమున నుండువారితత్త్వము నంత దెలిసియుండును గాన( దాదృశుల * ప్రల్లదములను నిత్యము ప్రకటిం

(* హితకారిణి చేయు నధికప్రసంగము దిఙ్మాత్రము)

'మీలో వెంకటకవియా?, తిరుపతికవియా?, 'వెఱ్ఱివెంకటాయ' 'నిజముగా శ్రీతిరుపతి వేంకటేశ్వరుల ప్రజ్ఞావిశేషమునకుపమింపఁదగినది యొక్క మేడిపండే, గంగిరెద్దులయాటలోఁ గోనంకిదాసుఁడు అను వేషధారి అమ్మల్లారా నాదీపెండ్లి, అయ్యల్లారా నాదీపెండ్లి, అన్నల్లారా నాదీపెండ్లి, అని కేకలు వేయునట్లుగా మేము శతావధానులమని ప్రకటించుకొనుట మిగులఁ బరిహాస పాత్రముగా నున్నది. "వారి పూర్వక్రియలఁదెలుపు గుంటూరిసీమ పూర్వరంగము...ఉత్తరక్రియల నెఱిఁగించు గుంటూరిసీమ, ఉత్తరరంగము, వీరి చండాలపుబని నేలచేయనలెను. చివుకుల అప్పయ్యశాస్త్రుఁట?...మనోరంజనిమీద మామిడికేడు,... తురకదాసరికి ఈతమజ్జిగన్నట్లు, అప్పయ్యశాస్త్రి తురకతెలుగు" వెర్రిప్పయ్యా,... తిరుపతివేంకటేశ్వర్ల మేళంలో యితడో హాంగుదారుడు,- ఛీవాట్లు తినకు "వేశ్యావిధమున ... వీరు నింద్యులగుట చాల శోచనీయముగానున్నది నియోగిశిఖామణులనియు... యీ... యుఁ దెగబొగడుచుండిరి...గంగిరెద్దులవాండ్రు...పైన..., యిచ్చిన ఎట్టియర్థముఁడైనను వానిని మహారాజు...అని పొగడుచుందురు అట్టి మతమునే తమగవలంబించుట చాల శోచనీయము" 'ప్రాతలంజలు వీరమాతలైరి' "తిరుపతివేంకటేశ్వరులు... వేశ్యమాత కప్పయో చెల్లెలోయైన ప్రజ్ఞచే నిరసించుచు... యనుకూలురైనవారిని బెద్దఁబొగడుచు 'గంజాయిపోకురా, సారాయిపోకురా, బాపనోండ్లుండ్లల్లో పెద్దోడుతాగలేడ" అను పాటలుపాడుచున్నారు. "ఛీ, ఛీ, యని నిరసింపఁ శోచ్యస్థితిలోనున్న యభినవసరస్వతిని" ఆయన (వేదూరి సుబ్బయ్యగారు) తి॥ వెం॥ ల, నెక్కించి యనృతమహిషమ్ములంబూనిచి పాపపుబండిఁబోలుచున్న మహానుభావుఁడు, అయ్యా గంగరాజుగారు 2 గంగరాజుగారూ, ఓహోగంగరాజుగారూ??? ముఱిగినకాలును మూసిపెట్టుకొని 'మీగుండుమారుసీమ'' సలాములు చేయుచున్నాము. క॥ మస్తానునామకుండ ... మహమదుసుతుఁడ' "గాని స్వయంపాకివాని సర్వశూన్యశతకము,"

చుచు యుక్తాయుక్తజ్ఞానము నపలకు పెట్టి పాటుపడుచున్న 'హితకారిణి' 'మనోరంజను'ల యందలి పర్వతప్రాయములగు దబ్బఱల నిందుదాహరించి ఖండించుటకు మీరేసమ్మతింపరు. లోకులహృదయమునం దవి యేతీర్పున నెక్కియున్నవో నంత తెల్పుటవలన నాపత్రికాద్వయమునకుఁ గొండొక వివేక మబ్బవచ్చునని యెంచి దిఙ్మాత్ర మందులకు సాధకములగు నంశములు గొన్ని యుదాహరించెదము.

12th August 13.

(1)......మఱియు హితకారిణి, మనోరంజని యీ రెండుపత్రికలు మీ కపయశస్సును గలిగించుటకై కంకణముఁ గట్టికొన్నట్లు దోచుచున్నది. జూలై నెలలో

---

☞ ఇట్టి తప్పుడుకూఁతలు కుప్పతెప్పలు, ఈ స్వయంపాకివాఁ, డెవరో యెఱుఁగుదురా? స్వయంపాకుల లక్ష్మీనారాయణశాస్త్రికి వచ్చిన పాట్లివి.

(మనోరంజనిచేయు సధకపరిసంగము దిఙ్మాత్రము.)

ఓ యెండుగంపి కవులారా, జైలులనరయుఁడయ్యా, భరణంబునకు దావవై వుఁడయ్యా, ఒడిశెసంగనిసిన మిప్పుడుండఁదగునె, ఛీఛీ? యని ప్రజ్ఞాతిశయము లేప గింపఁగ నేతాఖుస సభయటన్న నిఁక నేగకుఁడీ 'వారు (తిరుపతి వెంకటకవులు) స్వర్గముగా మాపై మిడుకుదురు, నీ యిజారులో నాపైజారన్నట్లు వారిపుస్తకములో వీరి పస్యమెట్లో" "వారి (తిరుపతివేంకటేశ్వరుల) యీతలవంపు చైదముల" "అప్పుడెగ్గులఁగిరింపఁ దొంగున్నసేమి అయ్యెగ్గులనేలఁ దొంగున్నసేమి" "లేని మగతనము నాశించిరెమొగడ? తములో నొకరు మీసముంచికొనిరి" "పాగా, పంచాయింది పాపరాజువనుకొన్నాను, పేరాజుసంటోయ్! యీ రాజ్జా, "ఛీ? ఒప్పో? యెంతబిడ్డ ఈబిడ్డెనువీరు (తి॥ వెం॥ కవులు) మాయింటిపొరుగు బుచ్చమ్మ కప నేర్చుకొని యుండవలెను. మా చిన్ననాఁడు మా పొరుగున నొక సద్బ్రాహ్మణుఁడు నివసించెడివాఁడు' ఆయనభార్య బుచ్చెమ్మ కొంచెం పై యాటకత్తె..." "పండితరాయలు తిట్టెంగాని తమవలె బూతులు తిట్టి తన్నులు తిని........."

☞ ఇట్టి పెన్నోకలవు, పాకము ముదురుచున్నది. ఇందు మొదటివేవో కొన్ని తప్పఁ దక్కినవి పత్రికాప్రవర్తకుని స్వహస్తలిఖితములు సుఁడీ, ఇతఁడుగూడ నొకసత్య నివేదకుఁడే, ఇతఁడును విమర్శనకర్తయే, ఇతఁడును మానిసియే??? ఔరా! కాలమహిమ, శాంతంపాపమ్.

ప్రచురపడిన మనోరంజనిలో పత్రికాధిపతిగారు తమ గ్రంథముల నగరము విమర్శింతుమని వ్రాసియున్నారు. చూచుకొని యెదయుగాక, 'యతో ధర్మ స్తతో జయః' చూడఁజాలక గొందఱు మీ యమూల్యమగు కాలమును వ్యర్థపుచ్చఁ జేయుటకై పూనిరట్లున్నది. ఇంతకు నిది కాలమహిమ..."

ఎ, యస్, రామకృష్ణులు.
5489 Regimental Bazaar
Secunderabad (Deccan)

---

అమరావతి 10-2-14.

"హితకారిణి" యను ఏలూరులో ప్రచురింపబడుచుండు వారపత్రికలో యిప్పటికి౨ వారమునుంచి అనగా ది 14-12-13 తారీఖు పత్రికలోయున్నూ, ది 1-2-14 తారీఖు పత్రికలోయున్నూ 'పాతగోడకు పూత చక్కన' అను హెడ్డింగుపెట్టి వ్రాయుచుండు అవాచ్యపువ్రాతలను తమరు పత్రికాముఖమున చూచియే యుందురు. యిట్టి యప్రస్తుత ప్రసంగమును జరుపుచుండు ఘనుం డెవడో 'సశేష' మని వ్రాయుచుండుటచే దెలియకుండానున్నది. ఇంత మాత్రపు కారుకూతలు వ్రాసినంతనే... యిట్టి తప్పుడువ్రాతలు వ్రాయుచుండు మహానుభావుడెవడో తమకు తెలిసినయడల తెలుపవేడెద.

జానపాటి సంకటప్పయ్యవ్రాలు.

---

యేలూరు, 6-8-13

...మనోరంజని దుడుకుగ నడచుచున్నది. చూచితిరా?

మై. కృష్ణమూర్తి.

---

జానపాడు 7-9-13.

..."హితకారిణి మీరు చూచుటలేదా, వాగు డెక్కడయినదే?

జా॥ పట్టాభిరామశాస్త్రి.

లోకులయభిప్రాయముల నటుంచి తోడిపత్రిక లగు సుదర్శిని మొదలయి నవి వీరల పోకడల నెట్లు నిరసించుచున్నవో చూపుటకూడఁ బ్రస్తుతము కాకపోదు.

V

(1914 సం॥ జనేవరి 1 వ తేది సుదర్శనీ పత్రికనుండి)

# విజ్ఞప్తి

ఆర్యులారా! దేశము చేసుకొన్న పాపము చొప్పున నిట్టి కష్టముల జూచినను మనోదండి, కవులు మిక్కుటమయి గురుకులవాసపాఠపఠనాది వృథా శ్రమము లక్కరలేకుండనే సులక్షణసారనామకగ్రంథమాత్రశరణ్యులయి తగుదుమని ముందునకు వచ్చుచున్నారు. తమ రాదుకొనుమాటలనే గణములను పరిస్తరించుకొని యందిమిడ్చి పద్యముగా పాదుపుపెట్టిన వాడెల్ల కవియగుచున్నాడు. ఇందంతగా దప్పులేదు కాని తావాస్థితిలోనే యుండి తనతోడి బాలకులతోడనే సల్లాపములాడికొనక విశేషించి పెద్దకుండల కెసప్పు పెట్టం జూచుచు భాషాక్షయసాయమున గడిదేరిన నెట్టి పండితకవులనేనియుం బూచిక పుల్లలకై డీకొనేయుచు నోడలెఱుంగని సివములాడుచున్నారు! ఇందుకుం గారణ మిప్పుడీ తెగ యెక్కుడగుటయు నా తెగ తక్కువగుటయే! వినీతవాణి కిప్పుడు కాలదోషము పట్టినది. ఈ పత్రికలలో నప్పుడప్పుడు తిరుపతి వేంకటేశ్వరకవులంగూర్చి చర్చించబడుచు వచ్చినది. తత్సందర్భమునం గొప్పరపు గవులను గూర్చి కూడ నొండు రెండు సారులు వ్రాయబడినది. ఈ పత్రిక యుద్దేశము పాండిత్యము నభిలషించుటయేకాని వేరుకాదు. ఈ తిరుపతి వెంకట కవు లెట్టివారో కనులనైనం జూడలేదు కొప్పరపువారి నంతకుమును పే చూడలేదు. పరిచయ మున్నప్పుడుగదా స్నేహవిరోధము లేర్పడుట, అదిలేనప్పుడవియు నుండవుగదా? ఇట్టివిషయములో డిశంబరు 14 వ తేదీ హితకారిణిలో "సుదర్శనీ పత్రికాధిపతి సోదరకవులను దిట్టినట్లుగా" అను నీమొదలయిన వాక్యములుకొన్ని సశేషవ్యాసములో నెవ్వరో వ్రాసిరి. ఇదేటి యన్యాయము? సోదరకవులను దిట్టినదెప్పుడు? తారతమ్యచర్చ చేయుటయెల్లం దిట్టుటయేనా? ఈ సోదరకవులెవ్వరు? వీరి నెందుకుం దిట్టవలెను? ఎందుకు గౌరవించవలెను? గౌరవా గౌరవము లెప్పుడుపుట్టును? తదనుభవమువలనం బుట్టును. ఆయనుభవ మెట్టిది? తద్గ్రంథపఠనరూప మయినది. తిరుపతి వేంకటకవులమీద గౌరవభావమేలగుదురవలెను? వారిగ్రంథములను బఠించుటవలన, ఆగ్రంథములలోం గవిత్వవస్తు వుండుటవలన. కవిత్వవస్తువన నేమో? ప్రత్యేక మొకగ్రంథము వ్రాసినంగాని యిక్కడ స్ఫుటపఱుపంజాలము. అట్లే కొప్పరపువారుంగూడ పెద్దగ్రంథములు రచించి మన కనుగ్రహించనిండు అప్పుడు గౌరవాగౌరవములు

స్థిరపఱుతము. రెండు బంగారు కణికలు వన్నె గట్టవలసి వచ్చినప్పుడు నికషో పలము (గీటురాయి) పైనొక్క రేఖయే కానవచ్చుచుండెను. రెండవది స్వరూప శూన్యమయి యుండెను. అప్పట్లు జేయవలసిన దెద్ది? గీటురాతిపై రెండవ కణికగూడ నొకింతగీచి చూపరాదా? అప్పు డేరగవులు నుండవుగా! అది యే లొకో రహస్యముగ దాచిపెట్టి ఊరక "నాకణిక పదియార్వన్నె వచ్చును-తక్కినవన్నియు దీనికి దిగదుడుపు" అని బూంకరించనేల? వారి కవిత్వము విన్న వారికిఁ జాలదా? యని చెప్పవత్తురేమో? "వారువిన్నారు వీరువిన్నా" రని యీమూజివానీ సాక్ష్యము లెందుకు? నాల్గుగ్రంథములీపలఁ బాఱవేయరాదా? అవియే పోరాడునుగా! కావున నోప్రాజ్ఞులారా! సుదర్శనీపత్రికాధిపతి తిరుపతి వెంకటకవులను ఆకాశమున కెత్తుచున్నాఁడనియుఁ గొప్పరపువారిని దిట్టుచున్నాఁడనియు, నిత్యాదులు వ్రాసి స్వచ్ఛపత్రములఁ గళంకపఱచవలదు. దైవసాక్షిగా నిరువురును నాకు హితులుగాని అహితులుగాని కారు. ఇదిగాక నేనొక్కఁడను ఆకాశమున కెత్తినంతమాత్రమున నిస్తేజస్కులు ప్రకాశవంతులగుదురా? లేక తృణీకరించినంతమాత్రమునఁ బ్రకాశవంతులు నిస్తేజస్కులగుదురా? ప్రాజ్ఞలోకమున నేదియో స్థిరపడి యుండనేయుండినది. ఇంతకును లోకమంతయుఁ బక్షపాతమయమైయున్నది. తారతమ్యజ్ఞానము పోయినది. సత్యాంశిత్వమునకుఁ గాలదోషము పట్టినది. నేతిబీఱకాయలోని నేతితో సంతర్పణములు చేయుచున్నారు. అయిన నోయాధునాతన కవినామకులారా! దైవపదార్థము తన విలాసమును దెలిసికొనఁ దగినప్రాజ్ఞులను మచ్చునకైన నచ్చటచ్చట దాఁచియుంచకపోలేదు. వాణి యొకరిసొమ్ముగాదు. ముక్తెముక్తే సరస్వతి. కాని, విభక్తిప్రత్యయజ్ఞానమయినను లేక రామయబ్ధమైనను దెలియకయుండుటను తెలుఁగు పొత్తములు మూఁచి యందందలి ముక్కల నేంతెచ్చి యతుకుఁబెట్టుచునుండువారు, వ్రాయుటకుఁ బత్రిక లందుఁబాటుగా నున్నవి గదా యని ఉభయభాషా నిరాఘాట పాండిత్యమును సంపాదించి యావ్యవసాయములోఁ దలలు చిదుగఁగొట్టుకొని వ్రణకిణాంకదేహులయి యున్న విద్యాకర్కశులను గ్రుడ్డిగవ్వలక్రిందఁ బీసివేయుచున్నపుడు మానవసామాన్యశక్తికి నూఱట గలుగదు. కావున నవధారుఁడు! ఎంత చమత్కవిత్వముఁ జెప్పఁబూనినను అకారాకారసకారాంత భేదములు, ధర్మధర్మి భేదములు, మున్నగు సామాన్యవిషయము లయినను దెలియవలసి యుండెను. అందుకుఁ బంచకావ్యజ్ఞానమయిన నుండవలెను. అంతమాత్రపు శ్రమకైనను ఓర్వలేక తీరి కూరుచుండి.

యూరక తిరగా విద్యా ప్రాముఖ్యత సంపాదింపవలెననెడు దురాశచే వికట వాదములు చేయుచు బొల్లి కవిత్వములు చెప్పుచు వాణీప్రసన్నుల గడ్డి పరకల వలెఁ దీసివేయుచుందురేని అట్టివారి ముక్కులు పిండి తద్రుధిరబిందువులచే భూదేవికి దర్పణము చేయుటకై సజ్జీకృతాంగుళిపుటులు కొందఱు అప్రమత్తులయి యున్నారని యిప్పటి యమిధునకృత్యప్రసఫలాభాభిలాషు లెఱిఁగి యుందురు గాక. లజ్జ యనునది నిఘంటువులలోనైన దర్శన మిచ్చుగాక. "మహారాజ సుతా వాసి న నూతే— పినా" మహారాజసుతశ్చాపి సకవిః పాండితీం వినా.

(1914 సం॥ ఫిబ్రవరి అభినవ సరస్వతినుండి.)

## నీతిబోధ

మనోరంజనీ పత్రికాసంపాదకుఁడగు ......రావుగారు తమ వ్యాసావచ వంబులు గుంటూరుసీమ, ఆర్యమతబోధిని, సుదర్శని, పత్రికలలో సవిశేషముగఁ జర్చింపఁబడుటఁజేసి, కసిపోక మసిఁబూసికొనినట్టుల సగసమగుమార్గమున విమ ర్శింపఁజాలక కడకు వాగ్వ్యాయామముఁ జేయుచున్నారు ........పత్రికలలో మూఁడుపాళ్ళు తిట్లుతప్ప మఱియేమి కానరాచుటలేదు ... ... వీరికి సద్బుద్ధి గలుగువా రనేకులు గలరు గాని, వారు కులాభిమానులని యపలాపింతురేమో యని మతాంతరుల (వైష్ణవుల) మగు మేమే వీరికీవిధమున నీతిగఱపుచున్నా రము.........

క. ముద్రబ్రహ్మద్వేషంబునఁ, జనివాఁడవు కొన్నినాళ్ళు సత్యంబును గ
న్గొనఁజాలక నేఁడకటా, ఘనుఁ డిర్వతినెంక తేఁకు గర్హించెదవే!

ఉ. పత్రిక చేతనుండెనని వ్రాయఁగఁబోకు మసత్యముల్ సదా
పత్రపపిడి ధీవరులఁబైకొనఁబోకుము చేతిమీఁదుగాఁ
గృత్రిమముల్ లిఖింపకుము కింకవిమత్తగజేంద్రసింహులో
కత్రయభాసమానపర గర్జితముల్ విని మిన్నకుందుమా!

చ. తెలిసియు నిద్రఁబోనకుము దేవుఁడొకండుఁగలఁడు సటం చెదల్
దలఁపుము పుణ్యపాపముల ధ్యానముఁజేయుము కాలికిన్ విసం
జెలమినిఁ గోరఁబోకుము కవీశ్వర వైరము వాల్పఁబోకు మీ
తెలివిడిఁగూర్చుమమ్మఁ బడఁదిట్టకుమయ్యా! గుణంబెఱుంగుమా.

శేషాద్రిరమణకవులు.

మునుపు 'దర్బారుపత్రిక' చాలవ్యక్తముగాఁ బ్రబలించుచుండెడిది. కర్మవశమున నది యంతరించినది. తదుపరి దానిభారమును వహించి నియతముగా మ్రోఁగుచున్నవి 'హితకారిణీ' 'మనోరంజనులు' వీనియందలితప్పుడుఁబ్రసంగమునకు రోసి కొందఱుప్రాజ్ఞులు మందలింపులనువ్రాసి పత్రికర్తకుల పేరనే పంపుచుండిరఁట. కాని వానినిగూడ స్వీకరింపవలసినభార మీపత్రికల కుండుట న్యాయసిద్ధమైనను నివి *స్వీకరించుట లేదఁట. సోదరపత్త్రీయులు దేనిని తి॥ వెం॥ కవులపక్షపుఁబత్రికగా నడుపించుచున్నారో, ఆయభినవసరస్వతిగూడ బ్రచురించుటలేదఁట? హితకారిణీమనోరంజనులలో నేయే పేరులతోఁ దప్పుడు ప్రసంగము వెలువడుచున్నదో, అందుఁ గొందఱయోగ్యతను నిర్ణయింపఁ దగునంశములను లోకమునకుఁ దెల్పినచో వారివ్రాఁతలతత్త్వము తెలుపకయే బోధపడవచ్చునని యెంచి కొందఱట్టిసందర్భములను దెల్పుచుఁ గడు మృదులముగా వ్రాసిపంపుచువచ్చిరఁట! వ్రాసినవిషయములు యథార్థము లనుటకు లవమును సందియములేదఁట! అందుల కితరులసాక్ష్యము లక్కఱయేలేదఁట! ఎవరినిగూర్చి వ్రాసిరో వారే యొప్పుకొనఁ దగియుండునఁట! ఆయాసంగతులు పదిమంది పెద్దమనుష్యులు గలవివాహపుసభలు లోనగు ప్రదేశములకు సంబంధించినవి కాని పరమరహస్యములు గావఁట. అట్టి బహిరంగ సందర్భములను గూడ నభినవ సరస్వతి ప్రచురించుటకుఁ గొంకి 'యేకఙ్ఞానునిష్పన్న నని యే కాలుననియుపేక్షించుచున్నదఁట. వ్యాసప్రేషకులతత్త్వము 'నెఱుఁగక మాపేర వానిని ప్రకటింపవలసిన' దని ప్రార్థనాపూర్వకముగాఁ బంపుచున్నారు. సత్యనిర్ధారణాతత్పరులగు నవ్వారికి మాకృతజ్ఞతా పూర్వక నమస్కారముల నర్పించుచు గ్రంథవిస్తరభీతిచే నవ్వారివిపులవ్యాసములను వదలి యయ్యానఘుల నామములలోఁ గొన్ని మాత్రమిట నుదాహరించుచున్నారము.

(1) చింతామణి రాజగోపాలకవి (2) చేవూరి లక్ష్మణకవి, లోనగువారు.
వీరిలోఁ గొందఱభినవసరస్వతియం దారోపించిన దోషమును దెలుపఁదగు

---

*'... దీనిని హితకారిణికిఁ బంపించియుంటిని. కాని యది ప్రచురింపఁబడలేదు. తిరిగి వ్రాయలేక యీచిత్తునే తమకు పంపించితిని.

చివుకుల అప్పయ్య.

☞ ఈయన దేనిగూర్చి వ్రాసెనో దానిని విస్తరభీతిచే వదలితిమి,

నుత్తరములలో నొకటి రెండిట నుదాహరించెదము.

“ యీ...రావు యిదివరకు తమ నోటీసులోనికి వచ్చినవాడే. యీతడు మా పల్లెటూళ్లలో మిగుల గప్పాలు గొట్టుచూ “వారనగ నెంత వీరనగ నెంత” యనుచుండును ఇట్టి వానికి నేటికి తగిన ప్రాయశ్చిత్తము జరిగినది. యీ సంగతి పత్రికాముఖమున నెల్లరకు దెలియజేయుట సర్వోత్తమమని నా యభిప్రాయము”...పట్టాభిరామశాస్త్రిగారు యిట్టి విషయములలో శ్రద్ధపుచ్చుకొనరు. అనేక పిచ్చి పత్రికలీ కాలమందు ఓంకారం గుర్తనరాని వారలగువారి పిచ్చి వ్యాసములచే నిండియున్నవి...అభినవ సరస్వతి సాహసింపకున్నందులకు చింతిల్లుచున్నవారము. యీ గాథను...తమ గుంటూరు సీమయందుగాని ప్రచురింప ప్రార్థించుచున్నాను. చేపూరి లక్ష్మణకవి 8-2-14.

“ చింతామణి రాజగోపాలం వ్రాసుకున్న విజ్ఞాపన.....ప్రస్తుత కాలమున గాకివు లెందరో తమ యశస్సునకు లోటు కలిగింప యత్నించి నోటికి వచ్చినయట్లు పత్రికలలో గీయుచున్నారు. అట్టి పిచ్చి వ్రాతలనేని జరుగనిచ్చుటంత మంచిది గాదనుట జగద్విదితమే కదా! కాన నట్టివంటి తప్పుడు వ్రాతలకు మీరు స్థానంబు నొసంగుట సమంజసము కాదు గనుక నన్నుబోటి వాండ్లందులకు తావీయుందుముగదా? యీ సంగతి దెలిసియో యెరుగకయో పట్టాభిరామశాస్త్రిగారేదేని వ్యాసమునుగాని, పద్యములనుగాని, సహేతుకముగ వ్రాసి పంపినను బ్రచురింపక మిన్నకొనుచున్నారు. అందుచే ‘సీతకారిణి’ మొదలగు పిచ్చి పత్రికలకు జనంబులు రాక నిలవ యున్నవి. యింతయేల యీమధ్య......గారికి...వలన కలిగిన పరాభవమును క్లుప్తముగా వ్రాసి పంపుకొని యున్నాను. అది యేమగునో తెలియను ...”

చింతామణి రాజగోపాలం. 14-1-14.

పత్రిక యనంగా వివేచనాజ్ఞానము కలదియే గాని యన్యము కానేరదు. ఆంధ్ర, కృష్ణ, సువర్ణలేఖ, లోనైనవి మొదట నీ శాఖాభిమానుల తత్త్వము తెలియకయో, అభిమానులలోని పురుషులలోఁ గొందఱు కార్యస్థానముల నుండుటంబట్టియో మోసపడి పదపడి కన్ను తెఱచి యిప్పు డిప్పు డీ గొడవనుండి విరమించినవి, కాని విరమించునప్పుడు పై పత్రికలలోఁ గొన్ని చాల సయుక్తికముగా విరమించిన వని వ్రాయక తప్పదు. ఆయీ సందర్భము, వేమవరపు

పత్రికలో వారి వారి స్వహస్త లిఖితములగు జాబులవల్లనే తెలిసికొనవచ్చును. అది యటులుండె, పత్రికృతము

క. ....మతియెఱిఁగి యెఱుఁగనేరని, కఱటిం దెలుపంగఁ గమలగర్భుని వశమే. ( భార-ఆది-౪-౮ )

అను తెలుఁగున వర్తించు పత్రికల రీతిం దెలుప నందలి వ్యాస మొకటియే నుదాహరింపక "నీటిలో గేదెను బెట్టి బేరము చెప్పుట యుక్తము" కాదు. స్థాలీపులాక న్యాయమున నాయయుక్తప్రసంగము కొంచె ముదాహరించి చూపుచున్నారము.

(1914 సం॥ 4-11 వ జనవరి తేదీల హితకారిణి నుండి.)

...మరి నాల్గు దినములకు కవుల కంకణముల సభ జరిగెను. మూతక సామ్య చందంబున "ఎక్కడో కొడితే ఎక్కడో రాలిన పన్నట్లు" ఎక్కడ వేమవరం? ఎక్కడ గుంటూరు? ఎట్లాటి అనుధానం! ఆహా గుంటూరుసీమను బడ తిట్టిన దిట్టకవులకు తిర్గి గుంటూరునందు నిట్టి కంకణములు వగిగించుట చిత్రము. చివరకు బుట్టి గుంటూరేదక్కవెయ్యాగా యీ కవులకు!......అనగా దీని కంతకు కారకులు గుంటూరు నైదికోత్తములు గొందఱని యూహింపనగును. ఈ రోజులలో ఒక చిన్న పిల్లవాడైన ఒక పనిని చేస్తే 'థ్యాంకుయూ' అన్నట్లు ఊ-ఊ అంటె మెడల్సు, కడియాలు, గాజులు, ఉంగరాలు, తాళిబొట్లు, మున్నగు బహుమానాలు. పూర్వకాలంలో యెంతో గొప్ప పండితుడైతే దుశ్శాలువలు బహుమానం యిచ్చే టప్పటికి యెక్కువ. నక్షత్రకుడు.

ఏ 'నక్షత్రకుఁడో' యేదియో వ్రాసెనే యనుఁడు ఇందేమి స్పృహణీయమగు నంశ మున్నది. ఇందు నక్షత్రకుఁ డింకను నెంతో *సోదె నెళ్ళఁ

---

గుంటూరు గుబగుబలు. సానిపాట, కవులు.

* ఈ నెల 16 తేది రాత్రి 9-30 గంటలకు వెంగళూరు నాగరత్నం పాటకచేరి జరిగి యుండెను...... ముందు కవులకు గంకణాలు తగిలించి తరువాత రాత్రి సానిపాట అని అనుకున్నారట. కాని యేకారణమువల్లనో ముందు పాట జరిగినది. 20 తేదీని కవులకు కంకణముల బహుమానము జరిగినది. రాత్రి సానిపాటకు కవులు హాజరైరి...... అటుగాక యొక చక్కని సిద్ధాంతమును వెలిబుచ్చిరి. సానులు వివాహమే చేసుకొనినచో జనులకిట్టి యానందమెట్లు

శాట్టైను. అది యటులుండె, ఏమైనను 'హితకారిణి' ప్రచురించు నితరవ్యాసములకన్న భాషావిషయమగు నిక్కృష్టతలో నిది చాల మెఱుగు, ఎట్టి బూతుం గూఁతలేని యిది ప్రచురించెడి నను రహస్యము నీ 'నక్షత్రకుఁ' డెఱుఁగఁ డని తలంచెదము, లేనిచో నిటం డింత మృదువుగా వ్రాయఁడు, మఱియు నీవిచార గ్రస్తుని విచారమును బ్రచురించిననాఁటి "హితకారిణి"యే వేఱొకట నీక్రింది యక్షరములను బ్రచురించినది.

"ఈ నెల 18 వ తేదీ రాత్రి 3 న్నర గంటలకు శ్రీరాజా మంత్రిప్రగడ భుజంగరావు బహద్దూరువారి జ్యేష్ఠపుత్రికకు... పాణిగ్రహణ మహోత్సవము

---

జరుగునని యందున సానులు వివాహము జేసుకొనక యిట్లుండవలెనని యువిదించి మరీ కూర్చొనిరి. ఆహా! ఎంత నీతికోవిదులు...... ఇంతకు 'మాలాటి వారు లేరు' అనే గర్వం యెన్నంత వరకు సత్యము (తి॥ వెం॥ ల) కనులకు గోచరముకాదు......"

నక్షత్రకుని ప్రలాపము నిజస్తోత్రము చూపఁబడినది ఈప్రలాపమునకు నాఁటి గానప్రశంసాపద్యములకును గల సంబంధమును వివేచకులు నిర్ణయించుకొందురుగాక యని నాఁడు ప్రకటింపఁబడిన పద్యము లీక్రింద నుదాహరించుచున్నారము.

శా. గానంబుల్ విను నేర్పు కాకనుము నాగస్త్రీలకున్ గాన వి
ద్యానైపుణ్య మటంచు జెప్పికొనువారల్ మాపఁగాఁ బుట్టె నే
డో నాగాంగన యంచు లోపలఁ దలంతున్నన్న; నీగానవి
ద్యానందామృతవార్ధిలో మునుఁగు వార్యశ్రేణి నాగాంగనా!

తే. గీ. స్వరము రాగమ్ము పురుషుల సరణిఁ దోఁచు
మధురిమము పూవుఁబోఁడులపాలి సొమ్ము
చాటుగా నాగరత్నము పాటవిన్నఁ
బురుషుఁడో లేక కాంతయో యెఱుకపడదు.

ఉ. పాడుము రెండటో యెటులు పాడిననున్ 'మగవాని గానమున్
బేడెల సంస్కృతంబును రుచింపు' నటంచు వచించె మున్ను నే
నాఁ డెల శూద్రకుం డన్నృతవాదిగ నేఁటికిఁ దోఁచకున్నె! పూఁ
బోఁడులు నాగరత్నమును బోలెదు వాం ద్రుదయింపకున్నచో.

జరిగెను...... సోదరకవులకు మణిఖచిత స్వర్ణపతకములు చెఱియొకటి శ్రీరాజా గారొసంగిరి... బిరుదము నిచ్చిరి''

'శతపత్రికుని' తుట్టతుదివిచార మీ 'సోదరుల' కిఁకఁదప్పిదావాదులకుఁ దగులకుండుఁగాక. అది యటులుండె, నీహితకారిణి ననుసరించి మేము సవరింప వలసిన దొకటి కలదు. పూర్వరంగపీఠిక 2 వ పుటలో—

'తిరుపతివెంకటేశకవిధీరులఁ దెల్పెద మిమ్ముఁ దెల్పెదన్'

అని సవరించితిమి. ఇంతకన్న హితకారిణీమనోరంజకములలో గణింపఁదగిన యంశ మింమకయుఁ గానరాదు, పూర్వరంగము 51 వ పుట 28 పంక్తిలో

వేమూరి నృసింహశాస్త్రి, శతావధానీ,

అని సవరింపవలెను, అందుకుఁగల బీజ మీక్రిందియుత్తరము తెల్పును

''శ్లో॥ కేచిచ్ఛ్రీతిరుపతి వెంకటేశ్వరకవీ... గురుతా హేతూకవీంశప్రియే॥

శ్లో॥ తెనాలిపుర్యాం శివరామశాస్త్రి, ప్రసిద్ధతె సాధు శతావధానే అశీరం
పద్యమిదం సభాయాం, పత్రికస్థితపద్యే ప్వాతిమ్స్ప్రష్టచిత్తః॥

వేమూరి నృసింహశాస్త్రీ, శతావధానీ

---

శా. పెండ్లాడఁగ లె వేశ్యలందఱకటా! పెక్కండ్రు; నీజాతికిన్
బెండ్లింక్లే యగుచో సుధామధురమ వ్రీడాకరంబౌనటుల్
చెండ్లంబోలు స్వరంబులన్ విసరుచాచున్ రాగముల్ పాడుపూఁ
బోండ్లన్ జూచుట గల్గునే సభల నెప్డున్ నాగరత్నాంగులన్?

చ. అచలశిరమ్ములన్ జలన మందఁ దొడంగెడి 'నాగరత్న' పున్
విచికిలగంధి గానపుఁ బ్రవీణత, కన్యనిమిత్తమై సదా
పచలన మందు శీర్షములపాటులు వాకొన నేల? సద్వచో
రచనకు నట్టి గానపుభరమ్మునకున్ జగమెల్ల నూఁగెడిన్.

ఉ. "రాగములేదు నా'' కను విరాగి మనమ్మునయందు సైతమున్
రాగము పుట్టఁ జేయునది రాగము; రాగిమనమ్మునం దెటో
రాగము పుట్టఁజేయునది రాగమె?'' యన్ వివరం బెఱింగి తా
నాగమణీగళంబు గలనాదము లీనె మనోహరమ్ముగన్.

తిరుపతి వెంకటేశ్వరులు.

'హితకారిణి' లో నంతమాత్రమేని గణింపఁ దగినయంశము కలదు గాని 'మనోరంజని' లో లవముగు గానఁ బడలేదు. దానిపోకడలు కేవల కుతంత్రము లకుఁగాఁ బాటుపడుచున్నవి. ఆయంశ మీ క్రిందిపంక్తులు తెలుపఁ గలవు.

(15 జూలై 1913 సం॥ మనోరంజనినుండి)

"...మండలేగా- గుంటూరు సీమ మొదటనే నియోగు లందఱు స్త్రీలనియు, వైదికులందఱుఁ బురుషు లనియు, దమ వెఱ్ఱిధోరణిం గొంత బయటఁ బెట్టుకొనిరి..."

ఇది తనవలెఁ బల్వురకున్నగా శాఖాభిమానమును వినియోగింపని సహృదయులను నియోగిశిఖామణులకు 'పుల్లింగము ల' పెట్టుతలఁపుతో వ్రాసినవ్రాఁత. భవతు, వ్రాయుఁగాక, నియోగివైదికుల యైకమత్యమును బోధించు సాత్త్వికదేవరసుగా నియోగులం సంభావించిన యవమానాల్పమునం తో మూర్ఖుని నాపాదించుచున్న యీయొక్కగాని వేఱొకటిగాని యీవిషయమున కంటకన్నఁ బక్కన యుపమానమును సేకరించి చూపినచో మేము సగ్గాని శిరసావహించి పుచ్చుకొనుచున్నారము. 'స' అంటే పుంశబ్దము 'ఊ' అంటే, శబ్దము, నారాయణా, అంటే, బాలుమాటయునుగాఁ బ్రసంగించు జ్ఞానలవదుర్విదగ్ధ శంకయగుటచే 'స్త్రీం సుకోపము' మత్తోంపబడియె, దగిన సమాధాన మవసరములేని యదుగుచో * సాంఖ్యమతానుసారముగాని, ‡ దేవీభాగవతరీతిచేఁగాని, † ఆలంకారిక మతసందర్భమునఁ గాని యియ్యెడ వ్రాయఁదగిన ప్రమాణములు చాలఁ గలవని విజ్ఞులరయుదురుగాక. పనిలోఁ బని. మనోరంజనీ, హితకారిణి లించుక యుత్తర మిచ్చినదని చెలఁగుదగు వేఱొక విషయమును నూర్చి ముక్కుంచినవి. అవి యీక్రింది సందర్భములనఁ దెలిసికొనఁదగు.

---

*(1) అజామేకాం లోహితశుక్లకృష్ణాం బహ్వీంప్రజాం జనయంతీగ్ం సరూపామ్॥

‡ (2) శ్లో॥ బ్రహ్మాదయస్సురగణా నతుకిం యదుక్త్యా... శ్లో॥ త్వంనాస్త్రీ పుమాన్నచ పుమాన్...... (దేవి-౧- స్కం) శ్లో॥ నాహం స్త్రీ నపుమాంశ్చాహం నక్లీబం......(దేవీ-3 స్కం,)

† (8) తద్భిన్నత్వే సతి తద్గత భూయోధర్మవత్త్వం సాదృశ్యమ్।

(పరిషత్పత్రికనుండి)

పరిషత్పత్రికాపాఠకోత్తములారా!

2 సంపుటము 2 సంచిక చిట్టచివర నాపద్యములలో

(1) "అష్టభాషలకు" అను సీసములో గీతి తక్కఁ దక్కినది "సర్వశూన్య శతకము" నుండి యనువదింపఁబడినదని యెఱుంగవలయు ...............

దివాకర్ల, తిరుపతిశాస్త్రి.

(1913 వ సం॥ నవంబరునెల 1 వ తేదీ సుదర్శని పత్రికనుండి.)

"మీ "రోజా మంచిదని- పట్టపగలే కన్నమా" అను స్థూలదృష్టి వ్యాసముఁ జూచితిని. అందు మీరు "నాయీసంశయమును నివారింతురుగాక" అని నన్నుఁ గోరుటయేగాక తుట్టతుద నన్నుద్దేశించి కొంత వ్రాసియున్నారుగ .. "అష్టభాషలకు" అను పద్యము సర్వశూన్య శతకములోనున్నను అది తిరుపతిశాస్త్రిగారికవిత్వమేను. ముమ్మాటికి వారిదేను ..."

ఇట్లు, (Sd) కృత్తివెంటి గంగరాజు.

ఇతరులది గాని, తనది గాని, యన్యత్రక్లృప్తమైన దానిని నేఱొకచో గ్రహించుట[*] యనువాద మనఁబడును. ఇందులకు 'కాళిదాసు తిక్కన' లోనగు మహాకవుల ననేకులఁ బ్రమాణముగాఁ జెప్పనొప్పగు అదియటులుండె. ఇతరాధీనమౌ చేసినపద్యమును మరలనాత్మసాత్కరించుటమాత్రము తప్పు గాదా, అని యందురేని, ఆరోపమునకు మే మిప్పటికేఁ జిరకాలము క్రిందటనే పరిహారము వ్రాసియున్నారము చూడుము

(1908 సం॥ లో వచ్చియున నానారాజసందర్శన పీఠిక నుండి.)

(పండితుండనెడి) యనునది. 2 వ పేజీలో నస్మత్కృత మయ్యును నితరకవి కృతమని విధిగామిమ్ము భ్రమింపఁజేయునది కలదు. దానింగూర్చి వ్రాసిన గ్రంథము విశేషించి పెరుఁగును. గాన నయ్యది యస్మత్కృతమే యనియును నితరకవికృతమైన గ్రంథములో మేమే పూర్వము దానిని సంస్కరించునప్పుడు కృతినాయకుఁ డందులకు నిందులకు నొకఁ జేయుకుటచేఁ జేర్చితి మనియుఁ జదువరులూహించి మాపద్యమును మేము తిరిగియుఁ బుచ్చికొన్నందు

---

[*] "సిద్ధస్య కథనమనువాదః"

సవిధస్థాననిరర్గళప్రకటభాస్వత్సత్ప్రభాశోభిస
త్కవులౌ తిర్పతి వేంకటేశ్వరులతోఁ గాల్ ద్రవ్వవార్ మీరలే?

మ. నిమిషానేకవిశప్రబంధరచనానిర్నిద్రవిద్వత్సమా
జమనీషాప్రియసద్రసప్రథితసత్కావ్యాంభదత్యాగ్ఘటీ
పరిమాణాలంకృతసత్కవిత్వవిలసత్పాండిత్యగాంభీర్యదు
ర్గములౌ తిర్పతి వేంకటేశ్వరు లనంగా దోమలై తోఁచిరే?

మ. సతతప్రస్ఫురదాంధ్రసంస్కృతకలాసందర్భవిస్తీర్ణస
త్ప్రతిభాశక్తిసమ్మోహితప్రతిపక్షప్రాంతప్రభావాఢ్యలం
కృతసద్వత్కవి మూర్ధరత్నసతతసత్కీర్తిస్ఫురన్మాత్రస్వస
మ్మతులౌ తిర్పతి వేంకటేశ్వరులతో మారాడనోరాడునే?

శా. చండీసత్కరుణారసాప్తకవితాసామ్రాజ్యధౌరేయతా
ఖండైశ్వర్యయశోభిమండితదిశాకాండప్రచండార్భటీ
పాండిత్యాశనిపాతసాధనదృఢప్రావాతాద్రినిర్భేదనో
ద్దండుల్ తిర్పతివేంకటేశ్వరులు వాదం బేటిక వ్వారితోన్.

కరవది ⎫ పిశుపాటి చిదంబరశాస్త్రి,
ఒంగోలు ⎭ శతావధాని

క. అను పద్యంబుల వేగన్, ఘనదీర్ఘలసత్సమాసకంబులతో నేఁ
బనిచితి వారలకడకున్, బనిబూని లిఖింపరైరి ప్రత్యుత్తరమున్.

చ. కవియన నెట్టిఁడో యతనికావ్యమదేమొ యతండు దేనినిం
దవిలి పఠింపఁగా నగునొ తత్ఫలితమేమొ పదార్థశుద్ధి యెం
తవఱకు నుండఁగావలెనొ దాని నెఱుంగని యట్టివారలన్
గవులని చెప్పఁబోఁ గవులు కానిజనుల్ జగమందునుందురే!

క. తెలిపితి మీకీసంగతి, నలఘుయశోభాసురా! యిదంతయు నీలో
కులకుం దెలిపెదరనియెం, చి లలిన్ గ్రహియింపుఁడీ విశేషములెందున్.

పిశుపాటి చిదంబరశాస్త్రి.

(జనవరి 1914 సం॥ అభినవ సరస్వతినుండి)

**సుకవిరిపుకపోలచపేటము.**

ఇంచుమించు నాలుగు సంవత్సరములనుండి శ్రీ తిరుపతి వేంకటేశ్వరకవుల మీఁదికిఁ గొందఱు పండితంమన్యు లొంటికాలిపైన లేచుచున్నారు. అందగ్రగాం

బూలపువారు గీరతకారయితలు, తరువాత వారు గుంటూరుసీమలోని కథానాయకులు, అటుపిమ్మట వారి పైవారల ననుకరించువారును,...... శ్రీ కవివరులపైనిపుడు మన్యులు కాలుదువ్వుటను గుఱించి పూర్వ మెన్నఁడో తాతలకాలమునఁ జేసిన వీరిదిగ్విజయసమయమున నంతపాటివా రెవ్వరును లేమిచే నెటో కనులు మూసి గంతకట్టి యశముపడసిరనియు నిపు డెందఱో మహానుభావులు విలసిల్లుటచే వీరియాట లింకసాగ్రమును సాఁగిరాకున్నవనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. కాని ప్రకృతపు మన మన్యులవలె శ్రీ కవివరుల దిగ్విజయసమయమునందలి పండితశౌండులు స్వశక్తి నెఱుంగక "యేనకేనాప్యుపాయేన ప్రసిద్ధఃపురుషోభవే" త్తను శ్లోకప్రమాణానుయాయులమందలితో గణింపఁబడి బుధజనపరిహాస యోగ్యత నిచ్చగింపక గౌరవపరిరక్షణము గాపాడుకొనిన సంగతి వారు (పైవిధముగ నభిప్రాయపడువారు) గమనింపలేకపోవుట శోచనీయమని వ్రాయవలసివచ్చినందుకుఁ గష్టముతోఁచుచున్నది......శ్రీ కవివరులవలని పరాభవము సహితము గ్రంథస్థమై శ్రేయోదాయకమగుటంబట్టి మన్యుల కెట్లుచూచినను లోటుగలుగదు......ప్రస్తుతపు మన వృథామత్సరగ్రస్తుల చారిత్ర మెంతవ్రాసినను లేఖకులకు పనువు పుట్టవలసినదేకాని యెప్పటికిని దుదముట్టునట్లు తోఁపదు; కనుక నిఁకనొక పద్యమును మాత్రము వ్రాసి మా లేఖిని కొకింతవిశ్రాంతిగలిగింతుము.

సీ. భట్టవర్యులలోన దిట్టయౌ నన్నయభట్టారకుని కాదిఁ బుట్టువొంది
చాళుక్యవంశసంజనితుఁడౌ రాజేంద్రుతోరంపు ముంగిట దోఁగియాడి
అలకృష్ణదేవరాయలవారిసభలోనఁ దకదింధిమంచునృత్యం బొనర్చి
తంజాపురీశునాస్థానమంటపమందు మంతుకెక్కఁగఁ జాల అంతుసల్పి

గీ. ఇపుడు కవిపంక్తి మృగేంద్రులైన
పరస తిరుపతి వేంకటేశ్వరుల యింటఁ
బీఁటనెట్టుక సొంపుండెఁ బృథులహావ
భావరసపేటి సత్కవితావధూటి.

సికిందరాబాదు
8-7-1913

ఇట్లు,
చివుకుల వేంకటాచలశాస్త్రి.

---

మామా తారతమ్యము నెఱుఁగని వారెవరు? మాకుఁ దెలియకున్నను నితరులకుఁ దెలిసియే యున్నది. ఈ క్రింది వాక్యములు గూడఁ దిలకింపుఁడు.

## (1) హితోపదేశము.

“కొప్పరపుకవులు నియోగులైనందున్ను శాఖాభిమానముచేఁ గొందరు కల్పించిన కారణమువల్ల యీ రెండవ కలహము కలిగినదని ప్రతిమనుజునకును తెలిసిన యంశమే...పండితకవులలో అద్వితీయులని ప్రఖ్యాతి గాంచి... బ్ర॥ తిరుపతి వేంకటకవులు సంపాదించిన విశాలమైన కీర్తియే యితరులకు కన్నెఱ్ఱజేసి యిట్టి కలహములకు కారణభూతమైనది. నియోగిశాఖాభిమానులు న్యాయపక్షత లేకనే సోదరకవులను పురికొల్పి ఆవరకు వారికి బ్ర॥ తిరుపతివేంకటకవులయందున్న భక్తి విశ్వాసములను నశింపజేసి దుఃఖదాయకములగు ఇట్టి కలహములు కలుగఁజేసినందుల కెంతయు చింతింపవలసియున్నది...... లేనిపోని ద్వేషములను మనసునందుంచుకొని పండితతిరస్కారమునకు పురికొల్పుట మిగుల సాహసము. దేశానర్థదాయకము, పరిహాసాస్పదము...పండితులైనవారు వైదికులయిననేమి నియోగులయిననేమి మఱియొక శాఖవారయిననేమి...కావున ఓ నియోగి సోదరులారా! మీ రెంతయు కేవల దుఃఖాస్పదమయిన యీ విప్రవియోజకపు కలహములయందు ప్రవేశింపక దేశహితార్థము పని నొనరింపవలయునందులకు త్రికరణశుద్ధిగా మిమ్ములను వేడుకొనుచున్నాను. కలహముల నుపసంహరింపుడు; నిష్కళంకమైన మనములతో విచారింపుడు లోపములున్న క్షమింపుడు ”

జగ్గయ్యపేట. ఇట్లు, హితము గోరు, ములుగు సుబ్రహ్మణ్యం

“... అట్లుగాక తాతతప్పు వివరించెడునాడి శాఖాభిమానము మొదలగు కొన్ని వైషమ్యములను మనసునందుంచుకొని తిట్లకు దిగవలెనా? తమ నియోగ సోదర సంఘ బలమున్నదని భావించి తిరుపతికవులకు ప్రతిపక్షముగా నున్నట్టియు పాండిత్యమునందు తగుపాటి సామగ్రిలేనట్టియు శ్రీ కొప్పరపు సోదరకవులతో జరుగుచున్న తిట్లతో కూడినవద్వల్ల భాషకుకాని దేశమునకుగాని యెట్టిలాభమును లేదని నాతలంపు. యీ కొప్పరపువారు గురుకులవాసముచేసి పాండిత్యము గడించియుండలేదను సంగతి యందరకును విదితమే, కాని వారియందభిమానముగలవారు మాత్రము వారియం దెక్కుడగణ్యాపము తెచ్చిపెట్టుటకు తమశక్తికి మించిన ప్రయత్నము చేయుచున్నారు. యింతమాత్రమున వారికిలేని పాండిత్యమును గొనితెచ్చెదరా?... వారికున్న పాండిత్యమునకు తగు గౌరవము నిచ్చిన చాలును. బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటకవులతో అకారణముగా తమస్థితి తెలియుంగక కలహమునకు దిగుటచూడ కొండతో డీకొనవెంచు గొఱ్ఱెపోతుచందము జ్ఞప్తికి వచ్చు

నుబ్బయ్యగారిటు నుడివిరి. "శాస్త్రిగారూ! నాటిసభయందు సోదరులనుగూర్చి ...పద్యములు చెప్పుటకు మన సొగ్గకయూ చెప్పుచుండినచో బంధుమిత్రుల మనసు నొప్పింపజేసినవాడ నవుదునని యెంచి ఎట్టకేలకు...అను నర్థముగల పద్యములను జదివితిని ... యీ పద్యములు సోదరులు విని ... లోనున్నా వంశీకుల తోనున్నా పోల్చిరేకాని తమ్మునుగూర్చి పొగడలేదని ... యిదిగాక బ్రహ్మశ్రీ తిరుపతివెంకటేశ్వరులకు సంబంధించు అవాచ్యపరిసంగములు సభలో ప్రారంభించుటయె కాక వారి నేమో సాధించెద మనియెదరు,... అనాదినుంచి హెచ్చుకు ఏనుగునున్నా, తగ్గుకు దోమునున్నా పోల్చుటకలదు గాని వీరిపట్ల దీనిని కూడా వుపయోగపర్చుటకు తగదని నేను చెప్పెదను" యీ సంగతులు బాలేమర్తి గ్రామములో బాలేమర్తి లక్ష్మీనరసింహంగారి యింట్లో చర్చించబడినవనిన్ని యథార్థములనిన్ని నేను చెప్పుచున్నాను."

కలవకొలను రామయ్య, వరపు రామకృష్ణయ్య, యీనాందారు, పెద పరిమి, మకాం, కొడపటికల్లు, నందిగామపోస్టు, కృష్ణాజిల్లా.

## 20. November 1913.

వీరవలెనే బ్ర॥ శ్రీ॥ వేదము వెంకటరాయశాస్త్రిలవారుగూడఁ దమయంతరంగము నొక సంపన్నగృహస్థునకు నొసంగియున్నారు. ఆయంశమును దెలుపు మత్తరము నేమిటు నుదాహరింప నసమర్థులము. లక్షోటాప్రశ్నగాఁ జెప్పుచున్నారము, వారి యంతరంగము వేలు, ముక్కోటికిని వేలు, వేలు, వేలు. దీనినిటులుంచి శ్రీశాస్త్రిలవారి మెప్పు నీక్రింద నుదాహరించుచున్నారము.

(1914 సం॥ జనవరి 3 వ తేదీ కృష్ణాపత్రిక నుండి)

"...వేంకటరాయశాస్త్రిలవారు చెప్పుటలో ... అన్ని పద్యములును మిగుల బాగుగా నున్నవి. లోపములే కనుపించలేదు. (ఉభయభాషలయందును) వారికిగల సమర్థతను శ్లాఘించుచున్నవి..."

పైయక్షరములలో మిగుల సంశయింపవలసినది, మాచేఁ గుండలీకృతమగుభాగము, దానిఁగూర్చియే శ్రీ శాస్త్రిలవారికి మున్నుదాహరించిన సంపన్నగృహస్థుత్తరమును వ్రాసినది. ఇంతవఱకు నడచిన ప్రసక్తియెల్ల మేమెఱింగినదియే. ఇట్టిప్రసక్తికిడిన ప్రత్యుత్తరమే చూడరాని కట్టుబాటులతో వచ్చినది. అందలి సంగతులచే మే మనుమానప్రమాణమువలన గ్రహించినది. మాయను

మఱిలోఁ బొరపాటున్నచో శ్రీశాస్త్రులవారు తెలుపఁదగుదురు. వారు సర్వథా పెద్దలు. మా యనుమానమును బలపఱుపఁదగు మఱికొన్ని బీజము లుదాహరింపఁబడుచున్నవి.

ఏలూరు 20-1-1914.

“...మహారాజశ్రీ మంత్రిప్రగడ భుజంగరావుగారి లోపల వివాహము నాల్గవరోజున మహారాజశ్రీ కొప్పరపు కవీశ్వరులను ...పార్వతీపరిణయము చెప్పుమనగా చెప్పినారుగాని యేమీ బాగాలేదు. గంటకు 75 పద్యములు చొప్పున చెప్పినారు. ‘ఆశుకవి శిఖామణి’ యని బిరుదుకూడా యిచ్చినారు. తరువాత ... గారు వీరిని వెంటపెట్టుకొని... దగ్గరకువెళ్లి అడుగగా నిరసన భావము చూపుటవల్ల మోతేవారి ... పడితే వారు ఒకసభ చేయించినారు ఆరోజునకూడా బాగాలేదు,... వీరికి వచ్చు బిరుదులన్ని స్వశాఖాభిమానులు యిచ్చినట్లు తోస్తుంది...”

Ellore,

5-2-1914. గుండు వెంకటకృష్ణమూర్తి

“తాము వ్రాయుచున్న గుండువారికీము రెండవభాగము తయారు అయిన వెంటనే వి. పి. ద్వారా నాకొకపుస్తకము పంపించగోరుచున్నాను. కొప్పరపువారికిని మీకునుగల వివాదమందు విద్యావిషయము పరిశీలించుటకన్న శాఖాభిమానమధికముగా యుండుటచే వారు ఆ వేషములతో సంచారముచేయుచున్నారు. యీమధ్య యిచ్చట మోతేవారి ఆఫీసులో కొప్పరపువారు చెప్పిన ప్రహ్లాదచరిత్ర ఆశుకవిత్వముల్ల వారి పాండిత్యపటుత్వము న్యాయబుద్ధి కలిగినవారికి తెల్లమైనది ... సభా మధ్యమున కొండగుంటూరి నాగభూషణకవి గారు ప్రశ్నించగా అది తప్పించుకొనుటకు యెన్నో తప్పుదారులుత్రొక్కియు తుదకు మాకు అంతే తెలుసునని పెల్లడిగా కవులు నుడివిరి ... కొందరు శాఖాభిమానులు... న్యాయవాదులమని పేరుపెట్టుకొని ... న్యాయబుద్ధివిడిచి ... అడ్డము వచ్చిరి......”

చిత్తగించవలెను

Ellore T. Ramanjulu Naidu

మఱియు పేరిపూడి ప్రకాశముగారను నొక విద్యావయోవృద్ధులానాఁటి సభకేగి వచ్చి ప్రసంగవశమునఁ జెప్పిన యుత్తరము లాయీయా యుత్తరములను

కొంటిమి. ఆయీ విషయము పరిష్కృతమైన కంతగా సంబంధించినదికాదు. ఈవివాదము శాఖాభిమానపరియుక్తమైనదిగా నెంచఁదగదను నియోగిశిఖామణు లనేకులు గలరు. ఈయంశము ప్రస్తవపడుపఁదగు ననుభూతాంశములెన్నో కలవు. అందొకటిమాత్ర మిట నుదాహరింపఁబడుచున్నది.

చ. ఒకదినమందు గర్తపురి కొండొక డాపునఁ గట్టుచున్న పే
టకడఁ గనంగనయ్యె నొకటన్ సుగుణుండు నియోగియొక్కఁడు, డం

---

...లేదీతనికి ననిఁ తజ్జ్ఞులగు బుధుల్॥ శా॥ 'శబ్దజ్ఞానము లేదు సుంతయయినన్ సాహిత్యమున్ లేదితం। డబ్దంబుల్ ప్రభవాదులన్ జదువునట్లాత్మీయపద్యావళిన్। శబ్దం బాకసమంటఁగాఁ జదువు నిశ్శంకంబుగా వర్షహీ। నాబ్దధ్యానముఁ బోల్పవచ్చుఁ గవితా వ్యాహార విట్లొప్పునే':: క॥ అని తమలోఁ దమరను కొని। కని కొప్రపుటతని కనిఁ 'కవిపోటకు నెం। దును జాలవీవు చదువుము? తెనుఁగున్ సంస్కృతముఁ బిదపఁ దీప్యము కవితన్'... తే॥ గీ॥ మనుచరిత పద్యములుకొన్ని... గొప్రపుంగవిగున్న... యంప టపు డిపిహీ యని మండలింపఁ... సీ॥ ఒకరు వ్యస్తాక్షరి నొసఁగెడుమన దాని యత్నంబుఁ జేయలేదని యను గవి। కావ్యపాఠంబు నొక్కఁడడుగఁగా వానిఁ జదువలేదని చెప్పె సరసతముఁడు। ఒగిఁ బురాణార్థంబు నొకరు కోరఁగ నెప్డు చెప్పుట లేదని చెప్పె మేటి। ఒక రతురనిషేధ మొనరింతుమన్న నెక్కుడు భారమగునని యుడిగె ధీరుఁ। తే॥ గీ॥ డిట్లు ధారణ, పాండితి నెఱుఁగకయె వ। ధానమని పదుగురకుఁ బద్యముల జెప్పె। నెల్లజను "శిహిహీ" యని యెల్లుగోలఁ। జేసి రిదె వారి యవధాన మాసుధీందర్... ఉ॥ అంతటఁ గొప్రపుంగవి... వెంకనన్ దగడ... నీరసవ నిప్పుడే... పాడుఁడాయనెన్॥ క॥ అనవుడుఁ గవి భయ మెదఁగొని। చనియెన్... తే॥ గీ॥ ఆర్య! వీరలు మాపురమందుఁ జేసి। నట్టిపని యిదియే పొందినట్టి గౌర। వం బిదియె వేరొకటిలేదు వారలచటఁ। బరిమదమున నాడునుడులు దబ్బఱలు వినుఁడు... ఉ॥ కావున సత్కవిత్వమును గానని యిట్టి కవుల్ వచింతు మి। ధ్యావచనమ్ములన్ గలఁత నందకయుందురుగాక మానవుల్। భావమునందుఁ బండితులఁ బల్మరు మెత్తురుగాక సత్యమం। దోవఁ జరింత్రుగాతఁ జెడత్రోవలఁ దోఁగక కాపురపుంగవుల్॥

ముదిగొండ నాగవీరేశ్వరుఁడు, కశన్దుబజారు, శికిందారాబాదు.

తను మును మమ్మతండు విదితమ్ముగఁ జూచినవాఁడు గాఁడు, వి
న్కి కతనఁ బూర్తిగా నెఱిఁగి కేవలసత్తుఁ డితండు మాయెడన్.

ఉ. ఆపుహితుండు మాయెదుటి కాదృతిమైఁ జనుదెంచి మ్రొక్కి 'యో
స్వామి! భవద్యశంబు విని సారెకు దర్శన మాచరింప నెం
తే మది నూరుచుందు సుకృతోదయ మిర్వురఁగూడ మిమ్ముఁ దా
నీమెయి నీపురమ్మునకున్ యొట్టులొ తెచ్చెఁ గృపానుషంగియై.

ఉ. ఐన మఱేమి మిమ్ము మనసారఁ గనుంగొని మాటలాడు పు
ణ్యానకు దూరగుండను గదా! మఱి నేను నియోగినౌట; న
య్యో! నయమింతలేక తమయోగ్యత, యన్యులశక్తి, పూర్తిగా
లోన నెఱింగియుండి చపలుల్ కలహం బిది వెట్టి రీసునన్.

క. "కలికుక్కి గంగిగోవుగ, విరచింపఁగ నెంచి" రంచు విని నెమ్మది "నీ
చరితము'హాలికిక్కి పుక్కిటిపురాణ, మ''నియెంచుకొందుఁ బూర్వంబెపుడున్.

మ. ఇపు డెటువంటి ప్రాజ్ఞతములేని జగమ్మున నుండవచ్చు నం
చపరిమితమ్ముగాఁ గలిగె నాఱనినమ్మిక, లేనిమాట తా
నెపుడును బుట్ట దొక్కయెడ నెట్టులొ పుట్టిన నిల్వనేర దే
చపలుఁడొ యట్టివాఁ డొకఁ డెసంగుటనే జనియించె వాసదుల్.

చ. అది యటు లుండనిండు మనమందఱి కోరకి దీర్చుకోఁగ మీ
పదయుగదర్శనంబునకు వత్తునొ, వెంటనె కక్షులోనిదు
ర్హృదుఁ డెవఁడేనిఁ జూచి మఱి యేమనునో యని సంశయింతు, దు
ర్మదులకు నక్కటా! కలదె మంచియుఁ జెడ్డయు నడ్డమాకయున్.

చ. "అతఁడు నియోఁగిగావఁ దగఁ డాసనసత్కృతి" కంచు మీరు వ
ల్కితిరె? వృథాగ నెందులకు లేపిరి కక్ష నియోగివైదికవ్ర
తతికి? విద్దయున్నయెడఁ బక్షము యుక్తము; విద్ద లేనిచో
వితగద పక్షపాత, మవివేకుల పద్ధతు లిట్టివేకదా!

చ అని తన నెమ్మదిం గలుగునట్టి యథార్థము నెల్లఁ జెప్పి తోఁ
చినగతి నొచ్చుకోఁ దొడఁగె; వ్యయు లోవఱ్చెడిదానినైన స
జ్జనులు దురుద్యమంబును బ్రశంస యొనర్పరు గాని వారణం
బునకు యతింపఁ గొంకుదురు మూర్ఖులకున్ జగమెల్ల జంకఁగా.

ఇట్టినిష్పక్షపాతులను గణింపక మాసోదరులు తప్పుడుసృష్టులు లోనగు కార్యములచేఁ దమకుఁ దోడ్పడ నుంకించు సామాన్యులను మిగుల గౌరవించుచు న్నారు. ఆసృష్టిస్వరూపమింతకుమున్న 1 వ ఘట్టములో నుదాహరించినదిగాక, (పతెం నరసింహయ్యలేఖమూ) మఱియొకటి యిటఁ జూపుచున్నారము.

(మక్కీకిమక్కీనకలు) 28-7-13

“...మీరు ప్రకటించిన గుంటూరుసీమ అను అబద్ధపు పుస్తకము పత్రిక 41 పేజిలో మీపుస్తకమును ది 1-3-13 న తేదిన నాకు వీ. పీ. గా పంపింపుమని కోరుచు నొకజాబు వ్రాసినట్లు ప్రచురించి యున్నారు. అట్టిజాబును మీకు నేనెన్నడును వ్రాసియుండలేదు. ఆయుత్తరమును మీరే యాధారమున బ్రచురించితిరో వెంటనే తెల్పవలయును.”

పోతరాజు నరసయ్య, సంగాగుంటూరు పోష్టు.

ఈ యుత్తరముఁ జూచి మొదట వ్రాసిన నరసయ్యగారే వ్రాసియుందురని మామనస్సాక్షికి వచ్చుట లేదు, అందలి సంతకమునకు, ఇందలి సంతకమునకు, లేశమును పోలిక లేదు, అయినను నిందలి తత్త్వము తెల్పుటకు నిజమైన నరసయ్య గారు ప్రార్థించుచున్నారు. ఆ యీ మాయవేషములెల్ల మాందు శ్రీ ... పులు ప్రకటింపఁబోవు ‘నాస్తికశాస్త్రము’ లోనగు నూతనగ్రంథములయందుఁ జూడగలము, తత్ప్రతిక్రియ యగు ‘నవనాటకరచన’ వారి తత్త్వమును దెల్పఁగలము, కావున నిటఁ జర్చింపవలసినది లేదు, సోదరులిట్లు కావించుచున్న పరిశ్రమనెల్ల * నెక్కొని ప్రకృత ... భోగము లనుమాగ్రంథములను మాయింపవలయునని తప్ప వేఱొకటిలేదఁట! ఇందులకు వీరు నాక వారిపేర వ్రాయు నుత్తరములు కడు శోచ్యస్థితిలో నుండుటయు, ఆకారణమున వీరు వారివారిచే మందలింపఁబడుటయుఁ బ్రత్యక్షముగా మే మెఱుఁగుదుము, ప్రకృతము సోదరు లొనర్చుచున్న.—

‘కష్టము కిష్టారాయునికే యెఱుక’

---

* గుంటూరు 17-2-14

...గడచిన సంవత్సరం ది 14-6-13 తేదీన వేమవరం అగ్రహారం నివాసి గ్రామ కాపురస్తుడు ... అనువారు మీపేర వ్రాసిన వుత్తరం వేమవరం శతావధాన పీఠికలో నుదహరించియున్నారు. ఆవుత్తరమునకు వ్యతిరేకముగా

సర్వథా వారియుద్యమము ఫలించుఁగాక, ఇంతకుమున్ను తమకైయాత్మను సంచించి యవాచ్యములను బ్రచురించిన ప్రల్లదులకు వీరు చూపనెంచిన కృతజ్ఞతాస్వరూపము నీక్రింది సోదరుల యుత్తరమువలనఁ దెలిసికొనవచ్చును.

"శ్రీ పోతరాజు లక్ష్మీనరసింహ సత్కవికి, ప్రియమిత్రమా! మీకాహ్వానపత్రికలు వచ్చియేయుండునుగదా ... మీకు పినకొండ, సాలస గ్రామములలో రెండుచోట్లను సన్మానశూన్యమయ్యెను ... మీకు ప్రథమముగా శ్రీ విద్వత్ప్రభువర్యునిచే సన్మానము చేయింపవలెననియు, ... మీ పేరచ్చట వెల్లడిచేయవలెననియు, ... దలంచితిమి, ... కాన ... 15 వ తేదీ సాయంకాలమున కిచ్చటికి తప్పక వచ్చితీరుడు మీకుఁ జెప్పవలసినసంగతులనేకములు గలవు, ... అది వివాహము, ... కావున, ... ధరించు వస్త్రములు. ఉష్ణీష చెప్పనక్కఱలేదుగదా, ... 1, 2 తావులకాగితములు, ఒక పిన్నులు, ఉండవలయును, ... ఇట్టిసమయములో మీరు వెల్లడికి రానిచో నిఁక నెప్పటికిని, ఏలూరు, ముప్పాళ్లలోసాహుకార్లు ఎప్పుడు సభచేయింతురా, అని ప్రతీక్షించుచుండవలసినదే కాని వేఱుకాదు, ... కాన రేపుసాయంకాలమునకు మిమ్మురమ్మని కోరుచున్నాఁడ, ... ఆంతరంగిక మిత్రత్వకారణమున నిట్లు వ్రాసితిని, ... చి॥ మన్నికంటి (గురునాథుని) యొద్ద వివాహాహ్వాన పద్యరత్నావళియను మా పుస్తకమొకటికలదు, దానితో నత్యవసరము, కాన దానిని విచారించి ... వీండ్రచే బంపవలెను,..."

12-12-13 ఇట్లు భవన్మిత్రుడు,

కొ॥ వెంకటసుబ్బరాయశర్మ.

... బాలదాసత్వమునకు (విశ్వనాథునిఁ) బుత్తెంచుము.

---

షుమారు నెల రోజులక్రిందట సోదరకవులు ... గారు కొవ్వూరం వెళ్లగా వారికి విందుచేసి పద్యములచే భూషించి "ఆవుత్తరంలోని సంగతులు నాకు తెలియవు, యెవరు వ్రాసినారో" మొదలైన సంగతులతో వారి స్వదస్తూరిని నొక వుత్తరం సోదరులు వ్రాయించుకున్నారట ... మీకు వుత్తరం మొదట వ్రాసి తిరిగి యీలాగు వారికి వ్రాసియిచ్చుట చిత్రముగావున్నది, ..."

W. V. Subbayya.

ఇందుఁ గుండలీకరింపఁ బడిన గురునాథ విశ్వనాథులే గురువిశ్వనాథ కవులు, అనుపిల్లదులు, ఇల్లెండఅనో సోదరులు కవుల వౌసర్పుచున్నారు దూరగులు మోసమున మునుఁగుచున్నను దగ్గఱవారు నొచ్చుకొని * నిజమును దెలిపుచ్చుచున్నారు. ఆ యీ 'గూడుపుఠాణీ' లోని కొంపఱయోగ్యతలను దెల్పు వ్యాసములనే యభినవసరస్వతి యుపేక్షించినట్లు వెనుక వ్రాసియుంటిమి. గ్రంథవిస్తర భీతిచే మేముగూడ వారివారి వాక్యములనెల్ల నిందుదాహరింప లేకపోతిమి. విషయమంతయు వ్రాయజాలకున్నను శైలీ ప్రదర్శనార్థమై కొన్ని యక్కరములను మాత్ర మిట నుదాహరించెదము.

(1)...సీ॥ గుడ్డిపుల్లమకడ వడ్డదిడ్డపుఁగూఁతలను గూయుటాయని యనెడివారు... తే॥ గీ॥ తనదు బండారమును మంగతాయియొద్దఁ, జూపఁగా వలెనో యంచుఁ జోద్యమనుచుఁ, బలువిధమ్ములఁ బలికిరి పాప మతని సరసులైనట్టియా సభాస్తారులెల్ల॥ తే॥ గీ॥ లౌకికజ్ఞానహీనులు లక్షణంపు, వాసనను గొంచె మెఱుఁగనివారలెల్ల, సుకవులకు శోభఁగూర్చెడు సుజనులగుట, వారు చిరజీవులై యుండవలయుఁగాక.

---

*... తమకు "హెచ్చరిక" అని వ్రాసినకవీశ్వరులు యేసు తెలియనివారు. వారిని గురించి క్రిందవారి విశేషంబులు వ్రాయుచున్నారము. గురుకవిగారి యొక్క బుద్ధిబలముఁ ఈ క్రింది సంగతులవల్ల తెలియును. ఒకసు రేలూరిలో జమీందారుగారి కొమార్త వివాహవిషయంబులో 'కొప్పరపు కవీశ్వరులకుయేమి బహుమానము యిచ్చినారు'. అని అడుగగా మెడల్సులు యిచ్చినారు ఒకొక్కటి 30 శవర్లుయుండునని చెప్పెరి. యెంత వెడల్పు, యెంత మందము, వుండునని ప్రశ్నించగా అర్ధణా వెడల్పు అర్ధణా మందము వుండునని చెప్పినారు వారి యొక్క బుద్ధిబలము దీనిలో తెలియును. విశ్వనాథము అను కవికి 10 సంవత్సరములు వచ్చినపిదప 'కృష్ణా' అన మనినయెడల 'కుత్నా' అనెడివాడు యిప్పడు యితనికి 15 సంవత్సరములు వయస్సు యుండును. ఈ సంగతులను బట్టి వారి యొక్క సంగతి మీరే గ్రహించ కర్తలు. 'హెచ్చరిక' అని వ్రాసినపద్యములు కొప్పరపు కవీశ్వరులు వ్రాసి వీరల పేరులు పెట్టినారు. విశ్వనాథము అనే అతను పోతరాజు లక్ష్మీనృసింహ కవిగారి సహోదరుడు........"

(చేవ్రాలు,) 10-1-14

సాలసగ్రామం, ఫిరంగిపురం పోస్టు, గుంటూరు డిస్ట్రిక్టు.

(2)...మ॥ వినవయ్యా న్ గడు హేయపద్యతతి తద్విఖ్యాత కారుణ్యచే తను నాతండదివిన్నదాదిగను జింతన్ జేయఁ జొచ్చెన్ గవీ, శని మర్యాదను జేయు హెచ్చుగఁ; గవీశుం డద్ది గాంచంగ లే, కనుమానంబొక యింతలేక కడుధైర్యం బొప్పసుండెం బురిన్॥ ... ఉ॥ పాపము...లకుఁ బాలుగనయ్యెను శర్మశాస్త్రి యుం, చాపలు గాకి కిట్టిలనె యంతట సంతట నైనఁగాని తా, నేపను లెల్ల మానఁ, దని యింతసె యాతఁడు సిగ్గునొందనే?, 'యీపని గొంత వాని' కని యెంచెడి వారును నైరి వీటిలో॥ ... సీ॥ ఓదార్పవచ్చిన యోడఁ జే 'రిది నీకు మర్యాదగా' దని మరలువారు ... "తగనిగర్వంబూనెఁ దగినలాభం బొందెఁ గను బుద్ధినిఁక" నని చెనెడివారు॥ గీ॥ పలువు రను బలువిధములఁబల్కి పల్కి । యేడ్చువానిని మఱి మఱియేడిపించి । యెట్టెమన్నుగఁజేసి రే నేమివాసితు, నెంతయైన స్వభావోక్తి రీ కొఱంత॥ ... సీ॥ "పప్పికూఁతలుగూసి ... దనువారెల్లఁ గవులనఁబడ" రటంచు ... తే॥ గీ॥ పురమునందలి పెద్దలు పాలుపుమీఱ, నాడి సిద్ధికాంచిరి యంతనుండి, యింటిలోనుండి వెల్వడఁ డెంతకష్ట. మన్న నాతని కోరాగ! యహహ! కర్మ॥"

— — —

పాపము, సోదరు లీపాటివాని మంచితో ప్రకటింప వచ్చువారేగాని, పరోగం జనీ, హితకారిణులవ్వారి నేమో యుద్ధరించుననుభ్రాంతి వెనుకకు లాగుచున్నది. అవి చేయుచున్న యధిక ప్రసంగములకు సుదర్శనీ పత్రికాధిపతికన్నఁ జక్కని హితబోధకులు దొరకరనుట నిక్కము. కాని యిప్పుడిప్పుడాయనం గూడ నవి తిరస్కరించి దూషింప మొదలిడుచున్నవి. సోదరులో! వానికన్నను మించి ప్రసంగించుచున్నట్లు పూర్వసంగమునఁ బెక్కు సందర్భములు చూపఁ బడినవి. ఇందు వారి రిజప్టరు త్తరము చదివిన వారికి వారివాచాటత పూర్తిగా గోచరించె డిని. వారి హృదయమునకుఁ గడు నికృష్టముగా నెక్కినమా 'గుంటూరిసీమ' పూర్వ రంగము ప్రాజ్ఞుల కన్యథాగా దోఁచుటకుఁ గారణమేమో సుంత విచార్యము కాక పోదు. గాన దద్బోధకములు గొన్ని యుత్తరము లుదాహరింపఁ బడుచున్నవి.

# అభినందనములు

తమ సీమ పూర్తిగఁ జూచితిని. కడు రసవంతముగనున్నది. తత్రాపి 'యతిక్కంచి త్సంస్కారులు' అను కందమునకు సాటిమఱియొక పద్యము లేదు, ..."

మ. అవురా! శీతధరాధరేశ్వరగుహావ్యాప్తాతిగాంభీర్యగ
ర్వవిసారిత్వదుదారవక్త్రవిసరద్వాగ్జాహ్నవీపూరధా

ఈ పద్యములు ...నాశరీరము చాలశోచ్యావస్థలో నుండుటచే నింతటితో నంతరింపవలసివచ్చునేమో యను శంకచే నిప్పుడు పంపుకొంటిని. నాయందు దయయుంచి వీనిని గ్రహించి నన్నాశీర్వదింపుఁడని కోరుచున్నాను.

2-9-13. రాళ్ళబండి వెంకటసుబ్బశాస్త్రి.

---

Guntur.

......నిన్నటిదినమున నామూలాగ్రముగా తమ సీమంజదివితిని. చదువునప్పుడు ప్రత్యక్షరము మేన గగుర్పాటు కలిగించె. ఇది అతిశయోక్తికాదు. కొన్నికొన్ని భాగములయందు తాము యాథార్థ్యమును వెల్లడింప వ్రాసిన వ్రాతలు చదువుచో నాకు గన్నీరుపొడమె. విశేషించి కొప్పరపు తప్పుడుజాబు ఘట్టమున మీరు చేసిన కష్టము, మీరు వెళ్ళినపోకలు, తిక్కనను మఱపించినవి. భారతపు ఫక్కియంతయు మీకొక్కరికే యలవడినది. అపరతిక్కన యని మిమ్ముదలంచుచు మీహస్తమును కన్నుల నద్దికొంటిని. ఇంతకంటె నాసంతోషము వెల్లడింపలేను. ప్రతిపక్షులైనను నీగ్రంథమును దీక్షగా శిరసావహించి తీరవలయునని నానమ్మకము.

B. Lakhmikantam.

...గుంటూరుసీమ చేరినది దానిని... అందుకొంటిని. దానిని చదివిననాటి నుండియు నాకు కలిగిన యానందమును మీకు వ్రాయజాలను. మీరువ్రాసిన వ్రాతకున్న మాగుంటూరులో అన్యాయముగా, అక్రమముగా జరిగిన అల్లరికి యేమి భేదములేదు. తమరు వ్రాసిన పుస్తకములవల్ల మాగుంటూరులో 'సత్యవాదుల' మనియు, ...దొంగపేరులు పెట్టుకొని సంచరించుచున్న వారియొక్క డంబము అణచినది అని నేనురూఢిగా వ్రాయుచున్నాను. మీయొకటిపక్షము వారి యొక్క...కట్టివేసినది..."

11-4-13 గుంటూరు. మాటూరి బసవయ్య.

చ. తిరుపతి వేంకటేశ్వరులు తెంపరులై మనకొప్రభుం గవీ
శ్వరుల పృథాగ దూఱిరని వ్రాసెడువారికిఁ దారతమ్య సం
కరముగఁ బల్కువారలకుఁ గాఱులఁ బల్కెలందుఁ జోలు దీ
వరులకు 'రామరక్ష' యన వచ్చును గుంటురుసీమ కెంతయున్.

ఉ. ఎక్కడి వేంకటేశ్వరుఁ డిఁ కెక్కడి తిర్పతి ! రామకృష్ణులే
దక్కఁగనీరు వారిఁ, దగఁదక్కఁగ నిచ్చినఁ గొప్పపుంగవుల్
నిక్క విచల్పఁగా గలరు, నిశ్చయమం చని వ్రాయుచున్న య
వ్వాక్కులు వ్యర్థముల్ సలుపువారల మిమ్ముల నెన్నశక్యమే.

సీ. "భువి మహాకవులతోఁ బోకిన ననుభవించక తప్పునా ! యంచుఁ బల్కువారు
"తిరుపతి వేంకటేశ్వరు లనఁ దిరుపతి వేంకటేశ్వరు లం" చు వినుచువారు
ఆత్మకూరాది రాజాస్థానగత కథాభాగంబులను జ్ఞప్తిఁ బట్టువారు
ఎదిరించ మునుపు వాయినిఁగట్టినట్టి పెద్దలచరిత్రలు మదిఁదలఁచువారు

తే. గీ. నిన్నగాక నె మొన్న నిందించినట్టి
రామకృష్ణులు దృష్టాంతరంబటంచు
సారెఁదలపోయఁ జేసె గుంటూరిసీమ
విబుధమండలమందు వ్యాపించువేళ.

మ. ఎలమిన్ గొప్పపుజల్లిసీమయును మీ రీవ్రాయు గుంటూరు సీ
మలఁ జేఁ బట్టి నిజంబుఁదేల్చుకొని నమ్మన్ వచ్చు సత్యంబు ని
శ్చలచిత్తంబున నంచుఁ బూనితిమి యోసాహిత్యయుక్తుల్, వియో
గులనున్ వైదికులన్న నొక్కటియె మాకున్ బెక్కు లింకేటికిన్.

సోదరకవులు { నూపాటి తిరుమల శేషాచార్యులు.
వేంకటరమణాచార్యులు 5-5-18.

... గీరత, గుంటూరు సీమలయొక్క భాగము లచ్చుముగిసినతోడనే నాకు ఒకప్రతి కొరకు నా పేరును రిజిష్టరుజేసికొని...కృతజ్ఞతా బద్ధుని గావింపవేడు చున్నాను...నిన్నటిదినమున కొప్పరపు వెంకటసుబ్బరాయకవిగారి గ్రామము దేరగా గుంటూరుసీమవలన వారిమస్వభావము నెరిగినవాడ నగుటచే, అయ్యా! గుంటూరు సీమందిలకించితిరా? తమజల్లిసీమ యేమైనద ? ని యడుగ, నేమేమో ప్రగల్భములంబలికి జల్లిసీమ నెలదినములలో వచ్చుననిరి...గుంటూరు సీమయొక్క పూర్వరంగమును తనివిదీరగాంచితి. కొప్పరపువారి యసత్యపత్రికటవలును తమ సత్యనిర్ధారణలును మధురసుధాధారలొలుకు తమ కవితానైపుణ్యమును నాకే గాక సర్వాంధ్రులకమందానందము నొసరించక మానదని ఘంటాపథముగఁ జెప్పక తప్పదు.

మాకరాజు నారాయణరాజు. గుంటూరు 17-4-13

గవర్నమెంటు ట్రయినింగుస్కూలు.

... గుంటూరుసీమ చదివితిని. అఖండమగు మీకవితయందలి కథావిషయగమనము అత్యద్భుతముగ నున్నది. ఈకథా సంవిధానపరిపోషణ ఆంధ్రవాఙ్మయమునందు ఒకరిద్దఱు సనాతన కవులయందు తిక్కన, పినవీరభద్రుఁడు తక్కలాఁతి యెడలఁ గనుపట్టదు..."

హెడ్మాష్టర్ తిరువళ్ళూరి 2-7-13.

రాయప్రోలు సుబ్బారావు.

...గుంటూరుసీమ పూర్వరంగమను గ్రంథమును ... నందుకొంటిమి... సదరు గ్రంథము మాసంశయములను బోగొట్టి నిజమైన విషయములను దెలియఁజేసినందులకు మేమెంతయుఁ గృతజ్ఞులము. "నిజమునిలకడమీఁద దెలియు" నను లోకోక్తి కల్లగాదుకదా! వేయేల! సర్వవిధముల యీగ్రంథము సప్రమాణముగాను, పక్షపాతరహితముగను, చరిత్రాత్మకముగను, వ్రాయఁబడినదనుటకు సందేహము లేదు. దీనింగాంచిరయ్యెనను గలవాదనలు మౌనముద్రను వహింతురుగాత.
Secunderabad Daccan. ఏ. యల్. రామకృష్ణులు. 30th March 1913

ఉ. చూచితినండి 'సీమ' పరిశుద్ధవచోనిచయాభిరామ వి
ద్యాచతురప్రమోదఘనధామ, యథార్థకథానకోక్తిమ
ద్రాదణకామ, గ్రామ్యకవితంత్రబహిష్కృతిదేవభామ, యం
బాచరణాంబుజాతరసబంభర! శ్రీపతి వేంకటేశ్వరా!

శా. ప్రాచీపశ్చిమదిక్స్థితాంధ్రకుకవిప్రాణానిలాహీంద్రమై
వాచాదోషవిషక్తరిక్తజనతావక్త్రపటూసారమై
భూచక్రప్రకృతిప్రమాణలతికానూర్జద్వసంతర్తువై
తోఁచెన్ జుంటి చరిత్రయుగ్మము కవీంద్రశ్రేణి చూడామణీ!

క. గీరతమా! యత్యద్భుత, ధీరులపసఁ దేల్చె 'సీమ' తేల్చె సహోత్థ
శ్రీరాజులపస; నార్యులు, చారుప్రజ్ఞులు భవత్ప్రశాంతికి మెచ్చన్.

భాషాత్రయశాలి. 22-4-13 గుంటూరు అగ్రహారం

D Ramaswami Sastri

ఉ. దైవముఖమ్ముఁ జూచి సమరన్ వహియించి చరిత్రయుగ్మమున్
భావవిదుల్ సెబాసనఁగ వ్రాసితి రౌనసుశైలిఁ దాము, మీ

చేవ యథార్థ గౌరవ విశిష్టము శిష్టజనైకవేద్య మో
దేవ ! భవత్ప్రతాప మతిధృష్యదరిప్రతిబంధకం బహో!

గీ. సకలలోకమ్ములకు సత్యసత్త్వమిట్టి
దనుచుఁ దేల్పంగఁదాము వ్రాసినచరిత్ర
'సీమ' నాకొండుప్రతి వీ. పి. చేరఁజేయ
వెంకటకవీంద్ర మ్రొక్కెదవేవిధముల.

మాగంటి వీరరాఘవశాస్త్రి. 24-8-13

...గుంటూరిసీమ యను వివాదాంశగ్రంథమును నామూలాగ్రముగా జదివితి... సోదరకవులకును మీకును గలిగిన వివాదసందర్భములో మీ తప్పేమిలేనట్లు యీ గ్రంథమువల్ల యథార్థము బయల్పడినది...ఉత్తరరంగము గూడ ... బంపగలందులకు ప్రార్థించుచున్నాను. ఖరీదు ఎంతయిననుసరే ముందు పంపుమని సెలవిచ్చిన బంపెదను.

చించినాడ వేంకటరత్నశాస్త్రి బెజవాడ 29-4-13

గీ. సిరులఁజెన్నొందు గుంటూరుసీమ ప్రథమ
రంగమునుగాంచి తుష్టాంతరంగుఁడైతి
సెలయ నుత్తరరంగము వేమవరశ
తావధానము వీ. పి. గాదయనుబంప,
గోరి వందములుసేతు కోర్కెమీఱ

చివుకుల పిచ్చయ్యశాస్త్రి.

స్కూల్సు సూపర్వైజరు, పొదిలె, నెల్లూరుజిల్లా, మకాం తర్లుపాడు 21-7-13

ఉ. కనుఁగొనలేక మీప్రతిభఁ గల్లను లల్లిన ప్రల్లదంబులన్
గని విని యబ్బు పండితుఁ డొకండు శతంబున కైన నున్నె? యుం
డిన నలదిక్కటాహముల నిండి పయిన్ బయిఁ బొంగి నింగిఁ బా
కెడి భవదీయకీర్తిలహరిన్ నిలుపంగ నెవారలోపెడిన్.

చ. అవధుల కూళ లేరొకొ యహంయువులై తమనోటి యానుపో
ప నుడువు రిత్త పల్కులను పంచనకల్లు సె? "యూరకుక్కకూ
సినరొద జంగమయ్యకిలఁ జేటగునే?" బుధులేరు విన్న నీ!
యనుచుఁ జకారగుళ్ళఁ సగరా నగరా మొగమెత్త నిత్తురా.

ఉ. "అక్కనమాదనల్ తెలుఁగునందల మెక్కనరమ్ము సాటికిన్
నిక్కుచుఁ జెప్ప కట్టపయి నిస్త్రపతేన్ వెస నిల్చుమాడ్కి" నా
రొక్కటరెంటఁ బామరులయొద్ద రహఃకుహనావధానముల్
జక్కనొనర్చిరన్నఁ దమసాటికి వత్తురె? తక్కుఁగైసదుల్.

చ. అనవసరంపుఁ జివ్వకు సహాయము పూనై విఫలోగ్రశాఖ దార్
పెనఁగొని మున్గడించు వెనువేసవి నీటఁగలంచినట్టి నీ
వినయవివేకశాలులు లికఁదెగ్గెల వీడి రహస్యలంబులన్
గొనఁగుటమాని యిష్టయిన 'గుంటురిసీమను' మెచ్చికొఁగావగున్.

క. సారతరహృద్య పద్యస, ధారననిష్యందిత గీతముబలె నరయన్
మీ రచిత, సీమ, రసంబై రాజిలె నఖిలసూరు లోనని మెచ్చన్.

రామడుగు సీతారామశాస్త్రి. 14-1-14

... "గుంటూరుసీమ" చేరినది ... మిక్కిలి శ్రమకోర్చి ఆయాపత్రికల యందలి విషయములను ముందెన్నడో గ్రంథము వ్రాయుదలచుకొని సేకరించి గ్రంథము తయారుచేసినందువల్ల తమకు 'చాణక్య' బిరుదము సార్థకమైనదానినిగా దలంచుచున్నాను. తాము జనులని వ్రాయించిన విషయములలో నేను పత్రికలయందు చూచినగుటచే యిందునిగాలించి మాత్రము అన్యతము వ్రాసితిరని నేతలంపను.

వేమూరి సుబ్బరామశాస్త్రి. ఆళ్లమూడి 6-6-1

గీ. అంతియేకాక నారాయణశాస్త్రి మొకఁడు,
బయలు వెడలి గుంటూరుసీమ పటిమనెల్లఁ
జించి చెండాడి వెనుఁజూపఁ జేయునఁట! యుఁ
కేమి ప్రతికెక్కు గుంటూరి సీమపద్య.

గీ. కాన నారాయణశాస్త్రులు గ్రమ్మరయును
మాడుసేయక మున్నె సమ్మోదమలర
నారయన్ కోరినాఁడ గుంటూరిసీమ
లోని యుక్తిరరంగమ్ము లోకవినుత.

తెలికెపల్లి రామచంద్రశాస్త్రి. 25-2-14

శ్లో॥ ...పూర్వరంగ మమలం దృష్ట్వాఽఖిలం మానవ
స్స్వాంతే మోదముపైతి సంత్యజతి శాఖాపక్ష పాతాదికం.

తీఱగా కైకొనలేదు. ఈలోటు రాంబోవు 'నమస్కార' గ్రంథపీఠిక తీర్చుఁగాక యని యింతతో విరమించుచు నిఁక నిందలి తప్పులంగూర్చి కొండొక చర్చించుచున్నారము. ఎచ్చటనేని యతిప్రాసములు, వ్యత్యస్తము లగుటంగూర్చి ప్రాజ్ఞులు గణింపరు. అది భ్రాంతిమూలకము, అనివార్యము, దానింగూర్చి యితరులకు గోచరించినంత గ్రంథకర్తకు గోచరింపదు. ఆవిషయము కనిపెట్టుటకుఁ బాండిత్యముతో నవసరములేదు. యతిస్వరూప, ప్రాసస్వరూపములను దెలిసికొనుటకు సరిగా 5 నిమేషములకన్న నెక్కుడుకాలము పట్టదు అట్టి స్వల్పవిషయమును గూర్చికూడ దిసంతులు గొట్టువారు నేఁడు బయలుదేఱుటచే నీకాలముయొక్క దుస్థితికిఁ జాల విచారపడవలసియున్నది. పరిష్కృతము, హితకారిణీ. మనోరంజనులు నాకుఁ దప్పులు చూపఁగలయుననియెంచి పైరీతి తప్పులనే యన్వేషించి యవాకుచవాకులను వదరుచున్నవి. ప్రథమముద్రణమునందలి స్ఖాలిత్యముల నిటీవల సవరించితిమను మాటకూడఁ బాటింపక యీపత్రిక లూరక ప్రేలఁగమొదలిడుట మఱియును విచారణీయము. స్వాత్మదౌర్బల్యప్రకటనమునకై తమంతఁ దామే పలువిధముల సాక్ష్యము నిచ్చుచున్న యీపత్రికలు చూపు తప్పులెట్టివో తెలుపుటకుఁ బ్రకృతగ్రంథమునుండి కొన్ని యుదాహరించుచున్నారము.

"ఉ। ద్యామహేంద్రులు పశ్యశబ్దముపైని సారెకుఁ గొందఱు

ఇందు విశ్రమము పొరఁబడినది దీనింబట్టి యజ్ఞతను సమర్థింపనెంచుచో తి। సం॥ కవులకు, యతియన నేమో తెలియదని కాని, అక్షరజ్ఞానము లేదని కాని, మొఱఁగవలసియుండును. ఈమాట విశ్వసింపఁజేయుట కడుఁగష్టము. ఇట్టి ప్రయత్నమునకుఁ బాటుపడువార లేమనవలయును? మఱియు,

డం। బలగు నిస్సాగి సైనికులు నందుచునుండుదురు.

(పూర్వరంగము 4 వ పుట 16 పంక్తిచూ)

ఇందుఁ బ్రాసము పొరఁబడినది, పైపద్యము రేఫప్రాసకము కావున, అలరు, ఒరయు, అందు, ఒందు, గా మార్చికొన్న సరిపోవచ్చును. యతివిషయమున 'పశ్యశబ్దము తప్పుగాదని కొందఱు' అని సవరించుకొనవలెను. ఇట్టి భ్రాంతిప్రయుక్తములగు స్వల్పలోపము లెందఱుచేతనో యెన్నిసారులో సంస్కరింపఁబడుచువచ్చినను భారతాదులయందుఁగూడ నిప్పటికిని క్వాచిత్కముగాఁ గానవచ్చుచున్నవన నస్మదాదుల లెక్కయేమి! భ్రాంతివశించినఁగాని యీలోపములు

పఠింపవు. అది ప్రపంచముతో పాటుండఁదగినది, బ్రహ్మాదులుకూడ దానికి దాసులు. ఇది విషయాంతరము. ఇంకను వ్రాయవలసినవి చాలనంశములుగలవు. వ్రాసినవానివలనఁ దక్కినవి యూహించుకొందురుగాక, పూర్వరంగోత్తరరంగములలో సూత్రప్రాయముగా నాయావివాదకు సంబంధించిన యాపద్గాథయు విముడ్పఁబడినది. అది ఆసనచర్చయు, అంతము వేమనరావధాన ప్రయుక్తమగు సమ్మానమును నని రొటుఁవది, ఆసమ్మానసమయమునందలి పద్యములుమాత్ర ముదాహరించి విరమించుచున్నారము.

చ. తిరుపతివేంకటేశ్వరసుధీకరయుగ్మ మలంకృతంబు చే
సిరికద! కంకణంబులఁ బ్రసిద్ధులు వల్లూరు చెన్నయామల
బ్బురమున సంతసంబు నెడఁ బొంపిరివోవఁగఁ జూచుచున్నయం
తఱినయనంబులం దపి కనంబడుమన్న ననేమి చిత్రమో.

తి॥ శా॥

ఉ. గోడకు వెల్ల వేయుట టది గోడహితమ్మను గోరి కాదు మో
మోడి భవత్కుతూహలము నోమఁగ సింగపుమేల్మిబంగరుం
బోఁడిమికంకణమ్ము లివి పూనుచునుంటిమి యిందు కర్థ్మమో
వాఁ డెవఁడో, యెఱుంగఁగల ప్రాజ్ఞులు మృత్యులు నేఁడు చూడఁగన్.

వెం॥ శా॥

శ్రీమత్పరదేవతాయై నమః.

# గుంటూరిసీమ - ఉత్తరరంగము



శ్లో. ఉన్నతం పద మవాప్య యో లఘు, ర్హేలయైవ స పతే దితి బ్రువం
శైలశేఖరగతో దృషత్కణ, శ్చారుమారుతధుతః పత త్యధః.

(రసగంగాధరము)

శ్లో. యద్యపి నదతి సరోషం, మృగపతి పురతోఽపి మత్తగోమాయుః
తదపి నకుప్యతి సింహో, విసదృశపురుషేషు కః కోపః.

(అలంకారశేఖరము)

శ్లో. సంత స్సచ్చరితోదయవ్యసనినః ప్రాదుర్భవద్యంత్రణా
స్సర్వత్రైవ జనాపవాదచకితా జీవంతి కృచ్ఛ్రం సదా
అవ్యుత్పన్నమతిః కృతేన నసతా నైవాసతా వ్యాకులః
కృత్యాకృత్యవివేకశూన్యహృదయో ధన్యో జనః ప్రాకృతః.

(కువలయానందము)

(సదుపదేశము)

చ. వలదు నియోగివైదికవిభాగము, కొంపలు మున్గు దాన, వ
ర్తిలుఁడు యథానుపూర్విగ, విధేయులు విద్యకుఁ గందు; శాఖకుల్
బల మిడ నెంచి స్కంధమును బాయఁగఁ ద్రోచు టదేటితెల్వి! పూ
ర్వుల హృదయం బెఱుంగుఁ డని బోధ యొనర్పఁ గదమ్మ, శాంకరీ!

చ. వలదు నియోగివైదికవిభాగము, వల్వ దసత్య గోష్ఠి, ము
గ్ధులను విదగ్ధులన్ సరిగఁ దూఁచెడి తక్కెడకై ప్రయత్నమూ
వల, దవలాభముల్ గిలుక వల్వదు వల్వ దటంచు నంబ! శే
వలదురితంబుగా నడుచు వ్రాఁతల కాళ్ళ కురుల్ ఘటింపుమా!

చ. వలవని కోర్కులం బడినవా రెవరున్ దుద నెగ్గ రేదు, [illegible]
కలియుగ [illegible] గూడ సత్యము నె [illegible] గాని [illegible]

ద్దలకుఁ బ్రవర్తి లేదు, ఋజుధర్మము పట్టి చరింపుఁ డంచు మా
ర్షుల మసికొల్పు పెద్దలకుఁ గొండొక బోధ యొనర్పు మంబరో!

గ్రంథప్రవృత్తి.

ఉ. సత్య, మసత్య మంచు మనుజన్ముల మంచికిఁ జెడ్డకున్ సదా
దాత్యము సేయుచుండెడి పదార్థములం దొకదాని కిం కొకం
డత్యయమున్ ఘటించెడి యథార్థపదార్థము నిల్ప యోగ్యులున్,
బ్రాత్యులు వేఱొకండు నిలుపన్ బ్రయతించుచునుండ్రు శాంకరీ!

చ. నిలిపిన నిల్వఁజాలని దనిత్య మసత్యము, నిల్పకున్నను
న్నిలిచి యొసంగఁజాలినది నిత్యము సత్యము, సత్వరప్రభా
కలన కదే నిమిత్త మది గావలెఁ గావున దానికై మహా
త్ములవచనంబు లూఁత గొని పుస్తక మియ్యది సేతు మంబికా!

ఉ. నోటుకుఁ గాలదోష మది నోటియొడన్ గొఱ గాదు, కాన నె
ప్పాటనొ యుక్తి సేయుడు నపర్ణత గల్గదు, తప్పుతోఁ బ్రపలం
దాఁటెడివారి రజ్జులు వృథా, ఋణమిచ్చి యపర్ణుఁడున్ ద్విష
త్కోటి నెదిర్చి పేర్చి కవికుంజరుఁడున్ వెలుఁగొందు నంబికా!

మ. మనవాఁ డెవ్వఁడు? సత్యముం బలుకు సంపత్కామి, యన్యం డెవం
డనృతం బాడెడి దేబె, యీనియతికిన్ న్యాయైకదృష్టుల్ ప్రభుల్
దనియన్ బ్రమొగ్గెద; రన్యులో, మొఱకులై "తాఁబట్టుకుందేటికిన్
జమఁ బాదత్రయమే" యటన్న నుడికిన్ దాసానుదాసాగ్రణుల్.

మ. ధనమున్ జూడరు, వేషభాషలకు బందల్ వోరె లో జంక, నె
వ్వని కేగౌరవ మంతె కాని యధికత్వం బొప్పఁగాఁ బోరు, స
జ్జనులన్ దక్కఁ దదన్యులన్ మనమునన్ జర్చింపఁగాఁబోరు, ధీ
ఘను లంచున్ జననీ! ఋతం బడఁచు ప్రాజ్ఞశ్రేణికిన్ దెల్పుమీ!

పూర్వవిద్వన్నాగరికత.

శా. "మీవిద్దెల్ ధన మిచ్చి కొన్నయవి, మీమీ పోకలెల్లన్ ధనా
శావిద్ధంబులు, పూర్వనాగరికవిద్యాభ్యాసముల్ వేఱు, త
ద్భావమూర్తులు వేఱు, వారు మనకై దైన్యంబు గైకోరు మీ
తోవల్ వారికి పైప కాని" వని యుద్బోధింపుమీ శాంకరీ!

శా. పూర్వాచారుల విద్దె జెప్పు గుణలుబ్ధుల్ వారి మర్యాదలే
సర్వోత్కృష్టముగాఁ దలంతు రిపు డాచారమ్ము లేమున్న వీ
దుర్వారుల్ గనఁబోరు, దూర్వ లెనయా దుర్వాసుతో నందు రో
శర్వాణీ! యిటువంటి యోగులను లక్ష్య మ్మేలసేయన్ వలెన్.

టాటోటుకటకుఁడు

ఉ. కొట్టె నుపానహం బదియుఁ గొండొక కొంకు పహించు, నెవ్వనిం
దిట్టఁగ దానిఁ గుట్టు నల దీనుని నాల్కయుఁ వెక్కుఁడీయుఁ, నా
పుట్టుగు బమ్మచారి యెటుబోంకిన నేమగు? నట్టి చీపురుం
గట్టలు గిల్కు వ్రాఁతలకు గౌరవ మెక్కుడి దమ్మ! శాంకరీ!

మ. ఘటచేటీకరనీచకాచకలనాక్రాంతంబు కర్ణద్వయం
బఁట! నానానృతపాతకాంచితస్వఘాహంకారపంకాంకితం
బఁట! చేతం; బటువంటివాఁ డొకఁడు పే రాసించి టాటోటులన్
రటియింపన్ గటువౌనుగా కవియు ధీరవ్రాతముల్ చూతురే.

ఉ॥ "ఆవులు దూడలుం గలుగ నార్పులు గుంజల కేల?" తా నెవం?
డీవిషయంబు నేమెఱుఁగు? నింతకుఁ ద న్నెవఁ డీసడింపకే
పో విడుచున్? జరిత్రమన బొంకులు బూతులుఁగాద నానొకో!
కావల మేడ! సత్యపుఁ బ్రకార మదేడ! పచింపు మంబికా!

ఉ. ఇట్టి వృథా ప్రజల్పకుల హీనపు వ్రాఁతలు కీర్తికామినిం
గట్టుడు నాపె "కాళ్ల కురి గగ్గె" నటం చొకమూల నాఁగుచోఁ
బట్టపగంటఁ జుక్కలప్రభావము నెల్గక పోదు "తా డొగిన్
రొట్టెయుఁ గాకపో, దొకనరుం డలతానును గాకపోఁ" డికన్.

ఉ. వానిది నోరు గాద, యల వానిది నాల్కయుఁ గాద, తోఁచిన
ట్లేనరుఁడే నసత్యములనే నిగడించునొ యట్టివాఁడు శ్రీ
జాని స్వనామమూనినను జందనమూనిన రాసభంబె, మా
రానఁ బరిత్యజింతు రల వ్రాయసకాని మడుల్ బుధాగ్రణుల్.

ఉ. ఉన్నది యున్నయట్టులుగ నోపిక మీఱ లిఖింతు మంబరో!
కన్నపుదొంగ వ్రాఁతల ప్రకారము నోటికి వచ్చినట్టుగాఁ
బన్నము, బన్న మాగిలిత వ్రాయసకాండ్రికి రాన మంచి వి
ద్యున్నతమైన మార్గమునఁ బంపెడి భారము నీది యాదెసన్.

(త్రిశంకుస్వర్గము)

చ. అతనిని రోఁగి యంచు శివఁ డల్ల వసిష్ఠగవీసవ్రంతిదై
మతిచెడి పోరి రోడి మతిమత్తుఁడై తప మాచరించి బ్రి
హ్మత యొకకొంత గాంచె నల యాతఁడె గాధిజుఁ; డాతఁ డిచ్చె స్వ
ర్గతి నొక రాజసూతికి, సురప్రభుఁ డొప్పమి కాగ్రహించుచున్.

ఉ. గడ్డము మీసముల్ పెరిఁగి గాధిజుఁ జేయవు వేని నేని యా
పెద్ద మునీశ్వరుం డొకని శ్రీపతియన్నను జేర్పఁ బోయి తాఁ
బడ్డ పరిశ్రమంబు భగవంతుఁ డెఱుంగుఁ, గృతార్థుఁ డయ్యెనే?
అడ్డఁడె యింద్రుఁ! డాపయికథాంశ మెఱుంగనివారు లేరుగా.

(పౌండ్రకవాసుదేవీయము)

ఉ. ఉండ్రు జగమ్మునందు మును పుండినయట్టులె యుండువారు పె
క్కండ్రు, వృథాభిమానమునఁ గర్జ మెఱుంగక కొంద ఱెట్లొ చే
కొం డ్రవమానముల్ దమకుఁ గూడని బల్ బిరుదుల్ ధరించి; యా
*పౌండ్రక వాసుదేవుల నెవండు గణించు పచింపు మంబరో!

(గౌతమీనది—సెలయేఱు)

ఉ. కొండలు వ్రీల బండ లాగిఁ గొట్టుక పోవుచుఁ దేల గౌతమీ
చండతరప్రవాహ మది శాశ్వతమై భువిఁ బర్వె నెన్నియో
కొండలనుండి వచ్చి యడఁగున్ సెలయే ళ్లట నూరుఁ బేరు లే
కుండఁగ "దివ్యటీసరస నుండెడి దీపములో" యనం బోరిన్.
ఉ. అంతన పుట్టు నంతటనె యాఱుఁ గడున్ రయ మొప్పఁ బాఱు నొ
క్కింత వెడల్పుఁ బొడ్గు గల యే అదియే సెలయేఱు, దాని బై
సెంత? మహాప్రవాహముగ నెల్లపుడున్ బ్రవహించుచున్ బవి
త్రాంతరమై తనర్చెడి మహానది గౌతమియుందు, శాంకరీ!

(చ్యవనమహాముని)

ఉ. కొండలు బండలుం గలిసి గొప్పగ నెంచి స్వపక్షపాత మా
ఖండలు చేతి కత్తి కిడఁగా గరుడుం డిడెఁ బక్షపాతియై
యుండియు నీకమాత్రి; మదియున్ జ్యవనుం డిడఁ; డాత్మశక్తి యి
ట్లుండు నటంచుఁ దెల్పుటకు నో జగదంబ! తృణీకరించుచున్.

---

* హరివంశోత్తరభాగము-ఆశ్వాసము 6.

తే. తనబలము నెదిరిబలమును, గనవికతన బజ్రిమట్టి ఘనపోతియు కీ
ర్తిని గోలుపోయెఁ గాదవ, ల్లనిబొంద నటు లాచరింప నవి యేమగునో!

(కాళింగులు)

ఉ. అంగమునిండ భూతి నిడి, యల్పపువస్త్రము గట్టి, చెంబు చే
లం గొని శుద్ధసద్ద్విజులలాగు నటించుచు నెందుఁ బోవు కా
ళింగులపోల్కి నేఁ డకట! లేకు లనేకు లొకింత నేరు పెం
దుం గనకే పథానిబిడుదుం దలఁదాల్తు రదేమి పాపమో!

ఉ. వేసము పొట్టకోస మెటు వేసిన వేతురుగాక, యీరసా
భానులు నిక్కపుం ద్విజులఁ బట్టుక "మీరును విప్రులే? మిముఁ
భూసురు లంట తప్పు మముఁ బోరునఁ గెల్చినఁగాని మీకు మీ
భూసురనామ మొప్ప" దని పోరెఁగుదు రేమిటి కంబ! శాంకరీ!

(లూత)

ఉ. అంబరమందు *సాలెపురు వాదరు వింతయు లేక వ్రేలుచుం
దం బొకయప్డు తోఁచు నది తథ్యమొ? కా, దటమున్నె యల్లియుం
చుం బహుతంతుజాల మది చూపున నంటుక యుండు, దాని దా
రంబు మొగంపుదారపుఁ బరంపరతోఁ గలుపుఁ దిగంబడుఁ.

ఉ. నేయను గాత లూత యది నేర్చిన నేఁతగఁ బొట్టకోసమా
నాయము; బట్టకోసము జనంబు కువిందుని గోరుఁగాని యీ
మాయపుఁబుర్వు నేఁతకయి మానస ముంచునె? యుంచుఁబో, యెటో
కాయమునందుఁ గప్పికొనఁగా నది పచ్చునో! మట్ట విచ్చునో!

---

*21 వ సెప్టెంబరు 1912 సం॥ కృష్ణాపత్రికనుండి

ఈఁగపులి

తే. కీటకములందు మిక్కిలి కీర్తిగంటి। నీఁగపులి యంచు రందఱు నెలమి బన్న్ని। గాదె యంచును మది వృథా గర్వపడకు। సరసు లది ఖిన్న నగుదురు సాలెపురుగ! కపటమున నేదొ యొక పన్ను గడనుబన్ని। యీఁగలను మోస పుచ్చుట నీఁగపులివి। కాని యెదురుగ నిలఁబడి కలనఁ గెలిచి। పేరుపొందిన దేదిరూపింప లూత!।ఎట్టులో యొకరీతి నీ కీబిరుదము। కలిగె నామాట లటులుంచు కలిగినంత। మాత్రమున నూర్ణనాభ మామదిని మిపులు,। తలనుదాఁటిన గర్వంబు

ఉ. అల్లిన దానినే మరల నల్లును, గ్రొత్తవిధాన నల్లఁగాఁ
జెల్లదు సాలెపుర్వునకుఁ జేతయుఁ గా దది యెన్నిసారులే
నల్లిన యల్లికే మరల నల్లెడి; దానికి సంతసింతమా?
యల్లిక యెందుకేని గొఱయైనది గాదుగదా మహేశ్వరీ!

(నీరసాశుఘోషానిరసనము)

చ. ఎఱిఁగియుఁ గ్రొవ్వుపుం గయిత కేమును బాల్పడఁబోదు మేమొ! కొ
ప్పర మొకవేళఁ బోరికి సభాస్థలికిన్ జనుదెంచె నేని; శాం
కరి! యది కాము కూడ దని కంకకు మమ్ము! ప్రసక్తి దీరు ను
త్తరపు క్షణంబునన్ మరల దానిఁ ద్యజించెద మాజ్ఞ యిమ్మికన్.

చ. ఎఱమిఁ దురుష్కునిం దగిలి యేగిన నాతికిఁ బ్రీతిఁ గొల్ప మె
క్కలుఁడు తురుష్కతాప్తికయి కట్టెఁడిమార్గముఁ బట్టు భంగి నెం
గిలులకుఁ బ్రీతిగొల్పఁ గల కాకపితం బురుడింప నెంచి క
శ్మలమగు గ్రామ్యధాటి కొడిసాచెడి తప్పును సైఁపు మమ్మరో!

ఉ. తప్పులఁ దోఁపనీకు, మెఱుఁగుం గల శాస్త్రము గప్పిపుచ్చు, మే
చొప్పున నో దడాబిడిగఁ జొప్పశలాకలఁ బోలు పద్దెముల్
గుప్పఁగఁ జేయు, మెయ్యెడలఁ గొంకు ఘటింపకు, మెట్లొ నూఱులన్
జెప్పినదే మహాపదవి సేయుము, మాయుము గ్రామ్యవక్త్రముల్.

ఉ. కష్టముగా నెటో భవదఖండకృపామహిమమ్ము కల్మి నీ
ముష్టి కవిత్వమధ్యమున ముద్దులు మూటలుగట్టఁజాలు ని
ర్దుష్టపుఁ బద్యమున్న నది తొల్లిరచించిన దందుఁ, వారి సం
తుష్టికి నట్లు కాదనుచుఁ దోఁపఁగఁ జేయుట యెట్లు శాంకరీ!

---

దాల్పఁదగునె। నీపరాక్రమమునకును నీయశమునకు। నీదుబిరుదంబునకు లోన నీవు మెచ్చ। వలయు నీజాతివార్ మెచ్చ వలయుఁగాక। యింక నెవ్వరు మెత్తురో యీఁగలపులి!, యెన్నియో గొప్పకీటము లున్నవి సుమి। వాని కేమియు గర్వంబు గానఁబడదు।, వెదక రప్పంత యల్లి కల్లుదువో లేవో। మేలు నీదు గర్వము పట్టఁజాలకుండెఁ।, జాలునింతటి నంచైన సాలెపురుగ!।, బుద్ధి తెచ్చుకొని నయాన బుజము లెగర। వైచి కొనుటచాలించి గర్వంబు విడిచి। భద్రముగ నుండు మిదియు నీబ్రతుకు తెరువు.

పిప్పర సోదరకవులు

ఉ. గిరగిరఁ ద్రిప్పి మ్రోఁగెడిఁ బకీరుకరమ్మున నొక్కయంత్రి, మా
'కిరకిర' బాలురన్ దనుకఁ గిల్కుసుభంగిని మాన్యమైనచోఁ
బరపరలాడుచున్ గవితఁ బాడె దడాబిడిగా నటంచుఁ బా
మరులు నుతించుపూనికయు మాన్యతఁ గాంచుఁగదే మహేశ్వరీ!

మ. స్వరవర్జ్యత్వమెఱుంగకే పొరిఁబొరిన్ సంగీతముల్ వాడి యె
వ్వరు మెప్పింతురు! గాయకోత్తములు 'వహ్వా' నాఁగ; నట్లే పర
స్వరసందర్భము శ్రోత్రపేయతయు సౌశబ్ద్యంబు లే కట్టులో
విరచింపన్ గవితల్ శిరోయుగళికిన్ పీడల్ ప్రసాదించునే!

చ. "పదనిస, సానిదానిపస, పస్పసనీసరి, గామగారిసా,
సదగద, నీరిసారి, దరిసా, గరిసా, నిరిసా, రిసా, రిసా,
గదగద, పాదపాద, సదగా, పదగా, నిదిగా, దగా, దగా,"
యిది యొక గానమేని యెటియేనిఁ గవిత్వ మగున్ మహేశ్వరీ!

ఉ. "చేసిన దోసముల్ బయలుసేయఁగ నెంతువె! దుష్కవిత్వవి
న్యాసము పైటఁబెట్టుటకునై గమకించెదవేల" యంచు దే
వాసురయుద్ధముల్ గెలిచినట్టిఁడు పండితరాజు చేత నీ
వీసడిలంగఁజేసి మము నెందుకు దూర్చెద విందు శాంకరీ!

ఉ. ఎంచి పురాణులైన పదునెన్మిది వర్ణ్యములంగుణించి వ
ర్ణించి కథానుగుణ్యముగ నించి రచించిరి యుంచి రంచుఁ బ్ర
శ్నించినచో సదుత్తరము చెప్పుటకున్ దగవైనయుక్తి దోఁ
పించి యనంతరమ్ము నడిపించుమి యీకృతి కో మహేశ్వరీ!

చ. కవివరులెల్ల మేలనఁగ గ్రంథములన్ రచియించి కప్రపుం
జపుల జగమ్ము ముంచెడి ప్రశంస ఘటించియు నేఁడు కొప్రపుం
గవులకతమ్మునన్ రసము గన్పడకుండెడి దిక్కుమాలు కా
కవితకు మమ్ముఁ బాలుపడఁగా నొనరించెద మూలదైవమా!

చ. గడియకు మూఁడువందలఁట! గంటకు డెబ్బదివందలంట! త
ప్పడుకవనమ్ము చెప్పుటకుఁ బూనినవారిని బట్టఁకేసి యె
ప్పుడు సరసాశుసత్కవనమున్ బచరింప మదీయవక్త్రమున్
"బడబడ" మ్రోఁగు "తాషమరపా" నొనరించెదవమ్మ? యీశ్వరీ!

ఉ. వృత్తివిశేషముల్ చెడి వివేకము పాకముదప్పి సద్గుణా
యత్తతఁ దక్కఁ శయ్య యొకఁ డంతగ బొంతగ సంగ్రహించి యీ
పొత్తును రోయకే పలుకు పోకడ నేరిపి మాదుకైత ను
న్మత్తతమైఁ జరింప కసుమాలగఁ జేసెద మాలదైవమా !

చ. తొరతొర గ్రామనామములు తొంబదియో పదియో సహస్రమో
పరపర గ్రుక్కతిప్పకయె వాగెడి విప్రవినోదివైఖరిన్
జరచర నోరు జార్చు టది సత్కవిధర్మము గాదటంచు నీ
వెఱిఁగియు దానికై మనము నేటికిఁ గొల్చెదవమ్మ శాంకరీ!

ఉ. అక్కట ! నీరసాశువున నందముఁ జందము లేక రొట్టెలో
గ్రుక్కలు మ్రింగుచున్ వెసఁ గుగోల్లల సుద్దుల నెంతపాడినన్
దక్కునె 'కైత' యన్ పదవి దానికి? "గాడిద గంపెఁడూఁక దాఁ
బొక్కిన నేమి లాభమగు" బొంకక తెల్పఁగదమ్మ శాంకరీ !

ఉ. అబ్బెస మేల సేయవలె నంబరో ! తంబుర యొంటికంటి త
బ్బిబ్బ మృదంగ మీద్వయమె వేషముపట్టున లోటు గాని యా
బొబ్బిలిపాటగాంధ్ర తలఁపుం గొలుపంగల పాడుకైతమున్
సిబ్బితి గల్గి పండితులచే నుతిగాంచెడి కోర్కె యున్నచోన్.

చ. కవితయుఁగాని సంతతియుఁగాని జనించిన యుత్తరక్షణం
బవిసి నశించె నేని ఫలమబ్బునె ? గర్భభరమ్ము నెక్క నా
యువు లవమేని లేనిసుతు లొక్క సహస్రము ఱెప్పపాటులో
శివ ! శివ ! పుట్ట నేమియగుఁ జెప్పఁగదమ్మ, మదంబ! శాంకరీ !

ఉ. 'ఆశుకవిత్వమందు రస మారయరా'దని యప్ప సెప్పె, నో
యీశకుటుంబినీ ! జననమే శిథిలించిన బంతికిందనే
నాశముఁగూడ వ్రాయు టది నల్వకు సమ్మత మౌనుగాక, గ
ర్భాశయమే స్రవించుటకు నక్కట ! దీనికి భేదముందునే ?

ఉ. "మారుని గేరఁజాలు సుకుమారుఁడు, కన్నులు చేరెఁడేసి, బం
గారము మే" నటంచు స్మృతి గాంచిన బాలున కేడ్పుభంగి వి
స్తారరసమ్ము గల్గుటయు సంభవ మందెడుఁగాక, నిల్వఁగా
నేరని కావ్యపాశుకవి నేరుపు లేటికి మాకు, శాంకరీ !

చ. పలుకుల కల్కి నేర్పిన సుభాషితముల్ జతఁజేసి కచ్ఛపిన్
బలుకఁగఁజేయు దానికి నుపశ్రుతిగా శ్రుతివిందు సేయుచున్
గలకలలాడు కంకణవికస్వరసుస్వర మట్టులుండు మా
పలుకు లొనర్చెడే యినుపబాడిగ బండిరవంబు లీశ్వరీ!

చ. కలుషితమైన నీర్ దురుసుగాఁ బ్రవహించెడునట్లె తప్పుఁగై
తలు దొరలున్ దడాబిడిగఁ; దజ్ఞుల కట్లు రుచింపనౌ, శర
ల్లలితకలావిలాసవిమలమ్ములు సత్కవిమార్గములో, రస
జ్ఞులకు రుచించునట్టిది యగున్ హిత నూతనకవిత్వ మేరికిన్.

‡ (తలఁపుఁ దగని వ్రాఁతలు)

మ. కవితాతత్త్వరహస్యవేత్తృతకునై కల్పించునుత్కృష్టలీ
స్థవివేకుల్ కులగోత్రనిందకులు వేదాచారపారంపరీ
దవవహ్నుల్ సకలాన్యభోక్తలు సమస్తస్త్రీకుటుంబుల్ మహా
సువివేకుల్ వికృత మీ తెలివి విజ్ఞుల్ గాయ కెట్లుండునో!

ఉ. దుర్మతముల్ కడుం బ్రబలి తొంపరగాఁ జెల్వొదుపట్ల ధర్మపున్
మర్మ మెఱుంగునార్యు లవి మాపినయట్లె కవిత్వతత్త్వవి
త్కర్మము లాఁగఁగా సరెఁ గుకావ్యము; తాదృశధర్మకార్యమే
కర్మ మెఱుంగఁజాలని యకర్మపరుల్ నిరసింప నేమగున్?

---

‡ (మే 10 వ తేది 1913 వ సం॥ కృష్ణాపత్రికనుండి)

# చరణాయుధ ప్రశంస

ఒక భాషాభిమాని

ఈ పోట్లాటకు అంతంలేకుండా ఉన్నది. ఈ కవులు కోళ్ళనుగూడా మించిపోయినారు. తురుష్కయుద్ధమైనా ముగిసేటట్లున్నది కాని యీ కవుల కలహ మెప్పు డారంభమైనదో దానికి సిసుగు విరామము లేకుండా ఉన్నది. అంతకంతకు కక్షలు ప్రబలుతున్నాయి. ఇరుపక్షములచుట్టు గ్రామసింహాలుచేరి గర్జనము మొదలు పెట్టినాయి. ఈ పోట్లాటల నాపించే ప్రభు వెవడు కనపడడు. వీటి విషయమై ఆంధ్రపత్రికలు జాబులు ప్రకటించకూడదని దొరతనము వారొక చట్టంచేస్తే బాగుండును కవులకే బుద్ధిలేనప్పుడు నావంటివా రేమి చేయగలరు?

ఉ. జన్నము లాఁగిపోయెనో! యశస్వుల సత్రము లాఁగిపోయెనో!
అన్నము మాలమాదిగల దంపటులకుం బ్రియమై తనర్చెనో!
దున్నల కాలు భార్య లయి తోసము నందెనో! ప్రోషిత శిష్టసం
పన్న గృహస్థపుత్రికరపంకజ మంటెనో! వీరియాప్పులన్.

ఉ. ఐనవి కాదు, కాని దగునం, చది దేశము నుద్ధరించు నం
చేనరమాత్రులో గిలుకు నేఁపు వాప్రీతల కూఁతమై యశో
ధీనులఁ బూర్వపండితగతి స్మృతిఁ గొన్పెడి జ్ఞానులన్ మహా
ధీనిధులన్ వృథా దెగడు తెల్వులవిల్వల నెంచ నేటికిన్?

(మే 15 వ తేదీ 1913 వ సం॥ సుదర్శనీ పత్రికనుండి)

# కవులకలహములు.

గతవారపు కృష్ణా పత్రికలో కవుల కలహములను గూర్చి విచిత్ర చిత్రావళిలో నొక చిత్రము ముద్రింపఁబడినది. అందు రెండుతలల కోళ్లు రెండు ముఖాముఖిగా నిలుచఁబడి యుద్ధము చేయుచున్నటులను ఇరుప్రక్కలను శునకములు అఱచుచున్నట్లును జిత్రింపఁబడియున్నది. ఇది చూచుటకు మిగుల నచ్చెరువుగానే కన్పట్టుచున్నది. గాని కొంచెము దీర్ఘదృష్టితోఁ జూడఁగా మిక్కిలి జుగుప్సాకరముగఁ బర్యవసించు చున్నదని తెలుపుటకుఁ జింతిల్లుచున్నారము. ఈ జంటతలల కోళ్లరూపముతో నున్న కవులెవరో యెల్లరును జెప్పకయే తెలిసికొనఁగలరు... ఇంతకాలమునుండి వీరిట్లు వాదోపవాదములు చేసుకొనుచుండఁగా నింతవఱ కెవరి కేమి యనర్థము కలిగినదో చెప్పఁగలరా? వైదిక నియోగి కక్షలు పెరుగు చున్నవందురా? ఆ పాప మింతమూలముననే పండలేదు. అవి యిదివఱకే పండి బ్రద్దలయినవి... ఈ తారతమ్యచర్చ ప్రతివిషయములోనను గలుగుచుండును... "నిరంకుశాః కవయః" అనునట్లు వారిలో వారు చర్చచేసుకొనుచుండఁగా నడుమవారు వారిని గోళ్ళతోడను గుక్కలతోడను బోల్పఁజూచుట యనాలోచితము... కోళ్లు, కుక్కలు మొదలగు నీచోపమలచే వారిని బ్రజారంగమునఁ బడవేయుటకంటెఁ గొదమసింగములఁగానో మదగజములఁగానో ప్రదర్శించినచో సత్యమైన యర్హమయిన గౌరవమయిన ప్రదర్శనమయి యుండును... మఱియు వీరిట్లు నీచోపమలచేఁ జిత్రరూపమునఁ బ్రదర్శించుటయే కాక దాని వ్యాఖ్యానములో "ఈకవులకు బుద్ధిలేదు" ఇత్యాది పరమత్సరీకారనీచ వాక్యములచేఁగూడ సంభావించిరి,

తే. గీ. జననమరణాల లీస్టు విస్తరమొనర్ప
నవతరించిన యయ్యలే యగుదురొక్కొ!
పండితులటన్నఁ గవులన్నఁ బ్రాజ్ఞులన్నఁ
బత్రికలు వ్రాయువారిఁత లప్పగిదిగాక.

తే. గీ బుద్ధిలేదఁట? కవులకు; బుద్ధి గల్గు
వారలెఁక నెవ్వరో! కులాచారములకు
నున్న చుట్టెడి మేటిసంపన్ను లొక్కొ?
వీరలు నిగర్వులవ? గర్వ లేరు? జనని!

చ కవికలహప్రచారములు కట్టిఁడులన్ గరఁగింప లేవు కో
ళ్లవుదురు వారికిన్ సుకవు; లన్యులు కొండలు కుక్కలౌదు; రీ
యవినయమున్ సహింపనిగుణాఢ్యుల కీలిఖియించు ప్రాజ్ఞ లే
మవుదురొ? నీ తెలుంగని రహస్యములుం గలవే? మహేశ్వరీ!

---

(1913 వ సం॥ రం॥ జూన్ నెల 15 వ తేదీ సుదర్శనీపత్రికనుండి)

ఇప్పుడు వివాదపడుచున్న కవియుగ్మములను గూర్చి కృష్ణాపత్రికలోఁ గొల్లగను గుక్కలగను పరమనీచోపమగాఁ జిత్రించఁగా వర్తమానకవులలో గౌరవనీయులయి యున్నవారి నింత నీచపరుచుట చాలజుగుప్సాకరముగ నున్న దని మేము వ్రాసినది పురస్కరించుకొని "కవులు కలహించవలెనఁట" యను వ్యాసమొకటి సువర్ణలేఖ, యొక చదువరిపేరటఁ బ్రకటించెను ... అంత కంటెను అధికులు చర్చించుకొనుమందురేని వారి ప్రశంసయే యెత్తుకొనము. ఎందుచేత, వారి వివాదము తీర్చుటకు మనమెంత మన బ్రతుకెంత యనెడు స్వసామర్థ్య దౌర్బల్యమునుబట్టి మనతోవను మనము పోవుదుము. టర్కీ బాల్కను రాష్ట్రముల మహాప్రవివాదము సంధిచేయ బ్రిటిషుప్రభుత్వము వంటివారికే యస్వాత గలదుగాని, యాలమంచిలి ప్రాప్రయిటర్లు ఏమి చేయఁగలరు. ... ప్రస్తావనకవు లేతన్మాత్రులుగాని, కలహమెట్లు చేతఁబట్టవలెనో తెలియని "చదువరి" ప్రస్ఫుర్త్యసాత్మ్యద్రుశు లందఱును వంక దొరకఁగదాయని యొద్దియేని యనిష్టకారణమున వారిని దోఁచినట్లెల్ల నీచపఱచుట కధికారము లేదు...చమత్కారముగా యుక్తిప్రయుక్తికముగా వాదములు చేయుచున్నారు సొంపుచెడి వట్లు మధ్యస్థులకుఁ దోఁచుటలేదు ఇష్టములేనివారు వారి వాదములను బ్రకటించక

గీ. కోడిగుడ్డంత యున్నమ్మ గొనరె నొకఁడు
నిమ్మకాయంత గోరె నన్నమ్మతుండు
వేఱొకఁడు; దీనఁ గలుగువివేక మజ్ఞు
లెఱుఁగరది విజ్ఞులకుఁగాక యెట్లు తెలియు?

మ. ఉపమాకల్పనఁ బట్టి కాళ్ళిదాసం దూహింపఁగా వచ్చు ని
క్కపుసౌభాగ్యము లెన్నియేని; యది యజ్ఞాగ్రాహ్య మెట్లో? వృథా
కుపితుల్ తోఁచినయట్లు గిల్కుదురు సంకోచింప గల్లంతన
య్యుపలాపంబు సదోపిగర్హితముగా నడ్డెంతు రజ్ఞత్వముల్.

ఉ. అజ్ఞులవ్రాఁతలే ప్రకటనార్హము లౌనఁట? తాళ్ళ్యమ్ముల్ మహా
విజ్ఞులవ్రాఁత లౌనఁట! వివేకులు కోళ్లఁట, కుక్కలంట! ధ
ర్మజ్ఞత మేలుమే, లిదియు బ్రహ్మసమాజమతప్రపత్తి స
ర్వజ్ఞతయొక్క! యన్యమతపద్ధతుల కంబరొ! యింత జ్ఞానమే.

---

పోవచ్చును...వీరికి నిజము గాఁ గిష్టులు కలహించి పోయి పోవుచున్నారని పరి
తాపమా, లేక వారిలో నెవ్వరి నుండియో యనిష్టకారణమున నేరేని పంకఁబెట్టి
యేవో పలితి "రిమార్కు"లు చేసి వెల్లాని మునననుఁ దము యనిష్టమును దీర్చు
కొందమను దురుద్దేశమా?...తొలుత రాముకృష్ణకవులు తమకీశ్వర వేరులన్న
మాట వినగానే తిరుపతి వెంకటేశ్వరులు 'గుర్రుచచ్చి పిల్లను వెక్కిరించినం
దుకై' కంటగించుకొని కొంచె ముద్ఘోషమును చేసిరి. ఇట్లు గుంటూరి ప్రతాన
ధానములోఁ గొప్పరపుకవి గారికిఁ దమ సంగస్థలములోఁ దమతో సముఁడన్న
సిద్ధాంతముమీఁద సహాసనమీయఁగా నట్లు నలుపసిరి. లోక సామాన్యమర్యాదకై
మీరెట్టి యాసనమిచ్చినను మా మభ్యంతరము లేదు గాని, నప్రత్యేకించి మాతో
సముఁడన్న సిద్ధాంతముపై యాసనమిచ్చినచో మంగీకరించ మనిరి.

ఇందు దప్పేమియున్నది? సన్యసించి తపశ్చరించుకొనువారికైనను కీర్తి
కోలఁది వాఁడ నందు మేని యాతఁ డిపారకోఁడె! అట్టియెడ పాణుడము కవనా
డని లౌకికకవిమాత్రులు స్వగౌరవసన్మానతాపరాధపము నెట్లు సహింపఁ
గలరు.... కాఁబట్టి సర్వవిధములను ఏదంకనో తమ యనిష్టమును దీర్చుకొందమ
మను దురుద్దేశమే యీ పరితాపమునకుఁ గారణమని ఘంటాపథముగాఁ జెప్ప
వచ్చును... ఈ హృదయాకల్మషముల కొక్క పరిబలదృష్టాంత మిచ్చుచున్నాము.

సీ. అమ్మ గొంతెటిగన్నయారాలో యీడేడరజస్వలయయ్యె మొగియదిప్పటికిఁ బెండ్లి
కితనియోగ్యత నెన్న నెవనికశక్యము పెండ్లియాడె నల్వదియేండ్లయాఁడుఁ బడుచు
నావెసంస్కారణపరాయణత్వము మిన్నయోఁ బుత్రవతి పెండ్లియాడె విధవ
ఆతఁ డిందఱకన్న నధికుఁ; డేమన వాదమును ద్రోంచె బాలుఁడైనను దెగించి

తే గీ ఇట్లు ధర్మోద్ధారములనే యెపుడు విసుతి
నల్పు పతితోద్ధారక లెక్కడ! మహాత్మ
బద్ధ బుద్ధికిఁ గాని కన్పడని సత్య
మనెడి పరమార్థ మెక్కడ! యఖిలజనని!

---

చిత్తగించుఁడు... నిన్నటి సుదర్శనిలో... "ఓర్వలేక దగవులాడు కవులను బట్టిబట్టి మడిచిపెట్టి దగ్ధపరాంకములు వేసి యేమన్నారండో! శ్రీరామరామ" యనునొక సందర్భములో యసందర్భము వ్రాయించినారు... 'కవులను' ప్రత్యేకించి నిర్దేశమేల చేయవలెను? కవులనే కాదు, ఓర్వలేనిగుణము గల యితరుల నెవ్వరిని శిక్షింపరాదా యేమి?... తెనుగీటు దొరగారు చెప్పినట్లు కామము దీర్చుకొనుటకు అక్రమసంబంధ యుపయోగమైన క్రోధము దీర్చుకొనుట కిట్టి యుపయోగము. ఈ పెనుమఱపుదుర్గుణము విధాయకమే గనుక ఓర్వలేక తగవులాడు కవుల నొక్కరినే కాక యోగణములోని వారి నందఱినిఁగూడ నా లోకమునఁ జిత్రవధ చేయుట తప్పనిసరి యని తెలియఁజేయుచున్నాము. కలహించఁగూడదనుట నీతి సిద్ధాంతమే సర్వదా యాదరణీయమగునేనియు, నట్టివారి నెల్ల నేకరీతిగనో యేకకాలముగనో చిత్రించవలసియుండునేనియు నిప్పటివఱ కనేకవిషయములలోఁ గలహించుచు వచ్చిన కవులు, విమర్శకులు, పత్రికాధిపతులు, పండితులు, సంఘసంస్కారులు, పురావస్తుశోధకపరాయణులు మున్నగు మహామహుల నందఱ నీపాపమునఁ గోళ్ళు, కుక్కలు, పిల్లులు, పందులు, గాడిదె లుగాఁ గూడ నిప్పుడుగాఁ జిత్రించి వారికి నధోగతిప్రాప్తి యొండపలెననియుఁ దెలియఁ జేయుచున్నాము. ముందు కవిత్వస్పర్ధపూజగాఁ బోరినారట కలహాకవులయిన దండి కాళిదాసులను జెట్టమొక చక్కగను వారికిఁ దగవు తీర్చిన దేవినొక యాఁడుపందిగను జిత్రించి యని మొదలు మొన్నటివఱకుఁ దగవులాడిన శిష్టి కృష్ణమూర్తి, పిండిప్రోలు లక్ష్మణకవి, వెంకటరత్నశర్మగారు, వీరేశలింగం పంతులుగారు, వేదము వెంకటరాయశాస్త్రిగారు, కాశీభట్ల బ్రహ్మయ్యగారు,

సీ. ఘనుని బట్టుక నీచజనుఁ జేసి వ్రాసిన నది శిరమ్మునఁ దాల్చునట్టి ఘనులు
నీచుని నీచత నిక్కమ్ముగాఁ దెల్పువారి వ్రేలలు బట్టనైచు ఘనులు
సత్యమ్ము నెఱిఁగియు శాంతులపోల్కి నొప్పరకించు పరిపాటి నురుఁగు ఘనుల
ఏదియో పోట్లాట నూఁదినఁ బత్రికకబ్బు 'మేట' రటంచు నరయు ఘనులు

తే. గీ. పత్రికాధిపతిత్వంబుఁ బడసిరేని
దానివలనను గల్గెడిహాని జగతి
కెంత యని చెప్పఁగలము లోకైకజనని!
సత్య మడుగంటు నెగడు నసత్యమెందు

---

## కథాప్రారంభము

వ॥ అంబా! దీనికేమి, ప్రకృతవృత్తాంత మ్మాకర్ణింపుము.

(సూర్యోదయము)

మ. పరితస్సర్వదపారభాస్వరగభీపారంపరీమస్నత్తై
మిరభారుండు దివాకరుండు త్రిజగన్మిత్రుండు మందేహాధి
క్కారణోద్యోగి వెలింగె వార్యులు "కృతఘ్నఘ్నాయ దేవాయ" యం
చెరఁగన్ దస్కరకోటి కాల్కాలఁది నెండేఁ బంచత్తై పాఱఁగన్.

ఉ. సరసిరుహోత్తపావములు సారెకు నుప్పరమందు నెందుఁ గొ
ప్పరపు శిరమ్ములందు నొగిఁ బ్రాఁకి ఘవాలయపంక్తి మీఁదుగా
ధరణికి డిగ్గి యెల్లెడలఁ దామయి యామెయి వారి శైత్యపున్
భర మఱఁజేయుచున్ నెగడెఁ బండితపామరరంజకమ్ములై.

(కొప్పరపువారు కాలుద్రివ్వుట)

ఉ. దురుసుగ నుండె నుత్తరపుఘ[illegible]ణి యుత్తరగత్తరంబులన్
ద్వరపడి తిట్టి బందుగులదాపునఁ దూఱుట స్పష్ట మయ్యె నె

---

వడ్డాది సుబ్బారాయఁడుగారు, శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రిగారు మున్నగువారి
నంటను వారివారి యర్హతకుఁ దగిన జంతువులతోఁ బోల్చి చిత్రింతురుగాక
అపూర్వోపనిషన్మతము వెలయింత్రుగాక.

త్తతి నెటఁ జేయనట్టి * యవధానము నెత్తుట వీర్వలాయన
స్థిసు లని యెంతమూర్ఖునకుఁ జెప్పక చెప్పఁ దొడంగె నంబికా !

కం. అలనూజివీట శ్రీకా, కుళమున మతిఁకొన్నిచోట్లఁ గోపిను తెలుఁగన్
జలిపిన ప్రత్యేకపుసభ, లలవా తెలుఁగమియు స్పష్టమై కన్పట్టెన్.

‡క. ససహాయంబుగ నవధా, నసభన్ బొనరించునట్టి నరుఁడె ఘనుఁడో తా
నసహాయుఁడు ఘనుఁడో యది, నుసుమలకుం దెలియునే ఘనులకుం దక్కన్.

♦క. తెలుఁగట! మీసంబఁట! అది, నిలుపన్ వలెనంట! మీరు నేరుతురొక్కొ
తెలుఁ, గొరా! తెలుఁగనఁగాఁ, గలగాల్ మాటాడు పచ్చితెలుఁగేమగునో!

తే. గీ. బళిర! యీవ్రాఁత తెలుఁగెల్లఁ "బాటిమీఁది
పందికొక్కులు బలు" మన్న పగిదివోఁచె
వీరికి జనా బొసంగుట విజ్ఞులొప్ప
రయిన సామాన్యలోకు లట్లనరుగాక.

క. అని యెంచి నారు పద్దెము, లను గిలుకన్ మేము వానిలక్షణమును నే
రనిపోల్క †వచనమున జా, బును బంపితిమంబ! వాయుపురపురఁబోకన్.

---

* బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీశ్వరులకు......

సీ॥ అష్టావధానంబు నాచరింపవెదరేని యద్దానిమించి సేయంగలేము
శతఘంటకవనంబు సల్పఁబూనెదరేని యద్దానిమించి సేయంగలేము...

‡ గీ॥ అన్యసహాయ మించుకయైన లేక, పద్యమవధానమందు జెప్పంగ లేని, మీ మహాధారణాశక్తి......

♦......తెలుఁగు మీసంబు నిలుపంగ దివ్యపడింక. (20-8-11)

† మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బారాయ కవిగారికి అయ్యా! పద్యమయంబగు తమ యుత్తరమందెనది, "మీపద్యము మాపుమాటను బహాబు కొసంగినవాఁడ నమ్ముఁడీ" అని వ్రాయించినారు. ఏసందర్భమునం దేవిషయమునం దేరూపముగా మా యేమాట మీ యేపద్యమును మాపినదో యావిషయము విపులముగా వ్రాయించినంగాని మీకుఁదగిన యుత్తరమిచ్చుటకు వీలులేదు. కావున వెంటనే దయచేసి పైవిషయమును వ్రాయింతురుగాక.—

21—8—11

ఇట్లు, దివాకర్ల తిరుపతిశాస్త్రి.

క. 'పద్దెములు వ్రాసితిమి వి, ద్వద్దళ గూడెట్టి మనము పలుచనగా వా
గ్గద్దె విటు గొట్టిరని లో, గుద్దుకొనం దొడఁగి రంట? కొంప్రపఫ సామల్.

క. 'మును రామకృష్ణులకుఁ జ, క్కనిపద్దెమ్ములను వ్రాసి ఘనతనొసఁగి రి
య్యానవుల మనలం జూచిరి,'యని లోలో వగచిరంట? యాత్రింపుఁగవుల్.

క. అనుకొంటిరి మేము వీరికి, నవపద్యపుఫక్కి వచనమైనఁ గా వ్రాయం
జనద, యది గ్రామ్యశైలిం, బనుపడుటే యుక్తమనుచుఁ బదపడి జననీ.

క. కాని యటు మొదట యోజన, మానసమునఁ దవులకున్కి మఱి యాధాటిన్
బూని లిఖియింప మైతిమి, దానికె యక్కవుల కెడఁడ తబ్బిబ్బయ్యెన్.

క. తగిసంతగూఢగతి మే, మగుపఱచిన వీరికర్థ మగుటె ట్లటు వ్రా
యఁగ నర్థము తముఁగోరఁగ, నగరాజకుమారి! వీరి నగరా? విజ్ఞుల్.

సీ. అపి యనడ్వాహమ్ములన, "మాకునిత్యమియ్యవియె కూర"'కటన్న దెవరుజనని?
ఒకర్రో? యిద్దరో కొక్క? దేవులనుపిలి 'కెద్దు'లంచనుకొన్న దెవరు జనని?
"లవణం"బనిన నేదో యవలికిఁ జని తెచ్చి యెలమి వడ్డించిన దెవరు జనని?
సభ "నశాతో బ్రహ్మ"చదువ "నతాత" లోనవ్వుపర్సంగము నేసి రెవరుజనని?

గీ. వారిలో వారు గారొ కొంపంపువారు
కాక యుండిన గీత మెక్కుతిన స్మృత
మయ్యె వీరికి? నీలాటి యభముశుభము
నెఱుఁగని యమాయకులఁ మీసలెత్తనేల.

క. ఇది యిట్టు లుండె మాజా, బది వారికిఁ జేరె మరల నలవ్రాఁతయున్
గదురుచుకొను నీలోపలఁ, బొదలిన వేఱొకవిశేషమున్ విను మంబా.

(మ॥ రా॥ రా॥ ఏకా రామయ్యపంతులుగారింట విందు)

ఉ. ఇంతకుముందొ విందనుచు నెల్లబుధుల్ విన రామయార్యుఁ డే
నంతపమూనియో పిలిచెఁ జట్టన, నాఁడె నియోగివైదిక
స్వాంతము లెల్లఁబోలెఁ గొనసాగని యాసనచర్చకర్మ, ఫ
మంతుఁ డితండు మున్ననినమాటకు దాఁటక వచ్చి చెచ్చెరన్.

ఉ. నేఁ డరుదెంతుమన్ననుడి నిక్కమొనర్పఁ డటంచుఁ బిల్చి మో
మోటిన తోఁప గన్పడఁగ నొయ్యన నయ్యనఘుండు వోయెఁ "బోఁ
గూడదు కూడు" నంచు నొకకొందఱు దందడిఁ జర్చఁజేసి రా
పాడి గడింప 'కేగుటయె బా' గని వెంకన నిర్వికంకుఁడై.

ఉ. విందనుకూలమై జరిగె విందున లోప మొకింత లేద, యెం
దెందుల లేని మంచిదని యెంచిరొ యేమొ, మఱొక్కపంక్తి మా
కుం,దమ వారి కందఱకుఁ గొండొకపంక్తియుఁ గాఁగ నేరుపా
టుం దగఁ జేసి రయ్యది కడుం సుఖ మిచ్చె ననేకభంగులన్.

ఉ. పట్టురుమాల్ బుజమ్ముపయి బాలరవిప్రభ లీనఁ బంక్తికిన్
రాట్టయి యగ్రపీఠమున రాజిలెఁ గొప్పరపుసుబ్బరావు, బల్
దట్టులు మంచపాటికులధన్యుఁడు లోనగువార లాతనిం
బట్టి క్రమమ్ముగా నతనిపంక్తి నెసంగి రభంగురస్థితిన్.

తే. గీ. జరిగె నారీతి విందు ప్రశస్తగరిమ
భోజనానంతరమ్మున నోజఁ గొంద
ఱేగుదెంచిరి వారు కోటీశశాస్త్రి
శాస్త్రిముఖ్యులు పదపటిచర్య వినుము.

మ. చిఱుమామిళ్ళకులుండు యోగ్యుఁ డలలక్ష్మీపూర్వనారాయణుం
డురుకీర్తిస్థిరుండు వచ్చెనట తన్యోగిత్వమైత్రిన్, ధురం
ధరుడై తక్కినచుట్టలున్ మఱియు నందక్కంగలా రొప్ప భా
స్వర మయ్యెన్ దగుపాటిగా సభ భవిష్యచ్చర్య సూచించుచున్

శా. ఏకా రామయగారితమ్ములఁట! పీ,యే,పీ,యలై ప్లీడరై
దాఁకన్ వచ్చినమేటియంట! మఱి యా ధన్యుండు తాంబూలముల్
వీఁకన్ గొన్ని ఫలమ్ములుం గొని సభన్ వీక్షించి తాఁ బంచె; నా
పోకల్ కొండొక వర్ణనీయము లనంబోలుం జుమీ శాంకరీ!

ఉ. ముందు భుజంగరాయనృపమూర్తికో, కొప్పరపుటయ్యకో, ఫలం
బందఁగఁ జేసి యాపిదప నన్యులు బంధుల కిచ్చి మీఁదన
స్పందిలకీర్తి కంఘ్రిజనిభాస్వరుఁ డా నలమేటి కీయ నా
విం దతఁ డందఁ జే కడు వివేకి మయున్ గరసంజ్ఞఁ జూపుడున్.

ఉ. రామయగారితమ్ముఁ డలరారెడియోగ్యతఁ బొల్చువాఁడు సు
శ్రీమహితుండు లక్ష్మినరసింహసమాఖ్యుఁడు మా కొసంగెఁ ద
ద్ధీమహితత్వమేమి, మఱి లేఁకువయేమి మది న్నుతించుమన్
బ్రేమ ఫలమ్ము వెంకన పరిగ్రహణం బొనరించెఁ గ్రన్ననన్.

చ. తిరుపతి పృచ్ఛకోక్తి యొకతేఁకువ దాని ననాదరింపఁగాఁ
గరము మదిన్ దలంచి యటు కర్జమునన్ గుశలత్వమూనె, నం
తరమునఁ దత్ప్రదాత యది తా గ్రహియించె నొకింత చర్చయున్
సరసముగా నెసంగె నది సభ్యు లెఱింగినదే మహేశ్వరీ!

ఉ. రామయగారికిన్ మఱియు రామయతమ్ముఁడుగారికిన్ గడున్
ధీమహితత్వమందునను దేఁకువయందును గల్గువారకున్
మామదిఁ జర్చ సల్పుచుఁ గ్రమమ్ముగ వచ్చినత్రోవ నింటి కే
మేమియొ చెప్పికొంచుఁ దగ నేగితి మానిసి వోయె నీగతిన్.

చ వెలవెలవోయెఁ జుక్కలు వివేకవిహీనులమోములట్ల ని
ర్మలసలిలాశయంబులు ప్రమాద మెఱుంగని వారి మానసం
బులబలెఁ దెల్వి మీఱె ఘనపుణ్యులు వైదికులు న్నియోగులున్
గలిసి యొసంగుచర్ఘ్యములు గైకొనుచుండె దివాకరుం డొగిన్.

మ. అది వర్షర్తువుగాన మేఘపటలం బావంత దన్గప్పఁ గో
విదమాన్యుండు దివాకరుండు తనగోవిస్ఫూర్తిచే జ్ఞానిదు
ర్మదముంబోలె నపాకరించి సుదినప్రఖ్యాతి యవ్వేళకున్
గదియన్ వెల్గఁదొడంగెఁ గాకవితతుల్ గ్రాసార్థ మట్టాడఁగన్.

క. తరువాతఁ దనదు సొమ్మగు, "గురుతరలీల" యనుపదముగొని పద్యంబున్
బురపుర లిఖించి మీసము, స్మరియించుచుఁ గొప్పరంపుచతురుఁడు పెలుచన్.

ఉ. * పత్రిక సంపి యప్పుడును బద్యము వ్రాయక యుత్తరించు మా
పత్రికఁ జూచి "పీర్మనకుఁ బద్దెము వ్రాయమిఁ జూడ,'నేటి కీ
యాత్రను మీరు మాకుఁ గవులేయని తోఁపరు మీరు తిట్టినన్
శత్రుత మాకుఁ బుట్టు'దను చందముగా" మదిలోఁ దలంచుచున్.

---

* మహారాజశ్రీ తిరుపతివేంకటకవులకు......చ॥ గురుతరలీలఁ జెప్పె సభ గూర్పఁగ నంటిమిగాని, భానువా। సరమున దక్క రారెవరు...ఆశుకవిత్వశతావధానముల్ । విరచనసేయ రావలయు, వెంటనె, మేమవి యాచరించి ధీ। వరసభ మీప్రతిజ్ఞ దెలుపం గలమీసము దీయఁజేతుము..."

గుంటూరు,
22-8-11.

ఇట్లు,
కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ, శతావధాని.

క. పదపడి*పదనమె వ్రాయుచుఁ, దుదిదనుకం బత్రికలకుఁ దొడఁగెన్ 'సుకవుల్
పదుగురుగల సభ'యన న, ప్పదలో రాయివడి వ్రాఁత లెల్లన్ సురిఁగెన్

క. ♦తతిమితతిమి మునుమాకు, త్తరములు లిఖియింపు నతని తత్తఱమూపై
విఱిగి సురిఁగి కరిగెనో? యు, త్తరమే వచ్చుటకు మిగులఁ దడవై పోయెన్.

---

గుంటూరు, 23—8—11.

* మహారాజశ్రీ కొప్పరపు వెంకటసుబ్బరాయశర్మగారికి. అయ్యా... మీసభఁ బద్యమున కర్థ మేకారణముననో మీకుఁ దెలియలేదనుకొనియెదను... తెలియదేని పెద్దలనడుగుఁడు... (4) ఈప్రతిజ్ఞ ప్రస్తుతవిషయము కాకపోయినను మీయంతట మీరు పురస్కరించుకొని వివాదమునకుం దిగుటచే నయ్యది యింతటినుండి మీయెడలఁ గూడ నిర్వహించుట కంగీకరింపక తప్పినదికాదు... (9) మీరు మాకుఁ దెలిసిన యంశములలో నేకదేశప్రవిష్టులు మాత్రమే యయినను మీకోరికం బట్టి మీసభకు రా నుద్యోగింతుమే యనుకొనుఁడు రేపిఁక నొక యాంధ్రభాషైక దేశమగు గ్రామ్యభాషయందుఁ గాని నిర్వ్యతిగణప్రాసశబ్దార్థసాభాస కవిమార్గమునం గాని యన్యత్రఁ గాని మమ్ము జయింపుఁడని కాలుద్రవ్వినచో మాగ్రహాచారమందుకు నొడఁబడవలసినదేనా! అందులకుఁ బ్రాజ్ఞులు సమ్మతింపవలసినదేనా! మాకుఁగల శక్తులలో నేకైక దేశమున నంతో యింతో యెంతో యెఱిఁగినవారెల్ల మమ్మెదిరింపఁ దగువారేనా! శాంతం పాపం... (12) ఈ వ్రాఁతవలనఁ దెలుఁగునేని మీకు పటిమమని యనుకొనకుఁడు..."

గుంటూరు. 27-8-11.

♦మ॥ రా॥ రా॥ కొప్పరపు వెంకటసుబ్బరాయ శర్మగారికి, అయ్యా, (1) జరూరు " అని 25 వ తేదీని మేము వ్రాసిన యుత్తరమునకు 27 వ తేదీ 11 గంటలకు మీ రిచ్చిన జవాబు అందినది...౧. సభ ముందు మీరే చేయవలెను. ముందుత్తరము వ్రాసి యసదృశాశుకవిత్వములకై కాలుద్రవ్వినవారు మీరుకాని మేము కాము...౨. మా విషయమై మీరును మీ విషయమై మేమును సవధానపు టేర్పాటులు చేసికొనవలసినదేకాని యయ్యవి సభ్యు లేర్పఱుపఁదగినవి కావు. ఉభయులచే నేర్పఱిచికొనఁబడిన సభ్యులు న్యాయాన్యాయములును రసారసములును దారతమ్యములును విచారింపఁదగినవారు మాత్రమే. ౫. ఈ విషయముల కంగీకరించుచు మీరు సభ సమకూర్చుఁడు, లేదా మేము సమకూర్చ

క. లలి "బాజాసందడి మం, గళ తూర్యము మఱచినట్టు"గా సభకై ముం
గిలికిన రవివాసర మా, వలికిఁ జని వచ్చె సోమవాసర మంతన్.

చ. సభయగునన్న యాదినము సందడిగా జను లేగుదేర రా
సభమయి పోయె నెన్న్యెడల సందుల గొందుల పంటపూటియిం
డ్ల భరమాగా జనుల్ విడిసి "దాబులు దాటిరి యేలసేయరో
సభ" యని విప్రపుంగవుల సాకెమఁగేరఁ దొడంగి రంబికా!

సీ. పుట్టదిట్టము లేదుపో! నిల్పు టెట్లు కొప్పరమంచుఁ బలుమాఱు పలుకువారు
తన్నుఁగట్టిలబల్కి తనయున్నతిని నిల్పు నెంతదన్కఁ నటంచు నెంచువారు
తన్నూనుబండలే తన్ను వంచననేయు నవసరంబైనప్పు డనెడువారు
నేల విడిచి సాము లేలాకో? యొకచోట నంతలోనే యుండకనెడివారు

తే. గీ. వింధ్యగర్వం బగస్త్యునవంధ్యమహిమ
మగ్గడించి యిసీ! యని యొఱలువారు
హంసకాకచరిత్ర మిప్డందఱకును
స్మృతికిఁ దగిలె నటంచు వచించువారు.

---

దము...రా. జరూరని వ్రాసినను వెనుకటివలెనే ఆలస్యముచేయక రేపు సూర్యో
దయమునకుఁ దప్పక జవాబు పంపవలెను.

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

---

ఉదయం 8 గంటలకు 28-8-11, గుంటూరు.

అయ్యా! ఈ దినమున సభ తప్పక జరుగునను మీ ప్రకటనను బురస్కరించుకొని యనేకులనేక గ్రామములనుండి వచ్చి నిరీక్షించుచున్నారు. వారిని వృథాకుల నొనరించుట యుచితముకాదు కావున నవధాన సభావిషయ మేమయిన దియుఁ బ్రకటించి వారి సందియము దీర్పుఁడు. మా యుత్తరమునకుఁ బ్రత్యుత్తరము రాకుండగనే మేము ప్రకటించుట యుక్తము కాదుగదా?

ఇట్లు
దివాకర్ల తిరుపతిశాస్త్రి.

మ. ఒకచో శైలిగ నొక్కచో వడిగ నోహో! యంచుఁ గన్యాగ్రణీ
పరికరం బెంచఁగ, నంచ యేఁగ, నటు "రార"మ్మన్న కాకంబు ము
న్నొక తీ, రాపయి నొక్కతీరు, పయి నెన్నో తీరులై డస్సి, నూ
టొకయానమ్ములు చూపి కాదె శరణం బొందెన్ మరాళప్రభున్.

కం. అని పూర్వగాథ లెన్నుచు, మనమునఁ దమకడిన శ్రీమకు మతిమతి విసువుం
గనుచుఁ దిరిగిపో నెంచుచుఁ, బునఃపునర్యోజనలకు బుద్ధి చొనుపుచున్.

ఆ. వె. కొండవీటిసామిదండ నుండెడి లేడి
కొండసేనికూఁతు గుఱ్ఱమునకుఁ
దలుచు భయము చెంది దంశంబు లిడునో య
ద్దానితోడఁ జెనఁగు తలఁపు గొనునొ!

తే. గీ. సింహగమనంబు నేర్వంగఁ జిన్ని లేడి
కెన్ని జన్మము లెత్తిన యేని గలదె!
పాల్యపాలకభావసంబంధ ముడుపఁ
దలఁచు టది యెంతయేనియుఁ దప్పిదంబు.

కం. తనపాదములు మనమ్మున, ననయము మననమ్ము సల్పునప్పటికిన్ దాఁ
గనికరము కరము గని దా, నిని మువ్వఁగఁ జూడకున్న నేరము హరిదో.

కం. హరికిన్ హరిణమునకు సం, గర మది హాస్యాస్పదంబు గాదనవా సిం
డరు దానికేమి హరిణము, కరి నెదురుకొ యంద మెట్లు ఘటియించునటుల్.

ఉ. రంకువు శీఘ్రగామియని రాజులు పట్టపుటేన్గు వీడి రా
జ్యాంకము గాఁగఁ గైకొనిరె యక్కట! యేనుఁగుతోడఁ బోర నా
జింకకు శక్తియున్నదె? ప్రసిద్ధికినై "యెదిరింపు" మంచు నే
కొంకును లేనివాఁడు పురికొల్పినమాత్రన యేమిలాభమో!

చ. అరుల కభేద్యమైన చతురంగబలమ్ములు గల్గు రేనితో
గొఱియలగొల్లలేఁ డెదురుకోలు ఘటింపఁగ నెంచి "మీరలున్
గొఱియలతోనె రం"డనుచుఁ గోరిన "సీ" యని రోసి, దానికే
"సరి"యని సిద్ధపడ్డ వడజాబుపరాబుల డాబు లేటికో.

ఉ. ఇచ్చి వరమ్ము గైకొనరె యెల్లసురాధులకు న్నిలింపు; లా
సచ్చరితుల్ మహామహు లసమ్మదవారులతోఁ జెవఁ బట్టి వా

రిచ్చినమెచ్చు లాగికొనుటేమి యపూర్వము! మెచ్చినంత నే
హెచ్చును దగ్గనుట్ పలవదే? తలదాఁటినపోక లొప్పునే.

శా. దేవబ్రాహ్మణవృత్తులన్ విడిచి వర్తింప న్నియోగించి భూ
దేవుల్ వీడుదు రాలపోతు నది భూదేవాజ్ఞకుం దక్కు దు
ర్భావం బౌతతి నూరకుండరుగదా, పైవచ్చుచో నెవ్వరిం
గాపంజూతురె? కావలం బడఁపరే? కాల్ద్రిప్పఁగా నిత్తురే.

ఉ. చెక్కిలినొక్కుచున్ జనులు చేఁపఁగ ముద్దిడుకొంచుఁ బేర్మిమై
నక్కునఁ జేర్చికొన్న సమయమ్మున బాలుఁడు పాలు గ్రోలుచున్
ముక్కు 'కటుక్కునన్' గొఱుక ము ద్దదియెల్లను మూలఁబట్టి "నా
యక్క! ఇదేమిగోరిచెడుగా" యనదోసమె? దాన రోసమే.

చ. వితతతరప్రబంధముల విశ్వజనీనములన్ రచించి కీ
ర్తి జగమెల్ల ముంచుచుఁ జరించెడి తిర్పతివెంకటేశ్వరుల్
మతిచెడి కొప్రపుంగవుల మాయకవిత్వముతోడఁ బోరికిన్
గుతుకము పూనినా రని జనుల్ విని నవ్వుదు రేమొ గమ్మునన్.

ఉ. అల్లిక కేమి సాలెపురు పల్లదె? 'హు' వ్వని యూఁదునంతలోఁ
బొల్లగుసల్లికల్ సరిగ బుద్బుదముల్ గద! దీని కేసుదృ
క్కల్లజుచిత్తమేరియు యథార్థముగా ముదమందునే? యెటో
యల్లిన దేల కాదనఁగ నం 'దదిమే' లను టొక్క మెచ్చొకో.

ఉ. మంగలివాని యద్దము క్రమమ్మున మున్నరచించినట్టివే
ముంగలి కీడ్చి పాతమును బొల్పుగ నవ్వఁగఁ జెప్ప శిష్యపో
ల్కిం గడు ధాటిగాఁ జదివి కేవల మెక్కడొ యొక్క టొక్క టో
జం గయితంబు సెప్పుట యశస్కరమే, సుకవీంద్రు నుత్యమే?

ఉ. విప్రవినోదిపంచి నెటు వేఱొక వస్తువు లుండ దట్టులే
కొప్రపవారు సంచి నిడుకొందురు పర్ణన లన్ని చేసి, యా
శు ప్రకృతిన్ రచించి రని శుద్ధులమాయికు లందురి మర్మమున్
సుప్రథితుల్ గ్రహింతురిది చూచిరి పట్టి రనేకు లెల్లెడన్.

ఉ. గుట్టిది బైటఁబెట్టుటకుఁ గొంద ఔటిఁగియు సంశయింతు రీ
ఘట్ట వశంవదున్న నెటు చేటు దొలంగు? మహాకవిత్వ వి

ఘట్ట సుధాసధామకవితానవతామరసానవాచః
పట్టణవైభవపరిక్షిత బంధురసౌధవిలాసలక్ష్మికిన్.

ఉ. జీవనమూడె మాకని వచింతురుగా కొకకొంద ఱట్టి వా
రేవగనైన జీవనము నీవయిఁ జేతురుగాక, కైత యే
కావలెనే? మఱొక్కగతి గానఁగరాదె? యమాయికాత్ములన్
జీవికకై జగం బపహసించునటుల్ గికురింపఁ జెల్లునే.

చ. ఇటులొక కొంతమంది కవు లెల్లిదపుంగతి దోఁపనాడ న
ప్పటుమతు లాడుపల్కు లలపక్షమువారు సహింప "కేల యీ
కటువులు? కొప్పరిపుంగవు లఖండులు వారల శక్తి చూడుఁ, డు
త్కట మని, గోరతం బనెడి కావ్యమునం దగుపట్టు" నావుడున్.

ఉ. అప్పరమేశ్వరీ దయకు నాకరులన్ గదలించి దానిచే
గొప్పను గోరి కర్తమునఁ గూలి యెటో పయి రాఁగడంగి యీ
కప్పలరావముల్ కొఱయుఁ గావని లోనఁ దపించి పొక్కవి? యా
కొప్పరపుంగవీశులకు గోరతమే హితమెన్ని భంగులన్.

చ. అనుటయు వారిపక్షపు జనావళి వారలయోడు పూర్తిగా
మనమునఁ బట్టియుంట మఱుమాట వచింపక యూరకుండ వ
చ్చిన జనసంఘమందలి ప్రసిద్ధులు కొందఱు కొప్పరంపువా
రిని గని కొన్ని మాటలను రేఁగగ నేగెద మంచు నెంచుచున్.

క. చనుచుండ వారిపక్షమ్మున వారొకకొంద ఱాఁగి మొగి నేమేమో
యన మొదలిడ 'మీరెవ్వరు? చనుఁడా, మేమడుగ నటకుఁ జనవలె'ననుచున్.

శా. కాలిం ద్రిప్పితి రూరకుండెదరె? సంస్కారుల్ జగమ్మందు నే
వేలున్నా రటవారిఁ గోరికొనుఁడా విద్వాంసు లేతెంచి మీ
మీలోపమ్ముల నేర్పరించెదరు సామ్యమ్మేర్పరి కవ్వారికిన్
వీలో తెల్పెద రీనుడిన్ వినఁగ నువ్విళ్లూరెడిన్ లోకముల్.

క. తిరుపతి యెట్టిదియో? కొప్పరమెట్టిదియో కవిత్వభర మెట్టిదొ? సం
స్ఫురణం బెట్టిదియో? ధి, స్ఫురణం బెట్టిదియొ? తెల్పఁ గలరవ్వారల్.

చ. పదు వెటువంటిదో? తెలుచు బాసయు నెట్టిదొ? దేశమేని సం
స్ఫురణము పూజ్య మయ్యు పరిగంగలనాడుట యెట్టిదో? సమ

స్ఫురణకు నాసనమ్ము నెడఁ బోరడిధీరత లెట్టివోక్కొ? వి
స్తరము లొసంగు టెట్టిదియొ? సత్కవితావనితావినోదముల్.

ఉ. కోరిక యెట్టిదో? యడఁగఁ గొంకు పయింకమి యెట్టిదో? పరి
ష్కారము లెట్టివోక్కొ? మమకారము లెట్టివొ? యంతఁ బోక ధి
క్కారము లెట్టివో? పయివికారము లెట్టివొ? బారుబూరలం
కారము లెట్టివోక్కొ? యధికారము లెట్టిదొ? కార మెట్టిదో.

ఉ. సారము లెట్టివో? పయి నసారము లెట్టివొ? కాలుద్రవ్వు ఝం
కారము లెట్టివో? పయిఁ జకారము లెట్టివొ? యంతలో దఢ
క్కారము లెట్టివో? మఱి నికారము లెట్టివొ? పిమ్మటం దిర
స్కారము లెట్టివో? పొరిఁ జీత్కారము లెట్టివొ? కాఱు లెట్టివో?

ఉ. గీరము లెట్టివో? తిరుగు బేరము లెట్టివొ? పిమ్మట న్నమ
స్కారము లెట్టివో? పయిఁ బ్రకారము లెట్టివొ? యాపయిన్ జప
ట్కారము లెట్టివో? పయి నకారము లెట్టివొ? మీఁదు మీఁదు నా
కారము లెట్టివోక్కొ? నుడికారము లెట్టివొ? నైర మెట్టిదో?

ఉ. హారము లెట్టివోక్కొ? వ్యవహారము లెట్టివియొక్కొ? యీచమ
త్కారము లెట్టివోక్కొ? బయికారము లెట్టివియొక్కొ? పై బహి
ష్కారము లెట్టివోక్కొ? యుపకారము లెట్టివియొక్కొ? యాయహం
కారము లెట్టివోక్కొ? యపకారము లెట్టివొ? నేర మెట్టిదో?

ఉ. పారము లెట్టివోక్కొ? పయివారలశూరత లెట్టివోక్కొ? స్వీ
కారము లెట్టివోక్కొ? గుణకారము లెట్టివొ? చుట్టునున్న ప్రా
కారము లెట్టివో? పయిలకారము లెట్టివొ? చాటు చాటు స
త్కారము లెట్టివో? తెలుపఁగాఁ గలవారలు పండితుల్ గదా.

చ. కవి యన నెట్టిఁడో? కవిత గా దగునట్టిది యెట్టిదో? పృథా
రచనము లెట్టివో? కవుల రాపము లెట్టివొ? సత్కవీశ్వరో
త్సవచరితమ్ము లెట్టివొ? బుధత్వ మదెట్టిదొ? యేరి కేరికిన్?
శివ! శివ! సామ్య మెట్టిదియొ? చెప్పఁగలారు బుధోత్తముల్ గదా.

చ. ఎవరును పేరు నొక్కరొడ నెల్లరు మెచ్చఁగఁ గూరుచున్న నా
ప్పుపునోశా! యేరికిం దగదొ? యక్కట! శత్రులు పట్టి చూచి "వి

ర్కావు, లలవారలో, కవులు గాఁ దగువార" లటంచుఁ దెల్పఁగా
నెవరితరంబు? పండితకవీంద్రులు దక్క జగత్త్రయమ్మునన్.

ఉ. రా మనిరొక్క! పండితులు, రమ్మని కోరనెలేదొ? సద్యశః
కాములు మీరు వారిపయిఁ గాలటు ద్రివ్వి యుపేక్ష సేయఁగా
నేమి! వృథాగ లోకమున కింత పరిశ్రమ మేల పెట్టినా?
కీమెయి నూరకుంట తగునే! యని కంకెద మంచుఁ బోవుచో.

ఉ. ఏమిది! యీ జనంబునకు నింతటి పక్షము వారియందుఁ ద
న్నామము వీరి కింతగ మనమ్మున కెక్కఁగ నేల! క్రొప్రపు
న్నామము కోపపాత్రముగ నాటగ నేల! స్వదేశవాసు లన్
ప్రేమముగూడఁ గన్పడ దరిప్రకరమ్మును మించి రీ ప్రజల్.

చ. అని మనమందు నెంచుకొని యవ్వలి పక్షపువారు "మీరు వ
చ్చిన పని చూడిపోవుటకుఁ, జెప్పెడిమాటలు పెద్దమాట, లే
క్షను లయి మీకుఁ గట్టములు గప్పెద? రింతటి కంఠశోషకుం
బని గనుపట్ట" దంచు నుడువన్; "బని లేనిదె వచ్చినార మే.

మ. కవితావాద మటన్నఁ జూచుటకునై కష్టించి యీసత్సభా
సునివేశంబుల నాలకించుటకు నచ్చోనుండి యిచ్చోటికిన్
జవసత్త్వమ్ములు వెచ్చఁబెట్టుకొని రాఁ జన్నే! వృథాహంకృతి
స్థగితుల్ నించిన పత్రికల్ గని యథార్థం బంచు నూహించుచున్.

మ. అదగా కూరక వ్యాఘ్రసింగ గదుపులా గంతంత మిట్టెక్కి నె
మ్మదికి న్నెమ్మది దక్క మానసములపై మాత్సర్యముల్ గ్రిక్క సా
గన యంచుల్ దల గ్రుక్క పాటుకవులన్ గన్గోఁ జనన్ రాదె! యే
మిది! మీపూనిక యెందు కింతె!" నని పేర్మిన్ బల్కఁగాఁ గూడదే.

చ. అడిగెద మేము మి; మ్మడుగుఁ డట్టులె మమ్మును మీ, రటన్న వా
క్పటిమ యదెట్టిదో! కపటపద్ధతు లుద్ధతు లెట్టివొక్క! యా
గడబిడ లేమి యయ్యెనొకో? కాలటు ద్రివ్వుట దేడ కేగెనో!
మడమలు ద్రొక్కి మానమును మట్టునడావడు లేడ డాఁగెనో.

ఉ. "మీసము" లంచు మీసములమీఁదికిఁ బోవుటె కాక వారియ
స్థానసమందుఁ జేరుటకు నాసన మూఁచుటె కాక యొన్నియో

దోసపు బాసలన్ గిలికి తుందుడు కందురొ కాక పై రసా
భాసము చేసి పాఱు టిది భావ్యమె కొప్పరపుంగవీశ్వరుల్.

చ. సమరము చూచి ఖేచరులు సంబర మందుట యొందు విందు మ
ద్యమరులువోలె సభ్యులు జయాపజయార్థులు గాక వారు ప్ర
శ్నము లిడ నెవ్వ "రగ్గుఁడు పసన్ గనుఁ డగ్గెద" యంచు వారు స
క్రమముగ వ్రాయ నందులకుఁ గాక పరాఙ్ముఖులైతి రేటికో.

ఉ. గ్రుద్దె నఁటాంజనేయుఁ డొక గుద్దును రావణుఁ బట్టి మూర్ఛమై
నద్దివిజారి జాతి తెలి వంది "బళీ" యని మెచ్చెనంట! యా
నుద్దికి నంజనాసుతుఁడు నుంతయు సంతస మంద 'కార! నా
గ్రుద్దురుచిన్ వచించు టొనఁగూడెనుగా!' యని వంచె వక్త్రమున్.

ఉ. "మీసము" లన్న "జు" ట్టనుచు మిమ్మను వారన వచ్చుఁగాద! యే
వాసియు లేనివారియెడఁ బంతము ప్రాజ్ఞుల కేల? మీ రసా
భాసపువ్రాఁతయే తెలుపుఁ బండితదూరు లటంచు; సర్వథా
దోసము మీది, మీరిక నొదుంగక చేసెడి దేమి కైసరుల్.

చ. "గురుతరలీల" పద్య మది కో! యని యార్చుచు నుండె మీరె పై
బరు విడుకొన్న వారలు సభం బొనరించుటకంచు, నేల యీ
పిటికితనంబు సెప్పఁ డని బి ట్టడుగన్ పలె" నంచుఁ బోయి కొ
ప్పరపు కవుల్ కనంబడక వచ్చిరి వాగ్మముఁ జూడ నంబరో!

చ. అపు డొకచోట విందునకునై చనియుంటిమి మేము మా నివా
సపదము చూచి 'వీరలును జాతిరొకో!' యని యాడుకొంచు 'న
ట్టివనియు నుండునే!' యనుచు, డీకొని కొట్టెడిసేనపోల్కి న
య్యపరిమితప్రజానిచయ మయ్యెడఁ జే చనుదెంచె నంతటన్.

శా. అందున్ గొందఱు బ్రాహ్మణుల్ మఱియు వైశ్యశ్రేష్ఠులుం గమ్మవా
రెందుం గన్పడి రిందఱున్ గవితకై యేతెంచుటంజేసి యం
దం దించించుక గోష్ఠి గల్గు టనుమేయం బయ్యె నోయంబ! మే
మెందు న్నమ్ర న్గనియుండ మిందఱను దాదృగ్రిక్తిసంపన్నులన్.

ఉ. నాలవజాతియందలి జనంబులు తూర్పున నుండ్రు గాని యీ
నాలవజాతివేఱు పయి నాగరికత్వముమాట కేమి వి

ద్యాలయములన్నఁ బ్రాణముల నర్పణ చేసెడిపాటిభక్తులుం
జాలఁ గలారు కమ్మకులజన్ములలో శతముల్ సహస్రమున్

ఉ. వారలు నన్యులుం గడు నవారిగ వీధికి రెండుప్రక్కలన్
బారులు గట్టి నిల్చి యిట వచ్చుట, కొప్రపువారిఁ జూడఁగాఁ
గోరికతోడ నేగి తమకున్ మతి వారగుపట్టమిన్ వృథా
యై రహి నిండ్లకున్ మరలు టాదిగ నొండొరు లాడుకొం చొగిన్.

శా. అయ్యా! తిర్పతివెంకటేశ్వరులు! మే మత్యాశమై వేడ్క మీ
కయ్యంపున్ సభఁ జూడ వచ్చితి మిటన్, గా ల్ద్రివ్వినా రెవ్వరా
యయ్యల్ మోమును జాటు పెట్టిరిఁక మా యాయాసముల్ వ్యర్థమే
యయ్యెన్, వచ్చినత్రోవఁ బోవుదుమొ? లేదా, యుందుమో? తెల్పుఁడీ!

చ. ఎఱుఁగుదు మేము ‘కొప్పర’ మదెట్టిదొ? వారిని జూడ రాము, మి
మ్మెఱుఁగము మీదుపాత్రముల నింపెసలారు “ఫొటోలు” దక్క నేఁ
డరసితి మయ్యొ ధన్యము భవాదృశ; మూరక పొ మ్మటందురో?
దరిసెన మిచ్చి నందులకుఁ దగ్గఫలం బొసఁగం దలంతురో?

చ. అనుచు ననేకభంగుల జనావళి మాపయిఁ గల్గు ప్రేమమున్
గనుపడఁ జేయుచున్, బలుకఁగా నపుడేము వసించు సౌధ మొ
య్యన డిగి నాటకాలయమునం దొక మేటిసభన్ బొనర్చి నే
ర్చినగతి వారికిన్ గలుగఁ జేసితి మగ్గల మైన మోదమున్.

సీ. ‘తిరుపతివేంకటేశ్వరులఁ జూచితి’ మంచుఁ బలుమాఱు సంతసంపడెడివారు
ఉవ్వెత్తుగా లేచి మొక్కఁ దండములీలఁ బడి నమస్కారమ్ము లిడెడివారు
కొప్రింపువార లీగొడవఁ దెచ్చుట మేలె యయ్యెఁబో! యని పేర్మి నాడువారు
కయ్యంపుసభఁ జూడఁగలభాగ్య మిఁక లేదు వాదుపాతీరటంచు దూఱువారు

గీ. పాఱి కేమి యొనర్తురు వారికున్న
సరుకు నెఱుఁగమె యని చర్చసలుపువారు
ఐనచోఁ గాలు ద్రవ్వ నేల నెడివారు
అడుగు మవ్వారి నటకేగు మనెడువారు.

ఉ. అన్నిట వీరిదృష్టిని శతాంశము వారలు గారు దద్దడన్
దున్నకవిత్వమందు పలఁకుల్ మనవారలె యాదు, రంచు; నే

మున్నది దానిలో ననుచు, నుండిన దేదియొ యున్న దంచు, నా
తెన్నొకకష్టమే యను, చుదీర్ఘతరమ్ముగ వాదులాడుచున్.

ఉ. ఏమియు రానివార లెటు లేది యొనర్చిన మంచి దౌ, సుధీ
గ్రామణు లట్లొనర్చునెడ గ్రాంథికు లొప్పరు సాఁగఁ దీరు రిం
తే, మనవారు వోలె నలతిర్పతివేంకటపండితుల్ వచ
స్తోమము జార్చ లేరె యది దోసముగాఁ దలపోయ కుండుచో.

ఉ. జార్తురుగాక నో రెటులొ చయ్యన, నొయ్యన వట్టి పద్దెముల్
గూర్తురుగాక వీరు "చెవి గోసిన మేఁకల" పోల్కెఁ జాలనే
పార్తురె! డయ్యూరే! యుభయు లంత బలాఢ్యులె? దేహదార్ఢ్యమం
దేర్తుర కొప్పరంపుఁ గవు లీకవియుగ్మము నొక్క వ్రేల్మిడిన్.

చ. అనునెడ దేహదార్ఢ్యమునకా యలవారలు గాలు ద్రివ్వి? రి
ప్పునియెడ నేను జాలనొకొ! పాండితియున్న భయమ్ము గాని వీ
రిని మఱి వారినిం గలిపి రేనియు నాబుజ మొక్కటే సుఁడీ
పనిఁగొని యాఁపు నం చొకఁడు బాహుబలాఢ్యుఁడు పల్కె నల్కమై.

క. అని వారి వారికిన్ దోఁ, చినగతిగాఁ "బిచ్చపాటి" చెప్పికొనుచు భో
జనపుం బసలకుఁ జని మఱు, దినమున నటనుండి బయలుదేఱిరి వారల్.

చ. సెలవును వ్రాసి స్కూలునకుఁ జెచ్చెర వేంకటశాస్త్రి మున్నె, యీ
కలహము దేలునంతకును గాల్గదలింప నటంచుఁ బంతముం
గలిగి వసించె నప్పురిని, గయ్యపుసంగతు లాలకించి శి
ష్యులు మఱికొంద ఱయ్యెడకుఁ జాడఁగ వచ్చి తనున్ భజింపఁగన్.

చ. సరసులు యోగ్య శౌజనులు సంతతమున్ గవితాదరమ్ముమై
నెరఁగుచు విందులన్ దనిపి యెంతయు గౌరవ మాచరింప న
ప్పుర మది వాసమై యచటిపూజ్యులకున్ దలలోని నాల్కయై
తిరుపతి యప్పు డప్పు డరుదేరఁగ, వెంకన యుండె నయ్యెడన్.

శా. "ఆసీమాంత మొనర్చి గాని విడువం డాపెంకటేశుం" డటం
చాపీమన్ జనులెల్లఁ జెప్పికొన నిత్యమ్మున్ గవిశ్రేణి కిం
తే సంతోసము గూర్చుచున్ విమతు లంధీభూతచేతస్కులై
యూసున్ జెంది కృశింప మూఁడునెల లందే యుండె నుద్దండతన్.

ఆ. వె. మొదటఁ గాలు వెట్టినది యల్ల * శిష్టా హ
నూమదార్య గేహసీమ, యచటి
నింబభూరుహంపునీడ సాక్షాత్కల్ప
పాదపంబునీడ గాఁ దనర్చె

ఉ. చాపలు నిండి బల్లలకుఁ జాలి రజఃకణకీలితంబు భూ
మీపద మాక్రమించి పయిమిక్కిలి వీధికిఁ దాఁకి గేహపుం
దావున నున్న యన్యసదనంబుల ప్రక్కల నిల్చి సారెకున్
శ్రీపతి వేంకటేశ్వరులు చేయు ప్రసంగము విందు రెల్లరున్.

శా. అంబా! నింబము నీనివాస మదియో? యభ్రంకషానూనశా
ఖం బచ్చో నెపుడీవు పొల్చుటది నిక్కం బే, భవత్సాక్షికం
బుం బూజ్యాశయసాక్షికంబు నగుచుం బొల్పారు తత్తత్సభా
లంబం బౌ కవితాప్రసార మది యేలా నొక్కి వాక్రుచ్చుటల్.

మ. ఎటు నీభక్తులవాఙ్మధుద్రవము లందే పారె, శత్రుప్రజం
బటకున్ వచ్చి మనంబునందు నెటు "క్షీ" లౌ వారి, లాక్షాప్రపుం
గటువాక్యమ్ముల కెట్లు వారురక దుఃఖం బందువా, రెట్టుగా
గుటకల్ ద్రింగెడివారొ? నీమది యెఱుంగున్, జెప్పఁగా నేటికిన్.

ఉ. ఐనను శాఖ బాధ కయి యావలికిం జని తప్పుచొప్పులన్
బూని యవాచ్యముల్ గిలికి పుచ్చియు నెమ్మన మాఁగ లేక మా
పై నెనరున్నయట్టులుగ వచ్చి రసం బది గ్రోలి పోవు వా
రేని యథార్థముం దెలియ నెల్లరు నీవును డాఁగురింతురే?

చ. ఎలమి రచించి తీరవలె నీకవటాత్మలసత్స్వభావ; మీ
యలఘుల వేము శత్రువులమై మఱి మావచనంబు లెట్లు వీ

(గుంటూరినుండి బయలుదేఱు సమయమునఁ జెప్పినది.)

*సీ. తిరుపతి వెంకటేశ్వరుని కొండకు నీకు భేదమే కనుపట్టలేదు తల్లి, శ్రీశైలమల్లేశు శిఖరమ్మునకు నీకు భేదమే..., మధురమీనాక్షి వేశ్మస్థలికిని నీకు భేదమే..., కాశికావిశ్వేశు గర్భగుడికి నీకు భేదమే... తల్లి, తే॥ గీ॥ ఎట్టి సుముహూర్తమందుఁ దాఁగట్టెనొక్కొ, ఘనుఁడు శిష్టాహనూమదాఖ్యాక సుకవి, అడుగు వెట్టిన దాది బ్రహ్మసభఁ జేసి, పంపుచుంటివి నిను వీడవలసె నేఁడు. (వెం॥ రా)

మలకు రసాయనంబు లగునో? యవి జీర్ణము లైనవెంట నే
ఖల కపవాదముల్ గిలుకఁగాఁ గరముల్ దిరుగాడు నెట్టులో!

క. ఖలజనులవర్తనములకుఁ, జలయని తోఁక యని చెప్పఁ దరమే? యలపా
పులకేమి నింబకుజభూ, తలసభ లవి యెంతి కేని దగు జగదంబా!

చ. అరు లగువారి కిట్టు లెదయందలికుంపటివోలె నుండి యా
తిరుపతి వెంకటేశ్వరులు "తీర్పరులన్ బిలిపింపుఁడీ, సభన్
జరుపుఁడి మీసముల్ నెఱుకఁ జాలినచోఁ దెలుపుం డ" టంచుఁ దీ
వరముగఁ జెప్పఁ గొప్పరపువారిబడాయి క్రమక్రమమ్ముగన్.

ఉ. తగ్గి యిదెట్టులేనియును దప్పికొనన్ వలె నంచు నంతటన్
బగ్గలు వ్రాయ మాని తమపక్షము దుర్బలమౌట నెట్టులు
న్నెగ్గ దటంచు లోనెఱిఁగి * నెయ్యుఱుకుం గడు గూఢవృత్తిపై
సగ్గతి డాఁచి స్నేహమగు టర్హ మటంచు లిఖించుచున్ వెసన్.

చ. పయికిఁ బ్రియగర్భవాక్యములె పల్కుచు నప్పరమందె తీరికన్
గయికొని కూయుచుండిరి ప్రకంపితమైన మనంబు చందమై

---

చెన్నపురి; లైబ్రరీ, గురువారం.

*...నిన్న కొప్పరపుంగవులు నా పేర 8 పేజీల ఉత్తరం వ్రాసినారు, వివాదచరిత్రమును వ్రాసినారు. తమదోషము లేశమును లేదనియు వెం|| శా|| అన్యాయముగా గర్హించిరనియు, మొదలుగా వ్రాసినారు. దానిపై ఖరిచూడఁగా వివాదమునుండి తప్పించుకొనుట కిష్టపడుచున్నారని దోఁచుచున్నది. అట్టి ప్రయత్నము న్యాయ్యమే తప్పక మీరును అంగీకరింప వేఁడెదను. ఈ వివాదసభలు కార్యకారులు కావు. నడుమ వారికి పండువు, పోరాడువారికిర్వురకు శ్రేయము కన్పడదు, ఈ సభలలో తీర్పుతీర్చువారెవరు? ఎట్లుసాగును? "లోకోభిన్నరుచిః" తత్రాపి స్వస్వపక్షాభిమానో బలవాన్ బాధతే. వారు 'ఛాలెంజి' ప్రచురించినందుకు, శివరామశాస్త్రి వగైరల ప్రచురించెను. ఇంతట నాఁగిన బాగుండునని నేను తలంతును నా ప్రార్థన మిదియే. ... ఏవిధముననైనను తగవుమాపుకొనుట బాగు. నేను వారికేమని సమాధానము వ్రాయుటకును పాలుపోకయున్నాను, జవాబు వెంటనే వ్రాయించవలెను...."

వే|| ప్రభాకరుఁడు.

ల్లయెడల నెల్లరుందెలిసి "లావతి" రంచు వచించుచుండు న
పిప్రియములు పూర్తిగా వినియు బీరము మానర వారు మాటలన్.

ఉ. అంతట వాకిపత్రమున కావరు వౌ కులవృద్ధుఁ "డక్కటా!
యంతన తేలిపోవు నని యంపు మటంటిమి పత్రి మల్లవా
రెంతటిపట్టు పట్టిరొకొ ? యిప్పరి వీడను కొప్పరంపువా
రెం తలవారి ధాటి? కిపు డేమనుకొన్న మతేమి లాభమా.

ము. పులిపై బెడ్డను వేసి చెట్టుపయికిం బోవన్ వెసన్ దక్కు బ
స్థలమందే యది పీఁట నెట్టి యెటులో సాధించుఁ గాదే పగన్
దొలి నాలోచన చాల దయ్యె నపు డేదో హానియౌ మన్నార మి
ప్డలఁతిం బోకది "యేకు మే" కనెడిసామ్యం బయ్యె నెట్లో కదే!

ఉ. పాపము! "వారిదాసులము వారలలోన శతాంశమేనిఁ గా
మోపము వారి" కంచు నతియోగ్యుఁడు కొప్పరిపుజ్యేష్ఠుఁ డప్డు తా
నోపిన యంతవట్టు మొగమోడక చెప్పె; పృథాభిమానపుం
దాపము నాఁడు మామదికిఁ దద్వచనమ్ముల నెక్కనీ దహో!

ఉ. ఎంతటి ధైర్యమున్ మఱియు నెంతటిశక్తియు లేక యున్న ని
శ్చింతగ నాఁటి సత్సభ "ననేమిర వారల కాసనంబు మా
చెంత ఘటింపఁ గూడ" దని చెప్పఁగ నేర్చునె ? వేఱు సీమ య
న్నంతన భీతి పుట్ట వలదా ? కలదా? యిటువంటి చేవయున్.

చ. ప్రముఖుల మెంతమంది పని పట్టితి మక్కట! వారిముందు మా
అ మయితి మింత కెంతటిపరాభవ ? మూరక కొప్పరంపువా
రి మొరవ మిక్కుటమ్ముగఁ బొరిం బొరిఁ దగ్గఁగఁ జొచ్చెనే యుపా
యమునవో పీరిపైఁ బడునపాయముఁ బాయఁగఁ జేయఁగా వలెన్.

ము. * అని యోజించుచు నుండె నంత నొకనాఁ డాయూప్రసంగంబు నె
ల్లను విన్పించు సభం బొనర్చి తగుహేలన్ విన్కి సేయంగ వ
చ్చినవా రెల్లరుఁ బత్రికల్ వినుచు మంచిన్ జెడ్డ యోజించుచుం
డు నెడన్ గొందఱు వచ్చి రయ్యెడకు నెట్లో యానవ స్వాఁగఁగన్.

* నిష్పక్షపాత హృదయులును యథార్థపరిజ్ఞాతలును గుంటూరు పురవాస్త
వ్యులు నగు నార్య సోదరులారా! కొప్పరపువారు ప్రతిజ్ఞా పూర్వకముగా

ఉ. వచ్చిరిగాని యాసభ యవార్యముగా జరిగెన్, సమస్తముం
ఏచ్చునవంటిపండుబలె విజ్ఞులదృష్టికి స్పష్టమయ్యె "ని
ష్పచ్చర మెందుకిగతి గబాగబ లాడిరొకో?" యటంచు నె
న్నిచ్చినవారి దూఱి "రిహిహీ, యిహిహీ!" యని కొందఱాయెడన్.

ఉ. పనిగొని యుత్తరాల్ వినుచుపట్టిన నాసభ నాఁగుపూన్కి వ
చ్చిన యలశ్రీనివాసగుణిశేఖరువైఖరి "కోప్పరంపున

---

27 వ తేదీ ఆదివారమునాఁడు సభకు రావలయునని ముందుగా మాపైఁ గాలుద్రివ్వి పత్రికవ్రాసి, యందులోని యసందర్భములను దెల్పుచు మేముత్తరమీయఁగా వానికిఁ దగు సమాధానము వ్రాయక యేవో కొన్ని యుక్తులతోఁ గొన్ని యుత్తరములు వ్రాయుచు సభ ఆదివారము దప్పించి సోమవారమునకు మార్చిరి. తుద కాదివారమునాఁటి రాత్రి యనేక గ్రామములనుండి విచ్చేసిన మహాజనుల విఫలమనోరథులంజేయుట యుచితము కాదని మేమాదివారమునాఁడు వ్రాసిన యుత్తరములోఁ గొన్ని పండితసమ్మతములైన నిబంధనము లుదాహరించి "యీ ప్రకారము మీరు సభకూర్పుఁడు లేదా మేము గూర్చెదము అంగీకారానంగీకారములు రేపుదయమునకు దెల్పుఁడు లేదా మీరీయుద్యమము మానుకొన్నట్లే ప్రజలు దలంతురుగాక" అని స్పష్టీకరించినను దానికిజవాబు వ్రాయక సభానిర్ణయించినమునుముఁగూడ నుదయము 8 గం॥కు మరల 'రమైండరు' పంపినను దానికిని నేమియుఁబలుకక చల్లఁగా నాదినమెల్ల దాఁటించి ఆమఱునాఁడు 29 వ తేదీని మాకవసరము లేకున్నను మేము మరల "మీయుద్యమము మానుకొన్నట్లే యని దలఁచి మేము కాకినాడ వెళ్ళుచున్నా" మని వ్రాసిన యుత్తరమునకును దగిన సమాధానము నేమియు వ్రాయకుండుటచే వారు సభను మానుకొన్నట్లు మాస్తాటికిని స్పష్టపడినది. పిదప సభమాటట్టు లుంచి మీ మా యుత్తరప్రత్యుత్తరములలోని సారాసారములును న్యాయాన్యాయములును ప్రాజ్ఞులమూలముగా నిర్ణయించుకొని పిమ్మట విద్యావాదమునఁ బ్రవర్తింతమనియు, ఇందుకు రేపుదయము 8 గం॥కు లోఁగా జవాబిండనియు 28 వ తేదీ రాత్రి 7 గంటలకు మావ్రాసిన యుత్తరమునకు నేఁడు 10 గంటలకు నవసరపు యుక్తులతో దానికిఁగూడ నంగీకారమును దెల్పక "యుత్తరప్రత్యుత్తరములు ముగించుకొన్నాము" అని వ్రాసిన యుత్తరమునుగూడఁ జూచి వారికి జవాబు వ్రాయుట యిఁకతో

ర్తనములయుత్తరమ్ము లవి ప్రాజ్ఞసభాననుకూలదుర్వచః
ఖను లని యెల్లవారలకుఁ గ్రిన్నఁ జెప్పక చెప్పె నొప్పుగన్.

ఉ. ఏమిటి కాఁగఁగా వలెనొ? యెల్ల రెఱింగిన యుత్తరమ్ములన్
శ్రీమహితుల్ మహామహులు చేరిన సత్సభ విన్కి సేయుచో
నామహితుండు ప్రాజ్ఞుఁ డగుపట్టిఁడు గావున వారితప్పుడుం
బూమెలు కంపు గొట్టువని బుద్ధి గలంగినవాఁడు గానిచో.

---

ముగించుకొని ఆయాయంశములు లోకులకు శ్రుతపఱుపఁ దలఁచి ఈనాఁటి సాయంకాలము 6 ఘంటలకు శ్రీ ఫస్టుకంపెనీ నాటకశాలలో నుపన్యసించు చున్నారము గానఁ దామెల్ల విచ్చేయఁ బ్రార్థితులు.

గుంటూరు,
30-8-11.

ఇట్లు,
తిరుపతి వేంకటేశ్వరులు, శతావధానులు.

పై నుదాహరించిన యాహ్వానపత్రిక ననుసరించి శ్రీ ఫస్టుకంపెనీ హాలు లోనికి వకీలులు పౌరులును నితరులును నగు మహాజనులు నియమితకాలమునకు మున్నే వచ్చియుండిరి. పదపడి కాలేజి ఉపాధ్యాయులగు బ్ర॥ శ్రీ॥ మల్లాది వెంకటసోమయాజులవారి కోరిక ననుసరించి శ్రీమాన్ వంగిపురం కృష్ణమాచార్యులు బి. ఏ. ఎల్. టి. (వీరును కాలేజీ యుపాధ్యాయులే) గా రగ్రాసనాధిపత్యమును వహించిరి. వీరు సంస్కృతాంధ్రములలో గ్రంథముల రచించిన పండితకవిసత్తములు. పిదప నాయాయీ యుత్తరములు తిరుపతివెంకటేశ్వరులు వినిపింపఁదొడంగిరి. మొదట వెంకటశాస్త్రిగారు శ్రీకొప్పరపువారి మొదటియుత్తరమును మాత్రము వినిపించి ఆనాఁడే 12 గంటలు మొదలు మూఁడు గంటలవఱకును గోర్టులోఁ గంసాలులనుగూర్చిన వ్యాజ్యములో సాక్ష్యమిచ్చియుండుటవలని యాయాసముచేఁగాబోలును పదపడి యుత్తరములను దిరుపతి శాస్త్రిగారిని వినిపింపుమనిరి. తిరుపతిశాస్త్రిగారు వినిపించుచుండఁగాఁ గొందఱు పెద్దమనుష్యులువచ్చి యంతతో ప్రకృతసభ ముగించుటకై వెంకటశాస్త్రిగారిని గోరిరి గాని తగినంత హేతువునుజూపి కోరనందున వెంకటశాస్త్రిగారందుల కంగీకరింపరైరి. పిదప గంభీరముగాఁ దిరుపతిశాస్త్రులుగా రాయాయీయుత్తర ప్రత్యుత్తరముల నుపన్యసించుచుండఁగా వేంకటశాస్త్రులుగారు దాని వాఁప నుంకించువారితో సహేతుకముగా మెల్లఁగా నుపన్యసించుచుండిరి. పదపడి సభ

క. ఉత్తరముల తత్తఱములు, సత్తములకు చేహ్యామైన చందము గలవం
చుత్తముఁడు శ్రీనివాసుఁడె విత్తములకు సాక్షి యని వివేకు లెఱుఁగుతఁ.

క. *కుచమర్దనాదిపదముల, రచనం బచరించు కొప్పరపువారి వచో
నిచయము గల పత్రికలకు, నచటం గల సభ్యు లేవమందిరి పెలుచఁ.

---

నాఁపుడని కోరినవారు తామేదో మధ్య చెప్పుటకు నవకాశమిండని కోరిరి. అందులకును దుట్టతుదకుఁగాని వీలులేదనియు నప్పుడేని యగ్రాసనాధిపతుల నడుగఁదగియుండుననియు వెం॥ శా॥ గారు బదులు చెప్పిరి. పదపడి యుత్తరములనెల్ల దిరుపతిశాస్త్రిగారు వినిపించినపిదప నెవరు సమర్థులో, యెవరుకారో యెవరియుత్తరములు దురుసుగానున్నవో యెవరివట్టివికావో, యెవరు కోరిన షరతులు పండితసమ్మతములో యెవరివికావో, యెవరి వెనుకతీఁతవలన సభకాలేషో లోనగు నంశములు సభ్యులకేకాక సభనాఁపవచ్చిన యుత్తమపురుషుల హృదయములకుఁగూడ స్పష్టపడినవి. ఆ యీయంశములనే శ్రీ అగ్రాసనాధిపతిగారు తుట్టతుదనుపన్యసించుచు "మీసములపద్యము యొక్క యర్థమునుగూర్చి" తాము గూడ నిదివఱకుఁ బొరపాటుగానే యన్వయించుకొంటిమనియు నిప్పుడది స్పష్టముగాఁ దెలిసినదనియు నుభయభాషలు రానివారు దానిజోలికిఁ బోఁగూడదనియు సంస్కృతము రాని తెలుఁగు గణనీయము కాదనియు నుపన్యసించుచుండఁగా సభనాఁగుపూనికతో విచ్చేసినవారు పరిష్కృతమా విషయము నాఁగవలసినదని కోరిరి. దానిమీఁద నగ్రాసనాధిపతిగారు "కోరిక ననుసరించి యీ పద్యార్థము నిప్పుడు విస్తరింపక వదలితి" మని చెప్పి యావిషయము మాని తమ కీయుభయకవులయందును భగవంతుఁడు న్యాయముగాఁ దోఁపించిన యభిప్రాయమును వెల్లడించిరి. అదివిని సభ్యులెల్ల నానందించిరి. పిదప శ్రీ వెంకటశాస్త్రిలవారు కవితయన నేమో, కవియన నెవరో, ఆశుకవితయన నేమో, కవికి వలసిన సామగ్రి యేమో తేటతెల్లముగా నుపన్యసించిరి. పదపడి సభనాఁగు పూనికతో విచ్చేసియున్నవారిలో నొకరగు మ॥ రా॥ రా॥ గోవిందరాజుల శ్రీనివాసరావు పంతులు బి యే. బి. యల్. గారు సర్వసమ్మతమగు తమ మనోరథమును వెల్లడించిరి. వారి పూనికకు వెంకటశాస్త్రిగారు తమ సమ్మతిని దెల్పిరి.

*(8) ఇంతసైన మీ స్వకుచమర్దనలు మానుకొని"...

30-8-11

ఇట్లు,

కొప్పరపు వెంకటసుబ్బారాయశర్మ-శతావధాని.

క. ఆమెయు సాక్షాద్దశ్వ, త్థామను బురణించుతేజు దశదిశలలఘుం
గా మా శిష్యుం దల శివ, రామయ చను దెంచె సభకరం బలరారన్.

ఉ. ♦వచ్చి సభాంతమందుఁ దన వచ్చిన హేతువు, తాను విన్నయా
యచ్చెరువున్, సభాధిపతి యాజ్ఞను బొంది సభాసదుల్ "బలే!
వచ్చిన శిష్యుఁ డీతఁడె" యనన్ విన నింపగు కంఠమాధురిన్
హెచ్చగు గానపుంబటిమ యేర్పడఁగాఁ జదివెన్ గ్రిమమ్ముగన్.

క. పదపడి సభ్యులు సారెకు, సెద శివరామకవి వాణి కెంతయు మెచ్చుల్
వొదలఁగఁ గరతాళంపు ని, నదములఁ జెలరేఁగఁ గ్రన్నన సభముగిసెన్.

క. ఆమఱునాఁ డుదయమున శివ, రామయ కొ్రంపుఁ గవిని "రారమ్మ సభా
సీమ" కని యుత్తరంబు, ద్దామత లిఖియింతు" ననుచుఁ దద్దయు నెమ్మిన్.

ఉ. వెంకటశాస్త్రి పల్కు "నిది విన్న బుధుల్ మము నవ్వినట్లె ని
శ్శంకగ నిన్ను నవ్వుదురు శాస్త్రము నేర్చియు సాహితి న్నిరా
తంకతఁ బేర్చియున్ శతపధానివియై యసమాన కక్షగా
ఱంకెలు వైచెదే? "సభకు రం" దని కొ్రపువారిఁ బిల్చుచున్.

---

ఉదయము-9-గంటలు.

♦పదపడి యంతకొంక యరగంటకుము న్నె రైలుదిగి సభాభవనమునకుపచ్చి యున్నట్టియు తిరుపతి వెంకటేశ్వరుల శిష్యుఁ డైనట్టియు, చిరివాడ గ్రామ కాపురస్థులు శ్రీ వేలూరి శివరామశాస్త్రులవా రీకిరింది పద్యములఁ జదివిరి.

ఆ. వె. రాజశ్రీ భుజంగరావు, చెల్పతిరావుఁ గూర్చి యిటుఁలువ్రాసె గుంటురిపురి, జరుగుచున్న వైరచర్యయందునఁ దిర్పతికవి, వెంకటకవి తెరువు తప్పె॥1॥ చ॥ అనవిని యంత నామడలు నామపలుం బడిపోయినట్లు వ, చ్చిన పది మిథ్యయంచుఁ దెలిసెన్ గవితాసభ లేకపోయెఁగా, కనువుగ ధారణాబల మునంచున నాశుకవిత్వ మందునన్ దనివిగఁ గొప్పపుంగవుల దారులుతీరులు చూచి తీరనే॥2॥ తే॥ గీ॥. కాశినాథ బుధేంద్రుఁడు ఘనుఁడు శిష్ని, వాస సూరియు నెందఱోపలఁతులైన, కవులుపిఁకనిమాసమ్ము కఱచిపట్టి పీఁకనున్నారె కొప్పింపుఁ బిదపకవులు 3 తే. గీ. కలదు నేత్రావధానంపుగరిమయొకఁడు. కలదు గర్భావధానంపుగరిమయొకఁడు, కలదు హస్తావధానంపు గరిమయొకఁడు, వీని నెఱుఁగని నూరులెందేని గలరె 4 ..."

క. †అసమానకక్ష యని మను, రస దూషించెడివారి యుత్తరము లివిగో! నీ
రస మీ కయ్యము మానున్, బోసఁగెం దనయంతఁ బూర్వపుం గర్మమునన్.

చ. జ్వరితుఁడ నయ్యు సజ్జనులు సారెకు రమ్మని పిల్వ రానిచో
గరువము గాఁ దలంతు రని కష్టి గణింపక వచ్చినాఁడ ని
ష్ఠురపుని యోగి వైదికులపాత్రి నుమంతయు నే నెఱుంగ దు
ర్భర మసమానకక్ష యిటు రాఁ దగి యుండఁగ నెట్లొ లెంగెదన్.

ఉ. ఐనను గాలుదిశ్రువ్వ దోసఁ గాదన నుండుటఁ జేసి యంత మా
పై నెపముండ, దీ విపుడు పత్రిక నంపెద వేనిఁ బోరికిం
దా నయిపిల్చినట్ల యయి "తక్కెడ" సామెతగాఁ దనర్చు నీ!
మానఁగదయ్య యిట్టి యసమానపుఁ గక్షకు దీక్ష యేటికిన్.

ఉ. ఎప్పటికేని మా యెదుట నే పడఁగావలె వార, లప్పు డా
తప్పుడు కైతపద్ధతులు తజ్ఞులకున్ విశదంబు కావలెన్

---

1. †... యిదివరలో వున్నదే అసమానకక్ష అని అనుకుంటూ వున్న సంగతిలో పులిమీద పుట్రలాగ్ను యిదొకటి వచ్చినది దీనిని గు॥ కొన్ని రోజులు వ్యర్థపుచ్చడమున్నూ శ్రమతీసుకోవడమున్నూ నాకు సుతరాం యిష్టంలేదు..."

ది 2౮-౬-11 రా॥ వెంకటసూర్యరావు.

## Masulipatam.

2. బ్రహ్మశ్రీ శతావధానులు తిరుపతి శాస్త్రులవారిసన్నిధికి, మీరు కృష్ణారావుగారి పేరున వ్రాసిన జాబు చేరనది. మాయుభయుల నమస్కారములను అంగీకరింపవేడుచున్నాను. యథార్థవాదియొక్క వ్యాసము యథార్థముగనున్నను లేకున్నను దాని సత్యాసత్యములు మేము గ్రహింపజాలము......మీకీ లేనిపోని కలహములలో జిక్కుకొని ఆరోగ్యమును బుద్ధిని చెడగొట్టుకొనుట మా యభిప్రాయము కాదు. వారిని గెల్చినను మీకీర్తి హెచ్చునా? ఇదివఱకే విఖ్యాతి జగద్విఖ్యాతమైనపుడు మీకీపోరాటము లెందుకు? వారు కుర్చీమీద గూరుచుండిన మనకేమి? ఇంటి కప్పుమీద గూరుచుండిన మనకేమి? మీ బలాబలములు లోకము పూర్తిగ నెరిగియే యున్నది. ఈ పోరాటములను గుంటూరు చెరువులో దొక్కి వెంటనే బయలుదేరి రావలయునని మా ప్రార్థన..."

ఆ॥ నారాయణరావు.

జెప్పి ప్రసంగముల్ సలుపు పెద్దలతోడుత నీకు నేల? నేఁ
జెప్పినమాట చొప్పునకుఁ జేసము చొప్పుచు మిన్నకుండుమీ.

చ. వెనుఁబడి కాకవుల్ తనదు పీపులయిం జరణమ్ము లుంచి తా
చిన నది లెక్కగాఁ గొనక చిప్పకుఁ బూనక వైనతేయుఁడే
మనక శిరమ్ము వంచుకొని యల్లనఁ బోవఁడె? శక్తిమంతు లెం
దును నలఁతుల్ పొనర్చునఁతుంపుడుకుల్ గణియింప రంతగన్.

ఉ. ఇంతకు నీవు పత్రికల నెన్నిటి నంపిన నేమి లాభ? మా
వింతకవీశు లెన్నఁటికి విజ్ఞులు తీర్పరులున్న సత్సభా
భ్యంతరమందు నిన్నెదురువారని కోరుము వారితండనాల్
గాంతు రెవారు వారికడ గంతులు వేయుచునుం డ్రెలుంగుమీ.

శా. "ఓ కన్నో మటివంక" లన్నఁ దెలియన్ యోజింపఁగాలేని స
ద్ధీకుల్ వారికిఁ దోచు, వారదియుఁ దార్దృగ్విశేషంబె యీ
యేకాకారులు సత్సభాస్థలికిఁ దా రేమంచు నేతెంత్రు? నీ
వీ కార్యమ్మునకుం గడంగకుము మేమే యుంటి మన్నింటికిన్."

చ. అనుటయు వాతఁ డప్పటికి నన్యము చెప్పక మిన్నకుండె నె
మ్మనమున బాల్యచాపలము మానని చందము తోఁచుచుండె, నా
తని కొకకొంత తిర్పతి స్వతంత్రత నిచ్చి ననంతరంబు నెం
కన గికురించి యిర్వురును గ్రిక్కన నేగిరి "ప్రెస్సు" ప్రక్కకన్.

ఉ. * పద్దెము లచ్చు వేసి యవి పంపి నభోమణి రెండుయామముల్
పొద్దును దాఁటునప్పటికిఁ బూర్తి యొనర్చినమేటి కార్యమున్
పద్దయు మెచ్చుకొంచు బసదగ్గఱకున్ జనుదెంచి, చెప్పి రిం
కద్దియుఁ జేయ రామి సహియించెను వెంకన కొంతనొవ్వుతో.

---

మ॥ రా॥ రా॥ శ్రీ కొప్పరపు వెంకట సుబ్బరాయశర్మగారికి.

* చ॥ తిరుపతి వేంకటేశులకుఁ దెంపరినై సరివైఖరిం గవీశ్వరుఁ డను వాఁడు నోటనుడువన్ గడు సిగ్గిలునాకుధారకున్, బుడికొలుపం దలంచితె 'నమో నమ' యంచు వచింపకేటి య, ల్లరియిది సింగ మేనుఁగులలంబు భుజంపక పూరి మేయునే. మ॥ అనిమిత్తంబుగఁ గాలుద్రవ్విన త్వదీయాహంత నాఁప్రుంచలం, పున నీసీరసనిర్గుణాశుకవనంబున్ జెప్పి నిగ్గెల్వ నెం, చిన యస్మద్గురువర్యులన్

శా. * రామస్వామి యనంతరమ్మ కడుధీరత్వమ్మ చెన్నారఁ నే
మేమో పద్దెము లల్లి తెచ్చి యవి మమ్మాక్షేపింపఁ దన్నన్ క్షణం
బేమిం జెప్పక పిమ్మటం జదివి "మే! లీపద్దెముల్ వారిదౌ
సామర్థ్యమ్ముఁ గదున్ యథార్థముగ నిచ్చల్ వచ్చి వాక్రుచ్చెడిన్.

---

సుకవితాశ్రీధుర్యులన్ మానిపిం, చినినున్ గెల్వఁగ వచ్చినా నిది సభం జేయుం తువో వత్తువో. ఉ॥ గంటలు గట్టికొంటివట ! "గంటకు వందలు వేలుపద్యముల్, గెంటుదు' నంచు నేఁడు పరికించెద గెంటుటయెట్టిదో ? నినుం, గెంటెద నే వధానమున గెల్చెద నీరసధారయంచు నీ, ఘంటికలూడఁ గొట్టెదను గాచుకొనం గమకింపుమిత్తఱిన్. సీ॥ గురుపాదసేవఁ జేకూఱిన వ్యాకృతిపాండిత్యగరిమ యెటుండనిచ్చి, ఉభయభాషాకావ్య విభవాభిరామమౌ పాండిత్యగరిమ యటుండనిచ్చి, ఘనసత్ప్రబంధనిర్మాణధీచాతురీపాండిత్యగరిమయటుండనిచ్చి, సురుచిరలక్షణ భరితాశుకవికృత్యపాండిత్యగరిమ యటుండనిచ్చి॥ గీ॥ అసదృశం బటంచుఁ గొండాడఁదగిన, తావకాశుకవిత్వంబుఁ జేపఁగూడఁ, దావకశతావధానవిధంబుఁ గూడఁ జూడఁదలఁచితి వెంకటసుబ్బరాయ ! చ॥ తిరుపతివేంకటేశ్వరసుధీవరశిష్యుఁడ నాదుపేరు వే, లూరి శివరామశాస్త్రి యని లోకము వాకొను నాస్త్యమైన వ్యాకరణముజీవనమ్ము నధికారము కావ్యపురాణనాటకా, కరములఁ; జేయఁ జాలుదు నఖండము నాఁగ శతావధానమున్॥

గుంటూరు,
31-8-11.

ఇట్లు వినీతవశంవదుఁడు,
వేలూరి శివరామశాస్త్రి, శతావధాని,

---

* మహారాజశ్రీ కొప్పరపు సుబ్బరాయశర్మగారికి— సీ॥ అఱవదేశంబున నవధాన మొనరించు, టో కాద! యిదియు గుంటూరుసీమ, పల్నాటిసీమలోఁ బద్యంబులను జెప్పు, టో కాద! యిదియు గుంటూరుసీమ, ఆయూరనాయూర నాశుకవితసెప్పు-టో కాద! యిదియు గుంటూరుసీమ, గుడివాడసీమలోఁ గొన్ని యూళ్ళను జెప్పు - టో కాద! యిదియు గుంటూరుసీమ, గీ॥ యెట్టులుదక్కించు కొందురో యిపుడు మీరు, నిండుకొల్వున మీకున్నదండిబిరుదు, లూరకే పోదు. పూజ్యులఁ గాఱులఱవ, నాశుకవిసింహ కుండిన హంసలార॥ ఉ॥ బట్టులరీతిఁ బద్యములఁ బల్కుటెకాని శతావధానమె, ప్పట్టుల నేదిచేసితిరి పండితులెల్లరు

ఉ. వారలకన్నఁ దల్లునెడ వారక సంస్కృతమందుఁగూడ నీ
వారయఁ బెద్దపండితుఁడ వైనను వారలు బ్రాహ్మణుల్ మహో
దారులు మేల్ నియోగులును "శూద్రుఁడ వీ" వని యీసడింతు రీ
వేరమునందుఁ గాలిడక వేగమ యేగుమ యంగలూరికిన్.

తే. గీ. వారి తప్పుడుధారను వడిగఁ బోయి
సభ్యులఁగరంప నీకు నసాధ్య మెప్పు
డేని పనిపడ్డచో మేమె యేగవలయుఁ
బిదప నిది తప్పటంచు నొప్పింపవలయు"

చ. అనుటయుఁ జిన్నన్వ్వ నగి యాతఁడు "చిత్త" మటంచు నేగి యే
మని మది నెంచెనో? తుదకు నాతని యుద్దము లమ్ములోనికిన్
జనుటయు కాక, కొప్పరపుసన్నిధికిం జనె; వీని నెల్ల మే
మనిపినవే యటంచును యథార్థ మెఱుంగనివారు దూఱఁగన్.

---

మెచ్చినారలో, గుట్టుగఁ బోవకీగతిని, గొంటెతనంబును జేయఁజూతురే, "పెట్టి బుఱ్ఱ కొప్పి ఫుంజాపయి, బీనముఁ జూపిన" లాగుఁ గాఁపవో॥ గీ॥ ఒంటి వైదిక తోట మీసాలఁదీసి, కొన్న నెవ్వరు నవ్వరు; నెన్న నవ్వ, కుందురే కన్నవారు నియోగిపయ్యు, మీసములఁ గాచుకోలేక మిడుకుచుండ॥ క॥ గంటలఁగట్టెదరే! ము, కృంటితురగములకు హీకవితానంబీ, గంటలు మఱియేకార్యము, పొంకె వచింపుండు కొప్రపుం గవులారా॥ సీ॥ శతఘంటకవనంబుసల్పుదు మన్న మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, అష్టావధానంబు నాచరింతుమన మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, ఆశుకవిత్వంబు నాచరింతుమన మీ శక్తియడంప నే జాలనొక్కొ, సద్గ్రంథరచనంబు జరపుదుమన్న మీ శక్తియడంప నేఁ జాలనొక్కొ, గీ॥ ఇంగిలీషునవత్తురో యెఱిఁగియడపఁ, గరము నేఁ జాలనొక్కొ మాగురువులేల, రండు వేగమీ బిరుదులు దెంపు పెట్టి, పొండు నిండుసభను గొప్పరపుఁ గవులార॥ గీ॥ ఓడినారని తలపోయువాఁడ మీరు, నాకుఁ బ్రత్యుత్తరంబును నీక మాన, మొదలిపహియింతురేని నీముచ్చటెఱిఁగి, ముందుపనిఁజూడుఁడీ కొప్రపుఁగవులార, క॥ శివరామకవికిఁబోలెన్, జవాబునొసఁగకయె వృథగ జంపు నడిపినన్। స్వవసాయముకలదునుఁడీ, వ్యవధిం గయికొనక యిందు బ్రత్యుత్తరమున్॥

అంగలూరు }
3-2-1913 }

ఇట్లు బుధజనవిధేయుఁడు,
త్రిపురనేని రామస్వామి.

ఉ. ఉన్నయథార్థ మియ్యది మహోత్తము లాత్మవిదు రంచు మేము సం
పన్నగృహస్థుఁడం దనుచు వ్రాసితి; మింకొక బుజ్జిశిష్యుఁడున్
గ్రన్నన * గొన్ని పద్దెములు గానుక కొప్పరపువారి కంపె నా
చిన్నతఁ డొక్క సాహసము చేసె పఠింతుము తత్స్వరూపమున్.

---

బంపము.

శ్రీసద్గురవేనమః.

(ఇయ్యది కొప్పరపువారికి వ్రాసినయుత్తరమునకు సరియైన నకలు.)

* చ॥ ఉరుకరుణాయుతుండు, సమయోచిత ధీమహితుండు, భక్తులం, దతః కినిగల్పకద్రుమవిధంబుననుండెడువాఁడు నట్టియా, తిరుపతివెంకటేశ్వరుఁడు తిన్ననిచూపుల మిమ్ముఁజూచి యె, ల్లరును ముదంబు నొందునటులన్ దయ, మీకజయమ్ముఁగూర్చుతన్॥ 2. చ॥ ఉరుతరకీర్తివిశేష మహోన్నతులార! గుణాఢ్యులార! కొ, ప్పరపుకవీంద్రులార! వినవచ్చెను మీదుప్రతిజ్ఞ; యెంతో సం, బరమువహించినాఁడను, రమాపతి మీకజయంబునిచ్చు. నా, తిరుపతివేంకటేశుల నెదిర్చి గ్రహింపఁడు వారిమీసముల్॥ 3. చ॥ ధనముగడించి యింటి రవధానములం బొనరించి మీరలిం, దనుక శతావధానులను నామముతో; నిఁక మీఁదనట్లు కా, దనుచు శతావధానముల నక్కడనక్కడఁ జేసి పండితుల్, వినుతిరొనర్ప మీసములఁ ద్రెంచుఁడు నూతననామధారులై॥ 4. గీ॥ తెలుఁగు తిరుపతివేంకటేశులకుఁగూడ, వచ్చుఁగావున నోడింప భారమగును, గాని వారికి నేత్రావధానమందుఁ, బ్రజ్ఞలే దంపుమీరుగెల్వఁగలారు॥ 5. క॥ నేత్రావధానమది స; ర్వత్రజయంబిచ్చుమీకు, వదలకదానిన్, మాత్రమె పెట్టిన నప్పుడు, శత్రులనోడింప మీ కసాధ్యంబగునే॥ 6. చ॥ వినుతగుణాఢ్యులార! యొక విన్నపమున్ వినుఁడయ్య "గ్రుడ్డు పి, ల్లను గని వెక్కిరించినటులన్" గను పట్టెను వీరియన్న" మం, చు నట జనుల్ పఠించి రది నుంతయు నామది నమ్మఁబోవనే, మనిన నియోగినాటఁ దగవా? యదినమ్మి విమున్ద్యజించుటల్. 7. మ॥ "సభమీరెచ్చటఁ జేయువార" లని ప్రశ్నన్ వేసిరవ్వారు, మీ రుభయుల్ మాపురికేగుదెంచి యిట సభ్యుల్ మిమ్ముఁ గీర్తింపఁగా, సభసేయింపుఁడు, తోఁచినంతవఱకున్ సాహాయ్యమున్ జేతు నా, కక్షీమానంబని మీ యెడం గలదు రం డామోదముం బొందుమన్॥ 8. శా॥ "ఆరయ నీవు చేసెడిసహాయ

ఉ. బందరునుండి పద్దెములు వారికిఁ బోష్టునఁ బంపి మీఁద మా
కందఁగఁ జేసె దానిప్రతి; యక్కట! యాఁగుట యెట్టు? లిట్టులే
కొందఱు * స్కూలుశిష్యు లొకకొన్నిటి నంపిరి, మే మెఱింగిన
ట్లందఱు గాక యున్న జను లందురు గొందఱు మాన్ప నేర్తుమే!

చ. "తిరుపతివేంకటేశులకుఁ దీవ్రముగా సభ కేగుదెం డటం
చతిముటి వ్రాసి కొప్పరపుటాయన దా సభ కేగుదెంచెనే?

---

మదెట్టిది? పిల్లవాఁడ'' నం, చూరక నెంచఁబోకుఁడు మహోదధివారి నిబంధనంబు చే, కూఁతఁగ రాముఁడయ్యడవిఁ గోతులసాయము గోరలేద? సు, శ్రీ రహిమించ మీరు దయచేసి జయంబు వహించుఁడో బుధుల్॥ 9. క॥ తప్పక దయచేయుఁడు మీ, రిప్పరికి జవాబు వీని కిడుఁడు సరగునన్। మెప్పు గనుఁడయ్య వైశమ! కొప్పరపు కవీంద్రులార! గుణమణులారా!

'VIth Form C. Division,
Noble College.
Masulipatam.

ఇట్లు
సుకవిపాదరేణువు,
వడ్లమన్నాటి నరసింహశర్మ.

శ్రీ మ త్ప ర దే వ తా యై న మః.

11-9-11 బందరు.

* గురువర్యా! చ॥ మనమున భక్తినిల్పెదను మాధవపాదసరోజయుగ్మచింతనపరిలబ్ధదివ్యకవితావనితామహితప్రభావ సం। జనితలసద్యశః కుసుమజాలవినిర్మితహారధారులై। తనరెడు వేంకటేశ్వరబుధాగ్రణి! మీవగుపాద కంజముల్. ఉ॥ ఇందులనుంచు పద్యముల నేనె రచించియు వచ్చువేయఁగా, సందియ మొందుగల్గి తమసన్నిధి కంపితి వానిఁజూచి నా, కుం దయవ్రాయ వేఁడెదను గొంకకయెట్టులు సేయుమందురో? యందులనుండుదోషములనన్నియు దిద్దుచు నంపవేఁడెదన్. మ॥ తమసందర్శనమెప్పుడబ్బునని చింతాక్రాంత చిత్తుండనై, కుముదంబుల్ శశిఁగోరుభంగిఁ దమ వాక్సూనామృతాస్వేవసం, భ్రమమేపారను సంగువాఁడ నిట ధీరాగ్రేసరస్తుత్యని, త్యము లేఖార్థము చూచువాఁడఁగృపతోసంపుంగఁ బ్రార్థించెదన్.

చిత్తగించవలెను

ఇట్లు తమశిష్యుఁడు
కోట రాజారావు, హైస్కూలు, బందరు.

పరపర వ్రాసి రమ్మనినఁ, బాఱుద" మంచు చలస్కూలుఁగుజ్జు లెం
చిరి యని తోఁచుఁ జర్చఁ దగఁ జేసినయోగ్యులకెల్ల నిప్పునల్.

క. ఎటు దోఁచిన సరియే మే, మిట లేశమెఱుంగ మెఱిఁగి యే మెవ్వరి నాఁ
గుటకు యతించితిమో? వి, స్ఫుటముగ మును మున్న దానిఁ జూపితిమి కదా!

చ. చరితము గాన వ్రాయఁదగు సంగతి వ్రాసితి మంతె కాని యే
రెఱుఁగరు మేము కొవ్రిమున కిట్టులు శిష్యుల కేఁపి పంపుసం
బరమున కొప్పువారమొ? స్వబాహుబలమ్మునఁ బోవువారమో?
యరులు నిజం బెఱింగియును నాడఁగఁ జొచ్చిరి వేఱుకీతిగన్.

చ. ఎఱిఁగినదే కదా, జగతి యెల్లఁ గుశిష్యుల రామకృష్ణులన్
మఱి యలయిర్వురందు నొకమానిసి కన్న బహుశ్రుతుండు కొ
ప్పరమున వారి కంపె నొకపత్రిక * "నేత్రప్రధానమందు వ
త్తురె" యని రామకృష్ణు లటుదూఁకఁగఁ జేసి రనంగఁ జెల్లునే.

---

మ॥ రా॥ రా॥ శ్రీ. కొప్పరపు సుబ్బారాయశర్మగారికి... మ॥ ధరణీ చక్రము గూలఁగా వలదె! సప్తాంభోధిభాస్వద్వనుం, ధరభారంబు సహించి మించుసలమాతంగంబులున్ వీడి; కొప్పరపుం బండితమానులార! తమకున్ భాషాద్వయీ కావ్యసం, భరితుల్ తిరుపతి వేంకటేశ్వరులతో వాదంబు శ్రేయంబొకో" మ॥ కరిశార్దూలమృగేంద్రసత్తములు గంగాభంగకల్లోలలీ, ల విజృంభించి పెనంగుమండఁ గవిమార్జాలాదిసంపూజ్యులీ, రవధానంబు రచింపబూనిరహా! హాస్యంబె యారోక్తియున్ 'శివుఁడుం దాండవమాడనాడవె పిశాచీభూతబేతాళముల్... ఉ॥ చెప్పినమాట చెప్పకయె చెప్పఁగ నేర్తుఁగవిత్వధారగా, నొప్పిదమౌవిధంబున బుధోత్తములందఱు మెచ్చనేరమున్, దప్పిక దాప్రభంగి వచనంబున గెల్వఁగ రండు నన్నహో!, కొప్పరపుం గవీశ్వరులకుం దగదే మొకో? నా ప్రతిజ్ఞయున్........"

---

* విద్యాచర్చాపత్రిక.

"అయ్యా! తమకును బ్రహ్మశ్రీ తిరుపతి వేంకటేశ్వరమహాకవులకును, ఒక మాసమునుండి జరుగుచున్న కవితా కలహంబును పత్రికాముఖంబున వింటిని ...సర్వసాధారణమైన యాశుకవితకేమి? తమకు నేత్రావధానంబున నెన్ని బిరుదు లున్నవో... వానిని మీ కంటె నతిశయించి కాఁకరపర్తి విద్వత్సభలో

చ. పనిగొని రామకృష్ణులు "సెబాసు! బళీ!" యని కొప్పరంపువా
రొసఁగుచు తప్పులన్నిటిని నొప్పులుగాఁ దలపోయు పేరెఱుం
గని? దల వారిబంధువను కారణ మొక్కఁడె చూచి యట్లనన్
జనునె? యశక్తిమగ్నత సర్వవిగర్హిత మెన్ని భంగులన్.

క. ఇది యిట్టులుండె మమ్మున్, బదిబది యాసీమ నున్న ప్రాజ్ఞులు పూజా
స్పదులుగ సదానాదులఁ, బొదలించుచునుండి రరులు పురపురఁబొక్కన్.

శా. ఆపైఁ గొప్పఱ్ఱువారిపక్షమున వా రాలోచనల్ సేసి "ఇం
కీపై నెయ్యది కార్య? మీపురమునందే వారికిన్ పారెకున్
శాస్త్రిపై గౌరవ మిట్టు లౌనె? యిది యేప్పాటన్ సహింపంగ నొఁ
గోపం బూనుటయే యనుగ్రహముగాఁ గూర్చుండి రవ్వారిటన్.

సీ. చుట్టుపట్టులనుండి చూడ వచ్చెడివారిసంఖ్య వందలకన్నఁ జాలహెచ్చు
వచ్చి "మాయూరికి విచ్చేయుఁ" డను వారిసంఖ్య యేఁబదికన్నఁ జాలహెచ్చు
'రాఁజాల' మన్నఁ 'దీరదురాక' యను వారిసంఖ్య యిర్వదికన్నఁ జాలహెచ్చు
ఏమాట వినిచిన నింపుమై వినువారిసంఖ్యయో? వేలకుఁ జాలహెచ్చు

తే. గీ. పద్ధతినియోగులం దేరో పట్టుదలకుఁ
నేగకున్నను నెల్లవా రేగి వారి
చుట్టునుం గూరుచుండిరి చూచు టెట్లు
త్రిమతములు వారిపక్షమై తిరిగిపోయె.

శా. * ద్వైతాద్వైత మొకండు దక్క నఖిలద్వైతంబు నద్వైతమున్
శైవంబున్ మఱి వైష్ణవంబు నొకటై ఛత్రంబుగా వారలన్

---

ది 20 సెప్టెంబరు 1911 సం॥ రం తేదీని తత్తదంశంబుల నెఱవేర్చి యుండఁ దలఁచుచున్నాను గనుక నీ నోటీసు అందిన వెంటనే మీ ప్రజ్ఞా విశేషంబును గనుపఱుప వారోజునకుఁ గాఁకరపఱ్ఱుమీరు రాఁగోరెదను "లేనిచో మీతో విద్యాచర్చలకు రాఁజాలను" అని నాకొక జాబైనను వ్రాయఁగోరెదను...

ది 14-9-1911 సామవేదుల సూర్యనారాయణావధాని

నేత్రావధాని, అష్టావధాని, ముకాం, కాఁకరపఱ్ఱు అగ్రహారం, తణుకుతాలూకా

* ద్వైతాద్వైతము.

☞ పరా:— అనఁగా, నిది యొక నవీనమతము, దీనికే పద్ధతినియోగ మని

బూవుంబంతులపోల్కిఁ జూచెదరు శేపు న్మాత్రుప నవ్వారితోఁ
బోఁవై యుండుఁ బురంబు వారివచనంబుల్ వేదముల్ వీరికిన్.

చ. ఇతరులమాట కేమి? మది నించుక గోపము కల్గి యున్న నా
కుతుకముగూడ వారనినఁ గొండొకపువ్వులు వాఱు, వారివా
క్ప్రతతి వినం గుతూహల మపారము గల్గియుఁ బోను వారిపెం
కితనము నాకు నచ్చమియె కేవలమింతకు మూల మెమ్మెయిన్.

ఉ. 'పెంకెలు గారు సాధువులు పేర్మికి నిక్కలు గర్వమూరు' లం
చంకిలి లేక చెప్పికొనునట్టియనుం గల రల్లవారి; ని
శ్శంకగ వారు వారికటు చల్లఁగఁ దోఁచుటయున్ని జంబె; యే
పంకమొ యస్మదాదులకు వారు రుచింపరు వేయునేటికిన్.

ఉ. పాండితి లేని యీమనము పాండితిపట్టున వారి గెల్వలే;
మొండొక త్రోవఁ జూడవలె "హుమ్మను" వారిది మావఁగావలెన్
గండతనం బడంచుటకుఁగాఁ గబురంపితిఁగాని బెల్లపుం
గొండకవీంద్రుఁ డేమిటికిఁ గొంకెనొ? "రా" నని యుత్తరం బిడెన్.

తే. గీ. తీరి కూర్చుండి పెట్టి రీవైర మనుచు
నతఁడు కొండొక నిరసించినట్లు వినికి
యితరులకు వట్లె తోఁచుఁగా కిదియునట్టి
దెట్టులగు? నాసనము నీయరేమి మనకు!

ఉ. పండితపామరుల్ గలిసి వారలకే హితులైరి; వారలన్
గండడఁగించు టెట్లు? మనకక్షు జయించుట యెట్లు? తోఁపదొ
క్కండు నుపాయ"మంచుఁ దన గాదిలిపద్ధతివారితోడఁ గొ
ల్వుండి విచారణల్ సలుప నొండొకనేర్పరి పల్కె నీగతిన్.

---

యుం బేరు, ఇది సదుద్దేశముతోడనే శ్రీ నందిరాజు లక్ష్మీనారాయణ దీక్షితుల వారు పుట్టించిరి. వైదికు లసురులనియుఁ దాము దేవతలమనియు వారిసిద్ధాంతము, ఆ యూయంశము ద్వైవాద్వైత పదమే తెల్పెడిని. సుప్రసిద్ధాద్వైతము వీరికి నసురాద్వైతము. విస్తరము వారి విశ్వపక్ష సు విజయము లోనగు గ్రంథముల వలన నెఱుఁగఁదగు. పరిష్కృత కలహమునకుఁ గారకు లేతన్మతావలంబులలో స్వల్పసంఖ్యాకు లని చదువరు లరయుదురుగాక.

చ. అవమానం బది యెంత గావలయునో యాసర్వ మవ్వారికిం
జవిఁజూపెద మనకొప్పరంపుఁగవి; మీసాల్మాట సామాన్యమే?
యెవ రిచ్చో నలవారి నిట్లనఁ గలారె? యంతియే చాలు న
న్యవిచారం బిఁక నేల? నా కొకయుపాయం బిందుఁ గన్పట్టెడిన్.

మ. అవివేకంబో వివేకమో జరిగె నేలా "సంధి మిచ్ఛంతి సా
ధవ" యన్ వాక్యముఁ బట్టి పోవుదము విద్వత్తాకవిత్వాభిజా
త్యవిశేషమ్ములఁ జేసి యిందులకు వా రంగీకృతిం జూప రం
చు విచారింపకుఁ డట్లు కావుటకె యీచొప్పూహ్య మెబ్భంగులన్.

క. కొఱుకంగ రానికొయ్యలు, తిరుపతివెంకటకవు లని తెల్లము సేయన్
బరికించితి సదుపాయము, గర మాలోచించి దీని గ్రహియింపుఁ డనన్.

తే. గీ. వృద్ధుఁడిట్లను "బాగు నీసెఱవు, దీనఁ
గలదు కష్ట మొకండు; లోకమునఁ గొప్ప
రంపువార లసారులు గ్రామ్యకవులు
వా రనేతాదృశు లటంచుఁ జేయగలరు.

తే. గీ. అట్టివో సంధియనుటకు నర్థమేమి
యగునొ? పరికింపుఁ డది యసమర్థతకును
నపరపర్యాయమగు" నన నతఁడు పల్కె
"నగును మీరన్న నుడియు నేనరసినాఁడ.

గీ. కాని యిపుడింతకన్నఁ జక్కని యుపాయ
మొండు గన రాదు సభసేయకుండ వారి
నిప్పరమునుండి పంపుటకింక నొక్క
సాధనం బేది? యానతిసల్పుఁ"డనుచు.

తే. గీ. కొంత యోజించి యావృద్ధు కొసకు సమ్మ
తించి రాజీకిఁదగునట్టి మంచిమాట
లెల్ల వ్రాయించి వ్రాళ్లు చేయించుటకును
పెద్దలగువారియొద్ది కంపించుటయును.

ఆ. వె. ఈసడించువార "ఋహిహీ" యనెడివారు
పెదవి విఱుచువారు "మొదలలేని

శాంతి యిప్పుడేల చాల్చాలుఁ బోఁడు పొం"
డనెడువారు కైన మనసు విఱిగి.

క. చని కడచిన వృత్తాంతమ్మును వృద్ధునితోడఁ జెప్ప మొగ మించుకయై
వసటం బడి తెప్పితె యేమియు దోఁచక యుండె నపరిమితయోజనతో.

తే. గీ. "నే నిడుదుఁ గంటిలోఁ క్రేలు, నీవు నాదు
నోట వ్రేలిడు" మన్నట్లు "లేటికిట్టి
సంధి" యని యెల్లరాడునాచంద మేను
మొదటఁ దెలిసియుఁ బంపితి మోసపోతి.

క. అని కొంతసేపు తన చేసినయపలౌకికపుఁ బనికిఁ జేతమ్మున నె
క్కొన సిగ్గుకల్మిఁ జింతం, గొనుచు నుపాయాంతరములకుం గడఁగునెడన్.

చ. మఱియొకఁ డిట్లుపల్కె "మఱుమాట వచింపకుఁ డింతకన్న నొం
డరయఁగ రాదుపాయ మొకరైదుగురేనియుఁ జాలు వ్రాళ్ల కం
దఱు నొనరించినంత విలునై చెలువారెడునంత వాయగా
దొరకవలెన్ బరాసరిగఁ దూఁగెడువారుగ నుండఁగావలెన్.

తే. గీ. శాఖ కొక్కొక్కరుండుగాఁ జర్చచేసి
యేరి వ్రాళ్లుచేయించితిమేనిఁ జాలు;
సంధి కన్నప్పుడేమని సమ్మతింప?
రరయరే "సంధిమిచ్చంతి" యన్న నోడువు?

సీ. ద్వైతులకెల్ల నాతనిచేతఁ జేయింత మద్వైతులకు నెల్ల నతనిచేత
నతనిచేఁ జేయింత మలవిశిష్టాద్వైతశాఖకెల్ల నతండు చాలువాఁడు
ఇంక ద్వైతాద్వైత మిందుఁ జేసెడివార లెందఱో యనియుఁ గల రెంచనేల
శుక్లయజుశ్శాఖ సుముఖులకెల్ల నయ్యానఘుచేఁ జేయింత మతఁడె చాలు

గీ. తప్పెవరిదేని యగుఁగాక తగుమనుష్యు
లిరువురకు సంధిగూర్చుచో నేమిదోసఁగు?
పైకి నటియింత మిట్లు చేవ్రాళ్లు దొరకు
వఱకుఁ బిమ్మట మనయిచ్చ నుఱుకవచ్చు.

ఆ. వె. సంధి కొప్పిరేని "చాలలే" కందము
సమ్మతింపరేని "శాంతిమాట"

లంద మసల; దీనియట్టి యుపాయమ్ము
మనకుఁ గానరాదు మఱియొకండు.

క. చెఱియొకటిగఁ బంపినఁ గొ, ప్పరమునకున్ లాఘవంబు పైఁ బడ దెవరో
యెఱిఁగిన వారెట్లాడిన, నరయుఁడు మూరగులు యోగ్యులందురు మనలన్.

తే. గీ. ఒక్కరొక్కరికి నెప్పట్లనోడువారు
కారు, తుల్యులు కయ్యమ్ము గలిగినప్డు
డేరి నేరు జయింతురో! యింతలోన
సంధి చేసిరి పైవారు శాంతి గోరి.

క. అనుప్రథ గల్గిన మనకున్, ఘనతయె, మనకవుల కింతకన్నను గొప్పం
గొని తేఁగలమే? మును పా, సనమేనియుఁ గోరు టీయశమ్మునకె కదా!

తే. గీ. ఆసనం బిడ నందుల కల్లవారి
మీసములు బీఁకుదు మటన్న బాస చాలు
నిపుడు మనపన్నగడ ఫలియించె నేని
"కోటలోఁ బాగవేయుఁబో! కొప్పరంబు."

క. అనునతనిమాటచొప్పున, ఘనుఁడా వృద్ధుండు సలుపఁగా నెంచియు వాం
ఛ్లనుకూలింపమిఁ గొండొక, దనుకన్ మాకడకుఁ గాగితము రాదయ్యెన్.

గీ. అంత బ్రాహ్మణకోటి యగ్రజన్ము
లెల్ల మమ్ము నాహ్వానించి యెలమి నొక్క
సభను గావించి మేటియుత్సవ మొనర్చి
గౌరవించిరి వైరులు కళవళింప.

క. పిదపఁ బినపాడులో నొక, సద స్సిటులె జరిగె నంత ఛాత్రుఁడొకఁడు గో
విదమయ మగు కాలేజీ, సదస్సులో శతవధానచతురిమ నెఱపెన్.

---

## గుంటూరు కాలేజీ శతావధానము

చ. ఎఱుఁగడు పిల్లకాయ యెటులే నొనరించు శతావధానమున్
పరసులు మీర లెల్లరును సభ్యులు పేర్మి ననుగ్రహింపుఁడా
దరమునఁ దప్పులన్ విడిచి తద్దయు నొప్పులు చూచి మెచ్చుఁడీ
తిరుపతివేంకటేశకవిధీరుల శిష్యుని వృద్ధికామునిన్. (౨౦౧ శా॥)

 అవధానపద్యము లన్నియు వదలఁబడినవి.

శా. నీకున్ శ్రీయును ధీయుఁ గల్గుత మతిన్ నీ కంఠసారస్యమ
స్తోకంబై యలరారుఁ గావుత నినుం దూలింపఁగా లేక దు
ర్ధీకుల్ గ్రామ్యులు తావధానులిఁక వ్యర్థీభావముం గందురీ గా
కేకాకారయశంబు గైకొనఁగదోయీ! ఛాత్రచూడామణీ!

మ. కుతుకంబొప్ప సరస్వతిం గొలిచి నేఁ గొంతార్జనం జేసితి
స్మృతిమన్మ్ముఖ్యుని బ్రహ్మఁ గొల్చి మతికొంత న్నేర్చితిన్ విద్దె ని
చ్చితి నీకు న్మతిఁ గొంతమందికి యశశ్శ్రీ నిల్పితీ వో జగ
న్నుతనామా! శివరామ! నీకు నొనరింతున్ దీవనల్ హెచ్చుగన్.

మ. ఎదిరిం దమ్ము నెఱుంగకే యెవరో మ మ్మెంతేని నిందించునా
యదన న్వచ్చితి వడ్డు చొచ్చితివి నిన్నవ్వారు లక్షింప రై
రది లోకం బెటులో యెఱింగె సభ గణ్యత్వంబు నీ కిచ్చి ర
య్యా! దెసల్ నిండె భవద్యశంబు శివరామా! ఛాత్రచూడామణీ!

సీ. నీతండ్రి వేదవిద్యాతత్పరుం డిట నున్నచో నెట్లు నిన్నోమునొక్కొ!
నీతల్లి లోకవిఖ్యాతదివ్యచరిత్ర యిది గన్నఁ దా నెంత ముదముగనునొ!
నీయన్న విద్యావినీతితత్పరుఁ డిట నిపుడున్న నెంతటి యెలమి గనునొ!
నీతమ్ముఁ డవధాననిపుణుఁ డీకృతి గన్న నెంతయా మోదమ్ము నెనయునొక్కొ!

గీ. ఇది మహాత్సంభవంబు నీయెల్ల బంధు
వులును బొందెడి మోదమ్ము గలిసి యొక్క
నన్ను నే పొందె; భరము ఘనంబు మోయు
టెట్లు శివరామ! చెప్పవోయీ! కుమార!

మ. కలవిద్దెం బలుమంది కిచ్చితిని వీఁకం గొంద ఱెట్లెట్టులో
యెలమిం గూర్చిరి పంగనామ మిడి యెట్లేఁ గొంద ఱానందముం
గొలుపం బూనిరి నీకతమ్మునన దగ్గుంగాక యాయొగ్గుఁ ద
గ్గులు; నీవే శివరామశాస్త్రి! మది పొంగుంగాక నాకుద్ధతిన్.

శా. "సంతానం బది లేదు నా" కను మనశ్శల్యంబు నీవైదుషీ
కాంతుల్ ద్రోచెఁగదోయి! తండ్రి! నినువాక్కాంతుండుఁ దద్భార్యయున్

స్వాంతం బుంచి యనుగ్రహించి బహుధా సంతుష్టునిం జేయుచుఁ
మంతుర్గాత్ర సమస్తలోకమును సమ్మానించుఁ గాక న్నినున్.

చ. "అఱువదిరెండు లాయు" వని యందుఱుగా కలిలోన, నల్వదీ
వఱకె గతించె నిప్పటికి వ్యాఘ్రమనన్ జర నోరువిప్పి మ
మ్మఱయ మనుండె మాభరమునంపయు నీతలఁదాల్చి చేయుమే
ర్పఱచిన త్రోవ నోయి శివరామకవీ! బహుళావధానముల్.

క. 'య'స్సనుచుఁ గొంపఱనఁగా, 'బ'స్సనుచుం గొందఱనఁగ బాలుఁడవయ్యున్
నిస్సీమయశముగొంటివి మ, హాస్సాగర! వృద్ధినందుమా! శివరామా!

చెళ్లపిళ్ల వెంకటశాస్త్రి, శతావధాని.

మ. జగతీనాథులు పెక్కుమంది ముదితస్వాంతంబునం గాన్కలం
పఁగ సాంగంబు సలక్షణంబుగ శరద్వావింశతిం బేర్మి హె
చ్చఁగ మా యేలిన యీ వధానకవితాసామ్రాజ్యభారంబు మో
యఁగఁ బూనంగదవయ్య తండ్రి! శివరామయ్యా! చిరంజీవివై.

మ. రిపు లేతెంచిన రూపడంచుమ ధరిత్రీనాథు లర్పించు న
య్యుపదల్ గైకొనుచుం బ్రమత్తుఁడవు గా కుద్యన్న వేందుండవై
విపరీతం బగు త్రోవఁబోక కవితావీరుండవై వర్ణనీ
యపరాక్రాంతి వహింపుమయ్య, శివరామయ్యా! చిరంజీవివై.

శా. బాల్యోద్రేకము మై నెదిర్చితివి కొప్పింపుంగవిం గ్రంథసా
కల్యంబుం బొనరింతొ లేదొ యని నీకై కొంకు నస్మన్మన
శ్శల్యం బిప్పటి కూడఁ బేసితివి వత్సా! సత్సభాశోభివై
కల్యాణంబులఁ బొందుమయ్య! యికవీఁకన్ శిష్యచూడామణీ!

మ. అవనీదేవులు నిస్సమానకవితావ్యాపారవాఃరాశిసం
భవపీయూషరసాభిలిప్తలలితవ్యాహారనీహారులై
యవలోకింప శతావధానమున మాకానందముంగూర్చి గా
ర్దవము న్నిల్పితివయ్య మాఋణము తీఱెన్ శిష్యచూడామణీ!

శా. స్వర్ణీలావతులెల్ల రద్భుతపదవ్యాపార మేపార మా
చర్లబ్రహ్మసుధీగురూత్తముని వాచాపూర్తిఁగీర్తింపఁగా

క. మాకును మాశిష్యులకు న, నేకులు ప్రాజ్ఞు లిటు లెల్లయెడఁ జేసెడి యు
స్తోకపుగౌరవముల కల, లౌకికు లెంతేని జింతలన్ జివికి వెసన్.

గీ. యత్న మెంతేని యొనరించి యంత "విశద"
లాఖ్యఁదగు పల్లెలో సభ నమఘటించి
రా సభావిశేషంబుల నరసి తీర
వలయు నంతియె యంబ! నీ పరయ లేదె?

గీ. వాసి "కలవాటులేని యాపాసనములు"
కొప్పరపుసాము లొనరింప నొప్పికొనరు
పాప! మేమి సేతురు వారిఁ బట్టికొనిన
గ్రహములనుబట్టి మిక్కిలి కష్టపడిరి.

క. "తాటికగఁ బ్రాఁకఁ బూనిన, చోటన్ మఱియెంతదనుకఁ "జోచో" యనుచున్
మాటికి నెగఁద్రోయుదు" రను, మాట కుదాహరణముగ శ్రమంబదియొప్పెన్.

గీ. కొప్పరం బవధానంబు కొలఁకుఁబూని,
‡ వశము గాక పడెడి భంగపాటులెల్ల
మాసయుని బోల్పఁ దొడఁగిరి మంత్రిబలము
చాలఁగల కూటలౌకికాచారపరులు.

మ. అవధానం బెటు చెడ్డనేమి, "బళి, మే, లాహో, జగమ్మందు లే
రవధానుల్ మఱి యొక్క రిట్టి" రని యాహాకారముల్ వ్రాసి తా
నెవఁడో పత్రిక కంప దానిఁ గని "యిట్లే నిక్క" మంచున్ జగం
బవలోకించు మనమ్మువందు నిజ మేలా తేలు నప్పట్టునన్?

ఉ. ♦'బాగుగ నుండెఁ గొప్పరపువారి' దటంచు లిఖించునప్పుడున్
డాఁగిరె గిల్క రెండవిగో; హుటాహుటివ్రాఁతలు డాఁగనేల? యే

---

గీర్లాభంబును గోరి మాదరికి భక్తిన్ శిష్యు లేతేరఁగాఁ
దర్లంజేసితి వస్మదీయగురువిద్యావంశచూడామణీ!

దివాకర్ల తిరుపతిశాస్త్రి, శతావధాని.

‡ ఈ భంగపాటులనుగూర్చి పూర్వరంగము 106, 107, 108, 103, 110 పుటలు చూ॥

♦(1911 సం॥ రం 13వ అక్టోబరు తేదీ, ఆంధ్రకేసరి పత్రికనుండి.)

(గుంటూరి శతావధానము.)

...సభ అసమాన వైభవంబుతో జరుపబడినది. 51 పృచ్ఛకులకు నిరాఘాట

వాఁగుడొ పళ్లఁ జెట్టునెడ వ్రాయసకాఁ డటు సేయుఁ గాక "మేల్!
బాగు! భళా! భళా" యనెడి పట్టున డాఁగుట కర్థ మేమగున్?

క. కల నిజమెల్ల నిటులె యీ, కలహమ్మునఁ దెలిసికొనినఁ గాక తెలియ; దే
పలుగో పేర్మార్చి యొదో, గిలికెడి నిజ మెట్లు తెలియుఁ గృతబుద్ధులకున్?

ఉ. ఇయ్యెడ భిన్నభిన్నతను వేటికి నెత్తిరొ! ప్రత్తిపాటి కా
మయ్యయు, రామకృష్ణులును, నందఱు దాఁటెడి కాళ్లకూరి నా

---

ముగా జరుపబడినది. అవధానపు బద్యములైనను ప్రబంధ పద్యములను మించి యున్నవి. యిదియంతయు జూచినతోడ ప్రతిపక్షులకు నోరెత్తుటకునయినను సందుదొరికినదికాదు. అంత సభానంతరమున ప్రతికక్షివారిచే కూడ మెప్పు వడసిరని వ్రాయుటకు గడు సంతసిల్లుచున్నారము. యిదివరకీ గ్రామంబున జరిగిన సభలలో నేదియు నింత జయప్రదముగా జరిగి యుండలేదు.

ఇట్లు, యథార్థవాది.

---

(ఆన 1911 వ సం॥ అక్టోబరు 4 వ తేది ఆంధ్రపత్రిక నుండి.)

గుంటూరు సమాచారము.

గత నెల 18 వ తేదీని గుంటూరు తాలూకా "విశదల" గ్రామమున కొప్పరపు సోదరకవిశ్రేష్ఠుడగు బ్రహ్మశ్రీ వెంకటసుబ్బరాయ శర్మ కవిగారిచే శతావధానము జరిపింపఁబడినది. నాటి సభకు బ్రహ్మశ్రీ కొండా వెంకటప్పయ్య పంతులుగారు అగ్రాసనాధిపత్యము వహించిరి. నాటి శతావధానమునకు గుంటూరునుంచి యుద్యోగస్థులు, విద్యార్థులు, న్యాయవాదులు, పండితులు, కవులు సుమారు 150 మంది వచ్చియుండిరి. వారి కందరికి పిండివంటలతో సహా భోజన సదుపాయములు చేయబడినవి. వీరి ధారణాశక్తియును, సమయోచిత యుక్తి శక్తులును, కవితాపటుత్వమును, మేధాశక్తియును, శ్లాఘనీయములు. సభానంతరము కొందఱు పండితులు, కవులు తమ యుత్సాహములను దెలుపుచు కొన్ని పద్యములను జదివిరి.

ఒక పృచ్ఛకుడు.

☞ ఇట్టి వ్రాఁతలు పెక్కులు, లోపల నిజ మెఱిఁగియుఁ గప్పిపుచ్చి శాఖాభిమానమును వెల్లడించు నీ వ్రాఁతలోఁగూడఁ జక్కఁగఁ బరికించువారికి "విశదల"లో నవధానముకన్న భోజనమే కొండొక మెఱుగను తత్త్వార్థము

రయ్యయుఁ జట్టిసింగయయు నట్టిరి వాఁడగు 'పోచి' పోఁ,లీ
యయ్యలు పూర్వజన్మమునయం దొకచోటఁ దోఁచు నంబికా!

క. అవధానం బారీతిగఁ, జవుటం బడువిత్తులట్ల సమయుడు శాఖా
యువతీమనోహరులు తమ, సువివేకము నెల్లఁ దెలుపఁజొచ్చిరి తెలవన్.

ఉ. వెంకట రామకృష్ణులను వీరికిఁ దోడుగఁ దెచ్చి, తిర్పతిన్
వెంకన నోడఁబుత్తమిది వీలని కొండలు వాకోసమై
చంకలు గొట్టికొంచుఁ జని సారము గన్గొని "ఛీ" యటంచు ని
ట్టింకుల నింకినట్లు జనులెంచఁగ వింటిమిసుమ్మి శాంకరీ!

చ. "కునికిన బోసినక్కపయిఁ గొండొక తాటి ఫలమ్ముపడ్డ" య
ట్లానువున రామకృష్ణు లిది యారసియుండవలెన్: దగించి యు
ప్పుని పయిఁబెట్టికొన్నఁ దనుపొండిలి గైటికిరాదె? దూరపుం
జనులు సమీపగుల్ బలె స్వశక్తి మహత్త్వమెఱింగి నవ్వరే!

తే. గీ. "ఎడమచేయియుఁ బుజ్జిచేయియు"నటన్న
సామెతయె వీరి కవధానచర్యపట్ల
తక్కసామగ్రిలోన భేదంబుబోలెఁ,
దెసఁగుఁ గొప్పింబునకు రామకృష్ణులకును.

ఉ. వచ్చిన రాకయున్నఁ దమవాక్కులఁ దోడుగ సంపుటేనియున్
మెచ్చు ఘటించుఁగా! యనుచు మేటులు వేటులు "శృంగభంగముల్"
వచ్చికమోఁపులుంబలెను పంపిరి పాపము! రామకృష్ణులే
మిచ్చఁ దలంచిరో? నిజమెటే బయలౌనని తా రెఱుంగమిన్.

ఉ. వెంకట రామకృష్ణు లవివేకవిశాలపు 'శృంగభంగమున్'
జంకలనూని జన్మదివసమ్మునదే యనర్ఘశతాప్తి ని
ట్టింకులు గొన్ 'శతఘ్నిఁ' బఠియించుచుఁ గొప్పవారి బందుగుల్
వంకపుఁదోవలంబడి స్వపద్ధతి నెల్లఁగఁ బెట్టిరంతటన్.

---

దొరకకపోదు. అది యటులుండె, ఈ రసాభాసావధానము మాయవధానము కన్న వేయిరెట్లధికముగ నున్నదని వ్రాసిన యతని వ్రాఁతను పూర్వరంగము నందు జూడఁగోరెదము.

తే. గీ. బందుగులటన్న దగ్గఱవారు కారు,
ఏకశాఖీయులనియె నీవెఱుఁగుమంబ!
వారు లోలోనఁ గొప్పింపువారి సత్త
నెఱుఁగ రనుకోకు మెఱిఁగియు నిట్టులైరి.

తే. గీ. ఒకరొ యిర్వురొ తక్క నియోగులందుఁ
గొప్పరపుధారయన నొప్పుకొననివారె
కాని యాసనచర్చాభిమానమాన
మానసాంతరులై మేను మఱచి చెడిరి.

సీ. "పండితబ్రువ"మంచు బండతిట్టులుతిట్టి యెవ్వాఁడు తన హైన్య మెఱుకపఱచె
"సత్యవాది"యటన్న చాటుపేరున లేనిపోనివాదుల నేఁడు పూని వ్రాసె
అతనికెక్కుడుగ "యథార్థవా"ద్యభిధానమున నెవ్వఁడుఁ [illegible]ంచె ననృతములను
వంటబ్రాహ్మణునుత్సవమ్మున కెవ్వాఁడు తన యశ్వమును సంఘనతఁ జెఱిచి

తే. గీ. కొనియె నీ నల్వురును మఱికొంతమంది
దక్క మాయందు ద్వేషంబుగలుగుజనులు
లేరట నియోగులందు నివ్వారికతన
పృథగ నెందఱికో చెడ్డపేరువచ్చె.

మ. జననీ! కొప్రపువారిపక్ష మది నీచంబో, ఘనంబో కనుం
గొనుమీ! పంటనియోగి నశ్వముపయిన్ గూర్చుండఁగాఁ జెట్టి యూ
రున నేగించిరి వాద్యఘోషములతోఁ గ్రొంగ్రొత్తదీపాలతో
"ననయుల్ వీరికి బుద్ధిలే"దని పురం బాబాలమున్ గోలగాన్.

మ. శివరాముం డవధానమున్ సలిపి వాసిన్ బేర్చుడున్ వానిగా
రవ మొప్పన్ ఘనులట్లు చేసిరని యోర్వన్ లేక 'కొప్రంబు దా
నవధానమ్మిటు చేయఁజాల దెటు లబ్బో నుత్సవం' బంచుఁ గుం
దు వెలార్చన్ దమపాచకాధముని నెంతుం ద్రిప్పి రప్పట్టునన్.

తే. గీ. దీనిచేతనె సకలంబు తెలిపినట్టి
దయ్యెఁ బ్రాజ్ఞుల కిఁకనన్య మనవసరము;
ఐన నాయీయి సందర్భమఁటో యింతో
తెల్పకున్న దూరగులకుఁ దెలియు టెట్లు?

చ. “వికటట” లోఁ బ్రథాన పాదిశాస్త్రిగఁ దోఁచినవీఁదఁగూడ నీ
ర్విక్రయము దక్కఁ గుంటురుపురీ సభఁజెట్టి చెడంగఁజూచి “దు
ర్గకులకు సత్సవంబునఁ దప్పఁగ నుండు” నటంచు నెంచి యీ
పశుకృతి కిచ్చఁజేసి నగుఁబాటులపాలయిరంబ! లౌకికుల్.

మ. అభిమానంబన గర్తపూర్తితనియోగ్యగ్రేసరాధీన మం
చు భయం బించుకలేక చెప్పఁదగునె చొప్పార లద్దానికై
శుభదూరంబు వసిష్ఠ్యముల్ శుభదమంచున్నమ్మి భాషింతు రే
రభసప్రక్రియకేని సిద్ధపడి యారంభింత్రు దుర్వ్యాహృతుల్.

క. కుకవిశ్వాసముపై నెక్కిన, నిక్కపు సంతోసమందు నిపుణులు కవులం
దెక్కువ తక్కువ లరయుదు, రోక్కో! యిదివిన్న నవ్వరోక్కో! విబుధుల్.

క. ఇది యిటులుండుత రాజీ, సుదరింపఁగఁ బత్రిమీఁది యొక్కొండు ముమపె యా
సదమతులు వ్రాసియుంచిరి, కద! తచ్చరితమ్ము వినికిఁ గావింతు మికన్.

క. ఇరువదినాలుగు దినములు, పరిపరి యోజించి తుదకుఁ బత్రిక మాకి
చ్చిరి తెచ్చి ‡ గౌరవస్థులు, మతిమాగురు; దానిఁగాంచిమదిముదమొదవన్.

ఉ. అంతకుమున్నె పత్రిమిటులాగతమా నవి విన్నవాఁడె వా
క్కాంత యనుగ్రహమ్మున నొకానొక కల్పన దోఁపఁగా “యశః
కాంత వివాహము” న్వ్రచి కట్టియ యుంచిన పద్యసప్తకం
బెంతయుఁ బేర్మి వారు విని యిచ్చిన మోదము గాంచి రయ్యెడన్.

———

‡ (1911 సం, అక్టోబరు 20, తేదీ కృష్ణాపత్రికనుండి.)

బ్రహ్మశ్రీ తిరుపతివెంకట కవీశ్వరుల సముఖమునకు. ఈదిగువ సంతకము చేసిన వారు నమస్కరించి వ్రాయువిజ్ఞాపన:—

ఈపురమున నీమధ్య శతావధానసభ జరిగినది మొదలు దమకును గొప్పరపు సోదర కవులకును వైషమ్యము లేర్పడి ఉత్తర ప్రత్యుత్తరములు నడచినవి. మా గ్రామములో తమ తమ మధ్య వైషమ్యము లేర్పడుట మాకు మిక్కిలి శోచనీయముగానున్నది. తమరును కొప్పరపు కవీశ్వరులును మాకు గౌరవార్హులే యగుట మా గ్రామమునుండి వారలను విమ్మలను సఖ్యపరచి పంపుట మాకు యుక్తమనియు గౌరవమనియు దోచుచున్నది. కావున మాయుద్దేశ్యమును మీరును అంగీకరించి వీరాసభ మొదలింటికను నొండొరులఁగూర్చి పఠించి-

యాశః కన్యకాపరిణయము.

సీ. తారతమ్య మెఱింగి తరలి వచ్చెడివారు కొప్పరం బంచెఱుంగుదురు మీరు
తప్పెటల్ మ్రోగంగఁ దరలి వచ్చెడివారు కొప్పరంబంచెఱుంగుదురు మీరు
తరుణతాభరము పైఁ దరలి వచ్చెడివారు కొప్పరం బంచెఱుంగుదురు మీరు
తగుబాంధవులతోడఁ దరలివచ్చెడివారు కొప్పరం బంచెఱుంగుదురు మీరు

తే. గీ. తిరుపతియొ, కన్యకాదాత; తెరువు౯వలె
వచ్చుచో నింత యాతిథ్యమిచ్చు, రాక
యున్నచో నప్పుడే పెండ్లి సున్నయయ్యె
నొకరువారింప నేటికో యోగ్యులార!

సీ. కలదొక్క సూఁతుడు కలిగెఁ జెండిలి కాకమున్నె వడుగు గాకమున్నె మాకు
నాంధ్రగీర్వాణభాషాంగనాతిలకమ్ము లిరువు రక్కన్నియ నెత్తి పెంచి
వీడేల; నెందఱో యీకన్నెఁ బెండ్లాడఁగా నెంచి యత్నించి కడకు దీని
చే నీసడింపుల నూనిపోయిరి తల నరయంగఁ దఱియయ్యెఁ బరిణయంబు

తే. గీ. లేకయే పోయె నమకొను పాక మెఱిఁగి
కొప్పరపువారు తరలి రాఁగోరి; రంత
సంతసించితి; మంత నే జాఱఁదొడఁగి;
రూరకుంటిమి; తప్పేమి యోగ్యులార!

సీ. 'తల నరసిననాటఁ గలయుట కామశాస్త్రవిరోధ'మని మదిఁ దలఁచిరొక్కొ!
'ఉభయభాషలు నేర్చునువిదఁ బెండ్లాడఁగాఁదగ'దంచులోలోనఁదలఁకిరొక్కొ!
'పెక్కుమాటలు నేర్చు పెంకెపిల్లనుగొన్నమాటదక్క'దటంచు మానిరొక్కొ!
'ఎందఱో జంకిన యీమెమ్మలాఁడినిఁగొన్నఁ బరువుదక్క'దటంచుఁ బఱచిరొక్కొ!

---

మవియు లిఖించినవియు మరల్చుకొనుచు నొకరికొకరు లిఖితరూపముగ తెల్పుకొని యిప్పటి స్నేహభావ మవలంబించిన మేము మిక్కిలి సంతసించెదము. మావిజ్ఞాపన నాదరించి మీవైషమ్యకారణములను మరచి మాకు సంతసము కూర్చుదురని నమ్ముచున్నాము.

గుంటూరు. }
4-9-11 }

చిత్తగించవలెను,
ఇట్లు తమ విధేయులు.

యేశా రామయ్య, జి. రామనాథయ్య, వంకిపురం కృష్ణమాచార్యులు
ర్యావలి హనుమంతరావు, కొండ వెంకటప్పయ్య.

తే. గీ. 'కట్నమే చాల' దనుకొని కనలిరొక్కొ!
వారు గోరినదిచ్చు మా కేటి మేమి?
ఎట్టులో పెండ్లి సాగించి యెలమి మైప
దన్యముఁగ బండితుఁడవ్వఁదలఁపుఁడయ్య!

సీ. కయ్యమ్మునకు నింటి పెద్దల నంపింపఁ 'దలఁతె' దనుచు మున్నె పలికినాము
"కానుగూడ"యటంచుఁ గాల్పైకల్పుకరాఁగ "మంచిదే" యనిసమ్మతించినాము
ఒకమాసమే కట్నమోఁపైఁ గోరఁ దక్కినమాసమునుగూడ నొసఁగినాము
కన్యాపరణదానకుఁ గార్యంబొనర్చితి మంతలో సుముహూర్త మగునటంచుఁ

తే. గీ. దలఁచుచుండఁ బురోహితుల్ దగినవారు
కాచలసి వచ్చి రంతట గాని
వచ్చి కథయాఁగె; నిండలి పొచ్చె మెఱిఁగి
యేల నెపపెట్టెదరు మమ్మ హీనులార!

సీ. "ఎంత మాసమ్మైన నిక సెందు కిక లె" యంచు నీసడించిన రోసమేమి మాకు?
"వైదికకన్యక వలదు కైకొన" టంచు నీసడించిన రోసమేమి మాకు?
"శాస్త్రంబు చదివిన సంయేలమాకంచు నీసడించిన రోసమేమి మాకు?
"హెచ్చుంగడపు మాయింటి మాకేల" యం చీసడించిన రోసమేమి మాకు?

తే. గీ. మొదటఁ గోరిరి సెమ్మటఁ జదువు సంద
రెఱఁగియో, యేమొ వెనుదీసి; రెందుకేని
సమ్మతించితి మింక మీకెన్ని మార్లు గూర్పఁ
బూనుటని పునరుక్త మెరాజ్ఞానులార!

సీ. రుద్రాక్షపూస లఱుతఁ దాల్చువారికి బంగారు వారి కేలాంఛనంబు?
వెబ్బూది దాల్చువారలకుఁ దిర్మణి తిరుచూర్ణాలవారికే చుట్టరికము?
"ఇత్యర్థ గలితిభావ" లేనేరఁ బల్కువారలకుఁ దెల్గులతోడ రాజియేల?
గురుపాదసేవఁ జేకొనినపద్దియకు బాజారు విద్దియతోడ సఖ్యమేల?

తే. గీ. ఏడ 'తిరుపతి'! 'కొప్పరం' బేడ! సహహ!
ఆహవమె కాని, మఱి వివాహంబె కాని,
స్నేహమే కాని మాకెట్లు చెల్లుఁ జెప్పుఁడ
పరసులార! గుంటూరు వాస్తవ్యులార!

సీ. గోదావరీనదీకూలమ్మునకుఁ గొండవీటి కూపమ్ముతో వేరమేల?
ఆమ్రాదితరుజాల మలరు తోఁటలకు గోఁగాకుభూములమీఁదఁ గాఁకయేల?
ఎచటఁ జూచిన నిక్షులే వొల్చుపొలములకేలయ్య జొన్నపొలాల చెలిమి?
తిరుపతి వేంకటేశ్వరున కంకాలమ్మ జాతరమీఁది విశ్వాసమేమి?

గీ॥ ఇంతకును గ్రాలుదర్గ్రీవ దేవరో యె
ఱుంగుదురు మీర; లెవరిస్వరూపమెట్టి
దో యెఱుంగుదు; రరక యేదోవిధమున
మమ్ము నెపపెట్టనేల? యోమాన్యులార!

---

చ. పదపడి కొన్ని పద్దెములు పత్త్రికలోఁ * బ్రకటించి సంశయా
స్పదులగు లోకులందనిపి ప్రాజ్ఞుల, సంధికిఁగొల్పు యోగ్యులన్
ముదమున మించి యచ్చటనె మోదమెలర్పఁ గవిత్వగోష్ఠి పెం
పొదవఁగనట్టిటి మాపయి కక్షోదయముం విమమంబ! శేర్మిమై.

---

(* 1911 సం, అక్టోబరు 20, 28 తేదీ కృష్ణాపత్త్రికనుండి.)

పై సంతకము లొనర్చినవారికి నమస్కారపూర్వకముగా మాయొనర్చు కొను వినయపూర్వక పద్యమయ విజ్ఞాపనము:—

ఆర్యులారా! 4-9-11 తేదీగల తమ పత్త్రిక 28-9-11 వ తేదీ సాయంకాలము సుమారు 5-30గంటలవేళ మ॥ రా॥ రా॥ కొండ వెంకటప్పయ్యపంతులుగారు బి. ఏ; బి యల్; గొల్లపూడి రామనాథయ్యగారు బి. ఏ; బి. యల్; గోవిందరాజు శ్రీనివాసరావు పంతులుగారు బి. ఏ; బి. యల్; అను నీ పెద్దమనుష్యులవలన మాకు నంది యపారానందము నొనర్చినది. దానిపైఁ గొన్ని పద్యములు భగవతి తోఁషింపఁగా నయ్యవి యన్నియును దమసన్నిధి కంపికొనవ దలఁచితిమి గాని గ్రంథవిస్తరభీతియును విలువగల తమకాలమునకు లేనిపోనిపని గల్పించినవారమగుదుమేమో యను సందియమును వెనుకంజవేయించుటచే నందలి దశాంశమును మాత్రముఁ బంపికొనుచున్నారము. వ్రాసి పంపినచోఁ దమకు మాత్రమే యిందలి మంచిచెడ్డలు బోధపడునుగాని యావదాంధ్రలోకమునకును బోధపడవని పత్త్రికాముఖమునఁ బ్రకటించికొంటిమి. ఇందుఁగలతప్పులనుమన్నింప వేఁడుకొనుచున్నారము.

(తిరుపతి వేంకటేశ్వరులు)

సీ. అనవసరమ్ముగా నాసనమ్మును గోరి యవధానవిఘ్నమ్ము నాచరించ
'మదియయుక్త' మటంచు నగ్రాసనాధిపుఁడనిన పిమ్మటఁగూడఁ జెనఁగఁబోము
పెనఁగియుఁ దుద కదిగొనలేక సభవీడి యవలికేగి యసూయనందఁబోము
అందియు నాటకాభ్యంతరమ్మున నుండునప్పుడు పద్యమ్ము లంపఁబోము

గీ. ఎఱుఁగకే మీసములఁబట్టి యెట్లొ వ్రేలఁ
బడము, తుందుడుకందము, పలికినట్టి
పలుకు మూఁడులోకమ్ముల నిలిపికొనఁగఁ
జాలుదుము పండితులయొద్ద సరసులార!

సీ. ఒకని పెండిలిలో మఱొక్కఁడా పల్లకీ నిఱుకనుంకించు టెంతేనిఁ దప్పు
ఎఱుఁగక యత్నించిరే యంద మాపైనిఁ దెలిసియుఁ జెనఁగు టెంతేనిఁ దప్పు
అధ్యక్షుఁ "డిదికూడ"దంచుఁ జెప్పిన మీఁద నేని యాగమి మ టెంతేనిఁ దప్పు
అక్షరతత్త్వంబు నరయ కాపై భీతి దీఱి కాల్ద్రివ్వు టెంతేనిఁ దప్పు

తే. గీ. "మీసముల" పద్య తాత్పర్యవాసన యిసు
మంత తెలియక వ్రేలాడు టెంతయేని
దప్పు; "తప్పని" నేఁ జెప్పుటొప్పుగాదు,
పండితులచేతఁ జెప్పింపవలయుఁజుండు.

సీ. తిరుపతి వేంకటేశ్వరులతక్కువయును గొప్పరంబున వారి గొప్పఁదనము
ఆంధ్ర గీర్వాణభాషావరత్వము గ్రామ్యభాషావధూటీపరిభావకత్వ
సనియమాశుకవిత్వమునఁ గల్గు లోపం బనియమాశుకవననిర్నిద్రమహిమ
అవ్యాజరచనాపహాస్యత్వమును బూర్వసంచితపఃసప్రశస్తతయును.

గీ. సభయొనర్చినపైఁగదా! సహృదయహృద
యావగతమగుఁ, గాల్ద్రివ్వు టలఁతి వారు
సేయఁదగుకార్యమా! యెంత చేవయేని
నుండియే తీరవలెఁజుండి యోగ్యులార!

సీ. ఊరూర నూరేగు నుత్తరప్రత్యుత్తరముల కేలాగు నాశము ఘటిల్లు?
నొప్పుతప్పుగఁ, దప్పునొప్పుగా లిఖియించు "సత్యవాదుల" వ్రాఁతసమయు టెట్లు?
ఇహపరమ్ము లెఱుంగకే వర్తించు "యథార్థవాదుల" ధార్ష్ట్యమడఁగు టెట్లు?
తిరుపతి కన్నఁ గొప్పర మెక్కుడనెడి యీపాటిబండలగోల దాఁటు టెట్లు?

తే. గీ. ఊరకే స్నేహమునుగూర్పఁ గోరువారు
మీ రమాయకు, లవియన్ని యెరిఁగి తనఁ
గ్గైనో నంత యోజింపఁగా భజ్ఘు
సత్యము నుతింతు మింక జిజ్ఞాసులార!

సీ. అక్కటా! కవులకు నవయౌవనంబబ్బెఁగా! యనెడి మీ హృదయంబు నరసినాము
అది యాసనప్రసంగాధీనమనెడి మీ యాశయం బాసాంత మరసినాము
ఆప్రశంసను మెచ్చు సమలాత్ములెవ్వరో యామూలముగ మున్నె యరసినాము
ఈసఖ్యమొనఁగూర్చె యింకమూలమున వారనఘాత్ములగుపూనిక నరసినాము

గీ. అప్రలించినఁ బ్రేవుల నరయఁగలరు
కవులు రవియెఱుఁగనిచోట్లు గాంచఁగలరు
కొప్పరపు సోదరులె రాణుఁగుదురు సకల
మక్కటా! యాసనం బెంత చిక్కు దెచ్చె!

సీ. "ఒడ తెఱుంగని సినమున్నదే" యెంచేని మాకీర్తి నెఱుఁగమే మాన్యులార!
ఈఁతకు మించు లోఁతెందేనిఁ గలదె? కా నిండయ్య యొకసారి నిండుసభను
వైదికత్వమున కేవం జేసి కళ్లొ మీసాలు దీయుంపుఁడీ సరసులార!
విద్వద్వినోదముల్ వినుటగ్రామమున జేయపయశమ్మునుగూర్ప వరయఁడనఘు

తే. గీ. లార! సత్యవాములును, యథార్థవాదు
లిప్పురమ్మునఁ బుట్టు రెంతేనిఁ దప్పు
గాని, విద్యలలో నేరు ఘనులొ, యెఱుఁగు
పూనికలు తప్పగాదయ్య పూజ్యులార!

సీ. "కాశికృష్ణబుధుండు కరమందు లిఖియించి సన్నఁ జేసిన" దెంత సత్యమయ్య!
"అభిమానమున మమ్ము నర్చించిరే కాని శుద్ధమూర్ఖులె" యంట నూనృతంబె?
"రామకృష్ణులఁ బట్టి రహిఁ బట్టినా"రన్న వ్రాఁత యెంతటి సత్యవంతమయ్య!
"నలుబది మందితో సలిపి రవ్వా" రని నెక్కిరించుట యేటి ఫక్కియయ్య!

తే. గీ. తమ తెఱుంగని దింక లేశమును లేదు
ఆపనమె తెచ్చిపెట్టె నీ యనృతములను
నిజముదెల్పి యశమ్ము చే నెగడరయ్య!
వలదు జంపింక గుంటూరు వాసులార!

సీ. "కృష్ణలో" వ్రాత నిష్ఠని మీ రొకసారి పరికింపుడీ హితవాదులార!
"దేశమాత" యొనర్చు దివ్యోపదేశమ్ము లరయుఁడీ యొకసారి యార్యులార!
"ఆంధ్రకేసరి" లోని యంశమ్ము లొకపరి చూడుఁడీ యిష్ఠన్ని బుద్ధులార!
తక్కు పత్రికల యథార్థంపు వ్రాఁత లింకేనిఁ జూడుఁడి మహాజ్ఞానులార!

గీ. సభను జరిగినయట్టి వాస్తవ మదెట్టి?
దెట్లు వ్రాయుచున్నారో, యెఱిఁగి శాంతి
చేయుఁ; డీ వ్రాఁత పోలికిఁ జెడ్డ యశము
గూర్చు నిజ మెట్లొ పైకి రానేర్చునేని.

సీ. వేనవేల్ సత్యవిజ్ఞాను లుండియుఁ జెడ్డకీర్తిఁ గొనునె గుంటూరుపురము?
సభ నున్న మీవంటి సరసులకన్న నాకాశంపు సూర్యుఁడా కర్మసాక్షి?
పంచభూతముల మా పాండిత్య తత్త్వంబుఁ జెప్పఁగా నప్పగించెదరె పోగు?
లెవ్వరో యొకరిద్దఱే హేతువై పురమ్మున కప్రతిష్ఠ రాఁబోలునయ్య?

గీ. 'రజకువాక్యమ్ములను వినురాము' లౌట
యుచితమయ్య! మీవంటి యోగ్యులకు సకల
మెఱిఁగినందుకు ఫలమేమి? యిట్టిపట్టు
నం దుదాసీనులగు టెంత యర్హమయ్య?

సీ. "ఆసవం బొప్పలే" దని కోపగింతురా? యది గోమటే పెద్ద యనుచితంబు
"అనుచితం బనుట పేయాధార"మందురా! కొప్రంపుకవి దాఁచికొనుటె సుందు
"అనుచితంబగు కోర్కె ఘను లెట్లు కోరువా"రందురా! అది ప్రమాదాతిశయము
"మతి ప్రాజ్ఞులకును బ్రమాదమా"యందురా! ♦ వారికే యందు నిర్ధారణంబు

గీ. చేసి వ్రాసిరి వ్యాఖ్యాతృశేఖరులు, ప్ర
మాదములు విశ్వసింపమి మాకుఁ దప్పె?
అంతమాత్రాన గంటుల కనుపతింత్రె,
సోదరులు చెప్పుఁడయ్య! యో సూరులార!

సీ. ఉచితమో యనుచితంబో చేయు పండితుం డరయఁగావలె భవిష్యత్ప్రశంస
అని * భర్తృహరి చెప్పుటైనఁ జూడక యేరి ప్రేరణమ్మున నౌదుర్వారులగుచుఁ

---

♦ శ్లో॥ ప్రమాదో ధీమతామ" పీత్యత్ర, అపిశబ్ద ఏవకారార్థక ఇత్యభియుక్తాః.
* శ్లో॥ ఉచితమనుచితం వా కుర్వతా కార్యజాలం, పరిణతిరవధార్యా యత్నతః పండితేన. (భర్తృహరి చూ.)

గాలి పట్టి యెన్ని యోగాఖ్యలు ప్రకటించి తలక్రిందగని ప్రయత్నములొనర్చి
“పండితసభ” యన్న పైఁ గొంత శాంతించి పండ్లబింక మొకించి ప్రాఁతయందుఁ

గీ. చూపి, ప్రాజ్ఞుల సమ్మతి పాపకార్య
మనుచు మము వెక్కిరించిన యట్టివారి
సఖ్య మది మాకు లేకున్నఁ జచ్చిపోము,
పృథగ నెపవెట్టకుండు సుప్రథితులార!

సీ. ‘ఓంశాంతి’ యనెదు మీ యోగ్యత నేనోర్వ శ్లాఘింపవలెఁజుండు సరసులార!
ఈయూహ మీకప్పుడే పుట్టెనేని మీసములమీఁదికి వాడు చనరుసుండు
అంతకొక్కింత పైనైనఁ బుట్టిన వారు “కుచమర్దనములు” పేర్కొనరుసుండు
సకలమ్ము జరుగుపై శాంతిఁ జెప్పుటకన్న నన్యాయ ముండునయ్యా! మహాత్ము

తే. గీ. లార! విద్వత్తలోఁ దప్పు నన్యవిషయ
మందుఁ గొప్పింపువారి సంఖ్యంబు మాకు
సమ్మతము; దానిలోఁ గూడ సమ్మతింతు
మేని భారతి మ మ్మింక నీసడించు.

సీ. చౌరపమై నెదిరించి సొఱకాయకోఁతలు కోసినారు కటార్లు దూసినారు
‘అవధానమందు మిమ్మతిశయించెద’ మంచు వ్రాసినారు సవాళ్లు చేసినారు
మీఁది మీఁదికివచ్చి మీసాలపైఁ జేయివేసినా ర్చెడుగుడుల్ గూసినారు
మసిపూసి యెట్టులో మారేడుకాయఁగాఁ జేసినా ర్మమ్మెడఁ బాసినారు

తే. గీ. పెనఁగి నా మీసమింతేనిఁ బీకకుండ
నెదిరి యవధానమున మమ్ముఁ గదుమకుండ
నేటి సఖ్యంబు మాకు? మీ కేటిభరము?
సభను సమకూర్పుఁడయ్య! యశస్వులార!

సీ. బందరేమయ్యెనో? “ప్రెస్సు” లేమయ్యెనో, పుస్తకాలేమయిపోయెనొక్కొ?
అచ్చేమి యయ్యెనో, ఆస్తి యేమయ్యెనో, కర్తృకం బేమి కావలసెనొక్కొ?
‘న్యూ’ లేమియయ్యెనో, బాలు రేమయినారొకో, యుద్యోగమేమూలనుండెనొక్కొ?
ఇల్లేమి యయ్యెనో! యితర మేమయ్యెనో, మిత్రవర్గంబు లేమి యయిరొక్కొ?

తే. గీ. వచ్చినది రాక యయ్యె, నీపాటికేము
సెలవు గైకొనుచున్నాము, స్నేహభావ
ముంచి పంపింపుఁడయ్య! యేముండె!
‘వడ్ల గింజలో బియ్యపుగింజ’ గేస్తులార!

సీ. శ్రావణమాసానఁ జనుదెంచితిమి భాద్రపదమాశ్వయుజము నిప్పట్టణమునఁ
బూర్తిగాఁ గడచె నిప్పుడు కార్తికము వచ్చె నిప్పటికేని మా కింటి కేగ
నిచ్చ పుట్టుట లేద, యిదియెల్ల నీసీమవారియాదృతియు నుదారమైన
మీ మైత్రియును మాదు*మీ సాలమహిమయుఁ గొప్పింపువారిమిక్కుటపుఁ జేర్మి

---

[illegible] మద్రాసులో బి. యే. (B. A. Honours) చదువుచున్న శ్రీవారణాసి శ్రీనివాసరావుగారు తత్కాలము పంపిన 200 పద్యములనుండి కొన్ని

* మ. తలమీఁదన్ దలపోసి యీసుగొని గద్వాలాత్మకూర్పార్థివేం, ద్రులసంస్థానములందుఁ బండితులు నిన్నున్ దీయయత్నింప ను, జ్జ్వలవాగ్వాహిని గొట్టివేసితివి ప్రాంచత్పాండితీ వైఖరిన్, బళిరా! మీసమ! నీకునీవసరి త్రిప్పన్ గెల్లురా నిన్నిఁకన్. సీ. ఏన్గుల నెక్కించి పృథ్వీపతులు గొల్వ నిక్కింపఁ జేసితి నీవకావె, వాదింపఁగా వచ్చువారి వాదంబుల నీఱుగావించితి నీవకావె, వర్ణాశ్రమస్థితిఁ బడయగాదగు రాచనెమ్మి నుద్రేకింతు నీవకావె, మాన్యంబు లిప్పించు మార్గంబుచూపించి నేస్తంబుఁ జాటుదు నీవకావె, గీ. మీసమా! గాఢ గౌరవావాసమైతి, వెంతఁజేసితి మున్ముందిఁ కెంతఁజేయఁ, జాలనెప్పుడుఁ గడుఁ జెంచఁజాలియుందు, త్రిప్పఁదిప్పఁగ నినుఁజెప్పి చెప్పవలయు. క. కానిర కినాసర నుడి నం, తోఁకిల్లఁగ నాసు కయితతో సాగెడి నీ, వీసపుకై సురులేసరి, మీసమ! నినుఁ దీయఁ గలుగుమేధాగతికిన్. సీ. అలబృహద్రిథు శక్తి దఱియనప్పుడ నీళ్లుమ్రింగిన విప్పుచ్చు మీసమెంత? దుర్యోధనుని గూల్పఁ దోడుగా కృష్ణుఁడు మిణ్కిన వలలాంకు మీసమెంత? వాలినివధయింప పంచవా, కృత్తిమై 'మెచ్చ్మ'యనిన రాము మీసమెంత? ఇంద్రజిత్తునికీలు నెఱిఁగి తుంచుచు చూపఁ జేసిన సౌమిత్రిమీసమెంత? గీ॥ నీవ మీసంబ పీమహి నీవ 'కుంతి తఁబు', వాఁగలపల్కుల నెత్తితినెఱుంగ, నెప్పు డసమానవిక్రమంబే పహించి జయము గొంటివి జగతిమీసంపుఁ జోఁడ. చ॥ అలఘుకవిత్వకీర్తిఁ గొన నండఁఱకున్ బర మానె? మించునె, త్తుల గమకింప నండఱకుఁ దోఁచునె? తోఁచిన జీలుగెత్తు గావలయదె? మేకుమాటమఱపించదె పెంచదె గీరతంబు; నీ, వలుగకు సంస్కృతాంధ్రకవితైక మహత్త్వము, చాలు మీసమా! మ॥ సుమనిర్యన్మకరందగంధకవితాశుద్ధాంతభృంగీరవో, పమభక్తప్రతిపత్తితో వెలయుచున్ బాండిత్యగంధానిలం బమలంబై తెమలంగ లోకజనసమ్మాన్యక్రియం బొల్తువో కమనీయప్రతిభావిలాసమ! నమస్కారం బిదే మీసమా! (18)...

తే. గీ. యనుజుఁడీ! లేకయున్న మేమొకటవింత
కాలముండుటిప్పట్టునఁ గల్గునెట్లు?
తక్కిన ప్రసంగములేమి దైవకల్పి
తమ్ము, లాజ్ఞయొసంగుఁడీ ధన్యులార!

సీ. ప్లీడర్లమా? కాము, బీ యేలమా? కాము, ధనికులమా? కాము ధన్యులార!
అర్థులమా? కాము, స్వార్థులమా? కాము, ప్రభువులమా ? కాము, పండితులార!
దీనులమా? కాము, మానులమా? కాము, మౌనులమా? కాము, మాన్యులార!
క్రుద్ధులమా? కాము, బద్ధులమా? కాము, వృద్ధులమా? కాము, వేత్తలార!

గీ. కవుల, మిప్పటి 'రూల్సు'కుఁ గట్టఁబడము,
ఘనులు * పండితరాయాదికవులు చూపు
త్రోవఁ బట్టిపోదుము, దేవునైన
లక్ష్యపెట్టము † మాకు వల్లభులు లేరు.

సీ. తిరుపతివేంకటేశ్వరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
అల్ల కొప్పరపు సోదరుల పేరులు మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
విశ్వత్కవీంద్ర సంవిద్విలాసము మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ
[illegible]పల కవుల యకించనత్వము మీకు జ్ఞప్తిలో నిల్పు నాసనపుఁ జర్చ

తే. గీ. మేటి యాసన చర్చకు, మీకు, సత్య
వాదులకు, మాకును "యథార్థవాదుల" కును
మఱియు నామీసములకుఁ, గొప్పరపు సోద
రులకు దీర్ఘాయువిడి నల్వ ప్రోచుఁగాక!

సీ. కాళిదాసునిమార్గ గరిమంబు నెఱిఁగినవారంచు మిమ్మెంతు ధీరులార!
భవభూతి యను మహాకవిమార్గ మెఱిఁగినవారంచు మిమ్మెంతు ధీరులార!
పండితరాయలపండితన మెఱుంగువారంచు మిమ్మెంతు ధీరులార!
ఆంధ్రకవీంద్రనిరాఘాటత నెఱుంగువా రంచు మిమ్మెంతు ధీరులార!

తే. గీ. పల్కనేపల్కఁ డెప్పట్లఁ బండితుండు
పల్కెనా, నిల్చునేగాని భయముగొనఁడు

---

* శ్లో॥ మనస్వీ మ్రియతే వాఽపి నోత్కర్షం నైవ ముంచతి।
అప్యే నిర్వాణ మాయాతి నాఽనలో యాతి శీతతామ్.

‡ నిరంకుశాః కవయః

ఇదియె విద్వత్కవీంద్రుల కింపునింపు
మార్గమని మీ రెఱుంగరే మహితులార!

సీ. మా కపకీర్తి సంపాదింపఁగా నెంచి దేశమాతకు దూఱు దెచ్చినారు
మా కప్రతిష్ఠ సంపాదింప నెంచి కృష్ణను నప్రతిష్ఠచే నడిపినారు
మాకు దుష్కీర్తి సంపాదింప నెంచి కేసరిని దుష్కీర్తి పాల్పఱచినారు
మాకు దుర్యశము సంపాదింప నెంచి యాంధ్రపుఁ బత్రికకు నదిదార్చినారు.

గీ. ఎంచఁబో 'యథార్థవాదు' లిం కెంపఁడేని
సత్యవాదు లిప్పురమున జననమంది
నారు, శివరామశాస్త్రి యీనాఁటికి శివ
రాముఁ డయ్యె; మాకేల కోపింపుఁ జెలిమి?

సీ. సఖ్యపఱచి మమ్ము సాగనంపుటకు మీ చేయు యత్నము గడు శ్రేష్ఠమయ్య!
సాగనంపకమున్నె చనువార మేకాని చుట్టుపట్టుల నుండు నూరివరులు
సభలు చేయుటఁ జేసి చనకిందు నిల్చితి మంతియేకాని సభాంతరమున
కింకను సోదరు లేతెంతు రని కాదు; గాయత్రి సాక్షి నిక్క మ్మెఱుంగుఁడు

తే. వారి సేమంబు గోరినవారు గాన
సంశయించుచు నున్నారు; సకల మెఱిఁగి
నట్టి మాకడ డాఁచ నేలయ్య! వారి
వదలి చిరకాలమయ్యె సహృదయులార.

సీ. వ్రాసి యుండంటిరే? వారితోఁ బోరాట మానికొంటి మటంచు మాన్యులార!
వ్రాఁత వ్రాసిన యంత నే తప్పిపోవునే! కాల్ద్రివ్వువారి బింకంపుఁ గంపు
కాల్ద్రివ్వ నెట్టిదో గనుఁగొన్నపైఁ గాని నిదురఁబట్టదు మాకు నిక్కమయ్య!
యీయూరఁ గాకున్న నేయూరనైన మీ సమ్మెఁ దీఁకుట చూచి సఖ్య మంతఁ

గీ. జేసి విడుతుము; మామీఁద నీసు గొనకుఁ
డనఘులార! డబ్బును దినినట్టి పులికి
నోరు పెటులబ్బు మీరెన్ని యోర్పు మంత్ర
ములను బఠియింతురేనియు నలఘులార!

సీ. పుట్టుపట్టునఁ బెట్టుబడ్డు లచ్చొత్తించి పట్టణంబునఁ బంచిపెట్టునాఁడు
"కాంపిటీషను" నటం చెకాయెకి నరుదెంచు ప్రజల కోరిక భంగపఱచునాఁడు

అక్షరతత్త్వ మావం తెలుంగక మీస లొగిఁ బట్టి యయ్యేల లూఁగునాఁడు
ఎఱుఁగని వ్రాఁత లేవేనియోఁగిల్కుచుఁ 'గుచమర్దనములు' పేర్కొనెదునాఁడు

గీ. మీర లేమైతిరో కొ! యిమ్మెయిని జేయి
కాలుమీఁద నాకులకు యత్నాలిపేఁ?
"యద్భవతి తద్భవత్యేవ" యనెడిమాట
లెఱిఁగి వర్తింపుఁడయ్య! యింకేటి సంధి?

సీ. సత్యవాదియొక్కరో 'జంట్లిమన్' పదవాచ్యుఁడేయంట యా సూరి నెఱుఁగుఁడయ్య!
అతని జ్యేష్ఠభ్రాత యగు "యథార్థవాది" కూడ నట్టిఁడె యంట చూడరయ్య!
ఈ యవతారమ్ము లెత్తువారల రసనాంచలమ్ములకు భర్మాంచితములు
భూషణమ్ములు దెచ్చి పొల్పుగా నర్పించి వాసిమై నూరేగఁ జేసి పిదప

గీ. సోదరులకును మాకును వాదుతీర్పఁ
బూనుఁడయ్య! తరతమత్వములను బట్టి
'మార్కుల' నొసంగుఁడయ్య! మీ మతివిశేష
మెల్ల విద్వాంసులును మెచ్చ నొసఁగుఁడయ్య!

సీ. "కుక్కతోఁకను బట్టి గోదావరీఁదువా" తిరుపతి వేంకటేశ్వరులుకారు
"వేడినీళ్లనె యిఁడ్లు వెలిఁగింపఁ బూనువా" తిరుపతి వేంకటేశ్వరులుకారు
"గానమ్ముచేఁ జింతకాయలు రాల్చువా" తిరుపతి వేంకటేశ్వరులుకారు
"కంజాప్త ధూళిచేఁ గప్ప నెంచెడివారు" తిరుపతి వేంకటేశ్వరులుకారు

గీ. పైకి రాకున్న నెవ్వరి పైకిఁగూడఁ
జనరు తిరుపతి వేంకటేశ్వరులు; వారి
భారతీతత్త్వమును జూచి వారివీరి
తారతమ్య మెఱుంగుట తగదె మీకు?

సీ. పిలువని పేరంటముల నొసర్పరు; గౌరవార్హుల నవమానమంద నీరు;
ధూర్తుల నైఁపరు; ధూర్జటియైనను దగవుమాలినచోటఁ దగవుపెట్టి
తీరుదు; రూరక యేరిని గదలింప; రెవరేనిఁ గదపిన "నితఁడు తగఁడు
మనతోడఁ బోర" నం చనుకోకయవ్వాని నెదిరించి తమకున్న కదనశక్తి

గీ. అంతయో యింతయో యర్హమైన పంఙి
తులు పొనర్చెడిసభలోన నిలిపికొనఁగఁ

బూనుదురు; పక్షపాతుల పూనికలను
వినరు; తా మెఱింగినయట్టివిషయమె యిది.

సీ. 'సత్యవాది' పదంబు చండాలమయ్యె నద్దానియాపదదీర్పఁదలఁచుఁడయ్య
ఆ దురాపదయె 'యథార్థవాది' పదంబు గనియెఁ దద్దుఃఖంబు కడపరయ్య
శాస్త్రీయమైనట్టి సరసాశు కవిత ధిక్కృతయయ్యె గెలుపోడు లెఱుఁగుఁడయ్య
పదియాఱుకళల యవ్వానితో రిక్కల నెనఁజేయుపూనికల్ గొనకుఁడయ్య

గీ. కీర్తికాములరై కవిత్వార్తిఁ బాపి
పక్షపాతులవార్తల వలనఁ గలుగు
దేశఘోషంబు నడిపి యుదీర్ణగరిమ
నలరఁజెలువారుఁడయ్య! ధీవరులు మెచ్చ.

సీ. లేదు శాస్త్రజ్ఞత, లేదు కావ్యజ్ఞత, సంస్కృతజ్ఞానలేశమును లేక,
శబ్దమంజరిఁ గూడఁ జదువంగలేదయ్యె; నదియట్టులుంచుఁ డింకాంధ్రమందు
లేదు వ్యాకరణంబు, లేదు పాండిత్యంబు, లేదు సారజ్ఞత, లేదు శిష్యు
లకు భారతాదుల నొకపద్యమేని పాఠముఁ జెప్ప శక్తినిక్కముగ లేక

గీ. కట్టియయ్యలు మమ్మాంధ్రమందు గొట్టి
మీసములుపీఁకుటకు నెట్లుమీసములు మ
హాత్ములొప్పుదురో? తెలియంగవలయు
సభను సమకూర్పుఁడయ్య! యశస్వులార!

సీ. తాఁ జెప్పినట్టి పద్యమునకే నర్థమ్ము చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁ జుండు
తా నుచ్చరించు పదములకే నర్థంబు చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁ జుండు
కవనంబనఁగ నేమొ కవు లున్న సభలోనఁ జక్కఁగాఁ జెప్పినఁ జాలుఁ జుండు
పద్యమ్ములటులుంచి గద్యమేయనుకొండు చక్కఁగాఁ జెప్పినఁ జాలుఁ జుండు

గీ. ఆంధ్రమంతయు వల్లె దచ్చాంధ్రమైనఁ
జక్కఁగ నుపన్యసించినఁ జాలుఁ జుండు;
మేముపదలెద మూరకే మీసముల మ
టంచు మీసముఁ దలపెట్టు టర్హమగునె?

సీ. మచ్ఛిష్యుల నటుంచి తచ్ఛిష్యులకుఁ గూడ శుశ్రూష జేసి నేర్చుకొనఁదగిన
పాటిపాండితి లేనివారు మామీఁదికి వచ్చి కాఱులు వ్రాసి హెచ్చుతగ్గు

తెలుఁగక మీసాల నెత్తి పీఁకెద మన్న మాట కేమర్థంబు మాన్యులార!
శాఖాభిమానపిశాచంబు నైదుష్య మీ నేర్చునయ్యా యహీనులార!

గీ. తగినమందులు పక్షవాతమ్మునకు ల
భించుఁ బక్షపాతమునకు లభింపఁ బోవు;
"కొలవిఁ బెట్టి నెత్తినిఁ గోఁకికొనియు" నిప్పు
డేటి రాజీలు మావారి కెలుఁగఁ జెప్పఁడి!

సీ. ఆంధ్రమ్మునం దేని యష్టావధానంపు నామ మెత్తఁగ వీరి కేమిహక్కు?
శతవధాన మ్మనుశబ్దంబు నెత్తంగ వీరి దే యూరయ్య వేత్తలార?
నేత్రావధానమ్ము నిగమజ్ఞులది కదా! దాని పేర్వారలెత్తఁ దగునయ్య?
నిజమైన శక్తియుండినఁ "బండితులుగల్గు సభ" యన్నయంత నే జాఱు టేటి

గీ. కయ్య? వారు మమ్మెదిరించు టాశుకవిత
యందె యుక్త మామాత్రమే మైన మేము
విశ్వసింపకయున్నను విశ్వమెల్ల
సమ్మతించుట కొంతేని సంభవించు.

సీ. "ఆశుకవిత్వమ్ము నందేని మీ రేల విశ్వసింప" రటంచు వేయుప్రశ్న
కుత్తరమ్మాలింపుఁ, డూరకే యెట్లెట్లొ "బడబడ" వాఁగునప్పట్టునందు
నేరేనిఁ జాలదు; కేమానవులొ దాని మెచ్చిన నామెచ్చు మెచ్చు గాదు;
పండితులగువారు "పకపక" నవ్వుదు రవ్వారు నవ్విన యాశుకవిత

గీ. అందు వేరొక్కనామంబు; నట్టిదాని
కెన్నఁడేకొను "నిహిహిహీ! యిహిహి, యిహిహి
యిహిహి" యని పండితులు నవ్వునట్టి పూని
గొనరు విద్వత్కవులు గనుంగొనుఁడు మఱియు.

సీ. కట్టుఁబాటులు గల్గు గానంబె గానమో? కట్టువీడినదియే గానమొక్కొ?
కట్టుఁబాటులు గల్గుకాంతయే కాంతయో? కట్టుదప్పినదియే కాంతయొక్కొ?
కట్టుఁబాటులు గల్గు కాయమే కాయమో? కట్టువాసినదియేకాయమొక్కొ?
కట్టుఁబాటులు గల్గుకవనమే కవనమో? కట్టూడ్చికొన్నదే కవనమొక్కొ?

గీ. మీమన మెఱుంగదే? మేరమీఱి మంచి
చెడ్డ లరయకయున్నియో చెట్ట లఱచు

వారి నేరంబు సైఁచుట పాడిగాదు
కూక లిడుఁడయ్య! సత్కీర్తి గోరుఁడయ్య!

సీ. సంస్కృత గ్రంథవాసనయె లేకున్నచోఁ దెలుఁగుగాదది పెద్దతెగులు గాని
ఆంధ్రరహస్యవైయాత్యమే లేనిచోఁ దెలుఁగు గాదది యొక్కయెలుఁగు గాని
శబ్దశాస్త్రపరివేశము సుంత లేనిచోఁ దెలుఁగు గాదది మేనివలుఁగు గాని
నాటకాలంకారనైపుణుల్ లేనిచోఁ దెలుఁగుగాదది చెడ్డపలుగు గాని

గీ. ఈరహస్యంబు నెఱుఁగనివారె మీరు?
తెల్గులో నేని వీర లెవిర్చి యేమి
నేతు రనుకొంటిరో? సుంత చెప్పుఁడయ్య!
సంధిసంగతి కేమి యోసరసులార!

సీ. ఏపండితుఁడువచ్చి యివ్వారితో మమ్ముఁ దులఁదూఁచి తనకీర్తి నిలిపికొనునొ?
ఏకవీంద్రుఁడువచ్చి యివ్వారితో మమ్ము సరిఁజేసి సద్యశశ్శాలి యగునొ?
ఏజమీందార్వచ్చి యివ్వారితో మమ్ము నెనఁజేసి తావన్నెకెక్కఁగలఁడొ?
ఏదైవతము వచ్చి యివ్వారితో మమ్ముఁ బుసిడించి దీప్తి నిల్పుకొనఁగలఁడొ?

గీ. చూచియే తీర్తుము; మీఁదఁ జూడవచ్చు
సంధిసంగతు; లెల్లేని సభయొనర్పఁ
గడఁగుఁడయ్య! వేరొకగతి గాంచఁబోకుఁ,
డయ్య! వేత్తల రప్పింపుఁడయ్య! యొయ్య.

సీ. చెప్పింపుఁడయ్య! దేశికునొక్కరుని బిల్చి చదువుసందెలు మన శర్మకింకఁ
జేయింపుఁడయ్య! యీపాఠ్యమందుననె శుశ్రూష కావ్యజ్ఞు నిచ్చోట నిల్పి
మాన్పింపుఁడయ్య! "డమాడమాడమడమల్" "ప్రాజ్ఞులీపోకలొప్ప" రని చెప్పి
బోధింపుఁడయ్య "యీబుడబుడక్కలకాశుకవితా ప్రశస్తి దక్క" దనినొక్కి

గీ. మీకు యశమబ్బు, వారికి మేలుగల్గు,
మమ్మెదిర్చినపనికి లాభమ్ము వెంట
నే కనంబడు, మాకెంతయేని మోద
మబ్బు; సంధియు నామీఁద ననుఘటించు.

సీ. వైదికలౌకికవైషమ్య మెవ్వారు తెచ్చిపెట్టిరొ? సుంత తెలియుఁడయ్య!
ఆత్మగౌరవమునకై పాటుపడువారె దీనిఁ బెట్టుదురు సందేహ మేల?

తగుగౌరవంబు విద్వత్తకుండునుగాని యన్యమ్మునకు నుండ దనుట ధ్రువము
గానఁ "దనన్య లీకక్షకుఁ గాదటు" లని యెవ్వరేనియు ననకమాన

గీ. అకట! విప్రులు దేవాంగులట్ల, పశ్వ
తోహరులయట్లు వెతివెట్టితోఁ ద్రిప్పఁబోవఁ
గాఁదగునె? దీని మానుపఁగడఁగుఁడయ్య!
సంఘ గోరుమీ కియ్యది చనుఁగదయ్య!

సీ. ఆంధ్రభారతకర్త యైన తిక్కన సోమయాజిజన్మస్థానమైన కతన
శ్రీనాథకవిరాజశేఖరు నేలినకొండవీటికిఁ బ్రక్క నుండు కతనఁ
బ్రకృతంపుఁ గవుల సంభావించు గద్వాలరాజ్యంపుఁ దోఁపలోఁ గ్రాలు కతన
వెనుక కాలమునందు వినుతింపఁదగు పెద్ద విద్వత్కవులు దీన వెలయు కతన

గీ. ఆంధ్రకవితాపదంబు మీకిచ్చెఁ: మెచ్చ
దగదె గుంటూరిపురిని? విద్వత్కవీంద్ర
జనని, కేవలకవితాసత్కరణి, దీని
మహిమ మెంతేని శ్లాఘ్యంబు మాన్యులార!

సీ. నిందింపనేమయ్యె? నిజమైనసత్కీర్తి గలిగించు "సత్యవాదులు" గలారు
గర్హింపనేమయ్యె? గణుతి నర్పించు పెద్దాగ్ర్యలగు యథార్థవాదులు గలారు
నయ్యాలవేవి? సత్కవికదంబముల పేర్వేలయింపఁగల నియోగులు గలారు
అభిమానమునకేమి? యాత్మీయకతన కతుల్గూడ మెచ్చు మాన్యులుగలారు

గీ. ఏరిచే మెచ్చుగొనదు గుంటూరిపురము?
సరసతకుఁ దావు, బలువెన్నె సిరులప్రోవు;
మీకు, మీప్రోలికిని మేటిమీఱుసిరుల
నిచ్చు భగవంతుఁ; డింక మమ్మేగనిందు.

సీ. ప్రేమించితిమి మున్నె పెద్దఱికము నిల్పుకొన్నచో వారి కేకొఱఁత రాదు
వారిసేమముఁ గోరువారె "యాదవ కులమునకు ముసలము" నానసఁబుఁజర్చ
కల్పించి; రభిపూర్వకవిసమ్మతము గాని మాకు నంగీకృతి లేక పోయె;
వీని నామీఁద వైదికనియోగపుఁగక్షగాఁ బోల్చి రెవ్వరో ఘనులు వారి

గీ. తెలుఁగుఁడయ్య! 'యనవసరమిట్టికక్ష
లింపుగాఁబో' వనుచు మందలింపుఁడయ్య !

యేరు వైదికులు? నియోగులెవ్వ? రొక్క .
విప్రులే గారటయ్య! యోచేత్తలార!

సీ. ఘనుఁడు నయోపృ ద్ధఖండపాండిత్యభూషణుఁడు సీతారామశాస్త్రికన్న
నుభయభాషాకవితోవ్యపాయశాలి శిష్ట్లా హనూమత్కవి శాస్త్రికన్నఁ
గృతి యభినవ సరస్వతినేత పట్టాభిశబ్దపూర్వక రామశాస్త్రికన్న
మాలుకుట్లకులుఁడు నిస్తులుఁ డాశుకవి గుణశాలి వెంకటకృష్ణశాస్త్రికన్న

గీ. మఱియునుంగల శాస్త్రవిప్రులకన్న
మొలచినవె కొమ్ము లితరుల మోములందు?
నవసరము లేని యాసనం బడుగనేల?
చర్చ పెంచఁగనేల? యశస్స్వులార!

సీ. వేదవేదాంగాదివేత్త చేపలి వెంకటప్ప శాస్త్రుల కన యన్యుఁ డగునె?
రామడుగుకులుండు ధీమన్మణియు రామకృష్ణశాస్త్రులఁ బోల నెవని వశము?
కంఠపాఠము నాటకములెల్ల శ్రీనోరి హనుమచ్ఛ్రధుని కవ్వఁ డగును దీటు?
అతిశాంతమూర్తి సాహితిపట్టు శ్రీపార్వతీశశాస్త్రికి సాటి యెందుఁ గలఁడె?

గీ. మఱియు నెందఱులేరు ధీమంతులందు?
వీరిలో నేరు కొప్రింపువారు చెప్పుఁడ?
వారికే యాసనంబును గోరనేల?
చర్చ పెంచఁగనేల? యశస్స్వులార!

సీ. కవి హూణభాషావగాహి పంకిప్రవంశజుఁడు శ్రీకృష్ణమాచార్యకన్న
జటిజైపల్లి కులసంభవుఁడు కవిత్వవిస్ఫూర్తి లక్ష్మీకాంత సుకవికన్న
సకలకళానైపుణికిఁ దావు మేటి మల్లాది వెంకట సోమయాజికన్న
వాఱుకేల నియోగి యనఘ జూపూడివంశజ హనూమచ్ఛర్మశాస్త్రికన్న

తే. గీ. మఱియునుంగల సత్కవిమణులకన్న,
లౌకికాగ్ర్యులకన్నను లాఁతివారి
కాసనము గోరనేలయ్యా? యనుచితముగఁ
జర్చ పెంచఁగ నేలయ్యా? సరసులార!

సీ. శొంఠి భద్రాద్రిశాస్త్రులవారి శిష్యుఁడు తచ్చైచ్ఛలి గలకైత దనరు సుకృతి
"అవధాన మేఁ గూడ నాచరించితి"నని స్వయముగాఁ జెప్పికోఁజాలు ధట్టుఁ:

డొక శైలినేకాక ప్రకటితంబుగఁ బలుశైలులఁ గవనమ్ము సలుపుజాణ
ఎపుడు రచించినట్లే కనుపట్టుకే పలుకృతుల్ ప్రకటింపఁగల యుపాయ

గీ. శాలి, బ్రాహ్మణప్రభువు, నాచారపరుఁడు,
ప్రథిత మంత్రిప్రగడ వంశభవుఁడు శ్రీ భు
జంగరాయలకేల యాసనము నడఁగ?
రౌరులు వీరికి మిన్నలే? యోగ్యులార!

మ. పటుజంఘానిలఘోరణీరణరణత్ప్రాగ్భారనుస్నాటవీ
తటశాఖాపటలాంతరుద్ధతనితాంతస్ఫారఘోరాగ్నిరు
ష్ఘుటనాధూపితభస్మసాత్కృతకురుష్కాండంబుతో వహ్నికిన్
ఘుటియింపం దలపెట్టినారు కద! సఖ్యం బార్యచూడామణుల్!

మ. స్వకృతాగఃప్రకరప్రచారనిహతాపారప్రమోఘప్రజా
నికరాత్మైకకరణ్యసర్వనరణీనిర్ణేతృతాభాగ్యభా
గకృతాహంకృతితో, సుమోఘనునితో భ్రాజిష్ణునిన్ ధర్మపు
త్రిరునిన్ గల్పఁదలంచినారె? యిది ధర్మ్యం బెట్టు లోహహో! హితుల్.

సీ. "గర్వం" బనెడి మిష గల్పించి దుర్గాంబుదీప్సకో సంకించు ధీరుఁ డొకఁడు
"పండిత లక్షణ" ప్రస్తావ మిషచేతఁ బడదిట్టునట్టి సర్వజ్ఞుఁ డొకఁడు
"వంటబావని కుత్సనం"బంచుఁ గల్పించి రసఁ జేయుగనుయుశోరాముఁ డొకఁడు
"రామేశ్వరీయ" మన్నామంపు పొత్తాన బూతు లేకరు వెట్టు పుణ్యుఁ డొకఁడు

తే. గీ. మటియు నెంతటో శాఖాభిమాను లిట్లు
బయలు దేటిరి, యింకను బయలు దేఱఁ
గలరు, కీర్తి చేకూర్పఁ గలరు సంధి
కొప్పరపువారి కేటికిఁ జెప్పుఁడయ్యా!

సీ. "ఈలకూరకుఁ బోయి యిల్లటం బున్నట్టు" లయ్యె మా వర్తనం బార్యులార!
అల పాశుపతమహాస్త్రాగ్నిహోత్రజ్వాల లాఁగిపోయెను దీన నవఘులార!
కాఁకరపర్తి "శృంగంపు భంగపు" వ్రాఁత లపఁచుపూనిక దీన పడుగుఁబట్టెఁ
జర్ల నారాయణశాస్త్రి "బార్హస్పత్య" మరయు వేడుక దీన నంతరించె

గీ. గీరతము సాకెకుం గోరు గీరతులకు
తూహలమ్మన కించుక దోడరె విఘ్న

మీ కిక్కడ తమ్మున, నిఁక నిఁటి కేఁగ నాజ్ఞ
నొసఁగుఁడయ్య! గుంటూర్పురీ యోగ్యులార!

సీ. కొప్పరపువారు మాకుఁ గనిష్ఠు లవ్వారి కరయఁగా జ్యేష్ఠుల మగుదు మేము
కొప్పరపువారు మాకు సుశిష్యు లవ్వారి కరయఁగా నొజ్జల మగుదు మేము
తత్కవిత్వంబు "సదరు మరాటా రైలు" "మదరాసు రైలు" లయ్య మాదు కైత
మిత్రుల నవ్వారు మెప్పింతు రేము శత్రులఁగూడ మెప్పింపఁగల మొకింత

గీ. వయసుకా? పెద్దలము మేము, వారు పిన్న;
లింతియే భేదః; మింతకు నింత కలహ
మెందులకు? స్నేహితులమైతి, మింక మీరు
శంకదక్కుఁడు సెలవు నొసఁగుఁడు మాకు.

---

క. ఉత్కీర్తి నరసరావ్పుర, వరవాసుఁడు పంగనామవంశ్యుఁడు సుగుణో
ద్ధురుఁడు నరసింగరావ, ప్పురమునకున్ మమ్మును స్వయముగఁ దాఁ బిలిచెన్-

తే. గీ. అతఁడు శాఖాభిమానుల కహితమైన
పనికిఁ బూనిన కతన నప్పట్టణంపు
శాఖలోని గుణాఢ్యులు సాగకుండఁ
జేయవలె నని యత్నంబు చేసి రంబ!

ఉ. * ఆపురికేము రేపు చను నట్టికుతూహల మూనియుండ నే
పాపియొకాని యయ్యనఘుపజ్జకుఁబోయి "వృథాప్రయత్న మే
లా పొనరింతు? విప్పురికి నల్లకవుల్ చనుదేర భీతి లో
దాపర మయ్యె వారి" కని తా నొగి బొంకి కలంచె నాతనిన్.

---

* (నర్సరావుపేట శతావధానపీఠికనుండి.)

నాప్రియమైన ఆర్. హనుమయ్య గారికి— శ్రీ తిరుపతి వేంకటేశ్వర కవీంద్రుల నిక్కడకు దయచేసి వారి కవితావైపుణ్యమును జూప నిక్కడకు రమ్మని యావాహనచేసియుండుట మీకు తెలిసినవిషయమే కదా; ... వారు రే పిక్కడకు వత్తురని నిరీక్షిస్తూయున్నాము. అవధానము రేపు 1 గంట లగాయితు ఆరంభమగునని నోటీసులలో ప్రచురించినాము. ఇక్కడ శతావధానమే లేదనియూ యిది యంతయూ నబద్ధమనియూ, పి. నరసింగరావు సదరుకవులను మోసగించ

చ. కలఁడు ప్రసిద్ధవంశ్యుఁ డరికాండము సైతము మెచ్చఁదగ్గ ధీ
బలమున కిక్క యా "పయిడిపాటి" నివాసి, యశస్వి, త్యాగి, వి
ద్యలకు నిధాన మంబ! కవితానవితాహృదయంగముండు పే
ర్వెలసిన "రామరా" యనెడి జెల్లముకొండవలీనుఁ డున్నతిన్.

చ. అతనికి మాయెడన్ మఱియు నాయనయందున మాకు విన్కమై
నతితరమైన పేర్మి యలరారెడి నప్పరిలో వధానమున్
గుతుకముమై నొనర్చి కనుఁగొంద మటంచుఁ దలంచుచుంటి మ
ట్టితఱిని బెట్టె నొక్కఁడు కడిందిగఁ గయ్యము చెయ్యముంబలెన్.

చ. కలహము పెట్టుమానిసియుఁ గర్వకు మాటెడివాఁడు గాఁడు పై
నెలమిని వాని నూఁత గొని యెన్నియొ క్రుగ్గులు వెట్టు చెట్టు నీ
డలమురిసంప్రజీవనపుఁడక్కురు లాతనిపాటి వారె? య
య్యలఘుఁడు రామరా వొకఁడె యాథ్యుఁడు సర్వవిధాల నంబికా!"

క. అతఁ డింట నుండియే పం, డితులం బిలిపించి విద్య నేర్చెన్ శాస్త్ర
స్మృతిముఖ్యసంస్కృతకళా, గతి ననదృశుఁ డంతెకాదు కవితాన్వితుఁడున్.

తే. గీ. నరసరాట్పురి శతధానంబు మొదట
జరిగె నందు నొకానొకజనుఁడు రాము

---

దలచినట్లున్న ఎవరో వారితో చెప్పియున్నట్లు, వినుట మిక్కిలి విచారకరముగా నున్నది.... అవధానమిచ్చుట జరుగుట యిష్టములేనివారలు పన్నిన కుట్రమాటలై యుండునని మేము తలంచెదము ... రేపు వుదయం 8 గంటల రైలుమీద వారు యిక్కడికి దయచేయవలయును ఈ వుత్తరం తెచ్చినవారు ప్రత్యేకించి వారినిక్కడకు తీసికొనివచ్చేనిమిత్తం పంపబడిరి. రేపు వారు ఇచ్చటికి రాని యెడల మాకవమానకరముగా నుండును....తప్పక రాగోరెదము.

నరసారావుపేట
30-9-11

ఇట్లు విధేయులు
ఆర్. కృష్ణమూర్తి.
పి నరసింగరావు.

(ఇంగ్లీషు వుత్తరమునకు సరియైన తెనుఁగు.)

---

రావు నడిగి సమస్య నైరంబుకతనఁ
దెచ్చి మాకిచ్చె నదిమాకు నచ్చదయ్యె.

క. అందుఁగల "పశ్య" శబ్దము, సందేహాస్పదమె కాక సరసతరముగా
డెందమునకుఁ దగులదు త, త్సందర్భము కతన 'మస్తకుఁ దా' వనుడున్.

గీ. పృచ్ఛకుఁడు మూర్ఖుగాన నడ్డేమియనక
పైడిపా డేగి మఱునాఁడు వచ్చి వచ్చు
నప్పుడా రామరాట్కవి నటకుఁ దెచ్చెఁ
"దప్పెటులొ తెల్పుఁ" డనెడివాదమ్ము కొఱకు.

క. గతదినమే కౌముదిఁ జూ, చితి మే మద్దానికొఱకు శ్రీకరుఁ డలవీ
క్షితుఁడటఁ 'బశ్య' యని యుందా, స్మృతిఁ జూపెక్ష సూత్రమందిఁ కేమనవచ్చున్?

తే. గీ. పాప! మలరాముగా వల్లబలను యూని
వాదమున కేసుదెంచి యవ్వాసరమున
నలుపు నష్టానఘానంపు నమయమందు
మరల నడుగంగఁ జేసె నమ్మెఱుకు చేత.

ఉ. అంత కొకింత పూర్వమె ‡ సమస్యను బూర్తియొనర్చి మేము ని
శ్చింతగ నుండియుండ్ "మును పు చెప్పితిమౌఁగద! 'తప్ప' టంచు సి
ద్ధాంతము సేయఁగా సలయు నానడి యట్లొనరింపమేని దు
ర్దాంతులు నైరు లీక్కతనఁ దాండవ మాడుదు" రంచు నెంచుచున్. 210

క. అది యెట్లు తప్పగునో? త, త్సదుపాయము చూడకయె నెసన్ సాహసమున్
మది నూని మున్నుబలెఁ "దప్పద" యని పల్కితిమి మే మనాతంకముగన్.

ఆ వె. "ఎట్లు తప్పుసెప్పుఁడీ" యని యడిగిన
యంబుమెఱయ మమ్ము నడిగె మొఱకు
'ఇపుడుగాదు పిదప నీపని తీరిచి
చెప్పువార' మనుడుఁ జెయ్యి లుడిగె. 212

ఉ. కౌముదిఁ జూచియుండియు నఖండుఁడు రామకవీందుఁడిఁ దస్మదు
ద్దామత కోహటించి మది ధైర్యము చాలక మిన్నకుండె నం

---

‡ శ్లో॥ యః పశ్యతి జగత్సర్వం యోనపశ్యతి సర్వతః, తావుభౌ పరమా
త్మానం పశ్యానపశ్యోపశ్యతః। (విస్తరమునకు 'పశ్యాం పుశ్యాం' చూ॰)

బా! ముగిసెఁ బద్యానము క్రమమ్ముగ నంతట రాత్రి యయ్యె నా
యామహితుల్ గృహమ్ములకు నమ్మెయి నేగిరి సంతసమ్మునన్. 213

ఉ. ఏమును నింటికేగితిమి, యేగెడునంతకె * యుత్తరం బొకం
డేమనుజుండొ తెచ్చె; నట నెందును రామకవీంద్రువ్రాలు లే;
బామెయిఁ జూచి "రామకవి కంతగ ధైర్యము లేదు లే" దటం
చేము మదిన్ దలంచి † ప్రతి యిందుక పంపితి మల్ల జాబుకున్. 214

---

* బ్రహ్మశ్రీ తిరుపతి వెంకట శాస్త్రుల వారికి.

బ్ర॥........రావు వ్రాయునది యేమనగా ? నిన్నటి దినము శతావధానములో బ్రహ్మశ్రీ......య్యా, అను నొక పృచ్ఛకుడు అడిగిన "పశ్యాపశ్యో నపశ్యతః" అను సమస్య తప్పని మీరు అనేక పర్యాయములు వక్కాణించి యున్నారు. ఈరోజున ఉదయము కూడా "తప్పులేదని చెప్పిన పండితు డెవ" డని పండిత దూషణతో ఉల్లంఘన చేసియున్నారు. ఈరోజున అష్టావధాన సమయమున తిరిగి ఆ పృచ్ఛకుడే ఆ విషయమును అడుగగా సభానంతరమున మీరు చెప్పిన విషయమును సమర్థించుకొందుమని చెప్పియున్నారు. గనుక మీరు చెప్పిన ప్రకారం తప్పను చూపించుటకు సామర్థ్యము కలిగిన యడల పండిత సభ చేయుంచుటకు సిద్ధముగా నున్నాము. అందుల కీయకొననిచో వ్రాతపూర్వకముగా సమస్యలో తప్పులేదని యొప్పుకొనుచు "సమస్య తప్పు అని చెప్పుటయే తప్పు" అని మీరు తెలియపరచవలయునని కోరుచున్నాము. పండితదూషణ నివృత్తికొరకై యేది విధియో ఆ ప్రకారము జరుపవలయునని కోరెదము. సాహసముగా సభలో పండితదూషణ చేసినందుకై ఇట్లు వ్రాయవలసివచ్చినది. వెంటనే జవాబీయ గోరెదము. కాలయాపన ఉభయత్ర కష్టము.

2-10-11,
Narasaraopeta.

Yours Sincerely,
(ఇంగ్లీషు చేవ్రాలు.)

---

† శ్రీమత్పరదేవతాయైనమః

మహారాజశ్రీ.........రావుగార్కి

అయ్యా

తమ యుత్తర మందినది. అందప్రస్తుత విషయములు కొన్ని వ్రాసినారు. మేము పండిత దూషణము చేయలేదు. ఆ సమయమున మా యుచ్చరించినమా

క. మఱునాఁ *డుదయ మ్మొకటియు, మరల నిశీథమున నొకటి మఱి యట్లే గొం
టము లెవ్వరో చేవ్రాలిడి, పురపురఁ బంపియు జవాబుఁ బొందరు మా చే.

---

టలు విద్యా విషయములు గాని పండిత దూషకములు కావు. అది యటులుండ నిండు. ఇది పండిత విషయము గాని తను విషయము కాదు. కావున నా విషయమై తమకు జవాబు వ్రాయుట మాకనవసరము. ప్రతివాదులగు పండితులచే వ్రాయించినచో దానికి సమాధాన మీఁబడును.

8-10-1911
నరసారావుపేట

దివాకర్ల తిరుపతిశాస్త్రి.

* మహారాజశ్రీ తిరుపతి వెంకటేశ్వర్ల గార్లకు.

.........రావు వ్రాయునది యేమనగా ? మిమ్మును కోరిన యంశమును మాత్రము తప్పించుకొనుచు మీలో తిరుపతిశాస్త్రిగారిచే వ్రాయబడిన జవాబును చూచి చాలా సంతసించినాము. "మీరు ప్రచురము చేయునీతిని విశేషములు గల పండితులు కా" రనే ఉద్దేశముతో "మీరు తెలియపరచుకొన్న సంగతులను సమర్థించుకోగలరా" యని మిమ్మును పండిత సభకు రమ్మని కోరగా అట్టి సందర్భమున సభకు వచ్చుటకు పూనుకొనదగిన పండిత లక్షణమునకు విరుద్ధముగ "సభను నిర్మాణము చేయుటకు పూనుకొనినవారు పండితులైతే జవాబు నిత్తు" మని పండిత లక్షణము గలిగినట్లు కనుపడని యూహను పెట్టుకొని "వ్రాసినవారి విషయము కా" దని పండిత లక్షణమునకు వెలియగు జవాబు నిచ్చినారు. ఆ విషయమును తమ పరదేవత తెల్పినదో తెలియదు. సమయము మీరుతరి ఈ ప్రకారము తప్పించుకొనుచు ఛందోలక్షణ అనభిజ్ఞులగు స్కూలు పిల్లలు మొదలగువారికి మాత్రము శతావధానము చెప్పుచూ పరదూషణ చేయుచుండుట మాత్రము పండితలక్షణమా ? అట్టివారే పండితులని మీ యభిప్రాయమా ? వారితో ప్రసంగములు గలుగజేసుకొనుటయే పండిత లక్షణమా ? ఇట్టి సందర్భములలో మీరు పండితులనుట కెటుల దగుదురో తెలియకున్నది. "పండిత సభ చేయబూనుకొంటి" మని యొకరు వ్రాయగా యిట్లు తప్పించుకొనుటవలననే "మీరు పండితులు కా" రని మాత్రము స్పష్ట మగుచున్నది. మా పాండిత్య విషయమును మీ రిటుల నిరాకరించిన మాత్రమున మాకు గల్గు

తే. గీ. ♦ రామరావు పత్రికలోన వ్రాలు చేసి,
పంపుచో నుత్తరం బీయ వలయు ననియు

---

లోప మేమియు లేదు. అందువలన మీకు యేవిధమైన ఔన్నత్యమును కలుగ నేరదు. ఇంతటనైనను విజయదశమినాడు మాచే వ్రాయబడిన ప్రకారము స్వవచనపోషణసమర్థత్వము గలిగిన పండితసభకు వచ్చెదరని తలచెదము.

వరసారావుపేట,
3-10-11

(తెలుఁగుతో చేవ్రాలు.)

---

నరసారాయనిపేట,
3-10-11.

♦ మహారాజశ్రీ తిరుపతి వేంకటేశ్వర్ల గార్లకు.

అయ్యలారా!

“పశ్యాపశ్యోనపశ్యతః” యను సమస్య విషయములో రెండు దినముల యందును “సమస్యలో తప్పు గలదు గాన పూర్తి కేయ వీలులే” దని మీరు దృఢముగాఁ జెప్పియున్నారు. పండితులు సాధువని చెప్పినారని తెలియపరచుకున్నను పండితుల నగౌరవ సూచకముగా నింద సల్పినారు. సామర్థ్యముగలయెడల స్వవచనపోషకము చేయుఁడీ యని బ్రహ్మశ్రీ........రాయలవారు మీకు వ్రాసిన, సదుత్తరము లివ్వఁబూనరైతిరని తెలియవచ్చినది. పై సమస్య తప్పుగా నున్నదని మీరు పండిత లక్షణముగ సిద్ధాంత పఱచినయెడల నూటపదియారు రూపాయలు మీకు తప్పకుండ నిచ్చుటకును సాధువని సిద్ధాంత పఱచిన నట్టి మొత్తమే మీరు మాకు నిచ్చునట్లుగను మీరు వడంబడిక చేయునెడల నందులకు మేమంగీకరింతుము. పై ప్రకారము బూనెదరా, మీ తరఫున జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు వచ్చి మాట్లాడగా నీ సంగతులకే మీతో కలసి మాటాడి జబాబు నిత్తుమని చెప్పి కాలవిలంబము చేసినందున నీ కాగితము వ్రాయ వలసివచ్చినది వెంటనే జవాబు వ్రాయకోరినాము.

ఇట్లు
......శర్మశాస్త్రి.
......శర్మశాస్త్రి.

